# ప్రకటనము.

ఈ గ్రంథము వలయువారు, ఈ దిగువనుండు విలాసమునకు జాబులువ్రాసి, వి. పి. పోస్టు ద్వారా తెప్పించుకొనవచ్చును.

తె - శ్రీ [illegible] శాస్త్రులు,

13, [illegible] వీధి - మద్రాసు.

# విజ్ఞప్తి

శ్రీకృష్ణదేవరాయ సభాలంకారులైన యష్టమహాకవులలో నొకఁడని పేర్కొనఁబడిన వాఁడును, ప్రథమశాఖీయ నియోగి బ్రాహ్మణుండు నగు తెనాలి-రామకృష్ణ మహాకవివర్యునిచే రచియింపఁబడినదై, "పాండురంగ సుకవి పద్యంబుహారువును" అన్నట్లు పదసందర్భంబునను, వర్ణనావైలక్షణ్యంబునను నిరుపమానంబై, శ్లాఘ్యతర కవిత్వశైలిగలదై విలసిల్లు "పాండురంగమాహాత్మ్యము" అనఁబడు నీ యపూర్వ మహాకావ్యము, లోఁగడ రెండుమాఱులు ముద్రింపఁబడియుండెనుగదా అక్కాలంబున ముద్రితంబులైన ప్రతులన్నియు విక్రీతంబులగుటంజేసియు, ఏతద్గ్రంథాభిమానులగు సుజనులనేకులు పదేపదే కోరుటంజేసియు, ఇప్పుడు మరల ప్రాచీనకోశము ననుసరించి యథోచితంబుగాఁ బరిష్కృతంబై లఘుటీకతోడ ముద్రింపఁబడియె. ఇందేమేని పాఠపాట్లుండినను గుణగ్రహణతత్పరులగు దోషజ్ఞు లట్టి స్ఖాలిత్యంబులను దిద్ది మమ్ముఁ గృతార్థులనుజేయుదురని పదింబదిగఁ బ్రార్థింపఁబడుచున్నారు.

దీనిని "పాండురంగవిజయ" మనియుం జెప్పుదురు. శ్రీభగవదవతార గుణచేష్టిత ప్రతిపాదకంబైన యీప్రబంధము, విరూరి-వేదాద్రిమంత్రికి అంకితము గావింపఁబడినది. ఇందు స్కాందపురాణాంతర్గతంబగు, క్షేత్రదైవతతీర్థ మేళనంబు గల పౌండరీకస్థలమాహాత్మ్యము వర్ణింపఁబడియున్నది.

శ్లో. ప్రహ్లాద నారద పరాశర పుండరీక వ్యాసాంబరీష శుక శౌనక భీష్మదాల్భ్యాన్,
రుక్మాంగదార్జున వసిష్ఠవిభీషణాదీన్ పుణ్యానిమాన్ పరమభాగవతాన్ స్మరామి."

"మ. సురకర్మందె హిరణ్యదైత్యసుతు వ్యాసున్ శౌనకున్ శ్రీపరా
శరు రుక్మాంగదు నంబరీషు నరమాజానిన్ వసిష్ఠుం బురం
దరపుత్రున్ శుకు దాల్భ్య భీష్ము వెఱఁగొం దంజేయు మద్భక్తికిన్
ప్రపుడేఁ డీ పుణ్యుఁడు పుండరీకుఁ డితనిన్ భావింతు మేలీవులన్"

అనునట్లు పరమభాగవతోత్తముం డగు పుండరీకమహర్షి చరిత్రంబును, అనేక పరమ భాగవతోపాఖ్యానంబులునుం గలిగి, పరమ ధర్మంబులను, పాండురంగాహ్వయంబున విలసిల్లు సర్వేశ్వరుని కల్యాణగుణంబులనుం బ్రతిపాదించుటం జేసి జ్ఞాన భక్తిసాధనంబై ఇహపరపురుషార్థప్రదంబైన యిమ్మహాగ్రంథమును భాషాభిమానులు బోధకులు బుభుత్సువులు నగు సుజనులందఱు నైకొని పఠించి యానందింతురుగాక.

---

# విషయసూచిక.



## ప్రథమాశ్వాసము.



## ద్వితీయాశ్వాసము.



## తృతీయాశ్వాసము.



## చతుర్థాశ్వాసము.



## పంచమాశ్వాసము.

శ్రీ వేఙ్కటేశాయనమః.

# పాండురంగమాహాత్మ్యము.

## ప్రథమాశ్వాసము.

—:0:—

### శ్రీకృష్ణప్రార్థనము


కాంతామణిఁ గన్మొఱంగి మది ధాత్రిన్ మంచినన్ దత్త్విటి
ఛ్రీకాదంబిని మీఁది కుబ్బ ననఁగా శ్రీవత్సముం దాల్చి ము
ల్లోకంబు ల్పొదలించు కృష్ణుఁడు దయాళుం డేలు శ్రీవైష్ణవ
స్వీకారార్హ విహారిపట్టణపతిన్ వేదాద్రిమంత్రీశ్వరున్

### లక్ష్మీప్రార్థనము

సీ. అవతారమందె నే యఖిలైకజనయిత్రి, కలశరత్నాకర గర్భసీమఁ
దోఁబుట్టువయ్యె నే తులితకాంచనవర్ణ, వెలఁదివెన్నెలగాయు వేల్పునకును
ఛాయకయుండు నే పరమపావనమూర్తి, చక్రిబాహామధ్య సౌధవీధి
నభిషేకమాడు నే యభివర్ణితాచార, దిగ్గజానీతమహా తేటనీట
తే. నవనిధానంబు లేదేవి జవణిసరకు, లమ్మహాదేవి శ్రీదేవి యాదిలక్ష్మి
సరసశుభదృష్టి రామానుజయ్యసుతుని, నాదరించు విహారివేదాద్రినాథు.

### బ్రహ్మస్తుతి

ఉ. మ్రాదికి మీఁద నంచవెలి పూవుపయిన్ ముఖనైనజోదుచే
భ్రమయాత్మచే భువనపాలనఖేలనుచే సరస్వతీ
ముద్రితవక్త్రచేత నలు మోములవేలుపుచే విహారి వే
దాద్రి ఛమూవిభుండు గను నాయువు శ్రీయు నిరంతరాయమున్. 3

### సరస్వతీ స్తుతి

శా. కద్రూజాంగదుతోఁడఁబుట్టువు శరత్కాదంబినీచంద్రికా
చిద్రూపాంచిత పద్మగర్భముఖరాజీవావళీహంసి వ

---

లఘుటీక_౧. శ్రీకాంతామణిన్=లక్ష్మీదేవిని. కన్మొఱంగి=వంచించి. ధాత్రిన్=భూదేవిని. మంచినన్=మన్నింపఁగా. తత్త్విట్ఛ్రీకాదంబిని=ఆభూమియొక్క కాంతిసంపద యనెడి మేఘపఙ్క్తి. శ్రీవత్సమున్=శ్రీవత్సము అనెడిబొమ్మనందలిమచ్చను. పొదలించు=వృద్ధిపొందించు ॥౨॥ వెలఁది=స్వచ్ఛమైన ॥ 3॥ మ్రాది=మాదిరి. నిరంతరాయము=నిత్యమైనశుభావహక్రియ—విఘ్నములేమి ॥౪॥ కద్రూజాంగదుఁడు=శివుఁడు. చిద్రూపాంచిత=జ్ఞానస్వరూపముచేత ఒప్పినది. వర్ణద్రాక్షాఫలకేరి=వర్ణములనెడి

దైత్యారివశమైన తన చిత్తమంతయు, నినుచు గౌరవమున నివ్వటించి
తెనుపువెన్నెలగాయు తనమూర్తియంతయుఁ, గీర్తివైభవమునఁ గీలుకొలిపి
తే. శేషుఁ డఖిల ప్రపంచవిశేషశాలి, నిత్యముక్తుల కాద్యుఁడై నిలుచుమేటి
చాపచాకిత్రు రామానుజయ్యపుత్రుఁ, గరుణ వేదాద్రిమంత్రిశేఖరుని మనుచు.

కవిస్తుతి

క. పుట్టుటఁ బుట్టెడు వేళం, దిట్టపు మనుపచ్చి పుట్ట తేనియచవితోఁ
బుట్టె నన నమృతముట్టెడు, పుట్టనిపు సత్కవిత్వములు వర్ణింతున్. ౧౦
క. ఇట్టాడరాని యాగమ, ఘట్టమునకు నడవ యచ్చుకట్టిన మునిరా
ట్పట్టాభిషిక్తుఁ డపముల, పుట్టిననెలవయిన వ్యాస ముని వర్ణింతున్. ౧౧
తే. వ్యాసవాల్మీకిముఖసూక్తి వైభవముల, నేర్పుమీరంగ నిజకావ్యదర్పణముల
సరసమానసములనేలు పటుచకీర్తి, ధవుల నన్నయభట్టాది కవులఁ దలఁతు.

సత్కవిప్రశంసాదికము

ఉ. చాటుకవిత్వతత్త్వరస సాగరపారగులయ్యు సత్కవుల్
పాటిగఁ బట్టి విందు రొకపాటివి గావన కన్యకావ్యముల్
కైటభవైరి యావతశిఖామణి శ్రీసతి పేరురంబునన్
మాటియు నీటికెంపు బహుమానముగం బదకంబుఁ జేయదే? ౧౩
తే. తప్పు గలిగినచోటనే యొప్పుఁగలుగు, సరసకవితావళోక్తుల సరణియందుఁ
గప్పుగలిగినసీహారకరునియందు, నమృతధారాప్రవాహంబు లడఁపఁగాదె.
తే. కానదోషాత్ములయినదుష్కవులకతనగరిమవహియించుగవిరాజకావ్యమహిమ
బహుళపక్షంబుచీఁకటి బహుళమగుటఁ, జాయవెన్నెల తరితీపు సేయుకరణి.
వ. అని నిఖిల భువనప్రధాన ధన్యంబు లగుమాన్యదైవతంబులం గొనియాడి మాడిమెఱయుకవివృషభులనభినుతించియుదంచితంబగుకవిత్వతత్త్వంబునం గల గరిమంబుఁ బరిశీలించి వంచకు లగు కొంచెపుంగవుల రవళి యదలించి పంచాశత్కోటివిస్తీర్ణం బగుసర్ణవమేఖలావలయంబునం గల పరమవైష్ణవ రత్నంబులకుఁ బ్రయత్నపూర్వకంబుగ నభివందనం బాచరించి. ౧౬
క. వాక్కాంతాశ్రయభట్టను, చిక్కాచార్యుల మహాత్ము శ్రీగురుమూర్తిన్
నిక్కపు భక్తి భజించెద, నిక్కావ్యకళాకలాప మీడేఱుటకున్. ౧౭

---

క్క్రప్రకాశముతో || ౯ || పొంకపఱిచి=జత సెట్టి. మనుమిన్కుగని=వేదములకు ఉనికిపట్టు. మస్తరించి=ఐక్యముచేసి. నివ్వటించి=వ్యాపింపఁజేసి || ౧౦ || ౧౧ || ఘట్టమునకున్ = తీరప్రదేశమునకు. అచ్చుకట్టిన=ఏర్పఱిచిన||౧౨||యావతశిఖామణి=స్త్రీసమూహమునందుశ్రేష్ఠురాలు. మాటియున్=మఱుఁగుపఱచియు. నీటికెంపున్=కౌస్తుభమణిని ||౧౩||౧౪||౧౫|| ౧౬||మాడి=ప్రసిద్ధి. గరిమంబు=

క. కౌండిన్యసగోత్రుఁడ వా, ఖండలగురునిభుఁడ వఖిల కావ్యరససుధా
మండనకుండలుఁడవు భూ, మండలవినుతుఁడవు లక్ష్మ మావరతనయా!

క. యశముగలిగించు నీ మృదు, విశదోక్తులఁ బౌండరీక విభుచరితఁ జతు
ర్దశభువనవినుతముగ శుభ, వశమతి నాపేర నుడువు వరతత్త్వనిధీ! ౨౫

ఉ. స్కాందపురాణనీరనిధి కౌస్తుభమై ప్రభవించు దేవకీ
నందను సత్కథోద్యమము నవ్యకవిత్వకళాకలాపముల్
కుందనముల్ ఘటించి కడుఁ గ్రొత్తగు సొమ్మొనరించి విష్ణుసే
వం దిలకించు నప్పరమ వైష్ణవకోటి నలంకరింపుమా. ౨౬

మ. ఉదయం బస్తనగంబు సేతువు హిమవ్యూహంబునుం జుట్టి రా
విదితంబైన మహిన్ మహాంధ్రకవితా విద్యాబలప్రౌఢి నీ
కెదు రేరీ సరసార్థబోధఘటనా హేలాపరిష్కార శా
రద నీరూపము రామకృష్ణకవిచంద్రా! సాంద్రకీర్తీశ్వరా. ౨౭

వ. అని సంభావించి కనకాంబరాభరణంబులం బ్రసాదించి యా ప్రధాన
పంచాననుండు. ౨౮

మ. పలుకుందొయ్యలి మోవికాంతి కెనయౌ బాగాలు నయ్యింతిచె
క్కులఁ బోలుం దెలనాకు లయ్యువిదపల్కుల్వంటి కప్రంపుఁ బ
ల్కులతోఁ గూడిన వీడియం బొసఁగె నా కుం బద్మనాభార్చనా
కలనాపావనహస్తకంకణఝణత్కారంబు తోరంబుగన్. ౨౯

వ. ఇట్లు లోకోత్తరగుణోత్తరుం డగు నా ప్రధానశేఖరుండు పరమపురుషపరి
కర చరిత్రంబునకు నధీశ్వరుండగుట తీర్థంబును స్వార్థంబునుజాదులుం దేవర
ప్రసాదంబునుబుణ్యంబునుంబురుషార్థంబునునయ్యె నయ్యభ్యుదయంబునకుం
గల్యాణాచారంబుగాఁ గృతిపతి వంశావతారం బభివర్ణింపంబూని. 30

---

రససుధామండనకుండలుఁడవు=కావ్యరసమనెడిఅమృతమేఅలంకారమయిన చెవిపోఁగుగాఁగలవాఁ
డవు ॥ ౨౫ ॥ మృదువిశదోక్తులన్=సులభోచ్చారణమును తేటదనమునుగల మాటలతో ॥ ౨౬ ॥
నీరనిధి=సముద్రము. తిలకించు=ప్రకాశించు॥ ౨౭ ॥ హిమవ్యూహంబు=హిమాలయము=ప్రౌఢి=
నేర్పు. సరసార్థ...ష్కార=రసవంతమయిన అర్థముయొక్క తెలివినికూర్చుటయనెడివిలాసచేష్ట
యే ఆభరణముగాఁగలది. శారద=సరస్వతి ॥ ౨౮॥ సంభావించి=సన్మానించి. ప్రసాదించి=ఇచ్చి.
ప్రధాన పంచాననుండు=మంత్రిశ్రేష్ఠుఁడు ॥ ౨౯ ॥ పలుకుందొయ్యలి=సరస్వతి. బాగాలు=వక్క
పలుకులు. తెలనాకులు=తెల్లనియాకులు. కప్రంపుఁబల్కులతోన్=కర్పూరపుఁబలుకులతో. వీడి
యంబు=తాంబూలము. తోరంబుగన్=అతిశయింపఁగా ॥ 30 ॥ లోకోత్తరగుణోత్తరుండు=లో
కమునందు మేలైనగుణములచేతఅధికుఁడు. పరికర=పరివారముయొక్క. జాదులున్=జాజీపువ్వు

సన్నుతభాగ్యవర్ధనుల సన్మతి శౌర్యము ధైర్య మన్నయా
భ్యున్నతి నీతి రీతి జయ మొప్పను నేర్పను సెన్నశక్యమే ? ౩౫

క. ఆముగ్గురిలో రంగను, ధీమణి దీపించె వంశ తిలకంబగుచున్
శ్రీమహితగంగమాంబా, రామారమణీయరాగ రసరంజితుఁడై. ౩౬

క. ఆరంగరాజుకీర్తులు, శ్రీరంగనివాస హాస శివకరలక్ష్మిం
జేరంగఁదగుచు నహితులఁ, బారంగా నెగుచు నతని బాహాసి యనిన్. ౩౭

సీ. శ్రీమదష్టాక్షరీ సేవైకనిపుణుండు, గీతార్థసారసం కేతవేది
పరిచితనిస్యప్రబంధసంధానుండు, మహితసౌదర్శన మనువిదుండు
నవ్య వైష్ణవపురాణచతుష్టయజ్ఞుండు, నిజసమయావన నిపుణబుద్ధి
సరసరామాయణ సప్తకాండజ్ఞాత, యాళవందారుస్తవాభిశోభి

తే. సలిలనిధిజాలజంఘాల జలవిశాల, ధూళిపాళీభరాళీక భూమభూమ
శంకితాత్మప్రతాపవైశ్వానరుండు,గంగమాప్రాణవిభుఁ డొప్పు రంగరాజు.

తే. దశరథేశ్వరుభార్యయై ధన్యమహిమ, మున్ను కౌసల్య శ్రీరాముఁ గన్నకరణి
రంగయామాత్యుసతియైనగంగమాంబ,మతిమరున్మంత్రి శ్రీరామమంత్రిఁగని

క. ఆరామరాజువాహిని, వారాకర మొకటి దాఁటె వసుమతి మున్నే
శ్రీరామరాజువాహిని, వారాన్నిధులేడు దాఁటి వర్తిలునవలన్. [యె. ౪౦

సీ. పుడమిపై నడనేర్చి యడుగుఁబెట్టెడు నాడె,ధర్మంబు నాల్గుపాదములనిలిపె
జిలిబిలిపలుకులు పలుకనేర్చిననాడె, సత్యభాషాహరిశ్చంద్రుఁ డయ్యె
వసుసమీఁదటి వ్రాలు వ్రాయనేర్చిననాడె, కమిచిదిక్కులజయాంకములు వ్రాసె
ముఖ్యవ్రతస్ఫూర్తి ముంజిగట్టెడునాడె,కవులఁ బ్రోచుటకుఁ గంకణముగట్టె

తే. నంబమాంబికఁగల్యాణమైననాడె,వాసిగల కీర్తిలక్ష్మికి నేసవెట్టె
ధైర్యహేమాద్రిప్రజ్ఞశాస్త్రనవుమాద్రి, రంగయామాత్యవసుని శ్రీరామమంత్రి

---

౩౬ ॥ ౩౭ ॥ శివకర=మేలునుకలుఁజేయునట్టి. ఎగుచున్=తఱుమును. బాహాసి=చేతికత్తి ॥ ౩౮॥ సంకేతవేది= ఏర్పాటు తెలిసినవాఁడు. పరిచిత = ఆలవాటుచేయఁబడిన. సౌదర్శనమనువిదుండు = సుదర్శన మంత్రము నెఱిఁగినవాఁడు. నవ్య=నుతింపఁదగిన. నిజసమయావన = తనమతమును రక్షించుకొనుటయందు. సలిలనిధి = సముద్రము. జంఘాల = మిక్కిలివడిగాపోవునట్టి. ధూళిపాళీభర=దుమ్ముచాలుయొక్క ఆతిశయమనెడి. ఆళీక = అబద్ధపు. భూమ = మిక్కిలి. ఆత్మప్రతాప=తనప్రతాపమనెడి. వైశ్వానరుఁడు=అగ్నిగలవాఁడు. ప్రాణవిభుఁడు=పెనిమిటి ॥ ౩౯॥౪౦॥ వాహిని=సేన-వాగ్ధాటి. వారాన్నిధులు=సముద్రములు ॥౪౧॥ జిలిబిలి=కొంచెము-వచ్చీరాని. కమిచి=ఆక్రమించి. ముంజి=దర్భమొలత్రాడు.ముంజిగట్టెడునాడే.=ఉపనయనమునాడే. కల్యాణము=

సీ. సంహృతాంహస్స్ఫూర్తి సింహాసనుండన, సింహవిక్రముఁడన సింహశౌరి
త్రయ్యంతవాసనా గ్రహబుద్ధినొయ్యారి, యొయ్యారిరామాను జయ్యగారు
గంగాతరంగసారంగలాంఛనదీప్తిఁ, బొంగుకీర్తికిరాజు రంగరాజు
శరణాగతత్రాణ కరుణాచరణకేళి, వరదరాజులఁబోలు వరదరాజు
తే. నన్నగ శ్రీరామవిభునికి నంబమకును, గలిగి రాచంద్రతారార్క- గతిఁ బ్రశస్తి
నలువురాత్మజులౌదార్య సలిలనిధులు, భుజగశాయికి నాలుగుభుజములట్లు.
తే. అందు నగ్రజుఁ డఖిలవిద్యావినోది, శ్రీనృసింహాఖ్యసన్మంత్రి సింహమలరు
లీల లక్ష్మమ్మ తనకుని ల్లాలుగాఁగఁ, జెలఁగె లక్ష్మీనృసింహావిశేషముద్ర.
క. శ్రీనరసింహుని లక్ష్మీ, మానవతికి వెంగళాఖ్య మంత్రీశ్వరుఁడున్
గోనప్పయు ననఁదగువి, ద్యానిధు లిరువురు సుపుత్త్రులై మనిరనిన్. ౪౪
క. నయవినయంబులకైవడి, జయతేజములట్లు విభవశమములక్రియ న
వ్యయ యశులు వెంగళయకో, నయ లిరువురు వెలసి రవని నాథార్చితులై.
క. ఆవెంగళ మంత్రీశ్వరు, దేవికి శ్రీ యూబళాఖ్య తిలకవతికి రా
ధావిభుదేవేరియు నల, కావేరియు నిజుజోడు గౌరవకళలన్. ౪౬
క. గానకళాతుంబురుఁ డనఁ, గా నయవిద్యావివేక గౌరవలక్ష్మీ
జాని యనంగా నిర్ఝరఁ, గోనప్రభుఁ డొప్పు మంత్రికులతిలకంబై. ౪౭
తే. అవిదేహాధిపతి పుత్త్రి యాత్మభార్య, గాఁగవిఖ్యాతిఁ బొందు రాఘవునికిఁ బోలె
రాఘవాంబాధినాథుడై శ్లాఘమీరు, శ్రీనృసింహునికోనప్ప సింగలక్ష్మ్మ.
ఉ. సామజరక్షణుం గొలిచి సన్నుతికెక్కిన భాగ్యశాలి శ్రీ
రామచమూపశేఖరుని రంగనమంత్రి ననంతమాంబికా
స్వామి నుతింతు మన్మథభుజానతపుష్ప ధనుర్మధూళికా
రామధురోక్తిగుంభనభ రస్ఫురణాపరిణాహచాతురిన్. ౪౯
చ. ఉరుమతి రంగమంత్రితన యుల్ విలసిల్లిరి ఫుల్లమల్లికా
హార దర హాస హీర హిమ హార పటీర యశోధురంధరుల్

---

పెండ్లి. నేస=తలఁబ్రాలు. ॥ ౪౨ ॥ సంహృతాంహస్స్ఫూర్తి=నశింపఁజేయఁబడిన పాపములప్రకాశముగల. త్రయ్యంత=వేదాంతములయొక్క. గ్రహ=గ్రహించుకట్టి. సారంగలాంఛన=చంద్రునివలెన ౪౩ ॥ ౪౪ ॥ ౪౫ ॥ ౪౬ ॥ రాధావిభుదేవేరి=విష్ణుదేవునిపట్టపురాణి యగులక్ష్మి. ౪౭ ॥ లక్ష్మీజాని=లక్ష్మికిపెనిమిటి—విష్ణువు ॥ ౪౮ ॥ ౪౯ ॥ చమూపశేఖరుని=సేనాపతిశ్రేష్ఠుని. స్వామి=పెనిమిటి మధూళి=మధువు=తేనె. గుంభనస్ఫురణాపరిణాహచాతురిన్=కూర్పుయొక్క అతిశయమువలనిప్రకాశముయొక్క మిక్కుటపునేర్పుచేత ॥ ౫౦ ॥ ఫుల్ల=వికసించిన. హీర = వజ్రమణి. హార=

వరదయగల్గువారు గుణవంతులు శాంతులు కాంతిచంద్రముల్
వరదయమంత్రిపుంగవుఁడు వాసవతుల్యుఁడు రాఘవయ్యయున్. ౫౦

క. రంగయవరదామాత్యు వి, హంగమవిభుగమనభజన హంసధ్వజు సా
రంగధరహారనిభ వా, గ్గంగాశృంగారితాస్యకమలు నుతింతున్. ౫౧

సీ. సమకూర్పఁగానేర్చు సకలవైష్ణవశాస్త్ర, సిద్ధాంతశుద్ధాంత సిద్ధిగరిమ
హావణింపఁగానేర్చు నఖిలావనీచక్ర, సామ్రాజ్యపూజ్యవిశాలలక్ష్మి
వలపింపఁగానేర్చు వాలాయఁజూపుల, కోపులుచూపుచకోరదృశలఁ
బాలింపఁగానేర్చు బాంధవకవిగాయ, కార్థార్థినివహంబు ననుదినంబు

తే. దండనాథునిమాత్రుఁడే దశదిశావ, కాశసంపూర్ణవిజయప్రకాశశాలి
రంగయామాత్యువరదయ్య ప్రకటశౌర్య, ధారివాచాధరాధరధారిశయ్యు

క. తిమ్మాంబ యక్కమయు వర, దమ్మయు వరదప్ప భార్యలై వెలసిరి తే
జమ్మున శక్తిత్రయమువి, ధమ్మున సకలోన్నతప్రథాప్రథితమతిన్. ౫౩

ఉ. మున్నొకరాఘవుండు తల మోచిభజించు విభీషణాదులన్
మన్ననఁ బ్రోచెఁ గాచెనను మాటలెకాని గుణప్రసన్నతన్
బ్రన్నఁదనంబుఁ జూపఁగల రంగయ రాఘవమంత్రి నిచ్చలున్
వన్నెకుఁ దెచ్చి నిచ్చు నభివాంఛితవస్తువు లర్థికోటికిన్. ౫౪

క. తేజమున రాఘవుని యం, భోజేక్షణ తిమ్మమాంబఁ బోల్పందగు నా
రాజీవసదన శారద, రాజార్ధకిరీటపూర్ణ రాజనిభాస్యన్. ౫౫

క. శ్రీరామమంత్రివరదను, ధీరత్నముకులవధూటి దీపించు యశో
దారమణీరమణ విష్ణు, శ్రీరంజిత కొండమాంబ చిరపుణ్యములన్. ౫౬

క. ఆదంపతులకుఁ గలిగిరి, గాదిలి సత్పుత్రవరులు గనుఁగొండనయున్
శ్రీదనుమనోబళయ్యయు, వేదస్మృతిజాయమాన వినయనయగతిన్. ౫౭

---

ముత్యాలపేరు. వర = మేలైన. పటీర=మంచిగంధము. ॥ ౫౧ ॥ ౫౨ ॥ హావణింపఁగాన్=ధరింప. వాలాయ = దీర్ఘములైన. కోపులు=అందములు. చకోరదృశలన్=స్త్రీలను. ప్రకటశౌర్యధారి = ప్రసిద్ధమయినశూరత్వమను ధరించినవాఁడు. వాచాధరాధరధారిశయ్య = మాటలచేత విష్ణుదేవుని పానుపైన శేషుఁడు ॥ ౫౩ ॥ ప్రథా=ప్రసిద్ధి. ప్రథిత=ప్రసిద్ధమయిన ॥౫౪॥ ప్రోచెన్=పోషించెను. కాచెన్=ఆపదలుతొలఁగించికాపాడెను. ప్రన్నఁదనంబు=మనోహరత్వము. అర్థికోటి=యాచకులసమూహము. అభివాంఛిత=కోరఁబడిన॥౫౫॥ రాజార్ధకిరీట=అర్ధచంద్రుఁడుకిరీటముగాఁగల శివునియొక్క ॥ ౫౬ ॥ కులవధూటి=గృహిణి— పెండ్లాము. రమణన్=విధమున ॥ ౫౭ ॥ గాదిలి=ప్రియమ

క. కామగవీసురతరువులు, వేమాఱును నిచ్చెఁ దవులు విడి బేరముగా
రామానుజయ్య దాన, ప్రామాణికముద్ర కొంగు బంగారమగున్. ౬౫

శా. ఆరామానుజమంత్రిచంద్రుఁడు వివాహంబయ్యె నెయ్యంబుతో
భారద్వాజపవిత్రగోత్రనిధికిన్ బల్పాటికన్నయ్యకున్
గారామైనకుమారికాతిలకమున్ గౌరీ ధరా శారదా
మారామా పరమప్రసిద్ధమతి న మ్మాజమ్మఁ దేజంబునన్. ౬౬

సీ. తొడవులు పెక్కులు దొడివియుండె నెకాని, సత్యంబు తనకుసి జాలతొడవు
చుట్టాలసురభియై సొబగునొందె నెకాని, నెనరైనచుట్టంబు దనకుఁ గీర్తి
కులదైవతంబహో బలనాథుఁడ నెకాని, పతిమూర్తిపరమదైవతముతనకుఁ
జక్కఁదనంబులు సహజంబుల నెకాని, తనచక్కఁదనము వర్తనమునంద
తే. యనఁగవిలసిల్లెనిఖిలవిద్యారహస్య, పరమవిజ్ఞానపాండిత్య భద్రమూర్తి
విప్రసురశాఖిరామానుజప్రధాన, చూళియర్ధాంగలక్ష్మియమ్మాజియమ్మ.

క. ఇమ్మహి రామానుజవిభు, నమ్మాజమ్మకు జనించి రబ్జభవముఖా
బ్జమ్ములఁబోలిన సుతరత్నమ్ములు నలువురు నుదార తాజిత శరధుల్. ౬౮

సీ. మద్రేశనిభసము న్నిద్రశౌర్యోద్రేక, విద్రావితారి వే దాద్రిశౌరి
విష్ణుపదధ్యాన నిష్ణాత విజ్ఞాన, కృష్ణుండు శ్రీరామ కృష్ణమంత్రి
శరశరచ్చంద్రికా హారహారహిమహీర, కరకీర్తి వరశయ్యతిరుమలయ్య
పక్ష్మలితత్యాగ లక్ష్మీకరోద్యోగ, లక్ష్మలక్షితమూర్తి లక్ష్మఘనుఁడు
తే. ననఁగ వెలసిరి రామానుజయ్యసుతులు, దశరథక్షోణిపాలనందనసమృద్ధి
దైవతేశమదావళ దంతరేఖ, నురగపర్యంకనిజచతుర్వ్యూహలక్ష్మి. ౬౯

ఉ. ముద్రితవైరివక్త్రులగు మువ్వురుతమ్ములుఁ బంపుసేయ వే
దాద్రి విహారిమందిరుఁ డహర్పతితేజుఁడు రాజిలున్ యశో

---

ము=వికాసములేమి—సంకోచము. దుర్గమతమస్సంబాధములు=అణఁపరాని శోకములయొక్క రాయిడులు ॥౬౫॥ కామగవి=కామధేనువు. తవులువిడిబేరము = అంటియంటనివ్యాపారము॥ ౬౬॥ గారాము=గారాబము॥ ౬౭॥తొడివి=తొడిగి—ధరించి. సొబగు=అందము. వర్తనము=నడవడి. విలసిల్లెన్=ఒప్పెను. విప్రసురశాఖి=బ్రాహ్మణులకు కల్పవృక్షము ॥ ౬౮ ॥ ఉదారతాజితశరధులు=దాతృత్వముచేత గెలువఁబడిన సముద్రముగలవారు ॥ ౬౯ ॥ సమున్నిద్ర=జాగ్రత్తగల. విద్రావితారి=యుద్ధమునుండి తొలఁగి పాఱిపోయినశత్రువులుగలవాఁడు. నిష్ణాత=నేర్పుగల. పక్ష్మలిత=చెప్పలెత్తఁబడిన—వికాసమునొందిన. లక్ష్మ=గుఱుతు. మదావళ=ఏనుఁగుయొక్క. చతుర్వ్యూహలక్ష్మిన్=వాసుదేవ సంకర్షణప్రద్యుమ్నానిరుద్ధులనెడి నాలుగుమూర్తులరచనలయొక్క

కలకాళహస్తితనూభవన్ సుగుణల క్ష్మిన్ దిర్మలాంబ న్సభిఖ్య
వెలయంగాఁ గులకాంతఁ జేసి వెలసెన్ వేదాద్రి భద్రోన్నతిన్. ౨౧

సీ. వృషభేంద్రగమనుఁ డీ వేదాద్రినాథుండు, గిరిరాజతనయ యీ తిరుమలాంబ
వేదనిశ్వాసుండు వేదాద్రినాథుండు, శ్రుతిశారదాంబ యీ తిరుమలాంబ
విహగేంద్రగమనుఁ డీ వేదాద్రినాథుండు, శరధితనూజ యీ తిరుమలాంబ
విబుధాధినాథుఁ డీ వేదాద్రినాథుండు, ధర శచీదేవి యీ తిరుమలాంబ

తే. యనగననుకూలదాంపత్యవినుతమహిమ, హరువుదీపించె నౌర వేదాద్రివిభుఁడు
హరియశుఁడై సకలకాళహస్తితనయ, తిరుమలాంబయు నిత్యవర్ధిష్ణులక్ష్మి

సీ. వేదమార్గప్రతిష్ఠాదైవత జ్యేష్ఠుఁ, డభ్యస్తషడ్దర్శనార్థరాశి
యతిరాజరచితభాష్యగ్రంథనిర్ణేత, యఖిలపురాణేతిహాసకర్త
బంధురదివ్యప్రబంధానుసంధాత, పంచసంస్కారప్రపంచచణుఁడు
వాధూలమునిచంద్ర వంశవర్ధనమూర్తి, సకలదేశాచార్య నికరగురువు

తే. పట్టమేనుంగు శ్రీరంగపతికి నణ్ణ, గారిగర్భాంబురాశినీహారరశ్మి
సారసాహిత్యసర్వస్వ శయ్య నేటి, యాళవందారు కందాళయప్పగారు.

శా. తత్తాదృగ్విభవ ప్రభావనిధిఁ గందాళప్పగారిన్ దయా
యత్తస్వాంతు నితాంతశాంతియుతు లోకాచార్యవర్యున్ సుధీ
చిత్తాంభోరుహభానుఁ గొల్చుచుఁ దదాశీర్వాదలబ్ధోన్నతిన్
హత్తెన్ దాను విహారిమంత్రిమణి వేదాద్రీశుఁ డుద్యద్రుచిన్. ౨౪

వ. వెండియు నవ్వేదాద్రిమంత్రీశ్వరుండు రవికులతిలకుండును రణరంగధీరుండును
నంబునిధిగభీరుండును భట్టరభావాంకుండును నకలంకుండును నవత్తారుమండ
లీకరగండుండును నుద్దండభుజాదండుండునై పరనారీసహోదరుండయ్యును
నితరసముపార్జితవధూవల్లభుండును గోపికాగోవిందుండయ్యు నీశ్వరలక్షణ

---

చుటచేత. విహగేన్ద్రగమనుఁడు=విష్ణువు. శరధి=సముద్రము. హరువు=మనోజ్ఞత ॥ ౨౨ ॥ దైవతజ్యేష్ఠుఁడు=బ్రహ్మ. అభ్యస్త=నేరువఁబడిన. షడ్దర్శనార్థరాశి=ఆఱుశాస్త్రముల యర్థసముదాయముఁగలవాఁడు. అనుసంధాత=అనుసంధానముచేయువాఁడు. (అనుసంధానముచేయు—భక్తితోఁ జదువు.) నీహారరశ్మి=చంద్రుఁడు ॥ ౨౩ ॥ తాదృక్=అటువంటి. సుధీచిత్తాంభోరుహభానున్=పండితులమనస్సులనెడి కమలములకుసూర్యుఁడైనవానిని. హత్తెన్=పొందెను. ఉద్యద్రుచిన్=పుట్టుచున్నప్రకాశమును ॥ ౨౪ ॥ ఉద్దండభుజాదండుఁడు=నిక్కినకఱ్ఱవంటి భుజముగలవాఁడు. ఇతరసముపార్జితవధూవల్లభుఁడు = శత్రువులచేతసంపాదింపఁబడిన జయలక్ష్మియనెడి స్త్రీ ప్రియురాలుగాఁ

లక్షితుండును పొన్నాంచాయదేవి దివ్యశ్రీపాదపద్మారాధకుండయ్యును ప్రతి
ష్ఠాపిత పరమవైష్ణవకుటుంబవిశేషుండును నైనఘనుని. ౭౯

తే. గుఱుతుగలరాజు మంగయ గురవరాజు, పుత్త్రిపెదసంగభూపాలుకొడుకు ప్రభు
భానుసమతేజువిద్యావధానభోజుఁ, గొల్చి వేదాద్రి నిత్యలక్ష్ములఁ దలిర్చె.

మ. విభవేంద్రుండు విరోధిశాసన మహావిఖ్యాతి రామానుజ
ప్రభు వేదాద్రిలిఖించు వ్రాయసము లౌ రా! పెద్దసంగానసి
విభుచిత్తంబునెఱింగి గంటమునరనల్ విద్యావధూనూపుర
ప్రభవప్రౌఢ ఝుళంఝుళారభటిసౌభాగ్యంబు గల్పింపఁగన్. ౮౧

చ. అతనిసహోదరుల్ వెలసి కార్యగుణాఢ్యులు రామకృష్ణుఁ డా
యతభుజశౌర్యుఁ డౌతిరుమ లయ్య విచక్షణభవ్యసత్కళా
చతురుఁడు లక్ష్మణయ్యయు రసాతలనూతనకామధేనువుల్
చతురుపథావిధాననయసాంద్రులు చంద్రులు కాంతిసంపదన్. ౮౨

తే. ధర్మనిర్ణేత వేదాద్రి కూర్మితమ్ముఁ, డైన శ్రీరామకృష్ణప్రధాని వెలసె
లక్ష్మమాంబాధినాథుఁడై లక్ష్మితోడి, యాదినారాయణునికిఁ బ్రతిదినంబు.

క. ఇంతిం దిరుమలమంత్రియు, నంతమఁ గొనియాడవలయు నారీమణిసుగుర
ప్రాంతోపవనలతాంతా, నంతమరందస్రవంతి కాంతిసుసూక్తిన్. ౮౪

క. ఆలక్ష్మణమంత్రీశ్వరు, లీలావతి వెంగళాంబ లేఖవిభుధనభూ
పాలితనానావిధల, క్ష్మీస్థలలక్షణశోభివిభవ కీర్తుల వెలసెన్. ౮౫

క. సోదరులు సుతులు సఖులును, వేదోదితమార్గచర్య వినయము నయముల్
శ్రీదాంపత్యము నెసఁగఁగ, వేదాద్రిమహాప్రధాని వెలయుం గృపలన్.

---

గలవాఁడు. గోపికాగోపింపఁడు=గొల్లపడుచులకుఁ ప్రష్టుఁడు—అంటికొన స్త్రీలకు కృష్ణునివలె విలాసపురుషుఁడైనవాఁడు. ఈశ్వరలక్షణలక్షితుండు=శివునిగుఱుతులచేఁ జూడఁబడువాఁడు.-ప్రభుత్వలక్షణములతోఁ దోఁచువాఁడు. ప్రతిష్ఠాపిత=ప్రతిష్ఠచేయించఁబడిన—నిలుపఁబడిన. ౮౦ ॥ విద్యావధానభోజుఁడు=చదువునందలి అవధానముచేత (ఏకాగ్రతచేత) భోజరాజైనవాఁడు. ౮౧॥ విభవేంద్రుఁడు=వైభవమునందు ఇంద్రుఁడు. వ్రాయసములు=లిఖితపత్రికలు. నూపురప్రభవ=అందెలయందుఁబుట్టిన. ఆరభటి=ధ్వని ॥ ౮౨ ॥ విచక్షణభవ్యసత్కళాచతురుఁడు=విద్వాంసులు శ్లాఘింపఁదగిన మంచివిద్యలయందు సమర్థుఁడు. రసాతల=భూమండలమునందలి. చతురుపథావిధాననయసాంద్రులు=నేర్పులమార్గములను విధించునట్టి నీతియందు అధికులు ॥ ౮౩ ॥ ౮౪ ॥ హరి... సూక్తిన్=ఇంద్రునిపట్టణమువెంబడిదైన నందనవనమునందలి పువ్వులవలని తుదిలేని తేనెవలెవలె మనోజ్ఞములైనమంచిమాటలచేత ॥ ౮౫ ॥ లేఖవిభు=ఇంద్రునియొక్క. ॥ ౮౬ ॥ ౮౭ ॥ వివిధ

## ❀ షష్ఠ్యంతములు. ❀

క. ఏవంవిధగుణమణిఖని, కావిర్భవదుపక్రపాక టాత్మజనికి ల
 క్ష్మీవల్లభ చరణాంబుజ, సేవాహేవాకశీలశీలనమునికిన్. ౮౭

క. అంధకరిపుగంధద్రుమ, గంధాంధద్విపవిపక్ష గరుడన్మ్రోటీ
 బాంధవబంధురకీర్తిసు, గంధిలభువనత్రయునకు ఘనవినయునకున్. ౮౮

క. చతురుదధివలయవలయిత, కుతలభరణకరణభుజున కును సుజనునకున్
 నుతశౌరికి జితవైరికి, హితకారికి సమదగమన హేలాకరికిన్. ౮౯

క. వాణీనఖముఖముఖరిత, వీణానిక్వాణపల్లవితనూత్నసుధా
 ప్రాణసఖలేఖినీకల, రాణున కాచరితభూసురత్రాణునకున్. ౯౦

క. సంధారఘుపతికి వృష, స్కంధున కైదంయుగీన కర్ణునకు సమి
 న్మాంధాతకు బాంధవశుభ, సంధాతకు ధాతకును వృషభగమనునకున్.

క. భీమక్రోధాంధవిమత, సీమంతవతీలలామ సీమంతమణి
 స్తోమాపాకరణపటు, శ్యామలకరవాలజయసహాయభుజునకున్. ౯౨

క. రవికిరణరుచికి మతిభా, రవికి విమతసచివగళిత రవపదభూషా
 రవికి భుజాంతరమణిహా, రవికిని రుచిరార్థితతికి ధరాభృత్పతికిన్. ౯౩

---

గుణమణిఖనికిన్. ఇటువంటి గుణములనెడిరత్నములకుగనియైనవానికి. ఆవిర్భవత్ = పుట్టుచున్న. జనికిన్=జన్మముగలవానికి. హేవాక=ప్రోత్సాహమనెడి ॥ ౮౮ ॥ అంధకరిపు...త్రయునకున్ = శివుఁడు గంధపుమ్రాను సింహము గరుడునిముక్కు వీనికిమిత్రమైన అనగా వీనినిబోలిన మిక్కుటమైన కీర్తిచేత పరిమళించుచున్నమూఁడులోకములు గలవానికి ॥ ౮౯ ॥ నుతశౌరికిన్ = పొగడఁబడిన విష్ణుదేవుడుగలవానికి. జితవైరికిన్=జయింపఁబడిన శత్రువులుగలవానికి. సమదగమన హేలాకరికిన్=మదముతోడి అనగా తిన్ననినడకవలని విలాసముచేత ఏనుఁగైనవానికి ॥౯౦॥నఖముఖముఖరిత=గోటికొనలచేత మ్రోగింపఁబడిన.పల్లవిత=చిగిర్చిన. సుధాప్రాణసఖ=అమృతమునకు మిత్రమైన—అమృతమునుబోలిన. లేఖినీ=గంటముయొక్క. కలరాణునకున్=కలధ్వనికలవానికి ॥ ౯౧ ॥ సంధా=ప్రతిజ్ఞచేత. ఐదంయుగీన=ఈయుగమునందలి. సమిత్=యుద్ధమునందు. సంధాతకున్ = కూర్చువానికి ॥ ౯౨ ॥ భీమ...భుజునకున్=భయంకరమయినకోపముచేత కన్నుగాననిశత్రువుల యిల్లాండ్రయొక్క ఆభరణరూపమైన పాపటయందలి రత్నములసమూహమును అపహరించుటయందు సమర్థమయిన నీలవర్ణపుకత్తివలని గెలుపుతోడుపాటుతోడి చేయిగలవానికి ॥ ౯౩ ॥ విమత...రవికిన్=శత్రువుల మంత్రులయొక్క జారిన ధ్వనిగల కాలియందె మ్రోఁతగలవానికి. భుజాంతరమణిహారరవికిన్=ఱొమ్మునందలి రత్నపుహారముల ప్రకాశముగలవానికి ॥ ౯౪ ॥ అర్థి...ఉన్నతికిన్=యాచకుల సమూహమునకు జీమూతవాహనసమూహముయొక్క గౌరవముగలవానికి—యాచకులకుఇష్టవస్తువులనిచ్చుటయందు జీమూతవాహనునివంటివారిని అనేకులనుపోలినవానికి

క. రామానుజార్యసుతునకు, శ్రీమంతున కర్థిసార్థ జీమూతహయ
స్తోమోన్నతికి విరాజి, శ్రీమద్వేదాద్రిమంత్రి సింహంబునకున్. ౯౪

❀ కథాప్రారంభము. ❀

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన పాండురంగమాహాత్మ్యం
బునకుం గథావిధానం బెట్టిదనిన— ౯౫

మ. తులితోక్షధ్వజసూతుఁడై వెలయు సూతుం గాంచి ముని శౌనకా
దులు క్షేత్రంబును వేల్పుఁ దీర్థము బుధస్తుత్య ప్రభావంబులై
జళితైనస్తిమిరంబులై యిహపరార్థప్రాప్తిమూలంబులై
యిలపై నొక్కెడఁ గల్గెనే ననఘమూర్తీ! తెల్పవే నావుడున్. ౯౬

క. ఆ ఋషులప్రశ్న మంగీ, కారంబొనరించి పలుకుఁ గథకుండు శ్రీనా
థారాధనహితచర్యున్, బారాశర్యుం దలంచి ప్రాంజలియగుచున్. ౯౭

వ. మహాత్ములారా! యీపురాణసూత్రంబు త్రిరావృత్తింబుగా నుత్తమశ్లోకుం
డగుకృష్ణద్వైపాయనువలన మున్నెఱింగినయదికల సత్తీర్థంగథలంబును
మీయంతరంగంబులకువచ్చునట్లుగావిన్నవించెదవినుండనిసూతుండిట్లనియె

❀ కాశీపురవర్ణనము. ❀

శా. శీతాహార్యసుతాళిని వికచ రాజీవంబు విశ్వేశ్వర
జ్యోతిర్లింగవిశుద్ధరత్నఖని మోక్షోపాయమధ్యాధ్వనీ
లాతీరావని మండితనామకగజాలానంబు గంగామహా
స్రోతోనిస్సృతి చంద్రగోళ మన మించున్ గాశి [illegible]. ౯౯

శా. ప్రాలేయాచలకన్యకావదన శుంభద్భద్ర సౌరభ్యమున్
గ్రోలంగల్గియుఁ దుష్టిలేక ముఖిహృ[illegible]గంధ్యమై
లాలాలిత్యముఁగోరు నొక్క [illegible] లంబంబులై [illegible]
హాలాంబించుఁ బరాసులన్ భ్రమరకీటన్యాయకేళిన్ బుకిన్. ౧౦౦

---

అని అర్థము ॥ ౯౫ ॥ ౯౬ ॥ తులితోక్షధ్వజసూతుఁడు=సరిపోల్పఁబడిన బ్రహ్మ[illegible]. [illegible]
నస్తిమిరంబులు=నశింపఁజేయఁబడినపాపములనెడిచీఁకట్లుగలవి. ౯౭ శ్రీనాథారాధనహితచర్యున్
=విష్ణుదేవుని అర్చనమనెడి మేలైన నడవడికలవానిని. ౯౮ పురాణసూత్రంబు=వృత్తాంతము. ౯౯
శీతాహార్య=హిమవత్పర్వతముయొక్క. అళిని=ఆఁడుతుమ్మెద. వికచ=వికసించిన. ఆలానము =
కట్టుకంబము. స్రోతోనిస్సృతి=ప్రవాహము వెడలుటకు ॥ ౧౦౦ ప్రాలేయ=మంచు. శుంభత్ =
వికసించుచున్న. సౌరభ్యము=పరిమళము. గ్రోలన్=అనుభవించుటకు. ముఖహృత్రోఁ... లాలిత్యమున్ =

సీ. ఒకనాఁడు తీర్థోప యోగిగాని శివుండు, సౌదల ధరియించు నభ్రగంగ
నా ప్రొద్దుపాయిరాజ నట్టి నిర్వేదయు,భోగించు నైశ్వర్యములెనిమిదియుఁ
బుష్కరాక్షులపొంతఁ బోనివర్షధరుండు, దేహార్ధమునఁదాల్చుఁ దీఁగఁబోఁడి
నాయుధప్రభ గాంచియలఁగుఁ శీరుపుఁబూనువాఁడిముమ్మొనముల వేఁడియలుగు
తే. మలినవర్తనుఁడునుసుధాలలితమూర్తి, మించివర్తించుమతిలేని మేదకుండు
మానివస్యులఁ జదివించు మత్తినీడఁ, బంచముఖుపీఠ మేనోసరించెనేని.

క. ఆనందకాననంబున, నానందకపాణి కేశ వాహ్వాయమునఁ బెం
పానం దగు ముక్తిప్రమ, దానందితహారనీల తరళోపముఁడై.　　౧౦౨

సీ. శ్రీకరోదయవధూ లోకాననప్రభా, నాటితబహుచంద్ర నాటనంబు
సమ్మర్దగళితభూ షారత్నమంజరీ, యోజితరథ్యాప్ర పూజనంబు
కైలాసశైలసం కాశ సౌధనివేశ, కౌముదీకవచిత గగనతలము
విస్తీర్ణవిపణివి న్యస్తవస్తువ్రజ, ప్రకటితరత్నగ ర్భాజఠరము
తే. విపులపవమానతాండవ వేపమాన, లాంఛనధ్వజపట్టప ల్లవలలామ
మాళిరచితకశాకృత్య హేళిహయము, దీపితం బగు శ్రీకాశి కాపురంబు.

చ. జలజపరాగరాగరస సంగత మా పరిఖాజలంబులోఁ
పలఁ బ్రతిబింబితంబు లగు బంగరుకోటకుఁ బెట్టినట్టి కొ
మ్మలచెలువంబునం బురిర మారమణీమణి యొప్పు రావియా
కులమొలనూలు వెట్టెననఁ గోరి కనుంగొనువారు మెచ్చఁగన్.　　౧౦౪

---

హృదయములోపలిభాగమయినకమలముయొక్కమంచివాసనయొక్కవిలాసమునందలిమనోజ్ఞతను. సితరోలంబంబు=తెల్లతుమ్మెద ॥ ౧౦౧ ॥ సౌదలన్=తలమీఁద. పుష్కరాక్షుల=స్త్రీలయొక్క. వర్షధరుఁడు=నపుంసకుఁడు. అలఁగు=జంకునట్టి. వాఁడిముమ్మొనముల వేఁడియలుఁగున్=పదునుగల మూఁడుకొనలుగల తీక్ష్ణమయిన ఆయుధమును—త్రిశూలమును. ఓసరించెనేనిన్=విడిచినపక్షమున॥ ౧౦౨ ॥ ఆనందకాననంబునన్=కాశియందు. నందకపాణి=విష్ణువు. ముక్తిప్రమద=మోక్షమనెడిస్త్రీ. తరళోపముఁడు=పతకమునుబోలినవాఁడు ॥ ౧౦౩ ॥ శ్రీకరోదయ=సంపదను కలిగించునట్టి పుట్టుకగల. నాటిత=నటింపఁజేయఁబడిన. నాటనము=నటనముగలది. సమ్మర్ద=జనులఒరయికచేత. మంజరీ=గుత్తులతోడ. యోజిత=పొందింపఁబడిన. రథ్యా=పట్టణమునడిమిపెద్దబాట. సౌధ...గగనతలము=మేడలప్రకాశమనెడి వెన్నెలచేతకవచముగలదిగాఁజేయఁబడిన (కప్పఁబడిన)ఆకాశప్రదేశముగలది. విపణి=అంగడివీధి. విన్యస్త=ఉంచఁబడిన. రత్నగర్భాజఠరము=భూమియొక్కకడుపు (లోపలిభాగము) కలది. వేపమాన=చలింపఁజేయఁబడుచున్న. లాంఛన=గుఱుతైన. పట్టపల్లవలలామమాళి=పట్టుతోనైనటెక్కెముచివరచేత. కశాకృత్య=చబుకుపనిగల. హేళి=సూర్యునియొక్క॥ ౧౦౪ ॥ పరాగరాగ=పుప్పొడివలనిరంగుగల. పరిఖ=అగడ్త. కొమ్మల=కోటకొమ్మలయొక్క॥

తే. బలయురత్నాకరములుసంచులుగ జేసి,పాదివినిధు లెల్లగొనిసంచి మొదలుచేసి
బేరమాడెడుపాటి యు దారలక్ష్మి, బచ్చు లప్పురి నున్నారు పెచ్చువెరిగి.

క. హారమణాళీహీర మచ్యుత, చరణాబ్జమరందధార జాహ్నవి లోకే
శ్వరి తమసోదరియనానట, పురివెలమల భాగ్యమహిమ పొగడఁగవశమే.

ఉ. భూమియు నాకసంబు తమ పొంకమునన్ బిగియించు తత్పురి
సామజకోటియున్నతికి సర్వజగంబులఁ గల్గు నున్నతుల్
భూమము డిందె వామనతఁ బూనఁగ దక్షిణదిక్కునేనుఁగుల్
వామనమంచునాడఁ దగ వా తగవాడరుగాక భూజనుల్. ౧౧౩

చ. కెరలక క్రమ్మరింప నడు గెంటనె నిల్చు నొకింత నూకినన్
శరనిధులేడు దాఁటు మెయి చాఁచి చివుక్కున నుక్కుమీరి సం
గరమున గాయమైన పతిఁ గాచుఁ జలింపక తత్పురీహయుల్
హరిహయు మావు ముల్డిగిన యంబుధిరేవున వచ్చెనోసుమీ. ౧౧౪

ఉ. సారథి ఛాందసుండు బడి సాగదు చక్రయుగంబు ప్రాఁతపం
చారపుగుఱ్ఱముల్ రథియు శౌర్యమునం దరమాని సాత్మవి
స్తారము ఖండఖండములు తానట మాసరి యంచుఁ దత్పురిం
దేరులు నవ్వు శంకరుని తేరిని కేతనకింకిణీధ్వనిన్. ౧౧౫

క. వేటాఱుతునియలుగ నరి, పాటన మొనరించి బాహుపాటవగరిమన్
మేటు లగుపోటుమగ లవ్వీటన్ విహరింతు రుగ్ర విక్రములగుచున్. ౧౧౬

---

పోని. వీటిరాసుతులు= పట్టణమునందలిరాచకొమారులు ॥ ౧౧౧ ॥ బలయు=భూమినిఆవరించిన. సంచిమొదలు = అసలు—మూలధనము. బచ్చులు = వైశ్యులు ॥ ౧౧౨ ॥ హీరము = వజ్రమణి. మరంద=పూఁదేనెయొక్క. జాహ్నవి = గంగానది. వెలమల = శూద్రులయొక్క ॥౧౧౩॥ పొంకమునన్=పొందికచేత—ఆకృతిచేత. ఉన్నతికిన్=పొడువునకు. భూమము=ఆధిక్యము. డింది= అణఁగి. వామనతన్=పొట్టితనమును. తగవు=న్యాయము. ఆడరు=చెప్పరు ॥ ౧౧౪ ॥ కెరలక = తత్తఱిల్లక. అడుగెంటనె=అడుగుకొలఁది దూరముననే. నూకినన్=తోలినను. శరనిధులు=సముద్రములు. సంగరమునన్ = యుద్ధమునందు. హరిహయుమావు = ఇంద్రునిగుఱ్ఱము ॥ ౧౧౫ ॥ ఛాందసుండు=వైదికుండు. బడిన్=క్రమముగా. ప్రాఁతపంచారపు= మిక్కిలిప్రాఁతవైన—బహుకాలమునాటివైన—మిక్కిలిముసలివైన. రథి = రథికుఁడు. అరమానిసి=సగముమనుష్యుఁడు—అర్ధనారీశ్వరుఁడు. ఆత్మవిస్తారము = తనవిరివి—స్వరూపమంతయు. శంకరునితేరినిన్=శివునిరథమును—భూమిని ॥ ౧౧౬ ॥ వేటాఱుతునియలుగన్ = ఒకవేటునకుఆఱుతునకలు అగునట్టుగా. అరిపాటనము=శత్రువులనునఱకుటను. పాటవగరిమన్=సామర్థ్యగౌరవముచేత. పోటుమగలు=

యనుబోలెఁ బాయని యనుకూలదాంపత్య, మునఁబొల్చి మునికోటితనుభ
దారకబ్రహ్మవి ద్యారహస్యజ్ఞాత, చులుకితాంభోరాశి కలశసూతి [జింపఁ
తే. బ్రహ్మనిభమూర్తి పెక్కుకల్పంబులుండి, విబుధయూథంబు ప్రార్థింపవిన్ధ్యశిఖరి
విక్రమాటోపమడఁపన వీఁడు వెడలెఁ, బరవిపత్ప్రీతికారత త్పరులుఘనులు.
తే. అబ్ధితోఁగూడమునుఁగ్రోలు నౌర్వవహ్ని, యుదరబిలమునవొకచోట నుండి
యుండి, జటిలవరునకుగద్రూజకటకకటక, విరహతాపమిషంబునవెడలెనపుడు
చ. పుడిసిటఁ బట్టి నేతపసి పొంగు పయోనిధి నిల్వలానుజుఁ
గడుపున వేల్చె నేతపసి గాఢతపోనిధి నయ్యగస్త్యునిన్
బొడగని వింధ్యభూధరము పొంకము బింకము దక్కి నేలలో
నడఁగె బిలాంతరస్థలి భయాహతిఁ జొచ్చు కుళీరమోయనన్. ౧౨౨
శా. ఆవింధ్యాచల మట్లు వంధ్యనిజగర్వారంభమైయుండ న
గ్గోవిందాభుఁ డభంగురోదయనిధిం గొల్లాపురీలక్ష్మి ర
క్షోవిద్వేషి భుజాంతరాళ పదవీ శుద్ధాంత సైరంధ్రికన్
సేవించెన్ నుతియించె నాగమకథా సిద్ధాంతశుద్ధోక్తులన్. ౧౨౩
క. ఆపరమేశ్వరి తను నా, జ్ఞాపింపఁగ సామిమలకు షణ్ముఖపదసే
వాపరతఁ జనియె నమ్ముని, లోపాముద్రయును శిష్యులును సేవింపన్.
వ. ఇట్లు చనునవసరంబున. ౧౨౪
సీ. కొనలఁజుట్టిన తీఁగె పెనచేఁ జమరవాల, పరికరంబులఁ జుట్టు పట్టితిగిచి
కమ్మసంపెఁగలమొగ్గల నికుగడరాయు, జేగురుఁదిరికలు చెంపఁబెట్టి

---

ప్రకాశము—ఛాయ. తరణి=సూర్యుఁడు. పొల్చి = ఉండి. చులుకిత = పుడిసిలింపఁబడిన. కలశ
సూతి = అగస్త్యుఁడు. విబుధయూథంబు= దేవతలసమూహము. ఆటోపము = విజృంభణమును.
పరవిపత్ప్రీతికారతత్పరులు = ఇతరులఆపదలనుతొలఁగించుటయందు ఆసక్తులు ॥ ౧౨౧ ॥ ఔర్వ
వహ్ని=బడబాగ్ని. ఉదరబిలమునన్=కడుపు అనెడిగుహయందు. జటిలవరునకున్=ఋషిశ్రేష్ఠు
నకు. కద్రూజకటకకటక విరహతాపమిషంబునన్ = పాములు కడియములుగాఁగల శివునిపట్టణ
మయిన కాశియొక్క యెడఁబాటువలని తాపము నెపముచేత ॥ ౧౨౨ ॥ వేల్చెన్=ఆహుతిగాఁజేసి
కొనెనో. పొడగని=చూచి. పొంకము = నిక్కుయొక్క. బింకము—బిగువును. తక్కి = విడిచి.
కుళీరము=ఎండ్రకాయ ॥ ౧౨౩ ॥ వంధ్య = వ్యర్థమయిన. ఆరంభము=త్వరగలది. అభంగురోద
యనిధిన్=చెడనిమేలునకు ఉనికిపట్టయినదానిని. రక్షోవిద్వేషిభుజాంతరాళ పదవీశుద్ధాంత సైరం
ధ్రికన్=రాక్షసులకు శత్రువైన విష్ణుదేవుని వక్షస్స్థలమార్గమనెడి అంతఃపురమునకు కావలికత్తెను॥
౧౨౪ ॥ ౧౨౫ ॥ ౧౨౬ ॥ కమ్మ=పరిమళముగల. జేగురుఁదిరికలు = ఎఱ్ఱనిజడలు. ఒడియు=ఆక

లేడికినోడియు శిలీముఖశ్రేణిచే, మేలిపూగుత్తులు రాలరువ్వి
కబళనత్వరమాణ కరటితుండములచేఁ, గదళికాతరువులఁ గాళ్లఁ దాఁచి

తే. నెఱికురులుజారనాసలునిబ్బరంపుఁగుబ్బచన్నులుఁదొడలపెక్కువయుఁగలుగు
మృగవధాజీవశుద్ధాంత మీననయన, లర్చనలుచేసికొలిచి రయ్యాలుమగల.

వ. ఇట్లు లనుదినప్రయాణంబుల నమ్మిథునంబు కుంతలదేశప్రాంతంబుగనిన.

క. పంపాతరంగ రింఖణ, ఝంపా సంపాత్యమాన జలకణరేఖా
సంపాతశీతలానిల, సంపద నాదరించెఁ బరమ శైవోత్తంసుఁడా. ౧౨౮

సీ. నఖరాగ్రలూనానన స్వేదకోరకం, బర్కకషాయ కృశాంచలంబు
ప్రబలనిశ్వాసనసారభతర్జిత మధ్వాళి, శోషితశ్రవణశిరీషయుతము
దర్శితమధ్యవృత్తిప్రసస్తమ దుశీవి, యప్రయత్నపయోధరాంబరంబు
సంతప్తశర్కరా సహపదన్యాసంబు, నచలరజోధూమ లాలకంబు

తే. సరణితరుణతరుచ్ఛాయశమితఖేద,మలసము దులాంగకంబునై యడుగు దెంచు
నన్నిజపరిగ్రహముఁగూర్మినాదరించి,పలుకువింధ్యాద్రినిర్బంధబాంధవుండు

---

...ణచేయునట్టి. శిలీముఖ=బాణములయొక్క. కబళన = మ్రింగుటకు. త్వరమాణ=తొందరపడు చున్న. కరటితుండములతోఁ=ఏనుఁగుతొండములతోడ. దాఁచి=తన్ని = ...నాసలు=బిష్పిద ములైన ముక్కులు. నిబ్బరంపు=సడలని. పెక్కువ=ఆధిక్యము. మృగవధాజీవశుద్ధాంతమీననయ నలు=బోయల యంతఃపుర స్త్రీలు ॥ ౧౨౭ ॥ మిథునము=దంపతులు ॥ ౧౨౮ ॥ పంపా...సంపద= పంపానదియందలి అలలయొక్క పొరలికలతోడి ... ...లనునల పాటువలనిచల్లగాలి. పాదరించెఁ=సంతోషింపఁజేసెను. పరమశైవోత్తంసుఁ = ... శివభక్తులకు సిగబంతి శ్రేష్ఠుఁడు ...—అగస్త్యుఁడు ॥ ౧౨౮ ॥ నఖరాగ్రలూనానన స్వేద కోరకంబు=కొనగోటిచేత ఎవి మీటఁబడిన మొగమునందలి చెమట మొలకలుగలది. అర్కకషాయ కృశాంచలంబు=కసము ఎఱ్ఱపారినకొంగులుగలది. ప్రబల...మధ్వాళి=పరిమళము చేత వృద్ధి పొందింపఁబడిన తుమ్మెదలుగలది. శోషిత=వాడిన. శిరీష=దిరిసెనపు పుష్పముతోడ. దర్శిత=చూపఁ బడిన. వృత్తి=వర్తులమైన. ప్రసస్త=జాఱిన. నీవి=పోకముడిగలది. పయోధరాంబరంబు = ... విఁగి వస్త్రముగలది—పైటగలది. సంతప్త...న్యాసంబు=కాలినగులకఱాలకు నొవ్వి ... పెట్టుటగలది—ఎండచేత కాలినగులకరాలవైన అడుగు పెట్టఁజాలకయు అడుగు పెట్టుచున్న అనుట. అచల...కంబు = కొండయందలి దుమ్ముచేతనలు పుమింపఁగలిగిన ...ముంగురులు గలది. సరణి=మార్గమునందలి. తరుణ=లేఁతలైన. శమితఖేదము = ఆఱఁపఁబడిన బడలికగలది. అలసమృదులాంగకంబు=బడలిన మెత్తనిదేహముగలది. నిజపరిగ్రహముఁ=తనభార్యను వింధ్యాద్రి నిర్బంధబాంధవుండు = అగస్త్యుఁడు ॥ ౧౩౦ ॥ ప్రభావంతంబు = ప్రకాశముగలది. నానా...తము = అనేకములయినరత్నములకు పుట్టుచోట్లయి యొప్పునట్టిచఱియలచేత మనోజ్ఞ

మ. వనితా! చూచితె మాల్యవంతముఁ బ్రభావంతంబు నానామణీ
జనకోదంచితసానుకాంతము మరుత్సంపూర్ణచంద్రాననా
జనకేళీపదచంద్రకాంతము నభస్సంబాధకృత్తుంగోత్కటవ
ర్ఘనదుర్గాంతము సర్వపర్వతకథాప్రాగ్వర్ణితోదంతముక్. ౧౩౦

సీ. ఇవె యూపవృతశాఖు లివె లూనముఖదర్భ, సందర్భవేశంత సైకతంబు
లివె శబ్దసహమృగ యువయుగంబులు వీరె, చలకాకపక్షమ స్తకులు బ్రహ్మ
చారులు నిజహోమ సౌరభేయీతర్ణ, కములనీడల నిల్చి కాచియున్న
వారు సామోదిత స్వరసంశయమునొంది, చిలుకకోయిలని దె తెలియనడిగె

తే. భసలకలభకులాస్పృష్టకుసుమవిసర, మసృణమకరందమయమైనమావిమోక
కిసలయచ్ఛవిపునరుక్తి నసలుమసలు, ఋషులచెంగావివలువందునిందువదన! ౧౩౧

క. నిర్ధూతపాతకములు హ, విర్ధూమలతాగ్ర లాస్య విలసనశిక్షా
ధూర్ధరములు నిజభజనవి,వర్ధితసుకృతంబు లిచటి వాయువు లబలా! ౧౩౨

ఉ. ఓలలితాంగి! యిందు సుఖ ముండు మృకండు కణాద గాధి వా
ధూలముఖాతిరిక్తచరితుండు మతంగమహాతపస్వి ని
ష్కాళగళుండు నిర్యువతి గాత్రుఁడు నిర్నిటలేక్షణుండు ని
ర్వ్యాళవిభూషణుండు నగు నంబరకేశుఁ డనంగఁ బెంపగుక్. ౧౩౩

---

మయినది. మరు...కాంతము = దేవతాస్త్రీలకు క్రీడాస్థానములైన చంద్రకాంతపురాళ్లుగలది. నభ...దుర్గాంతము = ఆకాశమును ఒరయుచున్న శిఖరములు పెరుగుటచేత అణఁపరానిది. ప్రాగ్వర్ణితోదంతము = ముందెన్నఁబడినవృత్తాంతముగలది ॥ ౧౩౧ ॥ యూపవృతశాఖులు = యూపస్తంభములచేత ఆవరింపఁబడిన వృక్షములు. లూన = కోయఁబడిన. సందర్భ = కూడికగల. వేశంతసైకతంబులు = కొంచెపునీటిపడియలవెంబడి యిసుకదిబ్బలు. సహ = సహించునట్టి. కాకపక్ష = పిల్లజుట్లతోడి. సౌరభేయీతర్ణకములక్ = ఆవులలేఁగదూడలను. సామోదిత = సామవేదమువలనఁబుట్టిన. భసల...మయము = కొదమతుమ్మెదలసమూహముచేత తాఁకఁబడని పువ్వులసముదాయమువలని మెఱుఁగులు దేఱుచున్న తేనెవికారముగలది. మావిమోక = మామిడిమొలక. కిసలయచ్ఛవి = చిగుళ్లకాంతి. పునరుక్తిక్ = ఇబ్బడించుటచేత. అసలుమసలుక్ = బురదగొనును—అతిశయించును. ఇందువదన = చంద్రునివంటిముఖముకలదానా ॥౧౩౨॥ నిర్ధూత = బొత్తిగాతొలఁగింపఁబడిన. హవిర్ధూమ = హోమపుపొగయనెడి. లాస్యవిలసన = నాట్యపుచతురత్వమును. ధూర్ధరములు = భారమునువహించినవి. నిజభజన = తమ్ముసేవించుటచేత ॥౧౩౩॥ అతిరిక్త = మించిన. నిష్కాళగళుండు = నల్లఁదనములేని మెడగలవాఁడు. నిర్యువతిగాత్రుఁడు = ఆఁడురూపు (అర్ధ) శరీరమునందు లేనివాఁడు. నిర్నిటలేక్షణుండు = నొసటికన్ను లేనివాఁడు. నిర్వ్యాళవిభూషణుండు = పాములసొమ్ములు లేనివాఁడు.

శా. గంగాసంగమ మిచ్ఛగించునె మదిన్ గావేరి దేవేరిగా
నంగీకారమొనర్చునే యమునతో నానందముం బొందునే
రంగత్తుంగ తరంగ హస్తముల నా రత్నాకరేంద్రుండు నీ
యంగంబంటి సుఖించునేని గుణభద్రా తుంగభద్రానదీ! ౧౩౯

క. ఓపును భూపరిధిం గల, యాపగ లవి బాహ్యతాప మాఁపఁగ నీవే
యోపుదుగా యంతర్గత, తాపత్రయ మడఁప నోయుదన్వన్మహిళా!

చ. అనికొనియాడి యన్నది మహానియమంబునఁ దీర్థమాడి బో
రన భవరోగజాడ్యములు ద్రాఁగఁ దదుజ్జ్వలకర్బురాబ్జగం
ధనిచిత మారసౌషధము ద్రావి తటస్థితపూజ్య పూజనం
బు నడపెఁ గాశికా విరహ భూరివిషాదము సాదమొందఁగన్. ౧౪౧

వ. ఇవ్విధంబునఁ ద్రిభువన పవిత్రీకరణ సమర్థచరిత్రం బగు నయ్యుదధికళత్రం
బున ససతీఛాత్రుండై యంచిత కృత్యంబు లాచరించి నీవారముష్టిం బంచ
వారంబులుండి తద్వారిపూరంబు వినిర్గమించి మించుఁబోఁడియునుం దానును
బంచాక్షరీ గుహా హర్యక్షంబగు విరూపాక్షు నుక్షధ్వజు దాక్షాయణీవిభు

పాపములముఖములకుముద్రయైనదానిని—పాపములనుతలయెత్తనీయనిదానిని ॥౧౩౯॥ దేవేరిగాన్=పట్టపుదేవిగా. రంగత్తుంగతరంగహస్తములన్ = చలించుచున్నయున్నతములయిన అలలనెడిచేతులతో. రత్నాకరేంద్రుఁడు=సముద్రరాజు. గుణభద్రా=మంచిగుణములచేత మేలైనదానా ॥౧౪౦॥ భూపరిధిన్=భూమండలమునందు. ఆపగలు=నదులు. ఆఁపఁగన్=అణఁపను. ఉదన్వన్మహిళా=సముద్రునియిల్లాలా ॥ ౧౪౧ ॥ తీర్థమాడి=స్నానముచేసి. బోరనన్=శీఘ్రముగ. భవరోగజాడ్యములు=జన్మములనెడి వ్యాధులవలని జడత్వములు. ద్రాఁగన్=కాలిపోఁగా. తదుజ్జ్వలకర్బురాబ్జగంధనిచితము=ఆనదియందలి ప్రకాశించునట్టి బంగారుకమలములవాసనచేత అతిశయిల్లినది. రసౌషధమున్=జలరూపమయినమందును. కాశికావిరహభూరివిషాదము=కాశీపట్టణమును విడుచుటవలని అత్యంతమయిన మనస్తాపము. సాదము—నాశము ॥ ౧౪౨ ॥ త్రిభువనపవిత్రీకరణసమర్థచరిత్రంబు=స్వర్గమర్త్యపాతాళములనెడి మూఁడులోకములను పావనములనుగాఁ జేయఁజాలినప్రవర్తనముగలది. అయ్యుదధికళత్రంబునన్ = ఆసముద్రునిభార్యయందు—నదియందు. ససతీఛాత్రుండు=పెండ్లాముతోను శిష్యులతోనుగూడినవాఁడు. అంచిత=ఒప్పిదములయిన—ముఖ్యములయిన. నీవారముష్టిన్=పిడికెఁడు నివ్వరిధాన్యము నాహారముగాఁ జేసికొనుటచేత. పంచవారంబులు=అయిదువారములు—నలువదిదినములు. తద్వారిపూరంబు=అందలిజలప్రవాహమును. వినిర్గమించి=దాఁటి. మించుఁబోఁడియున్—పెండ్లామును. పంచాక్షరీగుహాహర్యక్షంబు=పంచాక్షరీమంత్రము అనెడి గుహయందలి సింహము. ఉక్షధ్వజున్=వృషభకేతనముగలవానిని, దాక్షాయణీ

ఆ. అహితగోత్ర హృద్వ్యథోపకృతి నీదు, శక్తి కుగ్రబాహు శక్తిఁ దగు
ఘనవివృద్ధిఁ బేర్చి గర్వించుటలు నీదు, శిఖికి సత్ప్రతాప శిఖికి నమరు.

వ. అని యమ్మునికులచక్రవర్తి వెండియుం గార్తికేయుం డాశ్రితార్తిహరుండని యును శరవణభవుండు పరమపురుషార్థప్రవణుండనియును మహాసేనుండు దీనజన మందారుండనియును శశ్వద్బాలుండు కృపావిశాలుం డనియును షడాననుండు కీడువలనం బాచి ప్రోచు ప్రోడ యనియును నీలదంష్ట్రుండు జయశ్రీలాభంబులకు మూలంబనియును గాంగేయుండు ముంగిటిపెన్నిధానంబని యును కుక్కుటధ్వజుండు మ్రొక్కుటకుం దగిన వేల్పనియును బ్రహ్మగర్భుండు నిర్భర బ్రహ్మవిద్యోపదేశదేశికుండనియును విశాఖుండు కుశాగ్రబుద్ధియనియును సుబ్రహ్మణ్యుం డదభ్రగుణరత్నఖనియనియును శిఖివాహనుండు సాధుసఖుండనియును పార్వతీనందనుండు సచ్చిదానందుండనియును బాహులేయుండు మోహమహీధరవ్యూహ మేఘవాహనుం డనియును తారకారాతి యకారణసుకృతి యనియును శక్తిధరుండు భుక్తిముక్తికరుం డనియును స్వామి యోగక్షేమభూమియనియును స్కందుండు జగత్సందోహ

---

మునకు=దేవతలసేనానాయకులకు నాయకుఁడగునట్టిపట్టమును గట్టుకొనుటయందు. కిట్టి = సమీపించి. ప్రాఘతరరణక్రీడ=మిక్కిలి నేర్పుగలయుద్ధమనెడియాట ॥ ౧౮౬ ॥ అహితగోత్రహృద్వ్యథోపకృతి=శత్రువంశముయొక్క మనోవ్యథను కలుగఁజేయునట్టిపని (లేక) శత్రురూపమయిన కొండయొక్క మనోవ్యథను చేయునట్టి బాణవ్యాపారము. ఘనవివృద్ధిక్ = మేఘములయొక్క విశేషవృద్ధిచేత ; అధికమయిన పెరుగుటచేత. పేర్చి=విజృంభించి. శిఖికిన్=నెమలికిని. సత్ప్రతాపశిఖికిన్=మంచిప్రతాపమనెడి అగ్నికిని ॥ ౧౮౭ ॥ మునికులచక్రవర్తి = మునుల సమూహము నందుశ్రేష్ఠుఁడు. కార్తికేయుఁడు = కృత్తికలకొడుకు. శరవణభవుండు = రెల్లుగంటయందుఁ బుట్టినవాఁడు. ప్రవణుండు = ఆసక్తుఁడు. మందారుండు = కల్పవృక్షమయినవాఁడు. శశ్వద్బాలుండు=సదాబాలుఁడు అగువాఁడు. కృపావిశాలుఁడు = విశేషకృపగలవాఁడు. జయశ్రీలాభంబులకున్=గెలుపు కలుములవచ్చుబడికి. మూలంబు=కారణమయినవాఁడు. గాంగేయుండు=గంగకొడుకు. పెన్నిధానంబు=పెద్దనిధి. నిర్భర=మేలైన. దేశికుఁడు=గురువు. అదభ్రగుణరత్నఖని=శ్రేష్ఠములయిన గుణములనెడి రత్నములకుగని. సచ్చిదానందుఁడు=చెడనిజ్ఞానమును సంతోషమును గలవాఁడు. బాహులేయుఁడు=అనేకులకు కొడుకు. మోహమహీధరవ్యూహమేఘవాహనుఁడు=అజ్ఞానమనెడి కొండలసమూహమునకు ఇంద్రుఁడు. సుకృతి=సత్కార్యములు గలవాఁడు. భుక్తిముక్తికరుఁడు=భోగమోక్షములనుకలుగఁజేయువాఁడు. యోగక్షేమభూమి = అపూర్వవస్తువులను పొందుటకును మేలునకును స్థానమయినవాఁడు. జగత్సందోహావనపరిస్పందుఁడు=లోకసమూహమును రక్షించుటయందుచలింపనివాఁడు. క్రౌంచదారణుండు = క్రౌంచపర్వతమును భేదించినవాఁడు.

వన పరిస్పందుండనియును క్రౌంచదారణుండు పంచవదనా పరానతాననం డనియును గుహుండు నిరవగ్రహ శుభావహుండనియును గుమారుండు నమర చమూసముద్ధరణ నిర్వికారుండనియును షాణ్మాతురుండు తురాషాణ్ముఖ సుఖప్రదుండనియును బ్రమదరస నిమగ్నమనస్కుండై యగ్నిభవుం బ్రణు తించి యనాదం బగుతదీయ ప్రసాదంబు వడసి కతిపయ దివసంబు లుచిత గతిం గడపి తద్విరచిత మహాస్కాందగ్రంథ సందర్భంబునం బూర్వ భాగంబువిని తదాశయావబోధ సుధాధునీ వినిమజ్జనంబునం గాశీవియోగ జనిత క్లేశంబు దీసివైచి యందలి యుత్తరభాగంబున. ౧౪౭

సీ. మిన్నేటిపాటియుఁ బెన్నయున్నతియు వి, పాశవాసియుఁ జంద్రభాగ చేగ
యును శరావతిభూతి యను వేత్రవతిచరి, త్రము బాహుదయుదారతయును
వేణియగణ్యాభివృద్ధియుఁ గావేరి, తీవియుఁ గపిలలీలావిభవము [కృష్ణ
వంజీర మంజువార్వైభవంబును భవ, నాశని క్లేశని ర్నామకృతియుఁ
తే. దుంగభద్రప్రసంగము తుంగభద్ర, రాజిరాజిల్లు గౌతమి యోజమహిమయు
వార్తకెక్కినతీర్థప్రవర్తనములు, స్వామి వినిపించె వింధ్యసంస్తంభయితకు.

క. ఆకుంభజుతో మఱియుం, గేకిధ్వజుఁ డనియె మౌని కేసరి! వినుమిం
కేకథ వినియెదు సకలము, నీకెఱిఁగించితి నెకాధునీచరితంబుల్. ౧౪౯

---

నిరవగ్రహశుభావహుఁడు=కొఱవలేక శుభములనిచ్చువాఁడు. అమరచమూసముద్ధరణనిర్వికారుఁడు=దేవతలదండును ఉద్ధరించుటయందు వికారముపొందనివాఁడు. తురాషాణ్ముఖసుఖప్రదుఁడు=ఇంద్రుఁడు మొదలగువారికి సుఖము నిచ్చువాఁడు. ప్రమదరసనిమగ్నమనస్కుఁడు = సంతోషరసమునందు మునిఁగిన మనస్సుగలవాఁడు—మిక్కిలి సంతోషించినవాఁడు. అనాదంబు = నాశములేనిది. ప్రసాదంబు=అనుగ్రహము. కతిపయదివసంబులు=కొన్నిదినములు. తద్విరచిత = అతనిచేత చేయఁబడిన. సందర్భంబునందున్=రచనయందు = కూర్పునందు. తదా...మజ్జనంబునన్=దానియర్థము తెలియుటయనెడిఅమృతనదియందుమునుఁగుటచేత—అపురాణకథను వినుటయందలి యాసచేత. క్లేశంబు=దుఃఖమును ॥౧౪౭॥ మిన్నేటిపాటి=ఆకాశగంగయొక్కగొప్పతనము. ఉన్నతి=గౌరవము. వాసి=మేలిమి. చేగ=సత్త్వ. భూతి=సంపద. ఉదారత = గొప్పతనము. అగణ్యాభివృద్ధి=ఎన్నరానిపెంపు. తీవి=బాగు. లీలావిభవము=విలాససంపద. వార్వైభవంబు=జలసమృద్ధి. క్లేశనిర్నామకృతి=క్లేశము పేరులేకుండఁ జేయుట. ప్రసంగము = ప్రస్తావము. తుంగభద్రరాజిన్=అధికమైనశుభములవరుసను. ఓజ=విధము. వార్తకున్=ప్రసిద్ధికి. తీర్థప్రవర్తనములు = తీర్థముల చరిత్రములు. సంస్తంభయితకున్—అణఁచినవానికి ॥౧౪౮॥ కేకిధ్వజుఁడు=కుమారస్వామి. మౌనికేసరి=మునిశ్రేష్ఠుఁడా. ధునీచరితంబులు = నదులచరిత్రములు ॥౧౪౯॥ ఈఁగంగానీవు=మునుఁగ

క. ఈగంగాదికతీర్థము, లీఁగంగానీవు దమస మిద్ధాంబువులన్
దోఁగెడువారల గనగన, గ్రాఁగెడు నంగారసింధు కల్లోలములన్. ౧౫౦

క. వివిధక్షేత్ర చరిత్రలు, వివిధసుపర్వానుభావ విలసనములు దీ
ర్థవిశేషశ్రవణముతఱిఁ, జెవికిం జవియొసఁగెనే విశిష్టవిచారా! ౧౫౧

చ. అనుడు నగస్త్యుఁ డిట్లనియె హైమవతీసుతుతోడఁ దోడిస
న్మునులలరంగ నోయనఘ మూర్తి! సమస్తముఁ గ్రిందుచేసి మిం
చిన బలువేల్పుఁ దీర్థమును క్షేత్రము నొక్కెడఁ గూడియుండెనే
ని నిరుపమాదృతిం దెలిపి నీవు మముం గరుణింపఁగాఁదగున్. ౧౫౩

క. అని పలుకు కలశభవముఖ, మునిజనముల ప్రశ్నవాక్యములు విని పురభి
త్తనయుఁడు తత్త్రివిధమునొ, క్కనెలంగుమిగూడి యునికిఁ గనఁజాలమికిన్.

వ. ముహూర్తమాత్ర విచారడోలారూఢ నిజస్వాంతుండై యా యాశ్రమ
విశ్రాంతులంగూర్చి యిట్లనియె. ౧౫౪

క. ఏతత్త్రితయము నొకచో, భూతలమున మేళవించి పొగడొందుట మ
చ్చేతోగతి దోఁపదు సము, పేతావృతిముకురకుక్షి నిభమును బోలెన్.

తే. చిత్తమాశ్చర్యరసమున జొత్తిలంగఁ, జేయు నీప్రశ్నమక్షికాక్షేయుచేత
నిందుధరుచేతహరుచేత నెఱుఁగవలయు,రండుపోదముమునులార! రజతగిరికి.

క. పొడమిన సందేహంబుల, జడిసిన మందేహులం బ్రసన్నులఁ జేయన్
మృడునకుఁ బనిగావున మన, మడిగినయర్థంబు నతఁడ యాదేశించున్.

---

నీయవు. సమిద్ధాంబువులన్=మిక్కిలిశ్లాఘ్యములయిన జలములయందు. తోఁగెడు = మునిఁగెడు. క్రాఁగెడు = మండెడు. అంగారసింధుకల్లోలములన్ = నిప్పుటేటి పెద్దఅలలయందు ॥ ౧౫౧ ॥ సుపర్వ=దేవతలయొక్క. శ్రవణముతఱిన్=వినునప్పుడు. చవి=రుచి. విశిష్ట=విశేషమయిన॥౧౫౨॥ హైమవతి=పార్వతి. అలరంగన్ = సంతోషింపఁగా. క్రిందుచేసి = తక్కువపఱిచి. నిరుపమాదృతిన్=సాటిలేని ఆదరణముచేత ॥ ౧౫౩ ॥ పురభిత్తనయుఁడు=శివునికొడుకు. నెలన్ = నెలవునందు=స్థానమునందు ॥ ౧౫౪ ॥ విచారడోలారూఢనిజస్వాంతుఁడు=ఆలోచనయనెడి యుయ్యాలయందెక్కియున్నతనమనసుగలవాఁడు—ఆలోచనచేతచలించినమనసుగలవాఁడు. ఆశ్రమవిశ్రాంతులన్=మునులను ॥౧౫౫॥ మేళవించి=కూడి. చేతోగతిన్=మనోమార్గమునందు—మనస్సునందు. సముపేతావృతిముకురకుక్షిన్=కూడినకప్పుడుగల అద్దములోపలిభాగమునందు ॥ ౧౫౬ ॥ జొత్తిలంగన్=రాగిల్లఁగా—అనురాగమునుపొందఁగా. అక్షికాక్షేయుచేతన్ = శివునిచేత ॥ ౧౫౭ ॥ జడిసిన=చలించిన. మందేహులన్=(మంద + ఈహులన్) వికాసముచెడినవారిని. ప్రసన్నులన్=వికాసమునొందినవారినిఁగా. మృడునకున్=శివునికి. ఆదేశించున్=చెప్పును ॥ ౧౫౮ ॥ కృతనిశ్చ

క. అది సజ్జస్యందనమై, మదకరియై తత్తదుచిత మార్గంబుల నే
ర్పొదవ నొకకొంత చని పా, రదనిభశుభమూర్తి నశ్వరత్నంబగుచున్.

క. శితికంఠసుతుఁడు ఖచర, స్తుతుఁడై యాయచ్ఛరూపు తురికీ నాస్కం
దిత ధౌరితక ప్లుత రే, చితవల్గిత గతులఁ దరటు చేసిన నదియున్. ౧౬౩

క. మురళిగొనియు రవణమునన్, బరువడి గోమూత్రికాది భంజళులఁ గడున్
గెరలి చతుర్విధధావిత, పరిపాటీపాటవమునఁ బతి మెప్పించెన్. ౧౬౪

సీ. బలుపాపతలచుట్లు లలవరించినవారు, లేఁతచందురులఁ దాల్చినవారు
పునుకతమ్మంటులఁ బొలుచువీనులవారు, నొసలమిక్కిలిచూపు లెసఁగువారు
బూదుపారఁగ మేనబూదిఁ బూసినవారు, త్రిముఖాస్త్రములు కేలఁ ద్రిప్పువారు
పులితోలుహొంబట్టు పుట్టముల్ గలవారు, కొమ్ముతేజుల నెక్కి గునియువారు

తే. ఘోరతపములహరుదక్కఁ గొన్నవారు, కరటిదైతేయకుంభముక్తాలలామ
హారిభుజమధ్యములవారు దారయశులు, ప్రమథవీరులుగొలిచిరాబాహులేయు

---

స్వరము యొక్క కూర్పును. ఎసఁగు=అతిశయించునట్టి. తెలికన్నుగోనల యెక్కిరింతన్=తెల్లని కనుఁగొనలుకలదైన నెమలివాహనమును. బలుకొండఁదూఁటువోనేయుమేటి = కుమారస్వామి॥ ౧౬౨॥ సజ్జస్యందనము=అలంకారము (సిద్ధము) చేయఁబడిన రథము. పారద=పాదరసముతోడ. శుభమూర్తిన్=తెల్లనియాకృతితో ॥ ౧౬౩ ॥ ఖచరస్తుతుఁడు=దేవతలచేత పొగడఁబడినవాఁడు. అచ్ఛరూపుతురికీన్=స్వచ్ఛమయిన (తెల్లని) రూపముగల గుఱ్ఱమును. ఆస్కందిత...గతులన్= ఆస్కందిత=మిక్కిలివేగమును మందమునుగానిదియు. ధౌరితక=ఆస్కందితమునకంటె కొంచెము వడిగలదియు, ప్లుత = అతివేగమునదాఁటుచుఁబోవునదియు, రేచిత = వంకరగాతిరుగక వడిగాఁ బోవునదియు, వల్గిత=మీఁదికికాళ్లెత్తికదలించుచు వడిగాఁబోవునదియునైన, గతులన్=నడకల చేత. తరటుచేసినన్=నడపింపఁగా ॥ ౧౬౪ ॥ మురళి, రవణము, పరువడి, భంజళి—ఇవి గుఱ్ఱము దవుడుపాఱుటయందలి భేదములు. అందు భంజళి గోమూత్రిక మొదలగు భేదములచేనానా విధము ; (వీనివివరణము విచారింపఁదగినది.) కెరలి=రేఁగి. చతుర్విధధావిత పరిపాటీపాటవమునన్=నాలుగువిధములయినదవుడుపాఱుక్రమమునందలి నేర్పుచేత ॥౧౬౫॥ పాపతలచుట్లు= పాములతలపాగాలు. అలవరించిన=వహించిన. పునుకతమ్మంటులన్=తలపుఱ్ఱెలచేత చేయఁబడిన చెవిపోఁగులచేత. మిక్కిలిచూపులు—మూఁడవకన్నులు. బూఁదుపారఁగన్=బూఁజుపట్టినట్టుగా. బూది = భస్మము. త్రిముఖాస్త్రములన్ = మూఁడుమొనలుగల శూలములను. హొంబట్టుపుట్టములు=బంగారుపట్టువస్త్రములు. కొమ్ముతేజులన్=వృషభవాహనములను. గునియు = కులుకు. కరటిదైతేయ=గజాసురునియొక్క. కుంభ=కుంభస్థలమునందలి. ముక్తాలలామ = ముత్యాలహార ములచేత. హారి=అందగించునట్టి. భుజమధ్యములవారు = ఱొమ్ములుగలవారు. ఉదారయశులు= అధికకీర్తిగలవారు ॥ ౧౬౬ ॥ క్షోణీరేణుకృతంబులు= నేలదుమ్ముచేఁజేయఁబడినవి. అంజనరజ్జో

శా. క్షోణీరేణు కృతంబు లంజనరజో గుచ్ఛాసితంబుల్ తమ
శ్రేణుల్ దూషిత పూషభీషణగతిన్ జృంభించియుం దూలెన
క్షీణోత్తంభిత శక్తిభృద్భటశిర స్సీమా కిరీటస్ఫుట
న్మాణిక్యాతప పల్లవస్తబక సామగ్రీహృతాగ్రంబులై. ౧౬౬

క. స్మర శశి తటిదజ పవమా, న రవి సుధా సలిల మునిజ నక్ష్మాహిష్టా
సురమృత్యుజ్వాలనఁ జెలఁగు, సురవేశ్యలు గొలిచి రపుడు సుబ్రహ్మణ్యున్.

క. దైవతభటభుజశిఖర, వ్యావల్గన్నవకృపాణ వల్లిక లలరెన్
దైవపథవారినిధిసలి, లావిష్కృత విషమషీ మహస్సులఁబోలెన్. ౧౬౮

క. నయనత్రిభాగ * వృతహా, సయుతంబుగ సాధ్యసతులు చల్లిన లాజల్
నయనాయుధ తనయాయుధ, చయలతికావళులఁగుసుమ సమతఁ వహించెన్.

తే. వివిధదివిషద్వధూముక్త దివిజవిటపి, కుసుమకేసరలసదంస కూటుఁడగుచు
వేల్పుఁబడవాలుకేడువాలువిరియఁబడిన, కంఠమునఁబొల్చుదుర్గకంఖాణమనగ.

తే. విబుధమధురాధరాభుజవీజ్యమాన, విమలచామరబహుసహస్రములు గొలిచె
స్వామియిరుగడఁబుష్పవర్షములఁదలఁకి, సురవిమానపాళిముల్ దెరలెననగ

---

గుచ్ఛాసితంబులు=కాటుకపొడిముద్దలవలెనల్లనైనవి. తమశ్రేణులు=చీఁకటిబారులు. దూషితపూషభీషణగతిన్=దూషింపఁబడిన సూర్యునికి భయంకరమైన పథమున. జృంభించి=విజృంభించి. తూలెన్=తూలెను. అక్షీణో...గ్రంబులై=తగ్గనివియును నిక్కింపఁబడినవియు నైన కుమారస్వామి బంటులతలలయందలి కిరీటములందు ప్రకాశించుచున్న కెంపుల వెలుఁగుల గాడ్పులయొక్క సమగ్రత్వము (పరిపూర్తి) చేత అపహరింపఁబడిన కొనలుగలవై ॥౧౬౬॥ స్మ...జ్వలనన్ = మన్మథుఁడు చంద్రుఁడు మెఱుపుయొక్క ప్రకృతి వాయువు సూర్యుఁడు అమృతము జలము సప్తమహర్షులు భూమి శివుఁడు వీరియొక్క ప్రకాశముచేత. చెలఁగ = అతిశయించునట్లు ॥౧౬౭॥ భుజశిఖరవ్యావల్గన్నవకృపాణవల్లికలు = మూఁపులందుండుటను చలించుచున్న క్రొత్తకత్తులనెడుతీఁగెలు. అలరెన్=ప్రకాశించెను. దైవపథ...మస్సులు=ఆకాశమనెడి సముద్రజలమునందుండు విషముయొక్క నల్లనిమంటలు ॥౧౬౮॥ నయనత్రిభాగవృత=కంటియొక్క మూఁడుభాగములందావరించిన. లాజలు=పేలాలు. నయనాయుధ=శివునియొక్క ॥౧౬౯॥ వివిధ...కూటుఁడు=బహువిధములయిన దేవతాస్త్రీలచేత విడువఁబడిన (చల్లఁబడిన) కల్పవృక్షపుఁబువ్వులలోని అకరువులచేత ఒప్పుచున్న శిఖరములవంటి మూఁపులుగలవాఁడు. వేల్పుఁబడవాలు=దేవతల సేనానాయకుఁడు—కుమారస్వామి. విరియఁబడినకంఠమునన్=వికాసమునువహించిన మూఁపురముచేత, దుర్గకంఖాణము=భద్రకాళియొక్క వాహనము—సింహము. వాలున్=అతిశయించును ॥౧౭౦॥ విబుధ...

* దరహాస అని పాఠాంతరము.

తే. స్వామిమలనుండి రాజతాచలముదాఁక, సేతువెత్తినగతి మహాసేనసేన
రోదసీరంధ్రనీరంధ్ర రూపమగుచు, నడచె గిరిసింధువనసృష్టి పుడమినడఁగ

ఉ. పుట్టినమోముల్లై శిఖరముల్ వెలుఁగొందు నితంబమండలిం
గట్టినకృత్తిమై నిబిడ కాననరేఖ దలిర్ప లోనఁ జూ
పట్టిన విశ్వమై వెలుఁగు ప్రాణికులం బలరన్ గిరీశుఁడ
ప్పుట్టికిఁ గానిపించిన ప్రభం గలధౌతనగంబు దోఁచినన్. ౧౨౩

క. జైవాతృకబింబము నిజ, జీవాతువుఁ గాంచి ప్రాప్త జీవము లగుచున్
జీవంజీవము లలరెడు, భావంబున బాహులేయ బలములు పొదలన్. ౧౨౪

తే. పద్మరాగమణీమయ పాదలబ్ధి, స్ఫురితగైరికశిఖరచంచూసమృద్ధి
గంధవతియనునొక్కపక్షజమునడుమ,మించునక్కొండకొదమరాయంచఁబోలి ౧౨౫

తే. నీలగళవాహరింఖాఖనిత్రనిహతి, నింగికెగసిన వెండితానేలదుమ్ము
ప్రాంతవర్తిష్ణుసప్తపరివృఢులకు, నొసఁగు నిర్యత్నభసితవిలసితమచట ౧౨౬

వ. ఇట్లు నిజబలనిఖిలనిరీక్షణ నిస్తంద్రచంద్రికాధీనంబగునగ్గట్టుజేని వైమానిక
సేనాని మానఘనుండగునధికుండునిజపురుషకారంబునుంబోలెనధిరోహించి.

క. వాహనముడిగి గగనచర, వాహినిఁ దత్కుధరసవిధ వనవిహరణకాం
క్షాహార్యాతపహ్వయ నటయట,యోహోనిలుమనుచునిలిపి యుల్లంబలరన్.

---

ప్రములు= దేవతాస్త్రీలచేతులయందువీవఁబడుచున్న అనేకములగుపింజామరలు. తలఁకి=భయపడి. తెరలెన్=వెడలెను॥౧౨౨॥ సేతువు=కట్ట. ఎత్తినగతిన్=కట్టినవిధమున. మహాసేనసేన=కుమారునిదండు. రోదసి=భూమికి ఆకాశమునకు నడుమ. నీరంధ్ర=సందులేని. సింధు = నది ॥ ౧౨౩ ॥ నితంబమండలిన్=నడుము ప్రదేశమునందు. కృత్తి=తోలు. నిబిడ=దట్టమైన. రేఖ=చాలు. దలిర్పన్=ప్రకాశింపఁగా. అప్పుట్టికిన్=ఆకొండుకునకు. కలధౌతనగంబు = వెండికొండ ॥ ౧౨౪ ॥ జైవాతృక బింబమున్=చంద్రబింబమును. నిజజీవాతువున్=తాముజీవించుమందును. ప్రాప్తజీవములు= పొందఁబడిన ప్రాణములుగలవి. జీవంజీవములు = చకోరపక్షులు. ॥ ౧౨౫ ॥ పాదలబ్ధిన్=పాదములను పొందుటచేత. (పాదము=కాలు; ప్రత్యంతపర్వతము) గైరిక = కొండయందుఁ గలిగెడి యెఱ్ఱని పచ్చని వర్ణవిశేషముగల. చంచూ = పక్షిముక్కుయొక్క. గంధవతి=భూమి. రాయంచన్=రాజహంసను ॥ ౧౨౬ ॥ నీల...నిహతిన్=శివునివాహనమైన వృషభముయొక్క గిట్టలనెడి గుద్దండ్లతాఁకుడుచేత. నింగికిన్=ఆకాశమునకు. వర్తిష్ణు = ఉండునట్టి స్వభావముగల. పరివృఢులకున్=రాజులకు—శ్రేష్ఠులకు. నిర్యత్నభసితవిలసితము=యత్నములేనివిబూదియొక్క ప్రకాశము॥ ౧౨౭ ॥ నిస్తంద్ర—తగ్గని. గట్టుజేనిన్=పర్వతరాజును. వైమానికసేనాని=దేవతల సేనానాయకుఁడు. పురుషకారము=పురుషప్రయత్నము. అధిరోహించి = ఎక్కి ॥ ౧౨౮ ॥ గగనచరవాహినిన్=దేవతలదండును. తత్కుధర...హ్వయన్=ఆపర్వతము వెంబడ తోపులయందు విహరించుట

ఉ. ఆరవి వాలఖిల్యయుతుఁడై విధుగర్భము దూఱెనో యనన్
దారకవైరి సంయమికదంబయుతంబుగ నేగుదెంచి ము
క్తారుచిసాంద్రమైన వసుధారథు గేహముఁ జొచ్చెనప్పురా
రాతియు నిష్కుటాంతరవిహారకుతూహలితుండై యొనర్పఁగన్. ౧౭౯

తే. మన్దిరోద్యానఖేలనానన్దవిభవ, మనధరించెను తారాపిటార్భకమౌళిఁ, జవుదు
గుత్తులవిరులఁబూజించుటకును, యాఱుఋతువులుసన్నిధియయ్యెనచట.

సీ. మరువంపువలపుఁబల్మఱుఁగ్రోలిక్రోలికన్,ప్రాన్చియూరకమేనుమఱచుఁగొన్ని
యరవిచ్చుతెలిమొల్లవిరులుమూఁతులుసాచి,పాదిగూఁకఁజెక్కుఁబొదువుఁగొన్ని
గురువిందపూఁదేనెపెరలకై తమలోనఁ, బొత్తుపోవక సారెఁ బోరుఁగొన్ని
పక్వంబులగుదాఁకఁ బాటించి మల్లికా, కలికానికాయంబుఁ గాచుఁ గొన్ని
తే. భోగివశమైనగేదంగిపూవునకును,వగచుమదిఁగొన్నిబన్ధుజీవకలతాన్త,గుచ్ఛ
ములలోననొకకొన్నికొలువుసేయుఁ, దేఁటులఖిలస్త్రమయువనివాటిఁగమిచి.

తే. పూవుఁదేనియఁదడిసినపూవిచిగురు, మీఁదనంటిచరించుతుమ్మెదలిచ్చ,సమ
యనాటయుమనినెయ్యిసమరమనుచు,ద్రుంప్పఁబోదోముకీలంపుదునకయనఁగ

తే. గంధవిరహితమనుబుద్ధిఁ గనకతేఁటి, మూఁతివిచ్చినమోదుగు మొగ్గఁదగిలి
సౌరభాకాంక్షఁజొచ్చిచెన్నారెఁగీర, తుండపక్షమైననేరేడు పండుఁబోలె.

క. ఖరకరకరహతి సలసలఁ, దెరలెడు మల్లీమరందదీర్ఘికఁ జుట్టున్
దిరుగు నళి యనుభవమునకుఁ, జొరవతెలోభాంధబుద్ధి పొమ్మనియుక్రియన్.

---

యందలియాశచేత పిలువఁబడిన మనసుగలవానిని. అటయట=అక్కడనక్కడనే. అలరన్=వికాసమునొందఁగా ॥ ౧౭౯ ॥ విధు=చంద్రునియొక్క. సాంద్రము=అతిశయించినది. వసుధారథు= శివునియొక్క. పురారాతి=శివుఁడు. నిష్కుటాంతర=ఇంటితోఁటలోని శృంగారవనములో. ౧౮౦ ఖేలన=క్రీడించుటవలని. అనధరించెను=ధరించెను_పొందెను. తారాపిటార్భకమౌళి=ఆ చంద్రుఁడు కిరీటముగాఁగలవాఁడు_శివుఁడు. విరులన్=పువ్వులచేతను. సన్నిధియయ్యెన్=చేరెను ॥ ౧౮౧ ॥ వలపు= వాసన. క్రోలి=త్రాగి__అనుభవించి. ప్రాన్చి=కొంచెముమూసి. పొది = గుంపు. పొదువున్= కప్పును. పెర=తెట్టె. పొత్తుపోవక = పాలుపోక. పాటించి=పొంచి = వేచియుండి. కలికాని కాయంబున్=మొగ్గలసమూహమును. కాచున్=కావలికాచును. భోగి=పాము. బంధుజీవకలతాంత గుచ్ఛములలోనన్=మంకెనపూగుత్తులలో. వనివాటిన్=తోఁటలోనిచెట్లచాయను. ౧౮౨ ౧౮౩ ॥ సౌరభాకాంక్షన్=పరిమళమునందలి యపేక్షచేత. చెన్నారెన్=అందగించెను. కీరతుండ=చిలుక ముక్కునను ॥ ౧౮౪ ॥ ఖరకరకరహతిన్ = సూర్యకిరణములుసోఁకుటచేత. తెరలెడు=తెర్లుచున్నట్టి= ఉడుకుచున్నట్టి. మల్లీమరందదీర్ఘిక = మల్లెపూఁదేనెడిగ్గియ. (డిగ్గియ=నడబావి) అళి = తుమ్మెద. అరయుక్రియన్=విచారించువిధమున__కనిపెట్టియుండుకీలిని ॥ ౧౮౫ ॥ కొనియున్=పొందియు.

క. నలువదితొమ్మిది రూపం,బులు గొనియున్ బుష్పగంధ ములుమోవఁగ తే
కలసియుఁ దెమ్మెర లానుం,బలుమఱు యువజనముమేని ఫలుచనిచెమటల్.

చ. విమలమయూఖరేఖయు నవీనతరోత్పలపత్రమున్ బ్రవా
ళమణియు నొక్కటీవియ బ లాదృతి దాల్చె నటన్న వించు వి
భ్రమశిథిలాంగియయ్యుఁ గుచ భార నితంబ కపోలగోపన
క్రమకలనాకులాత్మయయి కన్నుల నీళు నదల్చె గౌరియున్. ౧౨౬

తే. ప్రావృషేణ్యపయోధరపటలిచేత, గాడ్పు నీహారకర రేఖఁ గప్పుకరణి,ధరణి
ధరకార్ముకుఁడు శైలతనయఁ బొదివెఁ,బచ్చడంబునఁ బొల్చుపూఁ బచ్చడమున

చ. పొదువుపరాగఘృష్టి మొగ మున్ శ్రమవారిని మేను భానుదీ
ప్తి దవుల హెచ్చు జన్గడలుఁ దేజము దాల్చెనెకాని యొప్పు గుం
దదు నగపుత్రి కప్డ భసి తంబున వర్షముచేత నగ్నిపైఁ.
గదురుట నద్దమున్ లతయుఁ గాంచనకుంభములున్ బెడంకునే. ౧౨౮

మ. బొమ లెక్కించిన విల్లువంచు నునుఁజూపు ల్పంచలాచంచల
క్రమరేఖ న్నిగిడింప శాతవిశిఖౌఘంబుల్ మెయిన్ నించు నె
య్యమునన్ బల్కఁగ నల్కమీఱి చటుల జ్యాఘోషముం జేయు న
య్యుమప్రాపొంది రతీశ్వరుండు హరు బిట్టోడింప నుట్టాడుచున్. ౧౨౯

చ. చిగురులు దేరఁ జేసి విరి చిక్కని చక్కని పువ్వుగుత్తులన్
బిగువుచనుంగవం బొదివి ప్రేలెడుచిల్కలఁ జోపి తేనియన్
బొగపినపల్కులం బొగడి భూతపతిన్ బతి మెచ్చఁ జేసె న
య్యగజ తదుద్యమార్హవిన యానునయాభినయానుకూలతన్. ౧౩౦

---

గంధములు=వాసనలు. తెమ్మెరలు = మందమారుతములు. ఆనున్=త్రాగును ॥ ౧౨౬ ॥ ౧౨౭ ॥ ప్రావృషేణ్య పయోధర పటలిచేతన్ = వర్షాకాలమునందలి మబ్బు తెగలచేత. గాడ్పు = గాలి. (ఇదికర్తృపదము) నీహారకరరేఖన్ = గీఱగాఁ గనఁబడెడి చంద్రుని. ధరణిధర కార్ముకుఁడు=శివుఁడు. డంబునన్=కాంతిచేత. పచ్చడమునన్=కప్పెడు వస్త్రముచేత ॥౧౨౮॥ పొదువు పరాగఘృష్టిన్=ఆవరించునట్టి పుప్పొడి వెలుఁగుచేత. శ్రమవారిని=చెమటచేత. భానుదీప్తి=సూర్య ప్రకాశము. చన్గడలు=స్తన సన్నివేశములు. కుందదు = తగ్గదు. భసితంబునన్ = విబూదిచేతను. కదురుటన్=కలుఁగుటచేతను—వ్యాపించుట చేతను. బెడంకునే=చలించునా ॥౧౨౯॥ బొమలు = కనుబొమ్మలు. ఎక్కించినన్=పైకినిక్కించినను. నునుఁజూపులు=సోఁకీసోఁకనిచూపులు. రేఖన్= విధమున. నిగిడింపన్=ప్రసరింపఁజేయఁగా. శాతవిశిఖౌఘంబులు=వాఁడి బాణముల సమూహములు. మెయిన్=దేహమునందు. నించున్=నిండించును. చటులజ్యాఘోషమున్ = చలించుచున్న అల్లెత్రాటిధ్వనిని. ప్రాపు=ఆశ్రయము. బిట్టు=శీఘ్రముగ. ఉట్టాడుచున్= పొంచిపొంచి తిరుగుచు,

క. కించిద్వలగ్న ! మిక్కిలి, మంచిది, నీప్రశ్న మిది. స మర్మముగా వి
న్నించెద నను నాలోనన,కంచుకు లరుదెంచి ఘటిత కరకిసలయులై.

క. దేవ ! యగస్త్యాదికముని, సేవితుఁడై వచ్చినాఁడు సేనాని భవ
త్సేవార్థియగుచు నతఁ డిట, రావచ్చునొ యనుడు రాగ రసభరిత మతిన్.

వ. దేవీసహితుండై యద్దేవదేవుండు తదాగమనం బనుమతించుటయు వల్లె యని సౌవిదల్ల నికరంబు నిజకరంబులం బుత్తడిబెత్తంబు లంబురుహ చుంబిత తరుణతరణి కిరణంబులం బురణింప మరలిపఱచి శరవణప్రభవునకు భవానీపతి యనుగ్రహించుటం దెలియ విన్నవించుటయు నతండు. ౧౫౩

సీ. వీడియం బెడలించి విధురత్నకనకాలు,కాంచితాంబువు పుక్కి లించియుమిసి
యుదిరిబంగరుప్రాత హారంబట్టువలెవాటు, సడలించి వెసఁ గటి స్థలినిజుట్టి
యనుయాయిపృథుకహ స్తాంతరన్యస్తాప, దోచితార్థముతానె యుద్వహించి
యంగుళీసంజ్ఞ సం యములఁ బ్రత్యేకంబు, మునుమున్న లోనికిఁ జననొనర్చి

తే. ద్వారపార్శ్వస్థ వేదికా వలుల జరఠ, రక్షివర్గంబు టంక్రియా రభటి వఱలు
వలయమకుటాదికంబుగ నిలిచి మ్రొక్క,నగవుఁజూపులఁజూచుచునగరుసొచ్చి

ఉ. వచ్చి పయోజపత్రముల ద్రావెడు తుమ్మెదదొమ్మిమూఁకలన్
దచ్చనసేయుచున్ బిత్రుప దంబుల కూఁకటులంట దర్శనం
బిచ్చుటమున్న గాఁగ నుతి యించుచు మ్రొక్కుడుఁ గేలుసాఁచి వే
గ్రుచ్చి కవుంగిలించి వలి గుబ్బలిపట్టియ వాఁకదాల్పుడున్. ౧౫౫

తే. సమ్మదాశ్రులు కనుఁగవ గ్రమ్ముదేర, నాఱుమోముల బాలుని జా స్తరమున
నిలుపనతఁడొప్పె రోహిణీజలజవిమత,మధ్యముననున్న తారాకుమారుఁబోలె

---

౧౫౧ ॥ కించిద్వలగ్న=సన్ననినడుముగలదానా. కంచుకులు=అంతఃపురపు కావలివారు=బెత్తాల వారు. ఘటితకరకిసలయులు = చేర్పఁబడినచిగుళ్లనుబోలిన చేతులుగలవారు. ॥ ౧౫౨ ॥ ౧౫౩ ॥ చుంబిత=ముద్దునొనుచున్న—తాఁకుచున్న. తరణి=సూర్యునియొక్క. పురణింపన్=సరిపోలఁగా. ౧౫౪ ॥ వీడియంబు=తమ్మ. ఎడలించి = తొలఁగించి—ఊఁచివేసి. విధురత్న...బువు = చంద్రకాంతమణులచేతఁజేయఁబడినగిండియందలి మంచిజలము. ఉదిరిబంగరు=పుటముదీరినబంగారు. కటిస్థలిని=నడుమునందు. అనుయాయి...తార్థము = వెంబడివచ్చునట్టి పిన్నవానిచేతనున్న కానుకకుఁ దగినవస్తువును. ఉద్వహించి=వహించి=తీసికొని. జరఠరక్షివర్గంబు=ముసలికావలివారిసమూహము. వఱలు=ఒప్పునట్టి ॥ ౧౫౫ ॥ పయోజపత్రములన్=తామర రేకులసైని. దొమ్మిమూఁకలన్=సందడిగుంపులను. తచ్చన = ఎగతాళి. కూఁకటులు=పిల్లజుట్లు—జులుపాలు. దర్శనంబు = కానుక. వలిగుబ్బలిపట్టి = హిమవత్పర్వతముకూఁతురు—పార్వతి. వాఁకదాల్పుడు= గంగానదినిధరించిన

క. నిటలాక్షువలన నప్పుడు, ఘటసంభవముఖ్యమునులు గని రెంతయు ము
చ్చటఁ బిలిచి పీటయిడి యుత్కటకృపతో నొసఁగు పరమ గౌరవమంతన్.

సీ. అలవోక కనకాద్రి సెలయుచో విఱిగిన, హరివరాహము దంష్ట్ర నవతరించె
నెద్ది మున్నపరంజి యనుపేరనేలలఁ, జరియించు గంధర్వపతిబ్రహ్మనకుఁ
జిత్రాశ్వునకు నెద్ది చేకూరె నెద్ది త, చ్ఛుద్ధాంతకామినీ సురతఖేద
మపనయింపఁగ జాలెఁ దపవాసరంబుల, నంచన్నై గరుడంచలానిలముల

తే. నెద్ది ప్రాపించె నాఖేచరేంద్రుఁ గెలుపు, గొన్న తారకునకు వాని గుహుఁడు మనిమి
తెచ్చెఁ దా నెద్దియమ్మౌక్తికమిచ్చె నచల, సుతకు శితికంఠరుసకు నిచ్చటయును నలరి.

చ. హరుఁడు శిరంబునం జెవిఁ గరాంబురుహంబునఁ దాల్పఁ జంద్రికాం
కురపరభాగమై యురగకుండలమై స్ఫటికాక్షసూత్రమై
గిరిజకుచాళిఁ గర్ణమునఁ గేల వహింపఁ బ్రసూనమాలికా
కరిరదపత్ర విభ్రమము కంబులునై మణి యుల్లసిల్లుచున్. ౨౦౩

వ. వెండియు నక్కొండరాచూలియు ఖండపరశుండునుం డెందంబుల నెద్ది
యభిలషించి రయ్యపూపంబు లాపరమరత్నంబు ధరియించి తదాదరణ
చరితార్థం బయ్యె నంత. ౨౦౪

క. మత్స్వామిప్యమునకు నీ, సత్సంయమివరులు నీవుఁ జనుదెంచుటకో
వత్సా! యెయ్యది కతమని, వాత్సల్యముగదుర పంచవదనుఁడు పలుకన్.

సీ. తనతండ్రిఁ బలుకఁ గ్రౌంచనిషూదనుఁడు చంద్ర, పరిషన్నిరుద్ధనీరరుహముకుళ
భాతి మోడ్పు గేలు ఫాలాగ్రవీథికి, విలసిల్లి యలక నో వృషభగమన!

---

హరుఁడు—శివుఁడు ॥ ౨౦౦ ॥ నమ్మకాశ్రులు=ఆనందబాష్పములు. క్రమ్మరెదరన్ = క్రమ్మఱఁగా. నిజాంతరమునన్=తమమనసున. ఉడుపమౌళి = చంద్రమౌని యొక్క ॥ ౨౦౧ ॥ కనిరి = పొందిరి. ౨౦౨ ॥ అలవోకన్=వేడుకగా. సెలయుచోన్=పొడిచి యెగఁజిమ్మినప్పుడు. దంష్ట్రన్=కోఱకొమ్మునందు. చేకూరెన్=దొరకెనో. తచ్ఛుద్ధాంత...ఖేదము=ఆచిత్రాశ్వుని యంతఃపుర స్త్రీల యొక్క క్రీడవలని శ్రమమును. అపనయింపఁగన్=పోఁగొట్టను. తపవాసరంబులన్ = వేసంగిదిన ములయందు. గరుడంచలానిలములన్=ఱెక్కలకొనలవలనిగాలిచేత. ప్రాపించెన్ = పొందెనో. ఆఖేచరేంద్రున్=ఆగంధర్వరాజును. ఎద్ది=దేనిని. అలరి = సంతోషించి ॥ ౨౦౩ ॥ కచాళిన్= కొప్పునందు. ప్రసూనమాలికా=పూలదండయు. కరిరదపత్ర=దంతపుఁగమ్మయు. విభ్రమకంబు లును=విలాసార్థముచేతనుంచుకొన్న చిలుకయు.మణి=ఆముత్తెము. ఉల్లసిల్లుచున్=ప్రకాశించుచు ౨౦౪ ॥ కొండరాచూలి=పార్వతి. అభిలషించిరి=కోరిరో. ఆపరమరత్నంబు=సర్వోత్కృష్టమయి నయాముత్తెము.తదాదరణచరితార్థంబు=వారియాదరణకుఁదగిననడవడికివిషయమయినది ॥ ౨౦౫ ॥ కతము=కారణము. ॥ ౨౦౬ ॥ చంద్రపరిషన్నిరుద్ధనీరరుహముకుళభాతిన్ = చంద్రులసమూహము

నా పేర స్కాందంబు నాఁదగు నొక పురాణము నీదుకరుణకలిమిరచించి
యమ్మునీంద్రులకెల్ల నెఱిఁగింప నందు నీ, రలు సురక్షేత్రతీర్థములకథలు
తే. చాల వినివిని సర్వాతిశాయియైన, దేవుఁడేనియు నటువంటి తీర్థమేని
యట్టిసుక్షేత్రమేని భోగాపవర్గ, దాయిగలదేనియెఱిఁగింపు తడయకనిన.
వ. సర్వోత్కృష్టంబు లగుతీర్థక్షేత్రదైవతంబులమహాప్రభావంబు మదీయభావ
దర్పణంబునం బ్రతిఫలింపమింజేసి. ౨౦౭
క. నీవలనన కడముట్టిన, దైవతమహిమయును క్షేత్ర తత్త్వము తీర్థ
శ్రీవిభవము శ్రుతిమార్గసు, ధావిష్కృతిగాఁగ వినుట కైముద మొదవన్.
సీ. ఈ కలశోద్భవప్రముఖు లేనును వచ్చితి మీహితార్థల
క్ష్మీకర! దీని మాకు నెఱిఁగింపు మనంబున నున్న సంశయో
త్సేకము మానిపింపు కృపఁ దేలెడుచూపులఁ జూడు మన్నఁ దా
రాకమనార్థమౌళి మధురంబుఁ బ్రియంబునుగాఁగ నిట్లనున్. ౨౦౯
మ. మము నీయర్థమ వేఁడుచున్నయది యుష్మన్మాత యోపుత్ర! యీ
యుమకు న్నీకు నెఱుంగఁజెప్పెద వినుం డూహించి యేతచ్చరి
త్రము సర్వంబు కరోదరస్ఫటికరత్నశ్రీఁ బ్రకాశింప గో
ప్యము సేయన్ దగు దీని విన్నపిదపన్ బ్రాణంబుగాఁ జూచుచున్. ౨౧౦
తే. శఠమతికినాస్తికునకు బాషండునకును, గర్మముగుఱించియాచించుగర్హితునకు
నీపరమగోప్య మోపుత్ర! యోపురంధ్రి! తప్పిదారియు నెఱిఁగింపఁదగవుగాదు.
క. అని నిజతనూభవునకును, దనమగువకుఁ దీర్థ దైవత క్షేత్రము లొ
క్కనెలవునన భువనత్రయి, వినుతిఁగనుట దెలుపఁగడఁగి విధుమౌళి మదిన్.

---

చేత ఆక్రమింపఁబడిన తామర మొగ్గవిధమున. ఫాలాగ్రవీథికన్ = నొసటిప్రదేశమునందు. సర్వాతిశాయి=అన్నిటినిమించినది. భోగాపవర్గదాయి=భోగమునుమోక్షమును ఇచ్చునది ॥౨౦౭॥ మదీయభావదర్పణంబునన్ = నామనసనెడి యద్దమునందు. ప్రతిఫలింపమింజేసి = తోఁచక పోవుటచేత ॥ ౨౦౮ ॥ శ్రుతిమార్గసుధావిష్కృతి = చెవిరంధ్రములందు అమృతమును విడుచుట. ౨౦౯ ॥ ఈహితార్థలక్ష్మీకర = కోరినవిషయములను కలుగఁజేయువాఁడా. సంశయోత్సేకము= సందేహముయొక్క ఆధిక్యము. తారాకమనార్థమౌళి = శివుఁడు ॥ ౨౧౦ ॥ యుష్మన్మాత = మీతల్లి. కరోదరస్ఫటికరత్నశ్రీన్=అరచేతియందలి పటికపురాతికలిమిచేత.॥౨౧౧॥ శఠమతికిన్= మూర్ఖబుద్ధిగలవానికిని.నాస్తికునకున్=దేవుఁడులేఁడుఅనువానికిని. పాషండునకున్=వేదాచారముల నిందించువానికిని॥౨౧౨॥౨౧౩॥వెడఁద=విశాలమైన. వ్రేతలన్=గొల్లపడుచులను.వలపించు=మోహింపఁజేయు.వెరవు=నేర్పు.చిప్పకూఁకటి=పిల్లజుట్టు.చిన్ని=మనోహరమైన. పింఛియము = పింఛెము= నెమలి.యీఁకలకుచ్చు.పులుఁగుతత్తడి=పక్షివాహనము. పొడవుల=ఆకృతులయొక్క-ఎల్లప్రాణుల

శ్రీపాండురంగవిట్ఠలస్వామినేనమః.

# పాండురంగమాహాత్మ్యము.

## ద్వితీయాశ్వాసము.



క. శ్రీదయితచరణసేవా, ప్రాదుర్భవదఖిలవిభవ భాసుర! సరసా
  హ్లాదకవితరణవిద్యా, వేదీ! రామానుజేంద్ర వేదాద్రీశా! ౧.

వ. ఆకర్ణింపుమాగోకర్ణకుండలుండు సుకుమారంబుగాగొండరాచూలింగనుంగొని.

సీ. శైలజ! విను విను షట్కంఠ! కరవీర, కుశపల్లవంబులఁ గొమరుమిగులు
  ఘర్మవీరానది గలసె నెచ్చట నట్టి, భైమిదక్షిణతీర భాగమునకు
  యోజనంబునసమన్తాన్నతంబగుతీర్థమును క్షేత్రమునుజాలఁబొగడువడయఁ
  బౌండరీకములన భాసిల్లు నచట న, ద్దేవతోత్తముఁడు లక్ష్మీవరుండు
తే. భక్తరక్షణదాక్షిణ్యసక్తబుద్ధి, యఖిలనిగమౌఘ గిరిగుహా హరిపృథుకము
  పాండురంగాండు సాకృతి బ్రహ్మలీల, నిలిచియున్నాఁడుభువనవర్ణితవిభూతి.

వ. ఆదికల్పంబునందలి పదునెనిమిదవ ద్వాపరంబు కడకందువ శతానందాది బృందారక సందోహ శిరశ్శిఖర మణిగణమయూఖచ్ఛటా టోపా రోప మహనీయచరణనఖరశిఖుండగుపుండరీకాక్షుండు పాండురంగాహ్వయంబునం బుండరీకుం డనునొక్క భూసురపుండరీకునకుఁ బ్రత్యక్షంబై భక్తపక్షపాతంబునఁ దక్షేత్ర తీర్థంబులకుఁ బౌండరీకంబులన నామకల్పనం బాచరించి యాచతుర్భుజుండు నేఁడు నచ్చోటనయున్నవాఁడు. అవ్వెన్నని

శ్రీదయిత=విష్ణుదేవునిదైన. ప్రాదుర్భవత్=పుట్టుచున్న. సరసాహ్లాదక=రసికులను సంతోషింపఁజేసెడి. వేదీ=తెలిసినవాఁడా ॥౧॥ గోకర్ణకుండలుండు=పాములచెవిపోఁగులుగలవాఁడు.—శివుఁడు. కొండరాచూలిన్=పార్వతిని ॥ ౨ ॥ షట్కంఠ=కుమారుఁడా. భాసిల్లున్ = ప్రకాశించును. సక్త=ఆసక్తమైన. నిగమౌఘ = వేదసమూహముఅనెడి, హరిపృథుకము = సింహపుపిల్ల. సాకృతి=ఆకృతితోఁగూడిన ॥ ౩ ॥ కందువన్=కాలమునందు. శతానంద=బ్రహ్మ. శిరశ్శిఖర= తలలయందలి కిరీటములు. మయూఖచ్ఛటా=కాంతిసమూహముయొక్క. ఆరోప=మోపుటచేత. మహనీయ=పూజ్యమయిన. నఖరశిఖుఁడు—గోళ్ళకొనలుగలవాఁడు. పుండరీకునకున్=శ్రేష్ఠునకు.

సీ. మొదలఁ గామక్రోధ ములబరాబరిచేసి, సత్యవాఙ్నియమంబు సంగ్రహించి
సాత్వికస్వల్పభో జనలబ్ధిఁ గ్రొవ్వాఁగి, యష్టాంగ కాసక్తి హవణుపరచి
తరచి ముప్పదిరెండు తత్త్వంబు లూహించి, మది సత్త్వసంపద మస్తరించి
తెలిసి ముద్రాసనం బుల మేనిపనిగొని, పాపపూ సుషు పటా పంచచేసి
తే. యతఁడు మూలాలవాలగ హ్వరకరండ, కుండలీస్థాన గోకర్ణ కులకలాప
తత్త్వదర్శనవర్ణాధి దైవతదళ, నిర్ణయంబెంతయుఁ తయు నిజముగాంచి. ౮
చ. మను హఠరాజయోగముల మర్మమెఱింగి తదర్థసిద్ధి నె
మ్మనముదలిర్చి హృజ్జలజ మానససౌరభ షట్పదంబు న
ర్జునరథభూషణంబు వెలిఁ జూడని నిద్దపు నిట్టచూపునన్
మునుకొని చొక్కు లోన నిజ మూర్ధగళత్సుధ సేద దేర్పఁగన్. ౯
మ. శతపత్రాక్షము శిక్యసఖ్యభృతి చం చన్మౌళిసన్నాహము
న్నతనాసాముకుళంబు పూర్ణతరచం ద్రస్నిగ్ధముగ్ధాననం
బతసీసూనసవర్ణవర్ణ మతిసౌ మ్యం బబ్జనాభంబు శ్రీ
శ్రితవక్షంబు మహామహం బొకదు పర్వెం దన్మనః పేటికన్. ౧౦

---

వాఙ్నియమంబు=మాటలనియమము. సాత్విక=క్రొవ్వునుకలుగఁజేయని. లబ్ధిన్ = కలుగుటచేత. ఆఁగి=అణఁచి. హవణుపఱచి=పొందుపఱచి. తరచి=చక్కగావిచారణచేసి. మస్తరించి=లోకువ పఱుచుకొని. మేనిపనిగొని=దేహమునుశ్రమపెట్టి. పటాపంచ = అగోచరము—నాశము. మూలా...నిర్ణయంబు = మూలాధారచక్రమనెడి గుహారూపమయిన బరణియందలి కుండలీస్థానము నందుండుసర్పసమూహమునకు ఆభరణమువంటి శేషునిదైన తత్త్వమును, అనఁగా విష్ణుతత్త్వమును కనఁబఱచునట్టి బీజాక్షరములు అధిదేవతలు దళములు వీనియొక్క నిర్ణయము ॥౮॥ మను= మంత్రము. తదర్థసిద్ధిన్ = దానివలని ప్రయోజనముయొక్క నెఱవేఱుటచేత. హృజ్జలజమానస సౌరభ షట్పదంబున్ = హృదయ కమలమునకు మనస్సనెడి సరోవరమునందలి పరిమళముతోఁ గూడిన తుమ్మెదను. వెలిన్=బయట. నిద్దపునిట్టచూపునన్=స్నేహముతోడి చలింపనిచూపుచేత. మునుకొని=ముందుమించి. నిజమూర్ధగళత్సుధ = తనతలనుండి జాఱుచున్న యమృతము. సేద= శ్రమను ॥ ౯ ॥ శతపత్రాక్షము = కమలములవంటి కన్నులుగలది. శిక్య...సన్నాహము = ఉట్టి యొక్క మైత్రినిభరించునట్టి మనోజ్ఞమైన శిఖాకవచము (కిరీటము) గలది. నాసాముకుళంబు= మొగ్గవంటిముక్కు. పూర్ణతరచంద్రస్నిగ్ధముగ్ధాననంబు = నిండుచంద్రునివలెకళలుదేఱుచున్న అంద మయిన మొగము. అతసీసూనసవర్ణవర్ణము=నల్లగిసెపువ్వుయొక్క వర్ణమువంటివర్ణముగలది. అతి సౌమ్యము=మిక్కిలియొప్పిదమయినది. అబ్జనాభంబు=తామరబొడ్డుగలది. శ్రీశ్రితవక్షంబు=లక్ష్మి దేవిచేత ఆశ్రయింపఁబడిన ఱొమ్ముగలదియునైన. మహామహంబు=గొప్పదియగు తేజస్సు. తన్మ నః పేటికన్=అతని మనస్సుఅనెడి పెట్టెయందు. పర్వెన్ = వ్యాపించెను ॥ ౧౦ ॥ అంతర్వాణి

సీ. సనకసనందనా దినిఖిలాంతర్వాణి, హృల్లీనభావంబు సల్లపెట్టి
విశ్వంభరాభోగ వివిధమూ ర్త్యంతర, స్ఫురితానుభావంబు బుజలువైచి
శింశుమారాకృతి స్వీకృతి వైఖరి, షట్కవిహారంబు జారవిడిచి
క్షీరోదమధ్యస్థ లీరత్ననగగుహా, గర్భనివాసంబు కచ్చువదలి
తే. పుండరీకేక్షణుండు శిఖండిబర్హ, మండితశిఖండకుఁడు నతాఖండలుండు
పుండరీకునిమానసాంభోజపీఠి,మిండతుమ్మెదయైయుండు నిండుకొలువు. ౧౧

ఉ. అన్వహముఁ బ్రవృద్ధ మగు నంబుజనాభ పదారవిందభ
క్తి న్వహికెక్కఁ జుఁ వసుమ తీసురవంశవతంస మెల్లవా
ర న్వినుతింపఁ బెంపెసఁగు ప్రోదియొనర్చుచుఁ దల్లి దండ్రి నెం
దు న్విధానురూపతను దోహద భోజన పూజనాదులన్. ౧౨

క. హరిభక్తియు గురుభక్తియు, నురరక్తియుఁ బుటముగాఁగ యోగీంద్రశిఖా
భరణము ముక్తామయతా, స్ఫురణము భువనప్రశస్తముగ జిగి మీఱెన్.

సీ. మును మీనగుటఁ బట్టిమునులువైచినబత్తి,వలఁబోలెఁ జిక్కనూ డలఁదలిర్ప
వెలితిగాఁ జవిగొన్న వెన్నముద్దయుఁ బోలె, శంఖంబు వామహస్తమునదనర
జగదండవహకాల చక్రభ్రమణహేతు, దండమై నిజధేను దండమమర
సంచిఁబట్టిన పద్మ జాతాండములలీల, వలకేల గ్రచ్చకాయలు ఘటిల్ల

---

హృల్లీనభావంబు = తత్త్వశాస్త్రము నెఱిఁగినవారి మనస్సులందు లయించియుండుటను. సల్లపెట్టి= సల్లించి—వదలి. విశ్వంభరా...అనుభావంబు = సర్వమునుభరించునట్టి గొప్పవియు నానావిధములునైన రామకృష్ణాదిమూర్తులచేత ప్రకాశించునట్టి మహిమను. బుజలువైచి=సున్నలుపెట్టి—మాని. శింశుమారాకృతిస్వీకృతిన్ = మొసలిరూపమునుపొందుటచేత—మత్స్యవతారమెత్తుటచేతననితోఁచెడి. క్షీరోద=పాలసముద్రముయొక్క. గుహాగర్భనివాసంబు = గుహాలోపలియునికియందలి. కచ్చు=అపేక్ష. శిఖండిబర్హమండితశిఖండకుఁడు=నెమలికుంచెచేత అలంకరింపఁబడిన పిల్లజుట్టుగలవాఁడు. నతాఖండలుండు=మ్రొక్కినయింద్రుఁడుగలవాఁడు. మానసాంభోజపీఠిన్=మనఃకమలమనెడి సింహాసనమునందు. మిండ = మగడైన ॥ ౧౧ ॥ అన్వహమున్ = ప్రతిదినమును. ప్రవృద్ధము=పెరిగినది. వహికిన్=ప్రసిద్ధికి. వతంసము=శ్రేష్ఠుఁడు. పెంపెసఁగు=మిక్కిలియతిశయించునట్టి. ప్రోది=రక్షణము. అనురూపతనుదోహద = తగినసలుగు పెట్టినస్నానముచేయించుట ॥ ౧౨ ॥
ఉరరక్తి = అధికమయినయనురాగము. పుటముగాఁగన్—హెచ్చుగా. ముక్తామయతాస్ఫురణము=ముత్తెపువికారముగలప్రకాశము. భువనప్రశస్తముగన్=లోకమునందుశ్లాఘ్యముగ. జిగి= నిగనిగనికాంతి ॥౧౩॥ బత్తి=భక్తి. చవిగొన్న=రుచిచూచిన—భుజించిన. జగదండ...దణ్డమై= బ్రహ్మాండమును వహించిన కాలచక్రముతిరుగుటకుకారణమైనకఱ్ఱయై. ధేనుదండము=పసులనుదోలెడికఱ్ఱ. లీలన్=విధమున. వలకేలన్=కుడిచేతియందు. చాయన్=విధమున. మంద...పండు= గొల్లయిల్లాండ్రయొక్క స్నేహమనెడివృక్షమునందుపండినపండు—బాలకృష్ణుఁడు ॥౧౪॥ సత్యా

తే. గలయఁ బూచిన కల్పవృక్షంబుచాయ, సరసవనపుష్పమాలికా భరసమగ్ర
విగ్రహముతోడ విలసిల్లు విప్రు నెదుట, మందప్రోయాంద్రకూరిమిమ్రానిపండు
క. నియమాంతంబున సత్యా, ప్రియరూపముతోడఁ గూడ బెనఁచిన యంత
ర్నయనము సడలిచి పితృపా, దయుగార్చాధీనబుద్ధిఁ దహతహ వెలుగన్.
ఉ. పావనదృగ్విలాసములు బాహ్యగతిం బచరించి చంద్రికా
శ్రీవిభవంబులం బలుచ సేయు ముఖప్రభ లుల్లసిల్లఁగా
మైనదలించి పూర్వ మగు మట్టును గాడ్పును సాగనిచ్చి పైఁ
గావలియిడ్డశక్తుల స గౌరవదృష్టిఁ బరిగ్రహించుచున్. ౧౬
సీ. తనువుతోఁ జరియించు ధర్మదేవతఁ బోలె, మెలఁపున వనవాటిఁ గలయఁ దిరిగి
గణనమీరిన శార్ఙ్గిగుణములు హృదయసం, పుటినించు క్రియ విరుల్ బుట్టిఁ బెట్టి
తనకుఁ బవిత్రవర్ధనమె కృత్యంబను, కరణి నూతనకుశోత్కరము గూర్చి
యపవర్గఫలసిద్ధి హదనైనఁ జేపట్టు, కైవడి బహుఫలోత్కరము లొడిచి[దెచ్చు
తే. యోగయాగంబు సలుపుచో నూర్మిపశువిశసన మొనరించుటకు యూపసమితి
భాతి సమిధలు గొని మహాప్రాజ్ఞుఁ డతఁడు, వచ్చు లేఁబగటికి నిజావాసమునకు.
క. విహితమతిం బరిచారక, సహస్రమయి పితృయుగంబు సంభావించున్
గృహమేధివతంసము నిజ, మహిళామణి యప్రతీప మతిఁ దోడ్పడఁగన్. ౧౮
సీ. ఆపాదమస్తంబు నంటు నూనియఁ గాఁచి, నయముగా నుద్వర్తనంబొనర్చి
జలకమార్చు నఖంపచస్వచ్ఛజలములఁ, దడియొత్తఁగదు మెదుగుడులఁ బొదవి

---

ప్రియ=కృష్ణునియొక్క. అంతర్నయనము=లోచూపు—యోగదృష్టి. తహతహ=తమకము ॥౧౫॥ బాహ్యగతిన్=బయటిసంచారమునందు. పచరించి=ప్రసరింపఁజేసి. పలుచ = అలక్ష్యము. మైవదలించి=దేహమునుసడలవిడిచి. శక్తులన్=ఇచ్ఛాదిశక్తులను ॥౧౬॥ మెలఁపునన్ = మెలఁకువతో. హృదయసంపుటిన్=మనస్సనెడి పెట్టెయందు. కుశోత్కరము=దర్భలసమూహమును. అపవర్గ= మోక్షము యొక్క. హదను=సమయము. ఊర్మిపశువిశసనము=శ్వాసమనెడి పశువునుచంపుటను. యూపసమితిన్=యాగపశువులుకట్టెడికంబముసమూహమును. భాతిన్=విధమున. లేఁబగటికిన్=తెల్లవాఱిపదిగడియలప్రొద్దెక్కునప్పటికి. నిజావాసమునకున్ = తనయింటికి ॥ ౧౭ ॥ పరిచారకసహస్రమయి=పరిచారకులయొక్క సహస్రము కలవాఁడై—అనేక పరిచారకులమాఱు తానేఅయి. పితృయుగంబున్=తల్లిదండ్రులను ఇద్దఱను. గృహమేధివతంసము = గృహస్థులలో శ్రేష్ఠుఁడు. మహిళామణి=స్త్రీరత్నము. అప్రతీపమతిన్=అనుకూలబుద్ధితో ॥ ౧౮ ॥ ఆపాదమస్తంబు=తలమొదలుకాళ్లదాఁక. ఉద్వర్తనంబు=నలుఁగు. జలకమార్చున్=స్నానముచేయించును. నఖంపచ=గోరువెచ్చనైన. మెదుగుడులన్=మెత్తనిగుడ్డలతో. లఘుధౌతవసనపల్లవములు = తేలికయైపరిశుద్ధము

లఘుధౌతవసనపల్లవములుగట్టించు, శిరసొప్పుమృదులీల సురఁటివిసరి
చేయూఁతయొసఁగి వేంచేయించులోనికి, ద్వారావతిగలంతిఁ దానెయొసఁగు

తే. తెలుపు సంధ్యాసమాధివిధిప్రయుక్తి, నగ్నివేల్పించు విష్ణుసహస్రనామ
పాఠ మొనరించుతఱిఁదోడుపడుగురునకు, కవలువోకుండబుత్రుడొకలువకంటి

తే. చూపుచాలమివివిధరూపోపకరణ, వితతిఁ దడవాడుజనకు నానతిశిరమునఁ
దాల్చి నిద్దంపుబుద్ధిఁ దద్దారకుండు, చక్రహస్తార్చనమునకు పక్రమించు.

సీ. అభిషేక మొనరించు నాకాశవాహినీ, జననకారణ పాద జలరుహునకు
వైచుఁ దోమాలియ వైజయంతీకాంతి, వలయితవక్షఃకవాటునకును
కౌశేయమర్పించుఁ గాంచనమయ పట, పల్లవారుణకటి బంధురునకుఁ
జందనం బలఁదు నిందిరాకుచకుంభ, సంగికుంకుమపంకిలాంగునకును

తే. రత్నహారంబు సాతు నిర్యత్నసిద్ధ, కౌస్తుభోదర్చిరభిరామ కంధరునకు
ధూపకల్పనమున్నగా దీపమిచ్చుఁ, దెరవ యాతఁడు త్రైలోక్య దీపకునకు

క. నిడుపచిగురనఁటియాకున, నిడి వివిధాన్నములు భూసురేశ్వరుఁ డొసఁగున్
బడి ఘంట మొరయఁజేయుచు, జడనిధితల్పునకుఁ బూర్ణసంకల్పునకున్.

క. భూమిసురసూతి సాల, గ్రామశిలావారి కంబుగర్భస్థము ది
వ్యామోదశ్రీతులసీ, కోమలదళసురభితంబు గురునకు నొసఁగున్. ౨౩

మ. తిరువారాధన మిట్లొనర్చి ధరణీదేవాన్వయశ్రేష్ఠుఁ డా
హరికర్పించుటఁ బావనంబు లగు శాల్యన్నంబులున్ నేతులున్

---

లైన చిగుళ్లవంటివస్త్రములను. సురఁటి=విసనకఱ్ఱ. ద్వారావతిన్ = ద్వారముతోడిముక్కుగల. గళంతిన్=గిండిచెంబును. కవలువోకుండన్=ముందుపఠించినది మరల పాఠమునందుగలయకుండ॥ ౧౯ ॥ తడవాడు = తడవుకొను. ఆనతి=ఆజ్ఞ. నిద్దంపు=ప్రేమతోడి. తద్దారకుండు = ఆచిన్నవాఁడు. చక్రహస్తార్చనమునకున్=విష్ణుదేవునిఆరాధనమునకు ॥ ౨౦ ॥ ఆకాశవాహినీ=మిన్నేటియొక్క. తోమాలియ = వనమాల. వైజయంతి = వైజయంతి యనెడి పూలమాలికచేత. కౌశేయము=పట్టుపచ్చడము. కటి=నడుముచేత. బంధురునకున్=ఒప్పిదమయినవానికి. సంగి=అంటిన. పంకిల=అడుసైన. చాతున్=ధరింపఁజేయును. నిర్యత్న...ధరునకున్=యత్నములేకయే సిద్ధించిన కౌస్తుభమణియొక్క మిక్కుటపుప్రకాశముచేత మనోజ్ఞమయిన మెడగలవానికి ॥౨౧॥ అనఁటి=అరఁటి. బడిన్=వెంబడిని. మొరయఁజేయుచున్=వాయించుచు. జడనిధి=సముద్రము ॥ ౨౨ ॥ కంబుగర్భస్థమున్=శంఖములోనిదానిని. దివ్యామోదశ్రీ=మంచివాసనయొక్క కలిమిగల. సురభితము=పరిమళముకలుగఁ జేయఁబడినది ॥ ౨౩ ॥ తిరువారాధనము=దేవతార్చనము. పూపములు=

వరుగుల్ చేరులు పప్పు లప్పడములుఁ దాలింపులుం బూపముల్
పరమాన్నంబులుఁ బెట్టు నెట్టన భుజింపన్ దల్లికిం దండ్రికిన్. ౨౪

వ. ఇట్లతివృద్ధులు శిథిలబుద్ధులు నగు జనయిత్రీజనయితలం గనిమని నడచుచు నడుగులకుమడుఁగు లొడ్డుచు నడుగునెడఁ బులిజున్నునియుం దెచ్చియిచ్చుచు నిచ్చఁ గొత్తయగుమచ్చికంగచ్చువదలక గోముమెఱసి యోమనగా యలంగా నోముచుఁ గాలోచితంబు లగు నోములు నోమించుచు నర్ధరామరనందనుండు జగదభినందితుండై యుండి వెండియు. ౨౫

క. పరలోకావాసుఖా, దరపరతం జనిన తల్లి దండ్రుల కొసఁగెన్
గురుభక్తినిగుడు కొడుకతి, కరుణామతి గంగనస్థి గయఁబిండంబున్. ౨౬

క. ప్రేయసివలనఁ బ్రబోధవి, ధేయమతుల సుతులఁ గాంచి తీర్చెఁ బితౄణం
బాయయ్య తదీయం బగు,ప్రాయపుఁబ్రొద్దంతఁగొంతపడమరదరిగెన్. ౨౭

క. భాషావిభునిభుఁ డమ్ముని, యీషణదూషణ మొనర్చి యిలుమరచి మదిన్
శేషఫణిశయనుఁగనునభి, లాషోన్నతిఁ జేయుఁ దప మిలాధరతనయా!

సీ. మిసిమింతుఁడునుగాక వసియించుఁ గుత్తుక, బంటినీరను బుండు వంటిచలిని
మోముదమ్మికిఁ దేటి మొత్తమై పొగపర్వ,ప్రేలుఁగ్రిందలగాఁగ వృక్షశాఖ
వేరువెల్లఁకి కాయ గూర పండనికోర,కుదరాగ్ని గాడ్పు చేనుజ్జగించు
నేచియీచెవిగాడు పాచెవిఁబోవంగ, నుబ్బిలింగముబోలె నుండునెండ
తే. నంతరాయాంధకారంబులలమికొనిన,నడఁచునిజధైర్యసూర్యోదయంబుచేత
దానవారినిగుఱిచేసి తనకుఁబోదు,నాకుఁబోదని నమ్మి సు శ్లోకుఁ డతఁడు.

ఉ. ఓగజరాజగామిని! మహోగ్రపు నోములు నోఁచుచున్న య
య్యోగివరేణ్యునేమమున నుల్లము వెన్నవలెం గరంగె హ్రా

---

పిండివంటలు. నెట్టనన్=సమృద్ధిగా ॥ ౨౪ ॥ శిథిల=పటుత్వములేని. జనయిత్రీజనయితలన్=తల్లి దండ్రులను. మచ్చికన్ = మరులుచేత. కచ్చు=ప్రీతి. గోము = శ్రమ మెఱుఁగమి. ఓమనగాయలంగాన్—చేతులమీఁద నేత్రిప్పుటగా. ఓముచున్=పోషించుచు. జగదభినందితుండు = లోకులచేతఁబొగడఁబడినవాఁడు ॥ ౨౫ ॥ ౨౬ ॥ ప్రేయసి=ప్రియురాలు—పెండ్లాము. ప్రబోధవిధేయమతులన్=విశేషజ్ఞానమువినయమువీనితోడిబుద్ధిగలవారిని. పితౄణము = పితృదేవతలబుుణమును॥ ౨౭ ॥ భాషావిభు=బ్రహ్మతోడ. ఈషణ=పెండ్లాము బిడ్డలు ధనము వీనియందలియాశను ॥౨౮॥ మిసిమింతుఁడు=అలసినవాఁడు. క్రిందల=తలక్రింద. ఉజ్జగించున్ = పోఁగొట్టును—అణఁచును. గాడ్పు=గాలి. అంతరాయాంధకారంబులు=విఘ్నములనెడిచీఁకట్లు ॥ ౨౯ ॥ నేమమునన్=నియ

ద్రాగసమగ్రగోపవని తాజనతాపరిరంభ సంభ్రమో
ద్యోగకళాప్రవర్తికిఁ జతుర్ముఖవంచిత ధూర్తకీర్తికిన్. ౩౦

సీ. యతిమనోగృహదీపి కాంకూరమగులీల, గోవర్ధనాచల గుహ మెలఁగుచు
గిరికూటతటరట త్కేకిరాజమురీతి, రాధచన్గవమీఁద వ్రాలి నగుచుఁ
జిత్రాభ్రములనేలు సుత్రాముకైవడిఁ, బలువన్నెయాలమందల మెలఁపుచుఁ
గమలకాననమధ్య కలహంసవిభుభాతిఁ, గూర్మినెచ్చెలిపిండుగొని చెలఁగుచుఁ

తే. జన్ద్రబింబంబునకు మృదుస్వనముగ నప్పు, రచనసంజ్ఞార్హ శజ్ఞమూఁదుచు నానచ్చు
నాటలన్నియుఁ జాలించి యరిగెఁ దపసి, పర్ణశాలకు దేవకీ తర్ణకంబు. ౩౧

చ. లలితశిరీషపుష్పమృదు లంబులు నీచరణంబు లక్కటా
యిల యిది రూక్ష మిట్టు లల యించుట గాదని ప్రార్థనామృదూ
క్తులు సెలఁగంగ వెన్పొదివి తొల్చదువుల్ తగువిన్నపంబులం
బలుమఱుఁ జేయు చందమున బంగరుటందియ లుగ్గడింపఁగన్. ౩౨

క. మెత్తఁగనూఁటినచుట్టుం, గత్తిన్ మధుకైటభారి కంఠము లలనా
డొత్తిన హత్తిన చెన్నుం, దిత్తులక్రియఁ దొడల యడ్డ తిత్తులు వేలన్ ౩౩

క. మాయావృతుఁడగు నాత్మని, సోయగమునఁ దెగడు తీఁగ సొగలు ముచ్చ
ట్రైయునికి సంగరహితం, బయ్యెన్ గాకున్న జఘన మభిరామమగున్. ౩౪

క. ఇట నభ మిట భూవలయం, బిట బలిసద్మంబునుండు నిరవు లనియనన్
బటువు లగువళుల చెలువునఁ, బుటపుటనై యున్న చిన్ని బొజ్జ గదలఁగన్.

చ. తులసికిఁ బచ్చరాకుదుర తోయదవాహనరత్నవేది య
క్కలిమి మెఱుంగుఁబోడికిని గౌస్తుభఘర్మగభస్తికిన్ నభ

---

మముచేత. ధూర్త=మోసపు ॥౩౦॥ దీపికాంకూరము=చిగురు మొగ్గవలెఁదోఁచెడిదీపము. రటత్=కేకలువేయుచున్న. వ్రాలి=ఒఱఁగి. చిత్రాభ్రములన్=నానావర్ణములుగల మేఘములను. సుత్రాముకైవడిన్=ఇంద్రునివలె. మెలఁపుచున్=త్రిప్పుచు—కాచుచు. పిండు = సమూహము. చెలఁగుచున్=సంతోషించుచు. రచనన్=విధమున. దేవకీతర్ణకంబు=దేవకీదేవిబిడ్డ—కృష్ణుఁడు ॥౩౧॥ శిరీష=దిరిసెనపు. మృదులంబులు=మిక్కిలి మెత్తనివి. రూక్షము=కఠినము కాదు=తగదు. వెన్పొదివి=వెంబడించి. తొల్చదువులు=వేదములు. ఉగ్గడింపఁగన్=మ్రోఁగఁగా ॥ ౩౨ ॥ నూఁటిన=పదును పెట్టిన. హత్తిన=అంటిన. చెన్నుందిత్తులక్రియన్ = అందమైన సంచులవిధమున ॥ ౩౩ ॥ మాయావృతుఁడు=మాయచేత ఆవరింపఁబడినవాఁడు. సోయగమునన్=అందముచేత. తెగడు=తిరస్కరించు ॥ ౩౪ ॥ బలిసద్మంబు=పాతాళము. ఇరవులు=చోట్లు. బటువులు=గుండ్రనివి. వళుల చెలువునన్=ముడుఁతలయందముచేత. పుటపుటనై=క్రమముగా పెరుగుచున్నదై ॥ ౩౫ ॥ తోయద

స్థలముననంగ బోల్చి నిరతంబు కృపావిభవంబు నింటి బో
ర్తలుపుఁదలంపుసేయుచు నుఠంబు గరంబు పరిస్ఫురింపఁగన్. ౩౬

క. కలుషఖగవఘవిధానా, కలితఘుటికలనఁగ గ్రచ్చకాయలు నలచే
నెలకొను నల జిలిబిలివ, న్నెలవన్నెలసంచినిండి యింపలరారన్. ౩౭

క. లలితనిజవామకరతల, కలితకనత్కంబుకాంతి గలకలనవ్వన్
గలువలచెలి గిలిగింతల, నలువగుజాలన్ బిసాళి నలువగుజాలన్. ౩౮

క. నిజధైర్యౌదార్యములను, గజములకుం బోడము నిడుద కిరములుఁబోలెన్
భుజములు పోషితభక్త, వ్రజములు కరవిజితపుష్కరజములుపొదలన్. ౩౯

క. వదనైక స్తంభ కనక, సదనము సిరికో అకొనర్చ స్రష్టనిలుపు న
మ్మొదలింటి శంఖశంకువొ, యిని యనఁగాఁ గంబుకంఠ మింపువహింపన్.

క. బింకపుఁ బ్రాఁతల వాతెఱ, మంకెనపూఁ దేనెతేట మానక పైపై
నింకఁగ నింకఁగఁ బల్మఱుఁ,బంకించుటఁబోలె మోవి బచ్చెనహెచ్చన్. ౪౧

క. తళుకు మొగము నెఱపదకము, నెలవుననిడుదీరుగాఁగ నిలిపిన యాఖం
డలనీలకళికక్రియ ని, ట్టలమై స్ఫుటనాసికాపుటము దీపింపన్. ౪౨

తే. తళుకుఁజెక్కులు మకరకుండలకలాప, మరకతద్యుతిరింఛోళి హరిణలక్ష్మ
మండలంబులలాంఛన మంజిమములు,గానిపించువిధంబునఁగలయఁ బ్రాఁక.

చ. తరళమసారసారనిభ తారకముల్ సితపద్మపత్రబం
ధురములు రాధికాహృదయ తోయజకోరకబోధనక్రియా

---

వాహనరత్నవేది=ఇంద్రనీలమణులయరుఁగు. ఘర్మగభస్తికిన్ = సూర్యునికి. నభస్థలము=ఆకాశ ప్రదేశము. బోర్తలుపున్=పెద్దతలుపును. పరిస్ఫురింపఁగన్ = చక్కగాప్రకాశింపఁగా ॥ ౩౬ ॥ ఆకలితఘుటికలు=గ్రహింపఁబడినగుండ్లు. జిలిబిలి=చిన్న. వన్నెలసంచి=అందమైనతిత్తి ॥ ౩౭ ॥ లలిత=మనోజ్ఞమైన. కలిత=కూడిన. కనత్కంబు=ప్రకాశించునట్టి శంఖముయొక్క. కలువలచెలి గిలిగింతలన్=చంద్రునిచక్కిలిగింతలచేత—సోఁకుటలచేత. నలువు=ఒప్పిదము. జాలన్ = చంద్రకాంతమణులను. పిసాళినలువగుజాలన్ = ప్రకాశించునట్టి హంసలను ॥ ౩౮ ॥ కరవిజితపుష్కరజములు=అరచేతులచేతజయింపఁబడిన తామరలుగలవి. పొదలన్=అతిశయింపఁగా ॥ ౩౯ ॥ సదనము=ఇల్లు. స్రష్ట = బ్రహ్మ. శంకువో = మేకో ॥ ౪౦ ॥ బింకపు = నిక్కుగల. పంకించుట= పూయుట. బచ్చెన=వర్ణము ॥ ౪౧ ॥ ఆఖండలనీలకళికక్రియన్ = ఇంద్రనీలపుమొగ్గవలె. ఇట్టలము = హెచ్చినది ॥ ౪౨ ॥ రింఛోళి = సమూహము. మంజిమములు = మనోజ్ఞతలు. కలయఁ బ్రాఁకన్=అంతటనువ్యాపింపఁగా ॥౪౩॥ మసార=ఇంద్రనీలమణులయొక్క. తారకములు=కంటి నల్లగ్రుడ్లు. బంధురములు = ఒప్పిదములైనవి. బోధనక్రియా = తెలియఁజేయు వ్యాపారముచేత. అర్కరుక్ = సూర్యకాంతిచేత. సక్త=పొందిన. కోణభాస్వరములు= కొనలచేతప్రకాశించునవి,

తరుణతరార్కరుగ్విలసితస్ఫుటరక్తిమసక్తకోణభా
స్వరములు సూక్ష్మపక్ష్మములు వాలికకన్నులు చెన్నుమీఱఁగన్. ౪౪

తే. అలకతిమిరంబు తనుఁ గప్పననుభయమున, ముఖసుధాసూతి నను వెల్గుములికిఁ గూ
ర్చి, సవదరించిన సింగిణిచాయ పొసలి, వంకచూపునఁ దగఁ గఱి వంకబొమలు.

క. బలభిదుపలాద్రిమౌళిన్, పలపలగాఁ బొదువు ముదిర పటలము పగిదిన్
లలితోత్తమాంగతలమున, జిలుగుందళుకొత్తు చలిది చిక్కముగ నరన్. ౪౬

శా. దిగ్వాసుం డురుపింఛలాంఛితశిఖోదీర్ణుండు వర్షాపయో
ముగ్వర్ణుండు నవాంబుజాహితలతాముక్తాంగదుండున్ సుధా
రుగ్విస్మేరముఖుం డనంగశతజిద్రూపాధికుం డగ్రభూ
వాగ్గర్వోద్భవభూమి శ్రీవిభుఁడు శ్రీవత్సాంకవక్షుండునై. ౪౭

క. నొడువులపడఁతుక మగనికిఁ, బొడచూపని తనదు రూపు పొడగనిపించెన్
జడనిధిశయనుఁడు కొంగున, ముడిచినమణి గాదె భక్తముఖ్యులకెల్లన్. ౪౮

క. నిగనిగని విదళకదళీ, యుగళి న్నగి జిగిదొలంకు నూరులఁ గని చొ
క్కుఁగ దురఁ జేయు జగత్పతిఁ, దగిలి కనుంగొనుచు ముని మదావళ మెలమిన్.

తే. విపులవీక్షణశక్తిచే వెండికుండ, లీంద్రతలిమాంగరుచిసుధ యెత్తిగ్రోలి
సంతతవ్రతకల్పనాజాయమాన, దుస్తరక్లేశమంతయుఁ దొలఁగఁద్రోచి.

---

పక్ష్మములు = ఱెప్పలుగలవి. వాలిక=దీర్ఘములైన ॥ ౪౪ ॥ అలకతిమిరంబు = ముంగురులనెడి చీఁకటి. సుధాసూతి=చంద్రుఁడు. నను వెల్గుములికిన్=క్రొంచెపుప్రకాశమనెడి బాణమును. సవదరించిన=పట్టిన. సింగిణిచాయన్=వింటి విధమున. కఱి=నల్లనైన ॥౪౫॥ బలభిదుపలాద్రిమౌళిన్= ఇంద్రనీలమణులకొండకొమ్మనందు. పలపలగాన్ = విశేషముగా. ముదిరపటలము = మేఘసమూహము. లలితోత్తమాంగతలమునన్=మనోజ్ఞమయినతలమీఁద. జిలుఁగుందళుకొత్తు = క్రొంచెపు వెలుఁగుదోఁచునట్టి ॥ ౪౬ ॥ దిగ్వాసుండు=దిగంబరుఁడు. ఉరు...దీర్ణుండు = గొప్పనెమిలికుంచె చేతఁగుఱుతిడఁబడినసిగచేత అధికుఁడు. వర్షాపయోముగ్వర్ణుండు = వానకాలపునల్లమబ్బువన్నెగలవాఁడు. నవాంబుజాహితలతాముక్తాంగదుండున్=క్రొత్త (లేఁత) చంద్రరేఖవంటి ముత్యాలభుజకీర్తులుగలవాఁడు. సుధారుగ్విస్మేరముఖుండు=చంద్రునివలె వికాసమునొందినముఖముగలవాఁడు. అనంగ...ధికుండు=మన్మథులను అనేకులను జయించెడి చక్కఁదనముచేత అధికుఁడు. అగ్రభూవాగ్గర్వోద్భవభూమి = బ్రాహ్మణులమాటగర్వమునకుపుట్టినచోటు ॥ ౪౭ ॥ నొడువులపడఁతుక= సరస్వతి. పొడగనిపించెన్=చూపెను ॥ ౪౮ ॥ విదళ=ఆకులులేని. జిగిదొలఁకు = కాంతి అతిశయించెడి. చొక్కుఁగదురన్=పరవశత్వము కలుగఁగా. మదావళము=ఏనుఁగు—శ్రేష్ఠుఁడు॥౪౯॥ కుండలీంద్ర...,సుధ = శేషశయ్యయొక్క ప్రకాశమనెడి యమృతమును ॥ ౫౦ ॥ అగ్రావనిన్=

ఉ. ఆవు నదల్చుపచ్చవెదు రంఘ్రియుగాంతరవీథి నూఁది య
గ్రావనిఁ దేజరిల్లు గటి హస్తసమన్వితుఁ గౌస్తుభాంకు నిం
దీవిభు నింద్రనీలనిభ దేహుఁ గనుంగొని హర్షవర్షధా
రావిలమానసుండగుచు నమ్ముని కృత్యవిమూఢబుద్ధియై. ౫౧

చ. విలిఖితమో శిలాకృతియొ విస్మృతిరూపువహించెనో యనన్
జలనవిదూరుఁడయ్యెఁ దొలు సావిపయోధరధారఁ దోఁగు న
య్యెలదళుకొత్తుఁ గ్రొత్తపులు నేపున వే పులకల్ తనూలతన్
మొలవఁగనున్న నవ్వియదు ముఖ్యుఁడు తాపసముఖ్యు నిట్లనున్. ౫౨

ఉ. నిచ్చలు నిచ్చలోఁ బొదలు నీపితృభక్తికి జ్ఞానశక్తికిన్
మెచ్చితి నిచ్చితిం గరము నీ యెడ నీ యెడ యేల? వేఁడుకొ
మ్మిచ్చెదఁ జెచ్చెరన్ వలయు నీప్సితముల్ శతమేని దీన నే
పొచ్చెము నొచ్చెముం జొరదు భూసురకేసరి! నమ్ము నావుడున్. ౫౩

శా. భస్మోద్ధూళన పాండురాంగము రమా ప్రాణేశు పాదద్వయిన్
విస్మేరాంబుజగామి హంస మిది నా వే వ్రాల్చుచున్ లేచి ‘దే
వాస్మాకం శరణం త్వమేవ గతి రన్యో నాస్తి దుర్వాసనా
పస్మారం హర’ యంచుఁ బల్కి మఱియున్ భక్తుండు భక్తిస్పృహన్. ౫౪

సీ. పొదలునీపొక్కిటి పువ్వుకాన్పునఁగదా, పెనుమాయ పిల్లలఁ బెట్టుటెల్లఁ
బొడమునీ మొదలియూర్పులనేర్పులనకదా, చదువుసంధ్యలుగల్గిజగముమనుట
కెరలునీయడుగుఁదా మరలతేనియఁగదా, పాపంపుఁ బెనురొంపి పలుచనగుట
పొసఁగునీతెలిచూపు పసగదా యిదిరాత్రి,యిదిపగలనుమేర లెఱుఁగబడుట

---

ఎదుట. ఇందీవిభున్=లక్ష్మీభర్తను. ఆవిల=కలఁకఁబాఱిన. కృత్య=తానుచేయఁదగినకార్యముల యందు ॥ ౫౧ ॥ విలిఖితమో=వ్రాయఁబడినదో—చిత్తరువో. విస్మృతి = స్మృతిలేమి. తొలుసావిపయోధరధారన్ = తొలుకరిమబ్బువలననీటిధారలచేత. తోఁగు=తడియు. తళుకొత్తు = ప్రకాశించు. పులునేపునన్ = గడ్డియొక్క యాధిక్యముచేత. పులకలు = గగుర్పాటులు ॥ ౫౨ ॥ ఇచ్చలోన్=మనసునందు. ఇచ్చితింగరము=అభయహస్తమునిచ్చితిని. ఎడ=అవకాశము. ఈప్సితములు=కోరికలను. పొచ్చెము=తక్కువ. ఒచ్చెము=అనుమానము ॥ ౫౩ ॥ ఉద్ధూళన=దుమ్మెగయఁబూయుటచేత. విస్మేరాంబుజగామి=వికసించినతామరనుపొందునది. అస్మాకంశరణంత్వమేవ=మాకురక్షకుడవునీవే. గతిః=దిక్కు. అన్యః=ఇతరము. నాస్తి=లేదు. దుర్వాసనాపస్మారంహర=చెడ్డవిషయాపేక్షయనెడి పిచ్చినిపోఁగొట్టుము. స్పృహన్=ఇచ్ఛచేత ॥ ౫౪ ॥ పొదలు=వర్ధిల్లు. కాన్పునన్=ప్రసవముచేత. ఊర్పుల=శ్వాసముల. కెరలు=అతిశయించు. తెలి=తేటయైన. భవన

తే. భువనఘటనకు మొదలికంబమునుబోలె, భువనములకెల్ల నీవాదిభూతుఁడగుట
నిట్టనిలుచున్కి చేఁగాదె నెట్టుకొనియె, గెంటుఁగుంటును లేక లక్ష్మీకళత్ర!

చ. ముదమున సోమకాసురుఁడు ముచ్చిలి యచ్ఛలమారఁ గొన్న ప్రాఁ
జదువులు తెచ్చి తజ్జఠర సాంద్రతరాంత్రములంటనాటు బల్
గదురుఁదోలంగఁ గీర్తియను గంగఁదోలంచి విధాతృవిస్ఫుర
ద్వదనసరోజగంధ్ఫలలి తంబులు చేసితిగా జగన్నిధీ!. ౫౬

ఉ. కోపనశాపనవ్యశిఖి గోర్మసఁగం గసుగంది ప్రమంది త
త్తాపమునాఁపలేక తిమి ధామజలభ్రమిఁ గూలి తూలు జం
భాపహరాజ్యలక్ష్మి వెర వారఁగఁ దేల్పవె యీఁతకాయరూ
పై పృథుకర్పరం బమర నాశ్రితరక్షణ దక్షిణేక్షణా! ౫౭

ఉ. ఆ పెనువెల్లిఁ ద్రెళ్లు మకరాకరమేఖల నీవు దేర్చి యష్టాపదటంకవిభ్రమవిడంబిని యైనిజదంష్ట్రఁ గూర్చు త
ద్రూపము దీపితంబగు సరోరుహలోచన! సప్తజిహ్వాజి
హ్వోపరిభాగధూమచల యోపమమై విలయోపలబ్ధులన్. ౫౮

చ. అలఘు జగద్ద్విష ద్ద్విప ఘటాంకుశ శాత నఖాంకురాగ్ర లాం
గలముల మున్న నీ వసుర ఘస్మర! వైరిభుజాంతరాళజాం
గలమహిఁ జాలువట్టిపయిఁ గ్రమ్మెడు నెత్తురు నీరువెట్టి యుం
దలుకవె కీర్తి పూర్తికల మాంకుర మింద్రరమాఫలార్థివై. ౫౯

---

ఘటనకున్=ఇల్లుకట్టుటకు. నిట్టనిలుచున్కి=నిలువుననిలిచియుండుట. నెట్టుకొనియెన్ = అతిశయించెను — తేటపడియెను. గెంటు=కదలిక. కుంటు=తగ్గు ॥ ౫౫ । అచ్ఛలము=ఉత్సాహము. ప్రాఁజదువులు=వేదములను. ఆంత్రములు=ప్రేఁగులు. బల్గదురు=అధికమైననిచుగబ్బు. తోలంచి=కడిగి. విస్ఫురత్=వికసించుచున్న ॥ ౫౬ ॥ కోపనశాపనవ్యశిఖి=కోపస్వభావముగల దుర్వాసుని శాపమనెడి క్రొత్తనిప్పు. గోర్మసఁగన్=మిక్కిలిరేఁగఁగా. కసుగంది=మిక్కిలితపించి. ప్రమంది=సోలి. తిమిధామజలభ్రమిన్=సముద్రజలముయొక్క తిరుగుడునందు. తూలు= చలించు. జంభాపహ=ఇంద్రునిదైన. ఈఁతకాయ = ఈఁదుటకుఅనువుగానుంచుకొనెడు ఎండుసొరకాయ. కర్పరము = వీఁపుచిప్ప. దక్షిణేక్షణా = దాక్షిణ్యముతోడి చూపుగలవాఁడా ॥ ౫౭ ॥ మకరాకరమేఖలన్=భూమిని. అష్టాపదటంకవిభ్రమవిడంబిని = బంగారునునఱకునట్టియులియొక్క విలాసమును పోలినది. సప్తజిహ్వ=అగ్నియొక్క. జిహ్వోపరి=నాలుకలైనమంటలకొనలందు. విలయోపలబ్ధులన్=ప్రళయములుకలుగునప్పుడు॥ ౫౮ ॥ అలఘు...లాంగలములన్=అధికులైనలోకశత్రువులనెడి యేనుఁగుల గుంపునకు అంకుశములై వాఁడులైనగోళ్లకొనలనెడి నాఁగేళ్లచేత. అసురఘస్మర=అసురులను నశింపఁజేయువాఁడా. వైరి...మహిన్=పగవానిఱొమ్మనెడి అడవినేల మ

క. దండితబలివై జగములు, నిండ బెరుగుచున్నవేళ నీయడుగున భూ
మండల మతిసూక్ష్మాకృతిఁ, గొండికమచ్చయునుబోలె గొమరొందు హరీ!

ఉ. మాతృకఠోరకంఠబిల మార్గగళద్రుధిరారుణాననం
బై తళుకొత్తు దోఃపరశు హంసికి మేఁత యొసంగవే ఽపృ
క్ష్మాతలనాథమేచకక చాకుచహార మృణాళనాళసం
ఘాతము నూత్నయైణమద కర్దమవర్ధనసంప్రభూతమున్. ౬౧

ఉ. దారుణబాణపాతమద ధారలుగాఁగఁ గ్రాలు దోర్ధను
ర్వారణరాజుఁ గొల్పి దశవక్త్రముఖాంబుజవాటిఁ గూల్చి బృం
దారకహృత్సరోజములు దానవ చేసి వికాసమాసరా
కారతనొందఁ జేసిన ప్రగల్భత నీక తగున్ దగున్ హరీ! ౬౨

మ. వికటోత్తంభిత సీరభోగపటలీ విస్ఫూర్తిమన్మూర్తికం
చుకనిర్మోకభయానకంబు వికృతాశుక్ష్వేళ మగ్నిచ్ఛటా
వికిరక్రూరనిరీక్షణంబు నగు నీ వేషంబు శేషానుకా
రి కళన్ గ్రాలదె క్రోలదే సమదవైరిప్రాణవాతూలముల్. ౬౩

---

చాలువట్టి=చాళ్ళేర్పడదున్ని. కలమాంకురము = వరిమొలక ॥ ౫౯ ॥ కొండిక=చిన్న ॥ ౬౦ ॥ కఠోర=కఠినమైన. గళద్రుధిరారుణాననంబు=కాఱుచున్న నెత్తుటిచేత ఎఱ్ఱనైన మొగముగలది. దోఃపరశుహంసికిన్ = చేతులయందలి గండ్రగొడ్డలియనెడు ఆఁడుహంసకు. మేచకకచా=స్త్రీఁ యొక్క. ఏణమద=కస్తూరియనెడి. కర్దమవర్ధనసంప్రభూతమున్=బురదయందువర్ధిలునదియయి పుట్టినదియును ॥ ౬౧ ॥ దారుణబాణపాతమదధారలుగాఁగన్ =క్రూరములైనబాణములుపడుటయనెడి మదజలధారలుకాఱుచుండఁగా. క్రాలు = ప్రకాశించునట్టి. దోర్ధనుర్వారణరాజున్ = భుజములయందలివిల్లనెడియేనుఁగులరాజును. కొల్పి=పురికొలిపి. దశవక్త్రముఖాంబుజవాటిన్ = రావణునివైనముఖములనెడి కమలములవరుసను. బృందారకహృత్సరోజములు = దేవతలమనస్సులనెడికమలములు. వికాసమాసరాకారతన్=వికాసముచేత అతిశయించిన యాకృతికలిగినతనమును. ప్రగల్భత = నేర్పరితనము ॥ ౬౨ ॥ వికట=వంకరైన. ఉత్తంభిత = మీఁదికెత్తఁబడిన. సీరభోగపటలీ=నాగేలనెడిపడగలయొక్క సమూహముచేత. విస్ఫూర్తిమత్=ప్రకాశించుచున్న. మూర్తి= ఆకృతి. కంచుకనిర్మోకభయానకంబు = కుబుసమువిడుచుటచేత భయంకరమైనది. వికృతాశుక్ష్వేళము— వికృత=వికారమైన. ఆశు=వడితోడి. క్ష్వేళము = విషముగలది; సింహనాదము గలది అని అర్థాంతరము. అగ్నిచ్ఛటావికిరక్రూరనిరీక్షణంబు = నిప్పులసమూహమును వెదచల్లునట్టి క్రూరమైన చూపుగలది. శేషానుకారి = శేషునిఁబోలుచున్న. కళన్ = ప్రకాశముచేత. క్రాలదె=ప్రకాశింపదా. క్రోలదే=త్రాగదా. సమదవైరిప్రాణవాతూలములు=మదముతోఁగూడిన శత్రువుల ప్రాణవాయువులను ॥ ౬౩ ॥ లుంఛనపురాయిడిన్ = ఊడిపోవునట్టి యుపద్రవముచేత.

చ. ప్రతిదినకేశలుంచనపు రాయిడి నెట్టన బట్టగట్టి పైఁ
బుతపుతమంచునున్న కుఱుబోడతలన్ ధరియింపనోడియున్
సతముగ సొమ్ముగాననిడఁ జాలవుగా శిఖిపింఛవల్లి సౌ
గతమతధుర్య! దానిఁ గటి గట్టుము పుట్టము మిన్న కేటికిన్. ౭౪

చ. కలిహిమవేళ శోభనపుఁ గమ్మవిరుల్ సకలంబు డుల్చి భూ
వలయవనంబుఁ గప్పికొని వర్తిలుజాడ్యపుటీఁద పర్వఁగా
నలరులకారులీల భవ దాగమనం బటఁగల్గ రోషపా
టల మగునీకనుంగడల డాలునగున్ జిగురాకునాకృతిన్ ౭౫

సీ. నీటిలోఁ జివుకక నిలిచి క్రమ్మఱుపూన్కిఁ, గఠినకర్పరపుఁజూ క్కానుబిగువు
దంష్ట్రనెత్తినమహీతలపుగాడుపుఁజీర, యురుదారుకలనయం దుదయమగుట
పసులకుఁ దనకట్లబలిమి చూపువిధంబు, పులిమిననెత్రు గుగ్గిఁపునూనె
ద్వీపాంతరమునకుఁ దెగువమైఁ జనుపెంపు, చేముట్టునాఁగంటి జీనుతగులు

తే. సౌగతాగమమాలిమి శాస్త్రసరణి, వల్గువల్గన చిత్రధావనముగల్గు
నిన్నుఁదరిచేసి భవవార్ధి నిస్తరించి, దరిఁదటియకున్న గలదె మోదము మురారి

చ. లలిత కళావళీ మృదు ప లాశపరీతసుధామరందవి
చ్ఛలసుషమాప్రబోధగుణ జృంభితపూర్ణ సుధాంశుబింబపు

---

నెట్టనన్=మిక్కిలి. పుతపుతమంచున్ = అదురుచు. కుఱుబోడతలన్ = కుఱుచయైనబోడితలయందు. సతముగన్=శాశ్వతముగ. శిఖిపింఛవల్లిన్=తీఁగవంటి నెమిలిపురిని. సౌగతమతధుర్యా=బుద్ధుఁడా. పుట్టము=వస్త్రము ॥ ౭౪ ॥ కలిహిమవేళన్=కలియుగమనెడి మంచుకాలమునందు. శోభనపుఁగమ్మవిరులు=మేలులనెడివాసనతోడిపువ్వులను. డుల్చి=రాల్చి. భూవలయవనంబున్=భూమండలముఅనెడి అడవిని. వర్తిలు=ఉండునట్టి. జాడ్యపుటీఁద = మూఢత్వమనెడిచలిగాలి. అలరులకారులీలన్=వసంతఋతువువిధమున. అటన్=అంతట. రోషపాటలము=కోపముచేతఎఱ్ఱనైనది. కనుంగడలడాలు = కడకన్నులకాంతి ॥ ౭౫ ॥ కర్పరపు=వీఁపుఁజిప్పయనెడి. గాడుపుఁజీర=గాలికిఎత్తెడుచాఁపగుడ్డ. దారుకలనయందున్=ప్రమానిపొందునందు. చేముట్టు=ఆయుధమైన. జీనుతగులు = లంగరుతగిలించుట. సౌగతాగమమాలిమిశాస్త్రసరణి=బౌద్ధమతాగమ మనెడి ఓడనడపుశాస్త్రరీతి. వల్గువల్గనచిత్రధావనము=చక్కనైనవల్గితమనెడి విచిత్రమయిన గుఱ్ఱముదవుడు పాఱుట. తరిన్=ఓడనుగా. నిస్తరించి=దాఁటి. దరిఁదటియకున్నన్ = గట్టుచేరకుండిన. మోదము=సంతోషము——ఈపద్యమునందు విష్ణుని దశావతారములను ఓడపరికరములుఁగావర్ణింపఁబడియున్నది. అందులకు అనుగుణముగా అర్థాంతర మూహించుకొనవలెను ॥ ౭౬ ॥ లలిత...ఆయతన=ఒప్పిదములైన కళలసమూహమనెడి మెత్తనియాకులచేత చుట్టఁబడినయమృతమనెడి పూఁదేనెమీఁగడయొక్క మేలైనకాంతివిశేషమునుశోభింపఁజేసెడిగుణముచేత రేఁగిననిండుచంద్రునిబింబముయొక్క కొఱఁతలేని తెల్లనైనజలప్రదేశమును (పాలసముద్రము) ఇల్లుగాఁగలవాఁడా. షట్చర

ష్కల సీతపుష్కరాయతన ! షట్చరణేంద్ర నవేంద్రనీలక
జ్జల జలజాప్తజాజల నిజద్యుతివంచక ! కాంతికంచుకా ! ౬౭

క. ఉత్పత్తిస్థితివిలయా, ర్థోత్పాదక విట్ఠలాహ్వ యోన్నత ! సత్రా
జిత్పుత్రికాసత్పృష్ణదృ,గుత్పిబ సుఖదాపఘనప యోధరశాలీ ! ౬౮

స్రగ్విణి. అండజాధీశ వాహా ! జగద్గేహ ! దో, ర్దండచండారిని ర్దారితారీ!నతా
ఖండలా ! గండరింఖన్మణీకుండలా ! పుండరీకేక్షణా ! ప్రోవు నన్ సుక్షణా !

చ. అలికులభాగకుంతలము లందపుముద్దుమొగంబుఁ జేరలం
గొలువఁగవచ్చుకన్నులుఁ జిగుర్నగుమోవి మెఱుంగుఁ జెక్కులున్
వలమురియట్టు లేమొసలి వాగడపోఁగులు లోఁతుపొక్కిటన్
మొలచినతెల్లదమ్మి బలు మూఁపులు నీలవినీలదేహమున్. ౭౦

చ. కలిగినవాని ప్రాఁబలుకుఁ గమ్మనియూర్పులవాని యెందు నే
వెలుఁగునుగాని పెన్వెలుఁగు వెంబడినిం జనువాని నంతటన్
వెలసినవాని నిన్ గనని వెంబరపుట్టువు తాతిపుట్టువుం
బలె గతిగానలేదు యతి మానసహంసక ! కంసహింసకా ! ౭౧

చ. ఛత్రితశేష ! నాయెడఁ బ్రసన్నుఁడ వయ్యెదవేఁ గృతోగ్రశ
త్రుత్రప మైన యీ లలిత రూపముతో నిచటన్ వసింపు మే
క్షేత్రము నెట్టితీర్థమును జెందనియున్నతిఁ బొందుగాక యీ
క్షేత్రము తీర్థమున్ గడుఁబ్రసిద్ధి మదాహ్వయలబ్ధిఁ బొందుచున్. ౭౨

---

ణేంద్ర...కంచుకా = శ్రేష్ఠమైన తుమ్మెద నూతనమయినయింద్రనీలమణి కాటుక యమునానది యందలిజలము వీనినితనకాంతిచేత తక్కువపఱుచునట్టి దేహకాంతియనెడు కవచముగలవాఁడా॥ ౬౭ ॥ ఉత్పాదక=కలిగించునదియైన. ఉన్నత=అధికుఁడా. సత్రాజి...శాలీ=సత్యభామయొక్క ఆశతోడిచూపులకు నిక్కిపానముచేయుటవలని సుఖమునిచ్చునట్టి దేహమనెడి మేఘముచేతఒప్పిన వాఁడా ॥ ౬౮ ॥ జగద్గేహ=లోకమేయిల్లుగాఁగలవాఁడా. దోర్దండ...తారి = కఱ్ఱలవంటిచేతుల యందలివాఁడియైన చక్రముచేత తెగనఱకఁబడిన శత్రువులుగలవాఁడా. నతాఖండలా=మ్రొక్కినయింద్రుఁడుగలవాఁడా. గండరింఖన్మణికుండలా=చెక్కిళ్లయందు నటించుచున్న రత్నములచెవిపోఁగులుగలవాఁడా. సుక్షణా = మంచియుత్సవము గలవాఁడా ॥ ౬౯ ॥ అలికుల భాగకుంతలములు=తుమ్మెదలనుబోలిన ముంగురులు. చిగుర్నగుమోవి=చిగురును పరిహసించునట్టిపెదవి. వలమురియట్టు=శంఖమువంటిమెడ. లేమొసలివాగడపోఁగులు=కొత్తవైనమకరకుండలములు. తమ్మి=తామర ॥ ౭౦ ॥ వెంబర=దుష్టునియొక్క. యతిమానసహంసక = యతులయొక్క మనస్సునకు హంసవైనవాఁడా ॥ ౭౧ ॥ ఛత్రితశేష = గొడుగుగాఁజేయఁబడిన శేషుఁడుగలవాఁడా. అయ్యెదవే=అయ్యెదుపక్షమున. కృతోగ్రశత్రుత్రపము=చేయఁబడిన క్రూరశత్రువులభయముకలది—

తే. క్షేత్రకులరాజమైనయీక్షేత్రమునకుదీర్థకులరాజమైనయీతీర్థమునకు [నుడు
నిఖిలసురనాథకర్తృత్వనియతిఁ బొదలి,యీవిటవసించుటయవరంబిచ్చుట

సీ. అనుకంప పెను మోపుగను సొంపునకువింత చెలువంబు మొలపింపజిగురు మోవి
పవడంపుఁగొన దంత పఙ్క్తిప్రభలుపుష్పితముగాఁగహరిపల్కుధరణిదివిజ
నివహవరేణ్య నోనిఖిలధర్మధురీణ ! యగునట్లుభవదాహ్వయమువహించు
ని త్తీర్థమున వసి యుంచెద నను చక్కి, నీకుఁ జేతఃప్రీతి నెలకొనంగ

తే. భీమఘర్మాంబుసంభూత భైమి నీదు, క్షేత్రమునుతీర్థమును నిజోత్కృష్టసలిల
వేణి సంప్లావితమ్ముగా వింపఁగలదు, నాకు నెంతయు నిష్టమొ నర్పఁగడఁగి

వ. ప్రకటసుప్తాకారంబునం బశ్చిమాభిముఖుండనై సర్వోత్తమత్వంబు నిర్వహింప నే నిచ్చట ముచ్చటం దవిలి వర్తించెద. సకలక్షేత్రతీర్థోత్తమంబు లగు నీ క్షేత్రతీర్థంబులుం బౌండరీకంబులై పాండురంగాహ్వయుండ నగు నాకు నెక్కాలంబును శ్వేతద్వీప సుధాసాగరంబులకంటెఁ బ్రియంబులై నిత్యనివాసంబులై యత్యంతవిభవంబుల నభిరామంబులయ్యెడు. నీకోరిన యట్ల యిచ్చితి నని యచ్చతుర్భుజుండు పుండరీకునిఁ జేకొనియె. ౭౫

శా. శీతాహార్యకుమారి ! విస్మితులు లక్ష్మీస్మజాని వాచంయమి
వ్రాతశ్రేష్ఠునకున్ వరంబొసఁగి సాంద్రప్రీతి నచ్చోన మ
ధ్యేతీర్థంబున నున్నవాఁ డిపుడు భుక్తిన్ ముక్తి నీఁజాలు వి
ఖ్యాతిం దాల్చి విచిత్రరత్నచయరమ్య స్వర్ణహర్మ్యంబునన్. ౭౬

చ. నలువ మొగంబు లెట్లు స్రుజనప్రథమాహమునం దలిర్చున
న్నలువున సిద్ధసాధ్యనరనాగమరుద్వరయోగిమండలీ
కలకలగుంభితంబులయి కాంచనచారువులైన నాల్గువా
కిళుల వెలుంగు నున్నతనికేతనరాజమునం బ్రసన్నుఁడై. ౭౭

---

క్రూరులైనశత్రువులకుభయమునుకలుగఁజేయునది. మదాహ్వయలబ్ధిన్ = నా పేరుకలుగుటను॥ ౭౨॥ ౭౩ ॥ అనుకంప=దయ. వింతచెలువంబు=క్రొత్తయందము. చక్కిన్ = చోటను. చేతఃప్రీతి= మనస్సంతోషము. భీమఘర్మాంబుసంభూత = శివునిచెమటనీటివలనఁబుట్టినది. నిజో...సంప్లావితమ్ము=తనదైనమంచినీటిపాయచేతచక్కఁగాఁదడుపఁబడినదానిఁగా ॥ ౭౪ ॥ సుప్త=నిద్రపోయినవాని.తవిలి=ఆసక్తుఁడనై ॥ ౭౫ ॥ వాచంయమివ్రాత=మునులసమూహమునందు.భుక్తి= ఇహలోకసుఖము ॥ ౭౬ ॥ అన్నలువునన్ =ఆవిధమున. మరుత్ =దేవతలు. మండలి=సమూహముయొక్క. గుంభితంబులు=కూడినవి. కాంచనచారువులు=బంగారుచేతమనోహరములు. నికేతనరాజమునన్ = శ్రేష్ఠమైనయింటియందు ॥ ౭౭ ॥ ౭౮ ॥ కంబులలితకరున్ = శంఖముచేత ఒప్పుచున్న చేయిగల

తే. పుండరీకుండు క్షేత్రపాలుండుగొలిచి, యుండ నవ్యక్తముఖ్యసంయుక్తుఁడగుచుఁ
బాండురంగండు భక్తకల్పద్రుమలీల, నిష్టఫలసిద్ధిఁ దోరహ త్తించు నింతి!.

క. ఆ కంబులలితకరు బుధ, కోకంబులపాలిహేళిఁ గొలుతు రబల! ము
ల్లోకంబులవారలుఁ బరి, పాకంబుల నాత్మసుకృత పరికర మొప్పన్. ౭౯

వ. అర్ధయోజనవిస్తారంబును దదర్ధాయామసంయుతంబును నై కంబుకంధరు నకు నాకుం బ్రియజనకంబై సనక సనందనాదిసజ్జన చింతితార్థప్రదంబై సర్వోత్తమంబైన యమ్మహాక్షేత్రరాజంబు పుష్కరంబునకంటెఁ ద్రిగుణంబును కేదారంబునకంటె షడ్గుణంబును వారణాసికంటె దశగుణం బును శ్రీశైలంబునకంటె ననంతంబునునై పుండరీకునిపేరం బౌండరీకం బన మహీమండలమణికుండలం బగుచు నుండు నప్పరమధామంబు నే నధిష్ఠించి. ౮౦

ఉ. ఆ యదుభర్త నా హలధరానుజు నా నవనీతచోరు నేఁ
బాయనిభక్తితోఁ గొలుతుఁ బ్రత్యహముల్ గృహదైవతంబుగా
నో యరవిందకోరకస హోదరచారుపయోధరాఢ్య! ని
శ్శ్రేయసకాంక్షఁదక్కొరులు చేరి భజింతు రనంగ నేటికిన్. ౮౧

క. ఇతరక్షేత్రస్థితదై, వతపూజలఁ గలుగుఫలమ వశ్యము గలుగున్
శతదశకగుణితమై యూ, ర్జితమతిఁ దత్క్షేత్రపూజ సేయునరునకున్. ౮౨

క. నరుఁ డరువదివేలేఁడు లి, తరదైవతదర్శనమునఁ దాఁ గనుఫలమున్
బొరయు నలవోకవలె శాంకరి! యాక్షేత్రోత్తమంబుఁ గనుఁగొన్నంతన్.

క. సకలక్షేత్రావాసము, నకంటె నం దునికి యొప్పు నమనకు మృగడిం
భకనయన! యేకదినవా,సకృతికి వే దొరకుఁ గాన సాయుజ్యంబుల్. ౮౪

---

వానిని. బుధకోకంబుల = విద్వాంసులనెడి చక్రవాకపక్షుల. పరికరము=ఉపకరణము ॥ ౭౯ ॥ ఆయామ=వెడలుపుతోడ. చింతితార్థప్రదంబు=కోరినదాని నిచ్చునది. త్రిగుణంబు = మూడంతలు. షడ్గుణంబు=ఆఱంతలు. అనంతంబు=తుదలేనిది. ధామంబు=ఆలయము. అధిష్ఠించి = ఉనికిచేసి కొని ॥ ౮౦ ॥ అరవింద...రాఢ్య=తామరమొగ్గలనుబోలిన యొప్పిదములగు స్తనములుగలదానా. నిశ్శ్రేయసకాంక్షన్=శుభమునందలి యపేక్షచేత. తక్కొరులు=తక్కినయితరులు. భజింతురు= సేవింతురు ॥ ౮౧ ॥ శతదశకగుణితము=వేయంతలుగా పెరుగునది. ఊర్జితమతిన్ = స్థిరబుద్ధితో॥౮౨॥ పొరయున్=పొందును. అలవోకవలెన్=అనాయాసముగ. శాంకరి=పార్వతీ ॥ ౮౩ ॥ మృగడిం భకనయన = జింకపిల్లకన్నులవంటి కన్నులుగలదానా. సాయుజ్యంబు = మోక్షము ॥ ౮౪ ॥

సీ. దొరకుజన్మమునకుఁ బరమభైషజ్యమూ,మాతృశుశ్రూషాస మాధి యొకటి
చిలువాయనపువేల్పుఁగోలముఁగొల్వక వాసు, దేవునారాధించుతెలివియొకటి
దుర్వాసనలబెట్టు దొసఁగులు విడదన్ని, యధ్యాత్మవాసన నలరుటొకటి
యుర్విజీవుల కెల్లనుదయించియుదయించి, తుదిమస్త్యఁడై పుట్టుపదవియొకటి
తే. కాలమునవచ్చునస్థలకాంక్ష యెఱిగి, తృప్తినొందింపఁగలుగంగ దిరుగుటొకటి
దుర్లభంబెట్టులట్లతి దుర్లభంబు, మగువ! తత్క్షేత్రవాసంబు మానవులకు. ౧౫

చ. వినవె యజస్రముఁ గుతప వేళ క్షుధార్తులకోటిఁగూర్చి నే
త నెసపవెట్టి వండు కల ధౌతపుఁగూడు పసిండిపప్పు భో
జనమిడి యొండుచోఁ బడయఁ జాలెడు పుణ్య మగణ్యమై ఘటి
ల్లు నెలఁత ! పౌండరీకమహిలోఁ మెదుకొక్కటి పెట్టువానికిన్. ౧౬

మ. నియతిం బాతికయెత్తు కాంచనముగా నీ వెండిగానీ జగ
త్త్రియపూజ్యం బగుపాండురంగవసతిన్ దానంబుగావించు పు
ణ్యయుతుం డుండు నఖండలీలఁ గలధౌ తాహార్యవర్యాత్మక
ప్రియగేహంబులలోఁ భవాంతరమునన్ బృథ్వీధరేంద్రాత్మజా !. ౧౭

శా. ప్రావారాజినరాజిఁ గంబళతతిన్ బట్టాంబరాళిన్ దయా
ప్లావస్నిగ్ధమతిన్ జలిన్ గృపణవిప్రశ్రేణిపైఁ గప్పఁబో
యేవాఁడేనియుఁ బౌండరీకమహి వాఁ డిందుప్రభాకందళ
శ్రీవిభ్రాజియశంబులం బొదువు ధాత్రీదిఙ్నభస్సీమలన్. ౧౮

---

దొరకు=కలుగు. భైషజ్యము=మందు. చిలువాయనపువేల్పుఁగోలము=చిల్లరదేవతలసమూహమును. దుర్వాసనలబెట్టుదొసఁగులు = దుష్టములయిన విషయాపేక్షలనెడి గొప్పయాపదలను. అధ్యాత్మవాసనన్ = తత్త్వవిచారాపేక్షచేత. అలరుట=ఆనందించుట. పదవి = భాగ్యము ॥ ౧౫ ॥ అజస్రమున్=ఎల్లప్పుడును. కుతపవేళన్=అపరాహ్ణసమయమునందు. నేతన్=నేతితో. కలధౌతపుఁగూడు=వెండియన్నము. పసిండి=బంగారు. ఒండుచోన్=ఇతరస్థలమునందు. అగణ్యమై=ఎంచరానిదై. ఘటిల్లున్=కలుగును. పౌండరీకమహిలోన్=పుండరీకక్షేత్రమునందు ॥౧౬॥ వసతిన్=ఉనికిపట్టునందు. కలధౌతాహార్యవర్యాత్మకప్రియగేహంబులలోన్ = శ్రేష్ఠమయినవెండికొండగల (అనఁగా) వెండికొండనుబోలిన యిష్టములైన యిండ్లయందు. భవాంతరమునన్=ఇంకొకజన్మమునందు. పృథ్వీధరేంద్రాత్మజా=పార్వతీ ॥ ౧౭ ॥ ప్రావారాజినరాజిన్=తోలుఉత్తరీయపుసమూహమును. పట్టాంబరాళిన్=పట్టువస్త్రములసమూహమును. దయాప్లావస్నిగ్ధమతిన్=మిక్కిలిదయగలస్నేహబుద్ధితో. చలిన్=చలికాలమునందు. కృపణ=దరిద్రులైన. ఇందుప్రభాకందళశ్రీవిభ్రాజియశంబులన్=వెన్నెలమొలకలకలిమిచేత వెలుఁగునట్టికీర్తులచేత. ధాత్రీదిఙ్నభస్సీమలన్=భూమియొక్కయు దిక్కులయొక్కయు ఆకాశముయొక్కయు మేరలయందు ॥ ౧౮ ॥ వృత్రవిరోధి=

ఉ. వృత్రవిరోధిముఖ్యు లగు వేల్పులుఁ బుట్టఁ దలంతు రోలతా
గాత్రి ! త్రివిష్టపస్థితిసు ఖంబులుగావని కర్మభూమిపైఁ
బత్రరథాధినాథరథు బాంధవవత్సలుఁ బౌండరీకసు
క్షేత్రపతిన్ భజించి తమ చెన్నఁటిపుట్టువు నీఁగుకోరికన్. ౮౯

సీ. పితరులుబ్బుదురు హృ ద్గతులనాత్మకులోద్భ, వుం డెవ్వఁడేనియుఁ బౌండరీక
మునకునేగకయున్నెయనియాదునోసఁగుహవ్యముగవ్యమునమేయమైఫలించు
సవదరించఁగలేరు సాత్వికంబగుభావ, మేనొక్కఁడునుదక్క నివలనవల
భక్తులెవ్వరు రజః ప్రకృతిఁదాల్తురెకాని, పౌండరీకేశు శాంబరికతమునఁ
తే.దలఁపమానసమునగల్గుకలుషమడగు,పొగడమాటలనగుదోషములుదొలఁగు
కనుగొనఁగజేతబుట్టునఘంబులుడుగు,నమ్మహాక్షేత్రమునకునెయ్యదిసమంబు

సీ. కుఱుచలై గుములై గొనబులై లేఁబాఁప,కొమ్మఁజుట్టినజడల్ గుమురుకొనఁ
మెఱుపులై మిట్టలై మిక్కిలి బటువులై, క్రాలుకన్నులచెన్ను గబ్బుదేరఁ[గ
జిక్కనై చెలువమై చిన్నదియైయొప్ప, మోము దంష్ట్రాటంక ములఁదలిర్ప
నీలమై నిబిడమై నిద్దమై నింగిక్రిం, దుగనున్న బలుమేని పొగరు మెఱయఁ
తే. బత్రిపతికేతనుని పురఃక్షేత్రమూఁది, యున్న శ్రీక్షేత్రపాలకు యోగిలోక
రమణుముప్పదిరెండక్షరములమంత్ర,రాజముజపించికొల్వదొరకుశుభములు

ఉ. చేరి చతుశ్శ్రుతుల్ చిలుక చేఁ జదివించుచు నక్షమాలికా
ధారిణియై తనుప్రభలు దట్టపువెన్నెలపండు పండఁగాఁ

---

ఇంద్రుఁడు— త్రివిష్టపస్థితిన్=స్వర్గమునందలి యునికిచేత. కావు = కలుగవు. పత్రరథాధినాథరథున్=గరుడవాహనుని. చెన్నఁటి=వ్యర్థమయిన. నీఁగు=తొలఁగు ॥ ౮౯ ॥ ఉబ్బుదురు=సంతోషింతురు.హృద్గతులన్=మనసులందు.ఆత్మకులోద్భవుఁడు=తమకులమునందుఁబుట్టినవాఁడు.ఉన్నె=ఉండునా. హవ్యమున్=దేవతలకియ్యఁదగినయన్నమును. కవ్యమున్ = పితృదేవతలకియ్యఁదగినయన్నమును. అమేయము=ఇంతమాత్రమనియూహించిచెప్పరానిది. సవదరించఁగలేరు = వహింపఁజాలరు. సాత్వికంబు=సత్వగుణమువల్లనైనది. రజః ప్రకృతిన్ = రజోగుణభావమును. శాంబరి=మాయ. కలుషము=కలవరము. అఘంబులు=పాపములు. ॥ ౯౦ ॥ గుమురులు = గుబురులు. గొనబులు=అందములు. బటువులు=గుండ్రనైనవి. క్రాలు=ప్రకాశించు. చెన్ను = అందము. గబ్బుదేరన్=గర్వమునుతోఁపింపఁగా. చిక్కన=సళ్లులేమి. చెలువమై=అందమై. దంష్ట్రాటంకములన్=కాసెయీలులవంటికోఱలచేత. తలిర్పన్=ప్రకాశింపఁగా. నిబిడము=దట్టము. నిద్దము = నిగనిగలాడునది. బలుమేనిపొగరు=గొప్పదేహముయొక్క నిక్కు. పత్రిపతికేతనుని = గరుడధ్వజముగల పాండురంగవిట్ఠలుని. పురఃక్షేత్రము=ఎదుటిప్రదేశమును. ఊఁది=అవలంబించి ॥ ౯౧ ॥ ధారిణి=

దూపపువాకిటన్ వెలయు తోయజగర్భనిరాణి వాణి నీ
హారమయూఖజిన్ముఖ ద శాక్షరమంత్రమయిం గనందగున్. ౯౨

ఉ. శ్రీరమణీమనోరమణు చేతం బ్రతిష్ఠితుండౌట దక్షిణ
ద్వారమునందు లింగతను వైభవమొప్ప షడక్షరీవిధుల్
గోరి భజించువారలకుఁ గొంగుపసిండయి వేణుముద్రతో
నారదుఁ డున్నవాఁడు రద నచ్ఛదభర్త్సితవిద్రుమద్రుమా!. ౯౩

ఉ. శౌరి భజించుచున్ భుజగ సద్మమునన్ విహరించు వాఙ్మనో
హారిణు లైదుగోటులు మ హామహిమాన్వితు లర్థి దక్షిణ
ద్వారమహిన్ విహారరతి వర్తిలి యవ్విభుఁ జేరి యున్నఁడో
యారతులిచ్చినారఁట త దాయతధూమము నేఁడుఁ బర్వెడున్. ౯౪

క. చేడియ! యాద్వారమె యదు, చూడామణి క్రీడలాడు చో టమ్మహితా
క్రీడనభూస్థలి హరిఁ గూ, డాడుఁజుమీ యమరవల్లభావళి నేడున్. ౯౫

ఉ. సేచనముఖ్యకర్మముల సేతఁకు నూతనమైనయచ్చటన్
శ్రీచరణంబులున్నయవి సింగము వెన్నునవంటి వానికిన్
వేచని మొక్కి పూజనము నేమముతో రచియించెనేని శై
లాచలపుత్త్రి! పూపపుఁ డి హంబుఁ బరంబుఁ గరంబునం గొనున్. ౯౬

చ. మరలఁగఁబట్టఁ గట్టఁగ సమస్తమరుత్కరిఁ దన్నుఁ గూర్చి యె
చ్చరిక ధరింపఁబోలునన శాతముఖాంకుశ పాశముల్ వికా
స్వరరుచిఁ దాల్చి పశ్చిమపు వాకిట హ్రీంకృతిమంత్రరూపభా
స్వర భువనాధినాయిక ల సద్రసనాయిక యొప్పు నెప్పుడున్. ౯౭

---

ధరించినది. తోయజగర్భనిరాణి=బ్రహ్మయొక్క పట్టపుదేవి. నీహారమయూఖజిన్ముఖ=చంద్రుని జయించునట్టి ముఖముగలది ॥ ౯౨ ॥ లింగతనువైభవము = లింగదేహముయొక్క కలిమి. రదనచ్ఛద భర్త్సితవిద్రుమద్రుమా=పెదవిచేత తిరస్కరింపఁబడిన పగడపుమ్రానుగలదానా ॥ ౯౩ ॥ భుజగసద్మమునన్ = నాగలోకమునందు. వాఙ్మనోహారిణులు = మాటలచేత మనోజ్ఞులగువారు. రతిన్ =ఆసక్తిచేత. వర్తిలి = ఉండి. తదాయతధూమము = దానిదైన విశేషపుపొగ ॥ ౯౪ ॥ యదుచూడామణి=కృష్ణుఁడు. అమ్మహితాక్రీడనభూస్థలిన్=లెస్సగాక్రీడించుటకుఁదగిన ఆపూజ్యమైనప్రదేశమునందు ॥౯౫॥ సేచన=స్నానము. చేఁతకున్=చేయుటకు ॥ ౯౬ ॥ మరలఁగఁబట్టన్= తిరుగఁబట్టుటకును. కట్టఁగన్=కట్టివేయుటకును. సమస్తమరుత్కరిన్ = ఎల్లదేవతలలోను ఏనుఁగైన—ప్రధానదేవతయైన. తన్నున్=పాండురంగనిని. శాతముఖాంకుశపాశములు = వాఁడిమొనగలఅంకుశమును త్రాటిని. వికస్వరరుచిన్ = వికాసముతోడి ప్రకాశముతో. భువనాధినాయిక= లోకములయేలికసాని. లసద్రసనాయిక = ఒప్పిదములైన రసములకు నాయకురాలు—సరస్వతి॥

ఉ. హారిపథాధిరూఢ మహి షాసురకీకసవర్గ దుర్గ నా
గారిమహోపవాహ్య సద శాత్రవమంత్రవిశేష యుత్తర
ద్వారమునందు నుండు నిర తంబును దా ఫలపూపపాయసా
హారములం దనుం దెలచు నయ్యలదొడ్డికి వేల్పుగిడ్డియై. ౯౮

క. ఇవి నాలుగుద్వారంబులు, ధవళేక్షణ! ద్వారదేవ తలు నల్వురు వీ
రవధానబుద్ధి నేత, త్సవిశేషార్చన మొనర్ప సంపద లొందవ్చు౯. ౯౯

తే. సమరసన్నద్ధరక్షోని శాతహేతి, పాతజాతక్షతవ్రాత భూతిఁ దనరు
పరమపదనాథు నెమ్మనఁ బరఁగు వర్ణ, రాజియఖిలంబు శ్రీమంత్ర రాజమబల!

మ. అహరారంభమునందు రక్తుఁడయి మ ధ్యాహ్నంబున౯ శుభ్రుఁడై
గ్రహరాడస్తమయంబునం దసితుఁడై గాయత్రియుంబోలి య
య్యహిపర్యంకుఁడు మూడుమూర్తులకు ని మ్మైనయొప్పఁ బూజింతు ర
న్వహముం గోమలి! మూడుమంత్రముల ని త్యానందకాంక్ష౯ మునుల్.

క. మూర్తిత్రితయమయత్వ, స్ఫూర్తి౯ వర్తించు చిహ్నములు మంత్రము శ్రీ
భర్తకృప నే నెఱుంగుదుఁ, గార్తికరాకాసుధాంశు కమనీయముఖీ! ౧౦౨

మ. గదసారించి త్రిదంష్ట్రినాముఁ డగు ర క్షఃపాలుఁ డొక్కండు బి
ట్టదరుల్ వాఱ మురారియెద్దబరి వ్రేయ౯ దాన నద్దిక్కునొ
చ్చె దళింపంబడియు౯ దదుగ్రహతిగా సి౯ క్షుల్లకాధిక్యము౯
మృదుసంరంభముతోడ నవ్వుచును దు న్మె౯ వాని నద్దేవుఁడు౯. ౧౦౩

---

౯౮ ॥ హారి=మనోహరమయిన. కీకసవర్గ=ఎముకలరాశిగలది. నాగారిమహోపవాహ్య = సింహ మనెడి రాజవాహనముగలది. పూప=పిండివంట. తెలచు = ఆరాధించు అయ్యలదొడ్డికి౯= ఉత్తమజనులసమూహమునకు. వేల్పుగిడ్డి=కామధేనువు ॥ ౯౮ ॥ అవధాన=ఎచ్చరికతోడి ॥౯౯॥ సమర...భూతి౯=యుద్ధమునకు సిద్ధపడినరాక్షసులవాఁడియైనఆయుధముల పాటువలననైనగాయ ముల సమూహముయొక్క కలిమిచేత. వర్ణరాజి=అక్షరములపఙ్క్తి ॥ ౧౦౦ ॥ అహరారంభము నందు౯=ప్రాతఃకాలమునందు. రక్తుఁడు=ఎఱ్ఱనివాఁడు. శుభ్రుఁడు=తెల్లనివాఁడు. అసితుఁడు= నల్లనివాఁడు. అహిపర్యంకుఁడు=విష్ణుదేవుఁడు. ఇమ్ము=ఉనికిపట్టు. అన్వహము౯=ప్రతిదినమును॥ ౧౦౧ ॥ స్ఫూర్తి౯=తోఁపికచేత. కార్తికరాకాసుధాంశు = శరత్కాలమునందలిపున్నమనాటి చంద్రునివలె. కమనీయ=సుందరమైన ॥ ౧౦౨ ॥ సారించి=చాఁచి. బిట్టు=మిక్కిలి. అదరులు= నిప్పురవలు. వాఱ౯=ప్రవహింపఁగా—రాలఁగా. బరి౯ = ప్రక్కను. వ్రేయ౯ = కొట్టఁగా. దళింపంబడియు౯=కొట్టఁబడియును. తదుగ్రహతిగాసి౯=ఆక్రూరమయిన దెబ్బవలని బాధచేత. క్షుల్లకాధిక్యము౯=అయల్పునివైన హెచ్చును. మృదుసంరంభముతోడ౯ = కొంచెపు త్వరతో. నవ్వుచు౯=ఎగతాళిచేయుచు, తున్మె౯=చంపెను ॥ ౧౦౩ ॥ ధాత్రీధరాత్మజ = ఓ పార్వతీ.

సీ. ధాత్రీధరాత్మజ! క్షేత్రాత్మయనఁగ దీర్థాత్మయనంగమూర్త్యాత్మయనఁగఁ
బ్రవిధమూర్తులుదాల్చిదీపించునతఁడుమూన్నెలవులయెడఁ బూజనీయుఁడగు
గంబళ కౌశేయ కలధౌత కాంచన,గంధసింధుర తురంగమశతాంగ[టఁ
కర్ణికా గ్రైవేయ కటక కన్యా గంధ, కాశ్మీర కస్తూరి కా గవాజ్య
ధాన్యవాసాదిబహుపదార్థంబు లచటఁ, బేదలకు వేదవిదులకుఁ బ్రీతినొసఁగ
క్షేత్రమయమూర్తియగు దేవకీసుతునకు, బ్రహ్మాండరక్షాధిపతికిఁ బ్రమద మొదవు

ఉ. చేడియ ! తీర్థమూర్తికడఁ జేయఁదగుక్ మనుజుండు సేచనా
క్రీడనముల్ మహీదివిజ కేసరులక్ బరమాన్నశర్కరా
పాడబ గోఘృతేక్షురస శాకములక్ ఫలపానకాదులక్
వీడెములక్ బ్రమోదపద వీమదలిప్సఁ జెలంగఁజేయుచుక్. ౧౦౫

క. ప్రణుతమతి సర్వపూజా, ర్పణమునఁ దత్తీర్థమూర్తి భజియించు సుధీ
మణులకు నభిముఖమతి బ, ర్హిణబర్హాకల్పుఁ డొసఁగు నిహముం బరముక్.

వ. అని మూర్త్యర్చనవిధానకథనోన్ముఖుండై పంచముఖుండు శిఖరినందనతో
నిట్లనియె. ౧౦౭

సీ. మంత్రపూతముగాఁగ మజ్జనంబొనరించి, ప్రసన్నని శుభ్రాంబరములుగట్టి
ఘనసారమిశ్రిత గంధసారమలంది, పరిమళంబుడివోని విరులు ముడిచి
సిగరలతోడ గోక్షీరపూరముతోడ, బహువిధం బగుఫల ప్రతతితోడ
పిండివంటలతోడ ఖండశర్కరతోడ, నేతులతోడ దే నియలతోడ

తే. దధులతోఁగూడఁదగునివేద్యములజూపి,వనధివనధాముఁబీతాంబరునిరమాకు
చరజవినిలిప్తుశిఖిబర్హధరుమఖాంశ,భోక్తఁబూజింపదగుఁజైత్రమునశుభాంగి!

---

మూన్నెలవులయెడక్=మూడుస్థానములయందు. కౌశేయ=పట్టు. కలధౌత = వెండి. గంధసింధుర=మదపుటేనుఁగు. శతాంగ=రథము. కర్ణిక=చెవికమ్మ. గ్రైవేయ=మెడలోధరించెడియాభరణము. కటక=కడియము. గవాజ్య=ఆవునెయ్యి. ప్రమదము = సంతోషము. ॥ ౧౦౪ ॥ సేచనాక్రీడనములు=జలకమాడుటలు. కేసరులక్ = శ్రేష్ఠులను. పాడబ = ఆఱురసములతోఁగూడిన పదార్థములు. ఇక్షు=చెఱుకు. ప్రమోదపదవీమదలిప్స=సంతోషమార్గముచేతమత్తుకొనునట్టియిచ్ఛ. చెలంగక్ = అతిశయింప ॥ ౧౦౫ ॥ బర్హిణబర్హాకల్పుఁడు = నెమలిపింఛెయలంకారముగాఁగలవాఁడు=కృష్ణుఁడు ॥ ౧౦౬ ॥ ౧౦౭ ॥ ప్రసన్ని=మనోజ్ఞమయిన. గంధసారము=మంచిగందము. ఉడివోని=తగ్గని. సిగర=తాలింపుచేసిన మజ్జిగ. పూరము=ప్రవాహము. వనధివనధాముక్=సముద్రజలము ఉనికిపట్టగువానిని. రమాకుచరజవినిలిప్తునిక్=లక్ష్మీదేవిబొమ్మలమీఁది గందపురేణువులచేతపూయఁబడినవానిని. శిఖిబర్హధరుక్=నెమలిపింఛెను ధరించినవానిని. మఖాంశభోక్తక్= యజ్ఞభాగమును భుజించువానిని ॥ ౧౦౮ ॥ ఓలలార్చి = అభిషేకముచేసి. ధార్తరాష్ట్రముక్=

సీ. గంగఁగాటుకకొండ గప్పనొప్పిదము దక్కొత్త నావులపాల నోలలార్చి
బలితంపు నునుపుజొంపము ధార్తరాష్ట్రంబుఁ, జుట్టినక్రియ తెల్లపట్టుగట్టి
ముదురువెన్నెలయొప్పు మున్నీటిగమిచిన ట్టినలీలఁ గ్రాలఁ జందనముఁబూసి
వడగండ్లుపొదువుశాద్వలమహిఁబొల్చుపొల్పగ మల్లెపువ్వులఁ బూజచేసి
తే. మంచువేసవి వాసవి మనుపుకాపు, విబుధతతిపాలి వీడర వెల్లమ్రాఁకు
భక్తసులభునిఁ దెలిచిపూర్వోక్తభూరి,భక్ష్యభోజ్యాదులర్పింపభద్రమొదవు
సీ. వృష్టిగా శుద్ధాంబు వేణిమజ్జనమార్చి, శిఖరిమేఘముగ మంజిడి ఘటించి
కరకపాతంబుగా విరిగొజ్జఁగలఁబూన్చి,క్షమపంకిలతగఁగుంకుమముఁబూసి
మఘువగోపములుగా మణిహారమర్పించి,పలుమెఱుంగులుగ దీపమ్ములెత్తి
గర్జితంబులుగ శంఖక్వాణములుచూపి,పచ్చికగా ధూపపటలిఁ బెనిచి
తే. యుత్పిబంబుల భక్తిగా నుష్ణతైల, పక్వగుడమిశ్రపిష్టసూపపరమాన్న
రాసులొసగంగదగుఁగారురాకహరికి,నట్టిఋతుధర్మములుచూపునంద మొంద
సీ. మహినాలపాఁడి ముమ్మరముగాఁబ్రభవింప,నవనవోజ్జ్వలదధిస్నానవిధియు
శుభ్రాభ్రపటలంబు లభ్రింబుపైఁబర్వ, లఘుధౌతవిమలచేలములకప్పు
సితకుశేశయ కాశ సితకరద్యుతిహెచ్చ, దొరకినయుచితంపు విరులపూజ
శాలిపాకస్ఫూర్తి గ్రాల గోరోచనా, సమ్మిశ్రచర్చిక్య సంఘటనము
తే. ప్రజభుజాభోజనములు క్రొంబంటవంట,కములుగావింపగోధూమఖండఖండ
శర్కరాఢ్య సుపక్వ భోజ్యములునెఱపి,విష్ణుఁబూజింపఁదగుశరద్వేళయందు
సీ. పాథోధివిహ్వాతిసంభవ తనూజాడ్యంబు,సంతప్త గోఘృత స్నపనరచనఁ
దులసిదండయకాని కలుగనితక్కువ, మరువక కుంద కుట్మల సమృద్ధిఁ

---

నల్లనిముక్కుకాళ్ళుగలహంసను. మున్నీటిఁ=సముద్రమును. కమిచి=కమ్మి. శాద్వలమహి=పచ్చికనేల. వీడరవెల్లమ్రాఁకు=ముంగిటనుండెడి కల్పవృక్షము. తెలచి=మ్రొక్కి. భూరి=అధికమైన. భద్రము=మేలు ॥ ౧౦౯ ॥ శుద్ధాంబువేణిఁ=తేటనీటిధారచేత. మజ్జనమార్చి=స్నానముచేయించి. మంజిడి=పీతాంబరము. కరకపాతంబుగాఁ=వడగండ్లుపడుటగా. విరిగొజ్జఁగలఁ=విరిసినగొజ్జంగి పూవులను. క్షమపంకిలతగఁ=నేలబురదగా. మఘువగోపములు=పట్టుపురుగులు. క్వాణములు=ధ్వనులు. ఉష్ణతైలపక్వగుడమిశ్రసూప=కాఁగిననూనెలోవండఁబడిన బెల్లముకలిసిన పిండివంటలు పప్పు. కారు=వర్షాకాలము ॥ ౧౧౦ ॥ ముమ్మరముగాఁ=అధికముగా. నవనవోజ్జ్వల=మిక్కిలి క్రొత్తదై ప్రకాశించునట్టి. శుభ్రాభ్రపటలంబులు = తెల్లనిమేఘములసమూహములు. ధౌత = మడుఁగైన. సితకుశేశయ...ద్యుతి= తెల్లదామరలయు రెల్లుపువ్వులయుచందమామయు కాంతిశాలిపాకస్ఫూర్తి=వరిపంటయొక్క ప్రకాశము. చర్చిక్య =పచ్చిగందపుపూఁత. గోధూమఖండ=గోదుమ

గళిన కచ్చర పీత కౌశేయనిర్బంధ, మభిరామచిత్రాంబ రార్పణమున
ముదురువెన్నెలఁ జేయు నుదరపోషణవృత్తి, నవ్యదివ్యాన్నపా నప్రశస్తి
తే. నుజ్జగింపించి డెందానకుబ్బొసర్చి,నిశలఁగుంకుమ మగలు మైనిండనలఁది,గే
హమునధూపధూమ మెక్కించికుధర,ధరుని హేమ స్తమునఁగొల్వదొరకుముక్తి
క. శిశిరాగమవాసరముల, యశోదగారాబుపట్టి నర్చింపఁదగున్
శశిముఖి! తత్కాలోచిత, కుశకుసుమపటాంగరాగ కూర్పాసాదిన్. ౧౧౩
క. ఋతువుల నాటిట సిక్రియఁ, బ్రతిదినము భజింపఁ బరమ పదనాథుఁడు వాం
ఛితశతము లొసఁగి భక్త, ప్రతతుల మన్నించు భక్త పరతంత్రుండై.
తే. మురవిభజ్ఞ నుశ్రీక్షేత్రమూర్తి తీర్థమూర్తిమూర్తులకడ నేమమునఁనొనర్చు
నర్చభాగవిశేషంబు లానుపూర్వి,వినుమువినిపింతుఁ బరమాణువిభవమధ్య!
తే. పరమపదనాథుఁ దిరిగిరా నిరువదేను,చేతులప్రమాణమునఁగల్గుభూతలంబు
ముక్తికరిమైనక్షేత్రమూర్తియందు,నర్చభాగంబుసుమ్ముచంద్రార్ధనిటల!
క. సకలోత్కృష్టోన్నతిఁ బొ, యక యెయ్యది కీర్తివడయు నత్తీర్థము పొ
ల్తుక!యర్చాభాగంబై, యకుటిలగతిఁ దీర్థమూర్తి యందు వెలుంగున్.
క. ఏనేల మూర్తియంద, ర్చానియమవిభాగమునఁబ్రశస్తం బగు నా
స్థానము నర్చింపక యె, వ్వానికిఁ దాఁ జేయుపూజ వమ్మగుఁజూపున్మ. ౧౧౮
వ. కావున క్షేత్రమూర్తి తీర్థమూర్తి మూర్తిమూర్తులయందలి యర్చాభా
గంబులెఱింగియర్చించుచు ననుచితాచరణవిముఖుండగు పుణ్యనిధికి సుము
ఖుండై పాండురంగం డఖండానందం బాపాదించునని యా పరమేశ్వ
రుండు పార్వతితో వెండియు నిట్లనియె. ౧౧౯

---

నూక. ఆఢ్య=కలిగిన. పక్వభోజ్యములు=వండఁబడినభుజించువస్తువులు.॥౧౧౧॥ పాథోధివిహృతి=సముద్రమునందలి విహారము. జాడ్యంబు=జడత్వము. సంతప్త=కాఁగిన. స్నపనరచనన్=స్నానముచేయించుటచేతను. కుందకుట్మల=మొల్లమొగ్గలయొక్క. కచ్చర = మురికియైన. పీతకౌశేయనిర్బంధము=పచ్చపట్టుకట్టు. చిత్ర=నానావర్ణమయిన. ముదురువెన్నెలన్=పూర్ణచంద్రుని కిరణములచేత—అమృతముచేత. దివ్య=మనోజ్ఞమయిన. ఉజ్జగింపించి=విడిపించి. డెందానకున్=మనస్సునకు. ఉబ్బు=సంతోషము. నిశలన్=రాత్రులందు. అగలు=అగరుగంధము. ఎక్కించి=అతిశయింపఁజేసి. కుధరధరునిన్=విష్ణుమూర్తిని ॥ ౧౧౨ ॥ పటాంగరాగకూర్పాసాదిన్=వస్త్రములు గందపుపూఁతలుకుబుసములు (అరచొక్కాలు) మొదలగువానిచేత ॥ ౧౧౩ ॥ ౧౧౪ ॥ఆనుపూర్విన్=మొదటనుండిక్రమముగా ॥ ౧౧౫ ॥ కరి=సాక్షి. అర్చభాగంబు=పూజించుభాగము. నిటల=నొసలుగలదానా ॥ ౧౧౬ ॥ నేల = చోటు. వమ్ము=వ్యర్థము ॥ ౧౧౭ ॥ ౧౧౮ ॥ ఆపాదించున్=కలిగించును ॥ ౧౧౯ ॥ శుభోత్కరపద్మంబు=శుభసమూహములనెడి పద్మములుగలది.

మ. హరిపశ్చాద్దిశ నూఱువింశులప్రమాణాసక్తిఁ గల్మిన్ శుభో
త్కరపద్మం బగు పద్మతీర్థ మనుతీర్థం బొప్పు నచ్చోన ను
స్థిరతన్ శంఖము పద్మమన్ నిధులు వర్తించుం దపోదీపితుల్
నరనారాయణు లున్నవా రచట బాలా! పిప్పలాకారులై. ౧౨౦

సీ. సమధికజ్ఞానవిభ్రమముతోఁ గూడంగ, హరిమేన నవతార మైనవారు
మదము పోవఁగ నిండు మనసుతోఁ గూడంగ, బ్రహ్మచర్యముచిక్కఁబట్టువారు
పరపురుషార్థసంపదతోడఁ గూడంగ, ధనురాదిశస్త్రము ల్దాల్చువారు
దుష్టనిగ్రహవిధా ధురతోడఁ గూడంగఁ, బుధరక్షణోన్నతిఁ బూనువారు
తే. మహితగాంభీర్యధైర్యసామగ్రితోడఁ, గూడ సౌజన్యరమఁ గూడియాడువారు
ఘస్రపతిబింబనిభులు సహస్రకవచ, కవచనిర్భేదనులువారు ధవళనయన!

క. ఏపట్టునఁ జూపట్టుదు, రాపట్టున మూఁడుకోటు లమరాంగన ల
ష్టాపదపాత్రనిహితమణి, దీపకళికలగుచు శ్రీపతి భజించుటకై. ౧౨౨

ఉ. దోశ్శమితారి శౌరి తన తోడ్వినకుండలముల్ నిజక్షమా
న్తశ్శిలలోన దాఁపఁ బ్రమదా! యొకతీర్థము కుండలాఖ్యమై
దుశ్శకునాదిసంజనిత దోషశతంబు హతంబు సేయు న
మ్భశ్శుచితన్ బ్రసిద్ధమగుఁ బన్నగశాయికి నీశుదిక్కునన్. ౧౨౩

క. వరసింహమధ్య! యచ్చో, నరసింహుఁడు కుంజరాశనతఁ దాల్చుట న
చ్చెరువ దేవుఁడు నిజమం, త్రరాజపూజైకతానతాయుతుఁ బ్రోచున్.

క. ఓరాజవదన! యచటన, నీరాజన లబ్జనాభునికి నీ నున్నా
రేరాళము హరివల్లభ, లారామలఁ గొల్వవలయు నయకాములకున్.

శా. అంశేందూద్వహ దేవి! హ్రీంకృతిధ్రువం బై యున్నయచ్చోటికిన్
ద్రింశచ్చాపమితోర్వి నుత్తరమునం దీపించుతీర్థంబు మున్

---

పిప్పలాకారులు=రావిచెట్టురూపము నొందినవారు ॥ ౧౨౦ ॥ విభ్రమముతోన్ = విలాసముతో. చిక్కఁబట్టు=పరిగ్రహించు. దుష్టనిగ్రహవిధాధురతోడన్=దుష్టులను శిక్షించుటయను భారముతో. సౌజన్యరమన్ = మంచితనపు కలిమిని. ఘస్రపతిబింబనిభులు = సూర్యబింబమును బోలినవారు. నిర్భేదనులు=చక్కఁగా భేదించువారు ॥ ౧౨౧ ॥ పట్టు=స్థానము. చూపట్టుదురు=కనఁబడుదురు. అష్టాపదపాత్రనిహిత = బంగారుపళ్లెరములందుంచఁబడిన ॥ ౧౨౨ ॥ దోశ్శమితారి=భుజములచేత అణఁపఁబడినశత్రువులుగలవాఁడు. నిజక్షమాంతశ్శిలలోన్ = తనభూమిలోనిఱాతియందు. అంభశ్శుచితన్=నీటిపరిశుద్ధతచేత. ॥ ౧౨౩ ॥ కుంజరాశనతన్=అశ్వత్థత్వముచేత. ఏకతానతా=ఇతరవిషయములందుబుద్ధిని చొరనియ్యకుండుట=ఏకాగ్రత ॥ ౧౨౪ ॥ నీరాజనలు = ఆరతులు. ఏరాళము=లెక్కలేనివారు. అయకాములకున్=మేలుకలిమిని కోరువారికి ॥ ౧౨౫ ॥ అంశేందూద్వహా=

భ్రంశంబొందక వెన్కఁ దత్సలిలధారం గూడెఁ బుష్పావలీ
సంశుద్ధాంబువు లాయెడం దగు జప స్నానార్ఘ్యదానక్రియల్. ౧౨౬

సీ. భరమానుతఱిఁదోడు పడవచ్చుగతిఁ గేలి, తోఁ గరమూలజ ద్యుతులుసాఁగ
నెలకులంబులచల్వ నేర్చు నవార్కాంశు, లనఁ గపోలముల దీపాంశులంటఁ
గొడిఁబుట్టుకాళిమాంకురపుమేఘములకు మెఱుఁగులై చూపుక్రొమ్మించులలర
స్నేహంబు పాత్రని క్షిప్తమూటకునుబ్బ,పగిది పాలిండ్లు ని బ్బరమునిక్క
తే. హరికిఁ బలువంకలను దగ నగ్రవీధి, నిలిచి శతకోటిసంఖ్యల నియమపరత
నారతులొసంగు దివ్యకన్యకలు ధన్య, మతులు గ్రీడింతురయ్యుత్తమస్థలమున.

ఉ. గోపిక యోర్తు తొల్లి హరిఁ గూర్చి తపంబొనరింప దాని ని
ష్ఠాపరతన్ మదిం గరఁగి శార్ఙ్గియుఁ దోఁచినఁ జూచి వేడ్కతో
నా పసిగాపు పూపవయ సాకె త్రిలోకవిమోహనక్రియా
రోపనిరూపణం బగు స రోరుహలోచను రూపుఁ జూచుచున్. ౧౨౮

తే. వైషమేషవవిషమేషు శోషణమున, వేషమొకరీతిగానిర్నిమేషనయన
యగుచు నెరగొంటఁ గదలనిపొగరుమీను,దోయిఁ జూపట్టు సుప్తసిన్ధువునుబో

తే. క్లేశపాశంబుతోఁగూడఁ గేశపాశ, మురుల బర్హావతంసుండు కిరుణనిచ్చు
నీవి యెఱుఁగకి యొక్కింత నీవిజాఱఁ, దచ్చరణములు మదినంటమచ్చెకంటి.

---

కళామాత్రమయిన చంద్రునివహించిన. హ్రీంకృతిన్=హ్రీంకారముచేత. ధ్రువంబై=శాశ్వతమై. త్రింశచ్చాపమితోర్విన్=ముప్పదివిండ్లపట్టుకొలఁది నేలను. పుష్పావలీసంశుద్ధాంబువులు = పువ్వుల సముదాయముచేత పరిశుద్ధమయిన జలములు ॥౧౨౬॥ భరము=బరువు. కేలితోన్=విలాసముతో కరమూలజద్యుతులు=చంకలనిగనిగనివెలుఁగులు. సాఁగన్=నడచిరాఁగా. నెలకులంబుల=చంద్రసమూహములయొక్క. చల్వ=చల్లఁదనమును. నవార్కాంశులు=క్రొత్త (ఉదయకాలమునందలి) సూర్యకిరణములు. కపోలములన్=చెక్కిళ్లయందు. కొడిన్=దీపపుశిఖయందు. కాళిమాంకురపు=నల్లఁదనపుమొలకలనెడి. మెఱుఁగులై=మెఱపులై. క్రొమ్మించులు=క్రొత్తమెఱపులు. అలరన్=ప్రకాశింపఁగా. స్నేహంబు = మైత్రి; నూనె. పాత్రము = యోగ్యము; గిన్నె మొదలగునది. నిక్షిప్తము=ఉంచఁబడినది. ఉబ్బ=సంతోషించు—ఉబుకు. పాలిండ్లు=స్తనములు. నిబ్బరము=మిక్కిలి. అగ్రవీధిన్—ఎదుటను ॥౧౨౭॥ ఓర్తు=ఒకత. తోఁచినన్=ప్రత్యక్షముకాఁగా. ఆపసిగాపుపూపవయసాకె = ఆగొల్లపడుచు ॥౧౨౮॥ వైష...మునన్—వైషమేషవ = మన్మథుని యొక్క. విషమేషు బేసిబాణములవలని. శోషణమునన్ = చిక్కుటచేత. నిర్నిమేషనయన=రెప్పపాట్లులేనికన్నులుగలది. ఎరగొంటన్=ఆహారమును తీసికొనుటచేత. పొగరుమీనుదోయిన్=మత్తుగొన్నచేఁపలజంటతో.॥౧౨౯॥ క్లేశపాశంబుతోన్=తపస్సువలని శ్రమమనెడి త్రాటితో. కేశపాశము=వెండ్రుకలముడి. ఉరులన్=జాఱఁగా. బర్హావతంసుండు=కృష్ణుఁడు. ఈవి=దానమును—కోరి

సీ. ఊరకుండినఁజూచి యొక్కింత నగి కృష్ణుఁ, డిది యేమినీవన్న నిందువదన
కుంచితావయవభం గురవృత్తిఁ దత్పాద,బిసరుహంబులు కేల బిగియఁబట్టి
మచ్చిత్తహరముల్లో మధువైరి ! నీపాద, వనరుహంబులు వీని వదలఁజాల
వీనిలావణ్య మీ వేషభూషణముగా, నస్మత్కరార్థితం బగుట నడుగుఁ
తే. గనయిదిసలాంఛనం బగుఁ గాతయనుడు,నట్లయగుఁ గాక సర్వంబు నతివ!నీవ
నంబరవుముక్తకేశివినఖిలభూష,ణాంచితాంగివినైయుండు మనియె శౌరి.
ఆ. అదియునట్లయగుచు నభిరామమూర్తియై, తనపసిండిజడలు దలఁగద్రోచి
యానతార్ధమూర్తి యైయిక్షేత్రమునకు నీ,శాన్యమున వసించు చంద్రవదన!
క. ఆ మహనీయక్షేత్రశి, ఖామణిపైఁ బిదపఁ బర్వెఁ గామిని ! నానా
భూములనునిగిడి మదగజ, భైమి బహుశిలహరిగహన భయదాకృతియై.
సీ. జడధిచల్లిన గంద వొడి నేత్రములఁబడ్డ,గతిఁదామరలపరాగంబు గ్రమ్మ
తదితరక్షేత్రముల్ తమయందునిలుమన్న నొడ్డించుటలువోలెనూర్మిలెసఁగఁ
బంకదంభమునఁ బాపముల మ్రింగిననీటి, పెద్దనవ్వులలీల ఫేనమలరఁ
బెరవాహినులమీఁదఁ బెరిగి నమత్సరా, వేశంబులన గ్రాహ విక్రుతులడర
తే. భానుభామైకజనిభూమి భైమినడచి, యమ్మహాక్షేత్రమటడాసి యధికభీతిఁ
జొరక గిరిరుద్ధగతియైన కరణిఘూర్ణ,నంబునొందుడు శ్రీజగన్నాథుఁ డెటిఁగి
ఉ. ఏటిగుఱించి పల్కు విను మేటికి నీభయ మోశుభాంగి ! యె
ప్పాట భవత్సమాన మగు పాటి సరిన్నికరంబు లేదు వాః
పాటవ మొప్ప మత్పదము పైఁ బ్రవహింపు మదాజ్ఞ నన్న న
చ్చోట సపాటమై కడలి జోటియుఁ గొల్పె నిజప్రవాహముల్. ౧౩౪

కను. నీవి=పోఁకముడి. తచ్చరణములు=ఆకృష్ణుని పాదములు ॥౧౩౦॥ కుంచితావయవ భంగుర వృత్తిన్=వంపఁబడిన అవయవములయొక్క వంకరతోడి వ్యాపారముతో. బిసరుహంబులు=కమలములను. సలాంఛనంబు=గుఱుతుతోఁగూడినది. అనంబరవు=వస్త్రము లేనిదానవు.ముక్తకేశివి=ముడివీడిన వెండ్రుకలుకలదానవు. అంచిత = ఒప్పిదమయిన ॥ ౧౩౧ ॥ ౧౩౨ ॥ జడధి = సముద్రము. పరాగంబు=పుప్పొడి. ఒడ్డించుటలు=చాఁగించుటలు. ఊర్ములు=అలలు. దంభమునన్=నెపముచేత. లీలన్=విధమున. పెరవాహినులమీఁదన్=ఇతరనదులమీఁద. మత్సర = ఈర్ష్యయొక్క. గ్రాహవిక్రుతులు = ప్రాణిహింసచేయు మత్స్యములవికారములు. అడరన్ = అతిశయింపఁగా. భానుభామైకజనిభూమి=సూర్యుని యొక్క (లేక) ప్రకాశములయొక్క ఆధిక్యమునకు ముఖ్యమయిన జన్మస్థానము. భైమి=భైమీనది. డాసి=సమీపించి. గిరిరుద్ధగతి = కొండచేత అడ్డగింపఁబడిన గమనముగలది. ఘూర్ణనంబున్=తిరుగుడుఁబాటును. ఒందుడున్ = పొందఁగా ॥ ౧౩౪ ॥ ఎప్పాటన్=ఏవిధముచేతను. సరిన్నికరంబు=నదీసమూహము. వాఃపాటవము=జలసమృద్ధి. సపా

తే. క్షేత్రమునభైమినిల్చిపాల్చినప్రదేశ, మునజనాభీష్టదమనాద్యమునుజతుర్ము
ఖాదిసేవ్యంబునగునృసింహాఖ్యతీర్థ, మమరుత్రింశద్ధనుఃప్రమాణమునమెఱసి.

సీ. ఉక్కుఁగంబముప్రచ్చి యుదయించెనేదేవుఁ, డరణినుద్భవమొందునగ్నికిరణి
వాలారుగోరమేల్ గాలాముచేసె నే, జేజే హిరణ్యాసు శిశుకమునకు
భక్తివృద్ధుఁడుగాఁగఁ బాటించె నేవేల్పు, ప్రహ్లాదుఁ గడుఁబాల పండ్లనాడ
నిజసింహతకుఁ దగ సుజనహృద్గుహలందుఁ, గ్రీడించె నేత్రిలోకీనియంత

తే. యానృహర్యక్షవర్యుండు యక్షపక్షి, ఖచరగంధర్వకిన్నరగ్రామణీశి
రోమణీఘృష్టిచరణసరోజుఁడందు, నుండుముప్పదిరెండుబాహులనుగలిగి.

శా. ఆ కుంభప్రభవుం డొకానొకతపం బత్యుగ్రతం జేసి ము
న్నో కుంభస్తని ! యాజలాంతరమునం దున్పంగ నేదివ్యలిం
గాకారంబుననిల్చు నట్టిదె యగస్త్యాఖ్యాకతీర్థంబు త
ద్వ్యాకోచాకృతి సప్తసప్తతి కరా యామావృతిన్ జెన్నగున్. ౧౩౮

మ. నవనీతప్రియుఁ గొల్చి విఘ్నపతి త న్మంత్రాంగతం దాల్చి యే
యవధిం బోని గణాధిపత్యపదవిం బ్రాపించి యద్దానిచెం
త వసింపంగఁ దదాహ్వయంబునన గాణాపత్య నామాన్వి తీ
ర్థవతంసంబు నగస్త్యతీర్థమునకా ద్యం బం డ్రను విద్యాధికుల్. ౧౩౯

సీ. నగపుత్రి ! యట్టిగాణాపత్యతీర్థంబు, నకుఁ బూర్వమై మజ్జనంబొనర్చు
వారికి మరివారి వారికి నపవర్గ, వర్గంబు నీఁజాలు వారిగలిగి
యచట సంకర్షణాహ్వాయతీర్థరాజంబు, వెలయునచ్చోమున్ను హలధరుండు
తీర్థయాత్రయొనర్చు త్రిమ్మటమైవచ్చి, యవగాహవేళఁ బ్రత్యక్షమైన

టము=మట్టము. కడలిజోటి=ఏఱు. కొల్పెన్=వ్యాపింపఁజేసెను ॥ ౧౩౫ ॥ పొల్చిన = ఉన్న. త్రింశద్ధనుఃప్రమాణమునన్=ముప్పదివిండ్లపట్టుకొలఁదిని ॥ ౧౩౬ ॥ ప్రచ్చి=పగుల్చుకొని. అరణిన్=నిప్పుత్రచ్చెడుసాధనమునందు. వాలారుగోరు = వాఁడిమొనచే అతిశయించినగోటిని. హిరణ్యాసు శిశుకమునకు=హిరణ్యకశిపుని ప్రాణమనెడియులుచమీనునకు. త్రిలోకీనియంత=మూడులోకముల సముదాయమును నియమించువాఁడు. నృహర్యక్షవర్యుండు = నృసింహోత్తముఁడు. గ్రామణీ=శ్రేష్ఠులయొక్క. ఘృష్టి=వెలుఁగులుగల ॥ ౧౩౭ ॥ తద్వ్యాకోచాకృతి = దానివికాసముతోడి యాకారము. సప్తసప్తతికరాయామావృతిన్ = డెబ్బదియేడుచేతుల విరివిగల యావరణముచేత. చెన్నగున్=అందగించును ॥ ౧౩౮ ॥ నవనీతప్రియున్=కృష్ణమూర్తిని. అవధిన్=మేరను. ॥౧౩౯॥ పూర్వము=తూర్పు. అపవర్గంబు=మోక్షము. త్రిమ్మటమైన్=త్రిప్పటతో. అవగాహ=స్నానము

తే. పాండురంగాధిపతికృప వడసి దద్వ, రాప్తి నిజనామమత్తీర్థ మధిగమింపఁ
జేసికార్తార్థ్యమునఁబొందె శ్రీసఖుండు, నాదయంతర్హితుండయ్యె నద్భుతముగ

శా. ఆసంకర్షణతీర్థరాజమునకా ద్యంబై నమద్వేదని
శ్వాసంబై తనదైర్ఘ్యమంతయును బం చాశద్ధనుర్మేయమై
భాసిల్లన్ నిజవారిమజ్జ దఖిల ప్రాణీప్సితత్యాగదీ
క్షాసన్నద్ధ మనం బ్రసిద్ధివడయున్ జాబాలితీర్థం బిలన్. ౧౪౧

క. అత్తీర్థమునంతరమున, వృత్తస్తని! బ్రహ్మతీర్థవిభు వభినుతిసం
పత్తివిలసిల్లు శతదో, ర్వృత్తాకృతి కాంత! దాని వృత్తంబెల్లన్. ౧౪౨

క. అందు వసియించు యదుకుల, నందనసేవావిధాస నందన్మతియై
కుందవిశదరదన! శతా, నందుఁడు వాణీవధూస నాథుం డగుచున్.

తే. బ్రహ్మతీర్థంబునకు దండ పాణియాశ, కులశిఖరిపుత్రి! దీపించుఁ గలశతీర్థ
మేనుబారలనిడుపున దినుమిగిలి, యదియయమృతామహాదేవి కాస్పదంబు.

తే. బ్రహ్మతీర్థంబుఁ గలశతీర్థంబుఁబొగడ, నేరరెవ్వారుచంద్రికాగౌరమయ్యుఁ
దత్పయోధరముక్తిని ధానమునకు, నంజనచ్ఛాయమైతోఁచుటద్భుతంబు.

ఉ. తామరసాక్షి! యందునకు దక్షిణదిక్కున సప్తదోర్మితా
యామ మయాతయామగుణమై యెసఁగున్ బితృతీర్థ మచ్చటన్
దామొనరించు దానములుఁ దాన ములున్ గయఁజేయు సత్క్రియా
స్తోమములై పితృప్రియముఁ జొన్ప సుఖింపుదు రెల్లవారలున్. ౧౪౬

ఉ. దానికి దక్షిణాశ వసుధాధరనందన! యొప్పు బ్రహ్మవి
ద్యానిధి సేవితంబు నవ హస్తమితం బగు చక్రతీర్థ మ

---

చేసెడి. తద్వరాప్తిన్=ఆయనవలన వరమునుపొందుటచేత. అధిగమింపన్ = పొంద. కార్తార్థ్యమునఁబొందెన్=కృతార్థత్వమునుపొందెను. అంతర్హితుండు=అంతర్ధానమునొందినవాఁడు ॥౧౪౦॥ దైర్ఘ్యము=నిడివి. పంచాశద్ధనుర్మేయము = ఏఁబదివిండ్లపట్టుకొలఁదిగలది. మజ్జత్ = స్నానముచేయుచున్న. ఈప్సిత=కోరికలను. దీక్షాసన్నద్ధము=నియమముచేత సిద్ధపడినది ॥ ౧౪౧ ॥ అంతరమునన్ = నడుమ. శతదోర్వృత్తాకృతి = నూఱుచేతులమేరగుండ్రని యాకారము. వృత్తము=ఉనికి ॥ ౧౪౨ ॥ నందన్మతి=సంతోషించుచున్నబుద్ధిగలవాఁడు. కుందవిశదరదన=మొల్లమొగ్గలవలె స్వచ్ఛమైనపలు (వరుస) గలదానా. శతానందుఁడు=బ్రహ్మ. ॥ ౧౪3 ॥ దండపాణియాశ=దక్షిణదిక్కు. కులశిఖరిపుత్రి=కులపర్వతముకూఁతురా. దీను = మనోజ్ఞత ॥ ౧౪౪ ॥ చంద్రికాగౌరము=వెన్నెలవంటి తెలుపుగలది. ॥ ౧౪౫ ॥ సప్తదోర్మితాయామము=ఏడుచేతులకొలఁదినిడివిగలది. అయాతయామ = విడువఁబడని. తానములు=స్నానములు ॥ ౧౪౬ ॥ ఆశన్=దిక్కునందు.

చ్చో నలవోకయుంబలె వి శుద్ధజలంబులఁ గ్రుంకి మాధవ
ధ్యానముసేయు మానులకు నబ్రము లే యపవర్గదుర్గముల్. ౧౪౭

క. చక్రస్తని! తజ్జలములఁ, జక్రాలంకృతశిలాని చయ ముదయించున్
శక్రముఖాఖిలమఘభుక్, చక్రముగొనియాడుఁ దత్ప్ర శస్తగుణంబుల్.

శా. ఆతీర్థంబునకుం గృతాంతదిశ నా ద్యం బార్తి వైద్యంబు ల
క్ష్మీతీర్థంబన నొక్క తీర్థము ప్రకా శించున్ రమాదేవి వీ
తాతంకస్థితి నచ్చటం దపము సే యన్ నేర్చికా తొల్లి యా
దైతేయారిభుజాంతరాళమణిసౌ ధం బెక్కెఁ బెన్మక్కువన్. ౧౪౮

సీ. ధూతాఘమైనల క్ష్మీతీర్థమునకు ద, క్షిణమునఁ గౌమోద కియును బద్మ
మునుశఙ్ఖమునుజక్రమునునిజనామచిహ్నములుగా వెలయుతీర్థములుపొలుచు
మెలఁత! యీనాల్గు ల క్ష్మీతీర్థమునఁగూడి,శక్తిపంచకనామ సంప్రయుక్తిఁ
దళుకొత్తు వీని వి స్తారంబు షష్టిహ, స్తప్రమాణంబనఁ జాలియుండుఁ

తే. బరమపావనంబు పాతకనిర్మూల, నైకకర్మఠంబు లోకనుతము
తత్ప్రభావమసుర దమనున కీయేను, ప్రాణధనములగుచుఁ బ్రణుతివడయు.

ఉ. ఆమధువైరిదివ్యతను వై సకలోన్నతమూర్తియై దశ
వ్యామవిశాలమై పరమ మై భువనత్రితయాభిగమ్యమై
యీ మును విన్న తీర్థముల కెక్కువచూపుచుఁ బౌండరీక మ
క్షామగుణాభిరామ మనఁ గా వినఁగాఁ గనఁగాఁ దగుం దగున్. ౧౫౦

సీ. నిడువాలుగనుచూపు నిగిడినచోనెల్ల, బీఱెండ రేయెండఁ బెండ్లియాడ
నిశ్వాసపవనంబు నెలకొన్నచోనెల్లఁ, బ్రామిన్కునెత్తావు లాముకవియఁ
బొక్కిటితమ్మిపు ప్పొడిమొల్కుచోనెల్ల, బ్రహ్మాంకురంబులు పాదుకొనఁగ
నడుగు లేఁజిగురాకు లంటినచోనెల్ల, వివిధతీర్థశ్రేణి వెల్లిగొడువ

---

అలవోకయుంబలె=స్వేచ్ఛగా. అబ్రము=వింత. దుర్గములు=పొందరానికోటలు ॥ ౧౪౭ ॥ మఘభుక్చక్రము=దేవతాసమూహము ॥ ౧౪౮ ॥ కృతాంతదిశన్ = దక్షిణపుదిక్కునందు. వీతాతంకస్థితిన్=పోయినభయముగలయునికితో. భుజాంతరాళమణిసౌధంబు=ఱొమ్మనెడి రత్నాలమేడ॥ ౧౪౯ ॥ ధూతాఘము=తొలఁగింపఁబడినపాపములుగలది. పొలుచున్=కలవు. సంప్రయుక్తిన్=కూడికతో. షష్టి=అఱువది. కర్మఠంబు=కార్యమును నెఱవేర్చునది. ఏను = అయిదు. ప్రణుతి=పొగడ్త ॥ ౧౫౦ ॥ దశవ్యామవిశాలము = పదిబారలవిరివిగలది. అభిగమ్యము = పొందఁదగినది. అక్షామ=తగ్గని ॥ ౧౫౧ ॥ వాలు = వాఁడియైన. బీఱెండ = తీక్ష్ణమైనయెండ. రేయెండ= వెన్నెల. నెలకొన్న=నిలిచిన—ఉన్న. ప్రామిన్కునెత్తావులు=వేదవాసనలు. ఆముకవియన్= ఆవరించుకొనఁగా. పొక్కిటితమ్మి=బొడ్డుతామర. ఒల్కు=చిందు. బ్రహ్మాంకురంబులు=బ్రహ్మల

తే. బర్హమణిబంధ మావేల్పు పచ్చవెదురు, గ్రచ్చకాయలతిత్తియుఁ గంబుశక్తి
గలిగి విహరించుఁ బౌండరీకంబునందు, నందు లేఁబట్టి ప్రాలేయనగముపట్టి!

వ. అఖిలతీర్థరాజం బగునమ్మహాతీర్థంబునకు జముదిక్కున ధిక్కృతావిముక్తం
బగు ముక్తకేశితీర్థం బఖిలార్థప్రదంబై యుండు. మున్నట్లు వెన్నునివలనం
దీర్ఘాపత్యంబును ముక్తిదాయిత్వంబునుం గాంచిన యమ్ముక్తకేశియునచ్చో
ట నచ్చవెన్నెలఁ దొచ్చెంబుచేసి యెసఁగు నిసుకదిన్నెలపై నున్నయది
యట్లగుటంజేసి. ౧౫౩

క. పులినోపరితలగత నా, తలోదరిని శిథిలవసన ధమ్మిల్ల మహో
జ్జ్వలభూషణభూషిత ని, శ్చలపదవిప్రద భజింపఁ జను గుహజననీ !

శా. భక్తుం డెవ్వఁడు ముక్తకైశిక పయఃపానంబు గావించి ని
ర్ముక్తక్లేశకు ముక్తకేశికి గరం బుల్ మోడ్చి సత్యామన
స్సక్తుం గన్గొనువాఁడు గన్నయదివో జన్మంబు మే దాల్చియున్
ముక్తుం డాతఁడు భావికాలజననం బుల్ వానికిం బూజ్యముల్. ౧౫౪

చ. హరి మును సంగమాహ్వయమహాసురు నాసురవృత్తిఁ ద్రోచి పే
రురవడి వానిపై నడుగు లూఁదఁ దదంకము లెట్టిచోట గో
చరమగు చూడ్కి కాస్థలము సన్నిధి పెన్నిధి వానిపేరిటం
బరఁగెడు దీర్ఘ మొప్పుఁ గల భాషిణి యీషణశోషణస్థితిన్. ౧౫౫

క. ప్లావితభూతల యగు పుష్పావతి యను నేఱు గలయఁ బావనమై యో
దేవీ! సంగమతీర్థం, బావిఖ్యాతాఖిలాద్భుతార్థత వెలయున్. ౧౫౬

సీ. ఆతీర్థమునకు నాద్యము సోమతీర్థంబు, సోమలోకావాస సుఖకరంబు
దానికి దేవతీర్థము పూర్వమై యుండు, దేవతాభోగోపదేష్ట యగుచు
నందున కటమున్న యవతరించిన సూర్య, తీర్థంబు సౌరసిద్ధిప్రదంబు
తత్తీర్థమునకుఁ బ్రాక్తనము సరస్వతీ, తీర్థంబు వాఙ్మయోద్దీపకంబు

---

యొక్క మొలకలు. వెల్లివోడువన్=ప్రవహింపఁగా ॥ ౧౫౨ ॥ జముదిక్కునన్=దక్షిణదిక్కు
నందు. ధిక్కృతావిముక్తంబు=తిరస్కరింపఁబడినకాశిగలది. తొచ్చెంబు=తుచ్ఛముగా ॥౧౫౩॥
పులినోపరితలగతన్ = ఇసుకదిన్నెమీఁదనున్నదానిని. శిథిలవసనధమ్మిల్లన్ = వీడినవస్త్రముసు
కొప్పునుగలదానిని ॥ ౧౫౪ ॥ ముక్తకైశికపయఃపానంబు=ముక్తకేశి తీర్థమునందలి జలమును
ద్రాగుటను. మే=దేహమును. పూజ్యములు=సున్నలు ॥ ౧౫౫ ॥ ఊఁదన్=మోఁపఁగా. తదంక
ములు=ఆగుఱుతులు. సన్నిధి పెన్నిధి=దగ్గఱనుండెడిగొప్పనిధి. ఈషణశోషణస్థితిన్ = ధనాదుల
యందలి యిచ్ఛనుతొలఁగించునట్టియునికితో ॥ ౧౫౬ ॥ ప్లావిత = తడుపఁబడిన ॥ ౧౫౭ ॥ సౌర
సిద్ధిప్రదంబు=సూర్యలోకసిద్ధినిచ్చునది. ప్రాక్తనము=పురాతనము. వాఙ్మయోద్దీపకంబు=వాగ్రూ

తే. వీననాల్గింట నాడిన వీనిమహిమఁ, బ్రస్తుతించిన వీనివై భవముగన్నఁ[ల్ల
బ్రాజ్యసాయుజ్యసామ్రాజ్యపూజ్యభూరి, భోగములుపఞ్చజనులకుఁబొదలుఁగొ

స్రగ్ధర. పూర్వద్వార స్థ సితాంగిఁ భువనవినుత నంభోరుహభ్రూణురాణిఁ
బర్వేందుస్పర్ధివక్త్రిఁ భగవతి నఖిల ప్రాణిధీమూర్తి వాణిఁ
దూర్వాశ్రీపత్రమల్లీ తులసిదళశమీ ధూపదీపాక్షతౌఘా
ఘుర్వాజ్యక్షీరధారల్ గొని కొలిచినచోఁ గోరుకోర్కుల్ ఫలించుఁ. ౧౪౯

పృథ్వి. తరణ్యయుతజిత్ప్రభా ధగధగాయితాశాంతరుం
డరణ్యమృగభూమికా వ్యథితదానవస్వాంతుఁ డా
హిరణ్యకశిపుద్రుహుం డెపుడునుండు నచ్చో నమ
చ్ఛరణ్యపదపద్ముఁడై చలదళాకృతిస్వీకృతిఁ. ౧౫౦

క. నీవడిగినఁ జెప్పితి నో, దేవి! చతుర్ముఖముఖులకుఁ దెలియఁగరా దీ
దైవత తీర్థ క్షేత్రమ, హావిర్భావములు చింతి తార్థప్రదముల్ ౧౫౧

ఉ. ఈచరితంబు విన్నఁ బఠి యించిన వ్రాసినఁ బుత్రపౌత్రల
క్ష్మీచతురాంగనాదికవి శేషము లిమ్మెయిఁ గాంచి మీఁదటఁ
జూచునవంశు ప్రాముసులు చూడని చక్కని యిక్క నిక్క మో
మేచకమేఘసంసదుప మేయశిరోజ! సరోజదృక్కృపన్. ౧౫౨

క. అని శివుఁడు కుధరకన్యకు, వినిపించినయట్టి సరణి వినిపించె మహా
మునులకు ననుపమితతపో, ధనులకుఁ గథకుండు తత్త్రితయమేళనముఁ.

---

పమైప్రకాశించునది. ఆడినన్=స్నానముచేసినను. ప్రాజ్య...భోగములు. ప్రాజ్య=అధికమైన. సాయుజ్య=భగవంతునితోడికూడికయనెడి. సామ్రాజ్య=మండలేశ్వరత్వమువలని. పూజ్య=గౌర వింపఁదగిన. భోగమ్ములు=సుఖానుభవములు. పంచజనులకున్=మనుష్యులకు. కొల్ల = కొల్లఁగా. పొదలున్=కలుగును ॥౧౪౮॥ అంభోరుహభ్రూణురాణిన్=సరస్వతిని. పర్వేందుస్పర్ధివక్త్రిన్= పున్నమనాటిచంద్రునెదిరించెడి ముఖముగలదానిని. ధీమూర్తిన్ = బుద్ధియే రూపమయినదానిని॥ ౧౪౯ ॥ తరణ్యయుతజిత్ప్రభా = పదివేలసూర్యులను గెలుమనట్టి తేజస్సుచేత. ఆశాంతరుఁడు= దిక్కులమధ్యప్రదేశముగలవాఁడు. భూమికా=వేషముచేత. ద్రుహుఁడు=శత్రువు. నమచ్ఛరణ్య పదపద్ముఁడు = సేవించువారికి పొందఁదగిన పాదపద్మములుగలవాఁడు. చలదళ = అశ్వత్థము యొక్క ॥ ౧౫౦॥ ముఖులకున్=మొదలగువారికి. చింతితార్థప్రదములు=కోరినకోరికలనిచ్చునవి॥ ౧౫౧ ॥ ఇమ్మెయిన్ = ఈదేహమునందు—ఈజన్మమునందు. చక్కనియిక్కన్ = మంచిచో టును. మేచకమేఘసంసదుపమేయశిరోజ=నల్లమబ్బులకూటువ ఉపమేయముగాఁగలతలవెండ్రు కలు గలదానా. సరోజదృక్ = విష్ణుదేవునియొక్క ॥ ౧౫౨ ॥ సరణిన్=విధమును ॥ ౧౫౩ ॥

క. వినిపించిన విని శౌనక, మునిప్రముఖనిఖిలమును లమోఘానందం
బును మనములఁ దాల్చిరి నెల, కొను నిజతనుఫలకపులక కులకలనమునన్.

క. ఆశౌనకుండు మఱియు బి, లేశయతల్పోపధాన లీలాలోల
స్వాశయుఁడు పరమపదబ, ద్ధాశుఁడునై రోమహర్షణాత్మజుఁ బలుకున్.

చ. దమనిధి! విట్ఠలేశ్వరుఁడు దైవతరత్నము భైమి తీర్థర
త్నము నల పౌండరీకవసుధాతల మన్నది క్షేత్రరత్న మీ
త్రిమణులు సూక్తిసూత్రవితతిం గుదిగ్రుచ్చితి మచ్ఛ్రవోవిధే
య మగుచునున్కి నక్షవల యాకృతి నీకృతి యొప్పు నెప్పుడున్. ౧౬౬

క. చతురభవదుక్తిముకుర, ప్రతిఫలదఖిలేశగుణపరంపర కలుషో
జ్ఝిత మగు నంతర్దృష్టిన్, సతతము నీక్షింపఁ దనివి సనదు మహాత్మా!

మ. హరి యాద్యుం డఖిలాండనాయకుఁడు నందాపత్య మేలయ్యెఁ? ద
చ్చరితం బెయ్యది? రాధ యెవ్వతె? తదిచ్ఛావృత్తి యేరీతి? శం
కరుదేహంబున భైమి యెట్లొదవె? శ్రీకాంతాంగజాతాక్షరో
త్కర మేమంత్రరహస్య? మింతయును నక్కాణింపు మాకింపుగన్.

ఉ. నావుడు సూతుఁ డిట్లనియె నారదమౌనికి మున్ను మేచక
గ్రీవుఁడు పుండరీకునిచరిత్రము దెల్పెఁ దదర్థవైభవం
బే వినిపింతు మీరు వినుఁ డిందఱు సందియ మెల్ల డిందఁ ల
క్ష్మీవిభుదివ్యలీల లఱచేతఁ గనందగు దీన దీనుగన్. ౧౬౯

క. అని సూతుఁడు వెండియు న, జ్జనసూనువిహారములు నిరూఢోక్తుల వి
న్ననువొప్పఁ జెప్పఁదొడఁగెన్, మును వేదవ్యాసువచనమున వినియునికిన్.

---

తనుఫలకపులకకులకలనమునన్ = తమదేహములనెడి పలకలయందు గగుర్పాటుకూటమితోడి కూడికతో ॥ ౧౬౪ ॥ బిలేశయ...స్వాశయుఁడు=పాముపానుపును దిండునుగాఁగల విష్ణుదేవుని లీలలయందు ఆసక్తమయిన తనమనసుగలవాఁడు ॥ ౧౬౫ ॥ దమనిధి = ఇంద్రియనిగ్రహమునకు ఉనికిపట్టయినవాఁడా. సూక్తిసూత్రవితతిన్=మంచిమాటనెడి దారములచేత. గుదిగ్రుచ్చితి=వత్తిగాకూర్చితిని. మచ్ఛ్రవోవిధేయము = మాచెవులయందుపొందినది ॥ ౧౬౬ ॥ భవదుక్తి...పరంపర=నీమాటలనెడియద్దమునందు తోఁచుచున్న సర్వేశ్వరునిగుణములపఙ్క్తులు. కలుషోజ్ఝితము= పాపముచేతతొలఁగింపఁబడినది. అంతర్దృష్టిన్=లోచూపుచేత. తనివిసనదు=తృప్తికాదు ॥౧౬౭॥ నందాపత్యము=నందునిబిడ్డ. ॥ ౧౬౮ ॥ మేచకగ్రీవుఁడు = శివుఁడు. డిందన్=తీఱఁగా. దీనన్= ఈచరిత్రమునువినుటచేత ॥ ౧౬౯ ॥ విన్ననువు = నేర్పు ॥ ౧౭౦ ॥ ప్రమదాప్రమదార్థముగాన్= భార్యయొక్క సంతోషముకొఱకు. ఉపన్యసించిన=చెప్పిన. శ్రుతిసీమలఁగాన్ = చెవిమార్గముల

చ. ధనపతిమిత్రుఁ డట్లు ప్రమదాప్రమదార్థముగా నుపన్యసిం
చిన వచనామృతంబు శ్రుతి సీమలఁ గా దిగి బోధభూజసే
చనమొనరించుటన్ సఫల సంభ్రము లై సమయూరరాజవా
హనముగ మాను లబ్ధిజల మానుఘనంబులలీల నేగఁగన్. ౧౭౧

సీ. జాలపాదము నంఘ్రిఁ గీలితంబగుసితాబ్జముభాతిఁగుంచెహస్తమునఁ గాల
బిరుదంబుఁ బొగడు శ్రీశ్వరుశంఖమనఁ జాలి, తన్నామముఖరకంధరదనర్ప
రజతాద్రికూటగర్జత్కాళికాకృతి,బృహదంసమునఁనిడ్డ మహతి పలుక
నిగిడి సుషుమ్న యీనిన పిల్లవెలుఁగుల, వడువున నెఱసంజ జడలునిక్కఁ

తే. దెగినచుక్కధరణికి నే తెంచుకరణిఁ, దరణిజిత్ప్రభతో మేఘ సరణి డిగ్గి
నందనీట శతానంద నందనుండు,మజ్జనంబాడి బాలేందుమౌళిఁబాడి.౧౭౨

చ. తటపుట బిల్వభూరుహావి తానలతానవపుష్పనిష్పత
జ్జటిలమధూళిధూళిభవ సౌరభ పూర భ్రమింపఁ జొచ్చె ని
చ్చట వనదేవతోద్ధతకు చద్వితయశ్రితయక్షకర్దమ
చ్ఛటలఁ దటాలునన్ వెడలు సారపుఁదావులు ద్రోవ లాఁగుచున్. ౧౭౩

తే. ఉచితనేపథ్యయుతలయ్యు నురగసతులు, నిఘ్ననిజవాళిమణిఘృణివిఘ్నలబ్ధి
నభికసంకేతములకు రే లరిగియరిగి, తిరుగు మొగమైనచిక్కుల తెరువు లివిర.

ఉ. వ్యాళకరాళకుంభములు వ్రచ్చుట గ్రుచ్చుటఁబోలెఁ బచ్చిము
త్యాలు నఖాగ్రధారలకు నాభరణాచరణం బొనర్ప నీ
శైలగుహాగ్రహస్థలులఁ జల్పెడు నిద్దుర లార గట్టురా
చూలివయాళివాపురము సూడుకుఁ బట్టు మహోగ్రసింహముల్. ౧౭౪

---

గుండ. బోధభూజసేచనము = జ్ఞానవృక్షముయొక్క తడుపుటను. సమయూరరాజవాహనముగన్ = కుమారస్వామితోఁగూడ. ఆను = త్రాగునట్టి ॥ ౧౭౧ ॥ జాలపాదము = హంస. కీలితము=కూర్పఁబడినది. ముఖర = మొరయుచున్న. కంధర=మెడ. కూట = శిఖరమునందు. గర్జత్కాళికాకృతిన్=ఉఱుముచున్న నల్లమబ్బులసమూహమువిధమున. బృహదంసము=పెద్దమూఁపు. ఎఱ్ఱసంజజెడలు=ఎఱ్ఱనిసంధ్యారాగకాంతిగలజడలు. తరణిజిత్ప్రభతోన్=సూర్యునిజయించునట్టి వెలుఁగుతో ॥ ౧౭౨ ॥ నిష్పతత్=పడుచున్న. జటిల=ధారారూపమైన. మధూళి = పూఁదేనెయొక్క. ధూళి—తుంపరలవలన. భవ=పుట్టిన. ఉద్ధత=నిక్కిన. యక్షకర్దమచ్ఛటలన్=కర్పూరాదులతోఁ చేయఁబడిన కలపముల తెగలచేత. ఆఁగుచున్ = అడ్డగించుచు ॥ ౧౭౩ ॥ నేపథ్యయుతలు=వస్త్రములు మొదలగు నలంకారములతోఁగూడినవారు. నిఘ్న = స్వాధీనములైయుండెడి. నిజవాళి=తమతలలయందలి. మణిఘృణివిఘ్నలబ్ధిన్ = రత్నకాంతులవలని విఘ్నము కలుగుటచేత. అభిక=కాముకులయొక్క. తెరువులు = మార్గములు ॥ ౧౭౪ ॥ వ్యాళకరాళకుంభములు=దుష్టగజములయొక్క విశాలములయిన కుంభస్థలములను. వ్రచ్చుట=భేదించుట. నఖాగ్రధారలకున్=గోటి

సీ. కాఁబోలు నివి గణ గ్రామణికల్పితా, నల్పవిహారగే హాంగణములు
కాఁబోలు నివి చర త్ఖచరచాప స్తనీ, సమ్మర్దగళితభూ షాస్రజములు
కాఁబోలు నివి దక్ష కన్యాంఘ్రివిన్యాస, ధన్యాసకృత్కేళి మాన్యగుహలు
కాఁబోలు నివి మోద కప్రియప్రబలదం, తప్రాసనిర్భిన్న ధాతుఖనులు
తే. తెలియఁగాఁబోలు నివివహ్ని తిలకచలక, పర్దనిర్దోషసురసరి ద్బహుళలహరి
గహనకుసుమాయమానశీ కరనిపాత, శీతలక్ష్మాతలోత్థద్రు పోతకములు.
తే. రాజతాహార్యగోరాజ రాజమునకుఁ, జంద్ర శేఖరవరకకు చ్ఛారువునకు
నీమహాసింధు వుపకంఠ సీమనిగిడి,డాలు దీపించె నిదె గంగ డోలుఁబోలె.
సీ. ఈ పృథివీధరంబున ని భేంద్రకటోదితదానధారలై
ద్వీపవతీతరంగతట విస్ఫుటశైవలకందళంబులై
తాపసబాలికాశ్రవణ దత్తయవాంకురభూషణంబులై
రేపు దమంబుసేయు శబ రీకబరీ నిబిరీస నీలిమల్. ౧౭౮
క. ఇటులనుచుఁ ద్రోచిచనిముం,దటమునఁగనుఁగొని యెవేల్పు దళములుగోలు
వక్,ఘటవటుకప్రముఖమహా,జటిలులతోవచ్చు నా భు జగభుగ్వాహుఁ.
మ. కని యేకారణమేగుదెంచిరొకొ యీ కామాధరుం డీ మునుల్
కనఁ జిత్రంబగుఁ గంటి కంటి స్వకృత స్కాందోక్తియం దావహి

కొనలమొనలకు. గట్టురా...మహోగ్రసింహములు = పార్వతీదేవియొక్క విహారముకొఱకైన వాహనమగు సింహముతో విరోధింపఁదగిన భయంకరములయిన సింహములు ॥ ౧౭౫ ॥ గణగ్రామణి=గణాధిపతి. అంగణములు=ముంగిళ్లు. చర...స్రజములు = సంచరించుచున్న గంధర్వస్త్రీల రాయిడివలన రాలినఅలంకారములైనహారములు. దక్షకన్యా...గుహలు=పార్వతీదేవి అడుగులు పెట్టుటచేతకృతార్థములగుచు ఒకానొకప్పుడు క్రీడించెడిశ్లాఘ్యములయినగుహలు. మోదక...ఖనులు= వినాయకునియొక్క మిక్కిలి బలముగలదంతములనెడి యీఁటెలచేత భేదింపఁబడిన మణిసిల మొదలగువాని గనులు. వహ్నితిలక...కములు=శివునియొక్క కదలుచున్న జడముడియందలి దోషములేనిదైన గంగయొక్క మిక్కుటమైన ప్రవాహమునందలి అడవిలోని పువ్వులవలెఁ దోఁచుచున్న తుంపరలు పడుటచేత చల్లనైన నేలయందుఁబుట్టిన చిఱుచెట్లు ॥ ౧౭౬ ॥ కకుత్ = ఎద్దుమూఁపురము. సింధువు=ఏఱు. ఉపకంఠ సీమన్=సమీపప్రదేశమునందు. గంగడోలు=ఎద్దుమెడక్రింద వ్రేలాడెడుతోలు ॥ ౧౭౭ ॥ ఇభేంద్రకటోదిత దానధారలు = శ్రేష్ఠములైన యేనుఁగులయొక్క చెక్కిళ్లయందుఁబుట్టిన మదపునీటిధారలు. ద్వీపవతీ=ఏఱు. విస్ఫుట = ప్రకాశించునట్టి. శైవలకందళంబులు=పాచిమొలకలు. శ్రవణదత్త=చెవులయందుఁబెట్టఁబడిన. రేపు=రేపటివేళ. శబరీకబరీనిబిరీసనీలిమలు=బోయపడుచులకొప్పులవలని మిక్కుటమైన నల్లఁదనములు ॥ ౧౭౮ ॥ త్రోచి= ముందుమించి. ఘటవటుక=అగస్త్యుఁడు. జటిలులతోన్ = జడలుదాల్చినమునులతో ॥ ౧౭౯ ॥ కామాధరుఁడు=కుమారస్వామి. హేళిన్=ఆసక్తిచేత ॥ ౧౮౦॥ శ్రోతలు = వినువారు. వక్త=చెప్పు

ల్లిన సందేహముఁ దండ్రిచేఁ దెలియు హాళి స్వీరిఁ దోకొంచుఁ గ్రొం
చనగోద్భేదియు వచ్చె నిట్లగుటకున్ శంకింప నింకేటికిన్. ౧౮౦

క. శరవణభవయుతు లగు నీ, పరమమునులు శ్రోతలఁట య పారప్రజ్ఞా
కరుఁడు నిశాకరశిశుశేఖరుఁడు హరుఁడు వక్తయఁట యగమ్యముగలదే.

తే. అతిరహస్యంబుశుద్ధంబునాజవంజ, వార్తిహరణంబునగునెద్దియడిగెనొక్కొ
కొడుకు సర్వజ్ఞు విజ్ఞానకుశలు ధర్మ, మర్మనిర్ణయవాఙ్మయమహితుఁదండ్రి.

మ. మును పుట్టెన్ బ్రకృతిం దమంబును రజంబున్ సత్వమున్ నాఁగ నం
దు నిలింపాదులు దామసాత్మకులు మర్త్యుల్ రాజసుల్ సాత్వికుల్
దనుజద్వేషణు లందుఁ బూజ్యులు నితాంతఖ్యాతి నాజానుజుల్
ఘనుఁ డాదింద్రుఁ డుపేంద్రుఁ డీశుఁ డమరుల్ గారెవ్వరుం దత్సముల్.

ఉ. డక్కిన విష్ణుభక్తియు దృఢంపు విరక్తియుఁ గల్గు నమ్మరు
ద్భుక్కటకున్ భజించుమతి పుట్టక కంపలఁబడ్డ కాకినై
యక్కట మోసపోయితిఁగదా పెనుత్రిమ్మట నెంతవారికిన్
జిక్కనె ముఖ్యసౌఖ్యము వి శిష్టజనంబులసఖ్య మందమిన్. ౧౮౪

స్రగ్ధర. ఐనంగానిమ్ము నన్నీ యతిగురుఁడు విడం డాప్తభృత్యుండుగా స
న్మానాధీనుండుగా వైష్ణవసుఖదుఁడుగా మత్కృపాపాత్రభూతుం
డౌనంచున్ బ్రోచి గోప్యం బగునది తెలుపున్ బ్రార్థితుండై మురారి
ధ్యానానూనాశయుల్ తుల్యదృశులు దమశిష్యాలి భావింతు రెందున్.

క. కావున శరణము వేఁడెద, నావైష్ణవసార్వభౌము నడిగెద నాకున్
గావలసిన యర్థము లా, దేవుండును దెలుపు తేటతెల్లముగాఁగన్. ౧౮౬

క. అని నిశ్చలతరనిశ్చయ, ముని నారదుఁ డరిగె సురసమూహావాసం
బునకుం గైలాసమునకు, ననుబింబితశాంభవాట్టహాసంబునకున్. ౧౮౭

---

వాఁడు. అగమ్యము = తెలియరానిది ॥ ౧౮౧ ॥ ఆజవంజవార్తిహరణంబు = సంసారదుఃఖమును మాన్పునది. వాఙ్మయమహితున్ = మాటలయొక్కమహిమగలవానిని ॥ ౧౮౨ ॥ ౧౮౩ ॥ మరుద్భుక్కటకున్ = సర్పాభరణములుగల శివుని. త్రిమ్మటన్ = త్రిప్పటచేత ॥౧౮౪॥ యతిగురుఁడు = యతులకు ఆచార్యుఁడు. సన్మానాధీనుండు = సన్మానించుటకుఁదగినవాఁడు. పాత్రభూతుఁడు = పాత్రమైనవాఁడు. మురారిధ్యానానూనాశయులు = విష్ణుధ్యానమునందు తక్కువపడని మనసుగలవారు. తుల్యదృశులు = సమదృష్టిగలవారు ॥ ౧౮౫ ॥ తేటతెల్లము = మిక్కిలిస్పష్టము ॥ ౧౮౬ ॥ నిశ్చలతర = మిక్కిలిచలనములేని. అనుబింబిత = మాఱుమొరయుచున్న. శాంభవ = శివునిదైన ॥౧౮౭॥

సీ. నగధన్వివాహనంబగుగోవృషముఱంకె, లనఁబోల్చుఘంటామహాక్వణములు
హారశిరశ్శశిరేఖ యపరావతారంబు, లనఁబోల్చు సేవాగతాబ్జముఖులు
కాద్రవేయాకల్ప కంఠమూలచ్ఛాయ, లనఁబోల్చు నగరుధూపాయతంబు
లీశానభూషణాహిస్ఫటామణికాంతు, లనఁబోల్చు రత్నాదిపాంశురములు
తే. ఖండపరశుతనుప్రభాఖండదుగ్ధ, జలధిజలశీకరము లనఁ బొలుచు వేల్పు, ఁటేలి
కలుచల్లుపూవుదో యిళ్లుగలుగు, నగముమునిముఖ్యునకుఁదృగానంద మొసఁగె
సీ. ఆకొండనెత్తాన హైమసాలావళీ, వేల్లితం బగుబలు వీడు గాంచె
నావీటినడుచక్కి నభిరామశుభవిభా, ధగధగాయిత మొక్క నగరు గాంచె
నామహాప్రాసాద మల్లన్లన డాసి, వాకిట నొక కీశ వదనుఁ గాంచె
నాకపిలపనుచే ననుమతుండై చొచ్చి, చని యొక్క ముత్యాల చవిక గాంచె
తే. నందు విధుకాంతవేదికాభ్యంతరమున, ద్వీపిచర్మోపరిస్థల దీపితార్క
కోటినిభమైనయొకనిరాఘాటనిరఘు, నిరుపమప్రభ గాంచె నిర్నిమిషదృష్టి.
ఉ. కాంచి విరించినందనుఁడు కన్నులు బిమ్మిటి నొంద డింది యొ
క్కించుక కొంకుదేఱి కని యెం దదుదగ్రమహోగ్రదీప్తిలోఁ
బంచముఖుం శిఖీక్షణవిభాసిలలాటు మరుజ్ఝరీధరుం
సంచితసత్కృపారసవశంవదు నాదికపిం వృషాకపిం. ౧౮౦
చ. విడువనివైరవృత్తిఁ దటి వేచి రతీశుఁడు చేతికత్తి నె
క్కుడురభసంబునం శిరసు గ్రుద్దిన నయ్యలుఁగెల్లఁబోయి లో

నగధన్వి=కొండధనుస్సుగాఁగలవాఁడైనశివునియొక్క. మహాక్వణములు=గొప్పధ్వనులు. కాద్రవే
యాకల్ప=సర్పభూషణములుగల శివునియొక్క. స్ఫటామణి = పడగలయందలి మణులయొక్క.
దుగ్ధజలధి=పాలసముద్రమునందలి. వేల్పుటేలికలు=దేవతాప్రభువులు. దృక్ =చూపులకు ॥౧౭౮॥
నెత్తానఁ=విశాలమైన సమప్రదేశమునందు. హైమసాలావళీవేల్లితంబు = బంగారుప్రాకారముల
పఙ్క్తులచేత ప్రకాశించునది. బలువీడు=పెద్దపట్టణము. చక్కిం=స్థానమునందు. ఆమహాప్రాసా
దము=ఆగొప్పనగరు. కీశవదనుఁ=కోఁతిమొగముగలవానిని. కపిలపనుచేఁ = కోఁతిమొగము
వానిచేత. అనుమతుఁడు=అంగీకరింపఁబడినవాఁడు. విధుకాంతవేదికాభ్యంతరమునఁ = చంద్రకాం
తపురాళ్ల అరుఁగునడుమ. ద్వీపి=పెద్దపులి. నిరాఘాటనిరఘునిరుపమప్రభఁ = మేరలేనిదియు-ఈడు
లేనిదియునైన ప్రకాశమును. నిర్నిమిషదృష్టిఁ = అప్పపాటులేనిచూపుతో ॥ ౧౭౯ ॥ బిమ్మిటి=
సంకోచము. డింది = పరవశత్వమునొందినవాఁడై. కొంకు = సంకోచము. శిఖీక్షణవిభాసిలలా
టుం=నిప్పుకంటిచేత ప్రకాశించెడి నొసలుగలవానిని. మరుజ్ఝరీధరుం=దేవనదినిధరించినవానిని.
ఆదికపిం=ప్రధానచైతన్యమైనవానిని. వృషాకపిం=శివుని ॥ ౧౮౦ ॥ తటివేచి = సమయముకని
పెట్టి. రభసంబునఁ=వేగిరపాటుతో. బహిస్థతత్సరుపథార్పితసూకరదంష్ట్రి = బయటనుండెడి

నడఁగ బహిస్స్థితస్ఫురదపార్పితసూకరదంష్ట్రికై వడిన్
జడముడిఁ జంద్రరేఖ వెదచల్లఁగఁ జల్లని చిన్నివెన్నెలల్. ౧౯౧

ఉ. కుంకుమపంకశోణ యగు కొండలమండలనాథుపట్టి వా
మాంకము డాకొనన్ ఘణఘణారవభూరికపాలమాలికా
లంకృతు లోంకృతుల్ నొడువు లాగడరన్ దటవిద్రుమద్రుమ
క్రేంకృతికారిసారసపరీతసుధానిధిరీతిఁ గ్రాలుచున్. ౧౯౨

చ. ఉమ పసుపాడి మోముతడి యొత్తిన హత్తిన తన్నిశాంకదృ
క్కమలదళాంజనాంకకుల కంబుగ నిమ్మగుచేలఁ గేలివి
భ్రమరతిఁ గప్పినాఁ డనఁగఁ బచ్చని నల్లనిచారలన్ మనో
రమ మగుద్వీపిరాడజిన రత్నము యత్నముమీఱఁ దాల్చుచున్. ౧౯౩

ఉ. దండనమస్క్రియాభిరతిఁ దండములై బలభిన్ముఖామరుల్
తండు సువర్ణదండ ముఖ తాడనభిన్నకిరీటులయ్యుఁ బెన్
జండితనంబునన్ మిగుల సందడిసేయుచుఁ జొచ్చిరాఁ గృపం
బండిన నిండుఁ జూపు పయిఁ బర్వఁగ వారల గారవించుచున్. ౧౯౪

తే. చరణపీఠోపకంఠని షణ్ణవృషభ, రాజకకుదర్పితాంఘ్రిసరోజుఁ డగుచు
నిండుకొలువున్న దేవతామండలేశు,నీశు డగ్గఱి మ్రొక్కి యోగీశ్వరుండు.

క. కనదధరకాంతిపల్లవ, మును దశనద్యుతిలతాంత మునుగా వాక్పూ
జన మొనరించెఁ బురారికిఁ, దనివిసనక మౌనికులవతంసుఁడు వేడ్కన్.

---

దానిపిడి తొలియందుంచబడిన పందికోఱ. వెదచల్లఁగన్=వ్యాపింపఁజేయఁగా. (దీనికి కర్మపదము వెన్నెలలను) ॥ ౧౯౧ ॥ కుంకుమపంకశోణ = కుంకుమపువ్వుకలపముచే ఎఱ్ఱనైనది. కొండలనాథుపట్టి=పార్వతి. డాకొనన్=చేరఁగా. ఓంకృతులు=ఓంకారములు. నొడువులాగు = చెప్పునట్టి విధము. అడరన్=అతిశయింపఁగా. క్రేంకృతికారి = క్రేంకారముచేయునది—క్రేం అనిధ్వనించునది. సారసపరీత=తామరలచేతచుట్టఁబడిన. సుధానిధిరీతిన్ = చంద్రునివిధమున ॥ ౧౯౨ ॥ ఉమ=పార్వతి. పసుపాడి=పసుపుపూసికొని స్నానముచేసి. హత్తిన = అంటిన. తన్నిశాంకదృక్కమలదళాంజనాంకకులకంబుగన్=ఆపసుపుగుఱుతుతోడి తామరలవంటికన్నులయందలికాటుకగుఱుతులకు మేలిమిగా. చేలన్=వస్త్రమును. విభ్రమరతిన్ = విలాసేచ్ఛచేత. ద్వీపిరాడజినరత్నము=శ్రేష్ఠమైన పెద్దపులితోలు ॥ ౧౯౩ ॥ దండనమస్క్రియాభిరతిన్ = కఱ్ఱవలెసాగిలఁబడి మ్రొక్కుటయందలి యాసక్తిచేత. తండములై = గుంపులై. బలభిన్ముఖామరులు = ఇంద్రుఁడు మొదలగు దేవతలు. పండిన=ఫలించిన. ॥ ౧౯౪ ॥ చరణ...సరోజుఁడు=పాదపీఠమునకుసమీపమందుండెడి నందియొక్క మూఁపురమునందు ఉంచఁబడిన పాదకమలములుగలవాఁడు ॥ ౧౯౫ ॥ కనత్=ప్రకాశించుచున్న. దశనద్యుతిలతాంతము=పండ్లకాంతియనెడి పువ్వులుగలది. వాక్పూజనము=మాటలచేతఁబూజించుట ॥ ౧౯౬ ॥ కడిఁది=అసాధ్యమయిన. తమము=చీఁకటి; తమో

తే. కాళరాత్రిశుఁడగునీకుగడిదితమము,పుండరీకాభుఁడగునీకుభూరిరజము,సత్కృ
పాంభోధియగునీకుసత్త్వభృతియు,ననుగుణంబులుమూర్తిత్రయైకనిలయ!

ఉ. వేదవివాదగోష్ఠిబడి వృద్ధులబుద్ధులఁ గొల్పవచ్చు శ్రీ
గాదిలియై మెలంగఁ గల కాలము గ్రాలఁగవచ్చు నిచ్చలుం
బ్రోదిడు నవ్యభవ్యసుఖ ముల్ మఖమూల్యము లొందవచ్చుఁ గా
కేదొర కేటికిందొరకు నీవు విషాగ్నుల నానఁబెట్టుటల్. ౧౯౮

క. అని పలుకు సిద్ధసంయమిఁ, గనుఁగొని కృపమీఱ నీల కంఠుఁడు రార
మ్మని కూర్చుండుటకుం దగ,ననుజ్ఞ గావించె హాస సాంద్రాధరుఁడై. ౧౯౯

క. కలహాశనముని చెన్నగు, నలికేక్షణు సవిధవసుధ నాసీనుండై
వలిమలపురోధరిత్రిన్, మొలచిన ప్రత్యంతకుధర మునకుఁ దరంబై. ౨౦౦

చ. హరుకృప నిట్లు కన్గొని త దాననదత్తనిరీక్షణాబ్జుఁడై
సురముని పల్కె నో పురని షూదన! నీయనుజీవి నేను మీఁ
దరయక మోసపోయితి గు హాన్వితులై మును లర్థి వేఁడ సు
స్థిరమతి మీరు తత్త్వమును దెల్పెదుచో నిట నుండఁ గల్గమిన్. ౨౦౧

ఆ. సాధుజనులతోడి సంసర్గ మురివిన, హాని భయము క్లేశ మావహిల్లు
నెంతవారికైన నిది నిక్క మనుమాట, నన్ను మోచి వచ్చె నాగహార!.

తే. దండితానంగ! నీదండనుండియుండి,యిప్పుడునేఁజన్నింతలో ఋషులువచ్చి
యెద్ది ప్రార్థించిరోమీర లేవిధమున,నుత్తరం బిచ్చితిరొవారియుక్తులకును.

క. కాలీఁచవడఁ జరింపుదు, నీలోకమునందు నెల్ల నీహితబోధ
శ్రీలాభబుద్ధి నెవ్వరుఁ, బోలరు తత్త్వంబుఁ దెలుపు పోలుపున నిన్నున్.

---

గుణము. రజము=పుప్పొడి ; రజోగుణము. సత్త్వభృతి = బలమునుదాల్చుట. ; సత్త్వగుణమును దాల్చుట. అనుగుణంబులు=యుక్తములు ॥ ౧౯౭ ॥ గాదిలి=ప్రియము. ప్రోదిడు=వృద్ధిపొందించునట్టి. మఖమూల్యములు=యజ్ఞమువెలఁగాఁగలవి ॥ ౧౯౮ ॥ సిద్ధసంయమిన్=నారదుని ॥ ౧౯౯ ॥ అలికేక్షణు=శివునియొక్క. సవిధ = సమీపమునందలి. వలిమలపురోధరిత్రిన్ = మంచుకొండయొక్క ముందరిప్రదేశమునందు. ప్రత్యంతకుధరమునకున్ = దగ్గఱనుండు చిన్నకొండతోడ. తరంబై=పోల్పఁదగినదై ॥ ౨౦౦ ॥ తదాననదత్తనిరీక్షణాబ్జుఁడు = అతనిముఖమునందుంచఁబడిన చూపులనెడి కమలములుగలవాఁడు. అనుజీవిన్ = అనుసరించిబ్రదుకువాఁడను ॥ ౨౦౧ ॥ సంసర్గము=కూడిక. ఉరివినన్=విడిచినను. మోచి=వహించుకొని ॥ ౨౦౨ ॥ దండన్ = సమీపమునందు ॥ ౨౦౩ ॥ ఈఁచవడన్=నిస్సత్త్వమునుపొందఁగా. పోలుపునన్ = విధముచేత ॥ ౨౦౪ ॥

ఉ. కావునఁ గ్రౌంచభేదియు నగస్త్యుఁడు దక్షుమునుల్ త్రిలోకర
క్షావశబుద్ధి నిన్నడిగి కాంచిన యర్థము లానతిచ్చి నన్
బ్రోవఁగఁ బాడి యట్లగుటఁ బోష్యులు శిష్యులునైనవారలన్
దేవరవంటివా రలఁత దీర్చి కృపారసదృష్టిఁ దెల్పరే. ౨౦౫

క. అని పలికి యూరకుండిన, మునిముఖ్యుని వినయవాక్యముల కలరి మనం
బునఁ గృష్ణు నిలిపి పురమ, ర్దనుఁ డిట్లనుఁ దత్కథాక థనలాలసుఁడై.

చ. విను మునినాథ! నన్ ఋషులు వేఁడినయర్థము బోధతీర్థ మ
త్యనఘ మనంతపుణ్యఫల దాననిదాన మనశ్వరంబు వి
శ్వనుతము దీని పెంపు గనఁ జాలరు తక్కినవార లెవ్వరుం
దనుజరిపుప్రసాదజనితప్రతిభానిధి నేను దక్కఁగన్. ౨౦౭

సీ. తరిద్రాడుసీఁద్రంపు బొరలంటిగాలిచే, జడియుచందమున నంచలు భ్రమింప
సురలుబంతులుసాగిసుఖమిథస్స్పృహఁ ద్రాగుతీంద్రఁ దేఁటులుపూవుదేనెలాన
నా మహావిష మాను నామూర్తులన జంబుఫలములం దెల్లచిల్కలు భుజింప
నాశ్రితాభ్రములభ్రమతినిగూఁకలువెట్టుక్రియ మయూరంబులు కెరలిపలుక

తే. నబ్ధిమథియింప నొక్కట నవతరిల్లు, నాటిసిరిఁ బోల్చు చాడ్పు ననవనవర్తు
లక్ష్మిఁ దిలకింపమదికినుల్లసనమొసఁగు, మన్దిరంబునమున్నెనుమయునుగూడి.

ఉ. లాలితలీల నైందవశి లాస్థలి నాస్థ లిగుర్పఁ గ్రాలుచో
నాలలితాంగిఁ జూచి విను మద్రిజ! నా మదిఁ గూలముద్రుజం
బై లలి నిల్చె నీదగువిహారము తోరముగాఁగ వేడు మి
వ్వేళ వరంబులిత్తు నిదె వేళమ నా విని దేవి యిట్లనున్. ౨౦౯

ఉ. సేవకకల్పభూరుహము శిష్టసుధాంబుధి భక్తరోహణ
గ్రావము దేవముఖ్యుఁ డనఁ గాఁదగు వేలుపనల్పరక్తి నీ
సేవకురాలి కిట్లు దయ చేసిన యావర మిప్పుడొల్ల నేఁ
గావలెనన్న నా కొసఁగఁ గాఁదగు నాదగువిన్నపంబునన్. ౨౧౦

---

అలఁత=శ్రమము ॥ ౨౦౫ ॥ లాలసుఁడు=మిక్కిలి యాసక్తిగలవాఁడు ॥ ౨౦౬ ॥ అనశ్వరంబు= చెడనిది ॥ ౨౦౭ ॥ తరిద్రాడు=తరుచునట్టిత్రాడైన. సీఁద్రంపుఁబొరలు = పాముయొక్క కుబుసములు. జడియు=చలించు. మిథస్స్పృహన్ = అన్యోన్యము ఆసక్తిచేత. తీంద్రన్ = చొరవతో. కూఁకలు=కూఁతలు. కెరలి=విజృంభించి. మథియింపన్=తరువఁగా. ఒక్కటన్=ఒక్కసారిగా. తిలకింపన్=ప్రకాశింపఁగా. ఉల్లసనము=ఉల్లాసము ॥ ౨౦౮ ॥ ఐందవశిలాస్థలిన్=చంద్రకాంత పురాళ్లనేలలయందు. ఆస్థలు=కోరికలు. కూలముద్రుజంబు=గట్టునొరయునది—మిక్కుటమయినది. లలిన్=ఒప్పిదముగా. తోరము=అధికము, ॥ ౨౦౯ ॥ రోహణగ్రావము = రత్నపర్వతము.

క. అని పలికి కొంతకాలము, చన నే డుపవనవిహార సమయమునందుఁ
మును నాకడనున్న వరము, గొని వేఁడెఁ గుమారజనని గుణతత్త్వనిధీ!౨౧౧

సీ. కాశి గుహాటవి గయ కురుక్షేత్రంబు, సైంధవంబును నైమిశంబు పుష్క-
రంబును దండకా రణ్యంబు చంపకా, రణ్యంబు గాంచనా రణ్యకంబు
కేదారమనుమహా క్షేత్రంబుగంగ య మునసరస్వతిగూడి మొనసిమెలఁగుఁ
నెలవును మొదలుగాఁ గలక్షేత్రములు వేన వేలుర్విఁబొగడొందుఁవీనిలోనఁ

తే. గాపురముసేయగొన్నింటఁగలుగుమేలు, మహిమగొన్నిటఁజేకుఱుమైదొఱంగ,నిట్టిక్షేత్రంబులకు నెక్కు డెద్దియెద్ది,గనఁ బరంబిచ్చునేక్షేత్ర మునికినీకు?

సీ. నీరజగర్భుండు నీవునింద్రుండు భా,స్కరుఁడు చంద్రుఁడుబృహస్పతియుదక్ష
ముఖ్యప్రజేశస మూహంబు మన్వాది, చక్రవర్తులు మునుల్ సాధ్యసిద్ధ
మనుజమహోరగ దనుజసరీసృప, పశుకీటమృగపక్షి పరికరంబు
స్థావరజంగమా త్మక మగుభౌతికం, బెవ్వనిచేఁ బుట్టు నెవ్వనికృప

తే. నిలుచు నెవ్వనికినుకచే విలయమొందు,నమ్మహాశక్తిసంపన్నుఁ డమ్మహాత్ముఁ
డమ్మహానందుఁ డెచ్చోటనధివసించు,నట్టివాఁడమ్మహావిష్ణుఁ? డిందుమకుట!.

క. గంగాదితీర్థమహిమ మ, హిం గాదనుతీర్థమెద్ది? యిమ్మాడు సదా
సంగతి నెచ్చోనుండు? న, నంగాహిత! దీని నెఱిఁగి యానతియీవే.

మ. అని దాక్షాయణి వేఁడ నుత్తరము నెయ్యంబొప్ప నీనున్నయం
త నగస్త్ర్యాదులు గొల్వ వచ్చె శిఖిమీఁదం బొల్చి సేనాని యే
ననుపఁ స్కందపురాణ మమ్మునులకుఁ వ్యాఖ్యానముఁ జేయ ముఁ
చని వారల్ శ్రుతతీర్థులై యదియ కాంక్షఁ వేఁడఁ దాఁ గానమిఁ.

తే. వచ్చి శ్రీ క్షేత్ర తీర్థ దైవత చరిత్ర, మన్ముఖంబున మానిస మన్వితముగ
నెఱిఁగి వారలు దా నిప్పు డిట్లు యరిగె, నంత నీ వేగుదెంచితి వజతనూజ!.

ఉ. నా విని శంకరుం బలుకు నారదుఁ డోమదనారి! భూరికా
ర్యావహబుద్ధిఁబోలె భువ నాళిని హాళిఁ జరింతు భ్రాంతియఁ

---

అనల్పరక్తిఁ = హెచ్చైన యనురాగముతో ॥ ౨౧౦ ॥ చనఁ = కడవఁగా ॥ ౨౧౧ ॥ వేన వేలు=అనేకములు. మై=దేహము. తొఱంగఁ=విడువఁగా. పరంబు = మోక్షమును ॥ ౨౧౨ ॥ భౌతికంబు=భూతసమూహము. కినుకచేఁ=కోపముచేత. అధివసించుఁ = ఉండును ॥ ౨౧౩ ॥ సంగతిఁ=చేరికతో. అనంగాహిత=మన్మథునికిశత్రువైన శివుఁడా ॥౨౧౪॥ నెయ్యంబు=స్నేహము. శిఖి=నెమలి ॥ ౨౧౫ ॥ ౨౧౬ ॥ భువనాళిఁ=లోకపఙ్క్తియందు—అన్నిలోకములందును.

కావిరి హావిరిం దగిలి కాళుల ధావతియయ్యె క్షేత్రముల్
దేవుఁడుఁ దీర్థ మొక్కకడఁ దీవ్రతరప్రభ నిల్చె కేఁ గనన్. ౨౧౭

తే. క్షేత్రదైవతతీర్థచారిత్రమెపుడు, గరళకంధర! యొకచోటఁ గలసియునికి, యా
నతియొసంగినస్నఁ గృతార్థుఁ జేయు, మనుఁడుఁ గలహాశిఁ బలుకునమ్మనసిజారి

చ. తనమదివల్చుభామినికి దక్కిన నిక్కపు మోహిఁ బోలె నే
మనుజుఁడు బుద్ధినిల్పు మురమర్దనదివ్యకథానుభూతిపై
ననిశము మత్ప్రియుం డతఁడ యట్లగుటన్ వినిపింతు నీకు నేఁ
గని విని యున్న గోప్యము నగమ్యము నైన యథప్రపంచముల్. ౨౧౯

ఉ. ఈ సముదగ్రతత్త్వపద మేనొకరుండ నెఱుంగుదున్ సరో
జాసనుఁ డొక్కరుం డెఱుఁగు నబ్ధితనూజ యొక తైఱుంగు న
వ్వాసవుఁ డొక్కరుం డెఱుఁగు వాఙ్మనుభోగిపతార్క్ష్యులాత్మఁ బ్రా
గ్వాసనమై నెఱుంగుదురు గాని తదన్యు లెఱుంగ రెవ్వరున్. ౨౨౦

తే. దాఁపఁదగువానిమిక్కిలిదాఁపఁగలిగి, క్షేత్రములకెల్లఁబరమమైకీర్తివడయు
నిమ్మహాక్షేత్రరాజంబునెఱుఁగఁజాలు, ప్రాజ్ఞుఁడగువాఁడుమునుఁగఁడుపాపజ [లధి.

క. పుడమికి వితస్తిమాత్రపుఁ, బొడువున నాక్షేత్రరాజము విరాజిల్లున్
నడుమన జ్యోతిర్యానము, వడువునఁ దేజోమయాభివర్తితమూర్తిన్. ౨౨౨

క. ఆక్షేత్రమునకు సురసద్మ క్షితిపాతాళముల సమంబై బుధలో
కక్షేమంకర మగునది, యేక్షేత్రముగాక యుంచు నిద్ధవిభూతిన్. ౨౨౩

క. ఏవంవిధబహుమహిమై, కావాసంబైనయమ్మహాక్షేత్రమునం
దే వసియింపుదు విను వసు, దేవసుతార్చావిధేయ ధీయోగమునన్. ౨౨౪

---

హాళిన్ = ఆసక్తితో. కావిరి = నలుపు—చీఁకటి. వావిరిన్ = క్రమముతో. ధావతి = త్రిప్పట॥ ౨౧౭॥ కలహాశిన్ = నారదముని. మనసిజారి = శివుఁడు ॥ ౨౧౮ ॥ నల్చు = కోరు. మోహి = మచ్చికగలవాఁడు. అనుభూతి = అనుభవము. అనిశము = ఎల్లప్పుడు. అగమ్యము = దుర్లభము. అథప్రపంచముల్ = కడచినసమాచారమును॥ ౨౧౯ ॥ అబ్ధితనూజ = లక్ష్మీదేవి. వాఙ్మనుభోగిపతార్క్ష్యులు = సరస్వతి మనువు ఆదిశేషుఁడు గరుత్మంతుఁడు. ప్రాగ్వాసనమైన్ = పూర్వవాసనచేత ॥ ౨౨౦ ॥ పరమమై = శ్రేష్ఠమై ॥ ౨౨౧ ॥ వితస్తిమాత్రపుఁ బొడువునన్ = జేనెడుకొలఁది పొడుగున. విరాజిల్లున్ = ప్రకాశించును. జ్యోతిర్యానము = వెలుఁగయినవాహనము. వడువునన్ = విధమున ॥ ౨౨౨ ॥ సురసద్మ = స్వర్గము. బుధలోక క్షేమంకరము = పండిత సమూహమునకు మేలుచేయునది. ఇద్ధ = ప్రసిద్ధమైన ॥౨౨౩॥ ఏకావాసము = ముఖ్యమైన ఉనికిపట్టు. ధీయోగమునన్ = బుద్ధితోడి కూడికతో ॥౨౨౪॥ సహ్యా...దన్వయమునకున్ = సహ్యపర్వతము వెంబడి చిన్న కొండలయందుఁబుట్టిన నదుల

సీ. సహ్యాపాదోద్భూత సరిదన్వయమునకు, నేను ధాతయును లక్ష్మీశ్వరుండు
నభిమానులము గాన నందుఁ గృష్ణుఁడు కృష్ణ, బ్రహ్మ గౌతమి నేను భైమిఁ గాంచి
యధివసింతుము దండకాటవి మొదలు పంపతుద గాఁగల క్షేత్ర పటలమెల్ల
నజునకు హరికి నా కాయత్తమై హత్తుఁ, భైమి విష్ణుక్షేత్ర భూమిఁ బఱచి

తే. వైష్ణవియనంగఁ దగు నందువలన నాదు, క్షేత్రమున నిల్చై వినాధాత్రి వేఁయు
దామరససంభవక్షేత్రతలము నంటి, బ్రాహ్మియై యొప్పు నిప్పాట బ్రహ్మపుత్ర!

తే. పుణ్యగుణగణ్య పాతకారణ్యహేతి, బహుళపుణ్యద్విజవ్రజ పిహితకూల
దీపితాకృతి బుధబోధదీపకళిక, యఖిలలోకవిపచ్ఛాంతి యా స్రవంతి.

తే. నడచి భగవంతు క్షేత్రంబునడుమఁ జొచ్చి, విరజయను సిద్ధి వెచ్చోట విడిసియుం
డు, నృహరి ప్రత్యక్షమై యుండు నెట్టిచోట, నట్టిచోటను వైష్ణవియనఁగ బరఁగు.

తే. కృష్ణవేణి ప్రకాశించు నెంతమేర, నంతమేర మదీయమై యతిశయిల్లు, భైమి
యటమున్న జలజసంభవుని యదియ, కానమూర్తిత్రితయమయాకారయయ్యె

సీ. చలిదిచిక్కపుజిల్గుసాలు ముల్కాసుపై, నొయ్యారముగ పింఛ మొయ్యఁ జెరివి
భాస్కరాంశులు దూఱి పాఱు ప్రేల్వీనుల, వెలలేని మకరకుండలములు నించి
మోచేతి వంపుగా ముడిచిపట్టిన కేల, వరదాభయంబు లావటము చేసి
పొర లేని యరఁటుల నిరసించు మృదులోరు, యమళ మధ్యమున గోయష్టి నిలిపి

తే. నిగమనూపురములు మ్రోయ నిరుకుళముగ, సిగ్గువాసిన కటి ప్రకాశింప నురము
కెంపు లేయెండ గ్రక్కఁ జెక్కిళ్ల నగవు, మొలవ నత్తీర్థమున నిల్చి పొల్చుఁ జక్రి.

తే. తీర్థహారంబునకు వాసుదేవమూర్తి, నీలతరళాకృతిస్ఫూర్తి నెలవుకొనఁగ
నత్తొడవునకు సంగమాఖ్యాకతీర్థ, తలము దళుకొత్తు హత్తినకొలికిఁ బోలె.

---

సముదాయమునకు. ఆయత్తమై=అధీనమై. హత్తుఁన్=చేరును. పఱచి=ప్రవహించి ॥ ౨౨౫ ॥ పుణ్యగుణగణ్య=మంచిగుణములచేత ఎన్నఁదగినది. పాతకారణ్యహేతి=పాపములనెడి అడవికి కొఱవి. పిహితకూల=కప్పఁబడిన తీరములచేత. బుధబోధదీపకళిక=పండితుల తెలివికి దీపజ్వాల. లోక = జనులయొక్క. స్రవంతి=ఏఱు ॥ ౨౨౬ ॥ విడిసి=ప్రవహించి ॥ ౨౨౭ ॥ కృష్ణవేణి=నల్లని నీటిపాయ ॥ ౨౨౮ ॥ ముల్కాసు=అల్లిక. ఒయ్యన్=తిన్నఁగా. చెరివి=చెక్కి. అంశులు=కిరణములు. ప్రేలు=ప్రేలాడు. వరదాభయంబులు=వరమిచ్చుటవలని భయములేములు. ఆవటము చేసి = పొందుపఱిచి. నిరసించు=తిరస్కరించు. మృదుల=మిక్కిలి మెత్తనైన. ఊరుయమళ = తొడలజంటయొక్క. గోయష్టి=ఆవులను తోలెడికఱ్ఱ. నిరుకుళముగన్=అడ్డములేక. లేయెండ = ప్రాతఃకాలమునందలి యెండ. పొల్చున్=ఉండును ॥ ౨౨౯ ॥ తరళ=నాయకమణియొక్క. స్ఫూర్తి=ప్రకాశము. అత్తొడవునకున్=ఆయాభరణమునకు. తళుకొత్తున్ = ప్రకాశించును ॥ ౨౩౦ ॥ ఖరనఖరాగ్ర నిర్గళిత

చ. ఖరనఖరాగ్రనిర్దళిత కర్బురరాజభుజాంతరుండు శ్రీ
నరహరి యుండు సంగమము నం జలమాడి నృసింహు నంఘ్రిపం
కిరుహయుగంబు గాంచి తన కల్గినమాత్రము దానమిచ్చు నే
నరుఁ డొకపూఁట వాఁడును గ నంగలఁ డాదిమవిష్ణుధిష్ణ్యముల్. ౨౩౧

క. కలుషవనప్లోషదవా, నలకీలావలయ మైన నరహరిక్షేత్ర
స్థలపుణ్యమహిమ లెన్నినఁ, గలుగుల్ సుక్షేత్రముఖ్యగమనఫలంబుల్.

తే. అపునరావృత్తిశాశ్వతవిపులసౌఖ్య, సిద్ధి ప్రహ్లాదునికి దయచేసినట్టి [గాంచు
యానృహర్యక్షవిభుక్షేత్రమధిగమించు,జనుఁడుపాపంబువలన మోచనము

శా. ఆక్షేత్రస్థలి క్రోశపంచకమితం బై యుండుఁ దత్రత్యులన్
వీక్షించుం దివినుండి వేల్పుగమి ది గ్వేదండతుండాకృతా
రక్షుద్రేతరదోశ్చతుష్టయులఁగా రాజీవరాజీవస
చ్ఛక్షూరమ్యులఁగా హిరణ్మయపటీ సక్తోరులంగా మహిన్. ౨౩౪

ఉ. వంచన యింత లేక బహు వారము లెంతయుఁ గ్రూరచిత్తుఁడై
పంచజనుండు పంచవిధ పాతకముల్ మును చేసె నేనియున్
బంచత శ్రీనృసింహు కుడి భాగమునం గనుఁ బుణ్యు డొక్కఁడున్
గాంచినఁ జాలు విష్ణుపద గామి యగున్ గులకోటితోడుతన్. ౨౩౫

ఉ. దేవుని వామభాగమున దేహము నూడ్చిన సార్వభౌముఁ డా
దేవుని వెన్క మేల్కనిన త్రేనుపుగై కొని నాకవాసి యా
దేవుని మ్రోల దక్షిణపు దిక్కున నీల్గినయేని ముక్తుఁ డౌఁ
గావున మానవుం డెపుడు గాపుర మాయెడఁ జేయఁగాఁ దగున్. ౨౩౬

---

కర్బురరాజభుజాంతరుండు=తీక్ష్ణములైన గోళ్లయొక్క కొనలచేత భేదింపఁబడిన రాక్షసరాజైన హిరణ్యకశిపునిదైన ఱొమ్ముగలవాఁడు. జలమాడి=స్నానముచేసి. ధిష్ణ్యముల్=స్థానములు॥౨౩౧॥ కలుషవనప్లోషదవానలకీలావలయము=పాపములనెడి అడవిని కాల్చునట్టి కార్చిచ్చుమంటల ఆవరణముగలది ॥ ౨౩౨ ॥ అధిగమించు=పొందునట్టి. మోచనము=విడుపు ॥ ౨౩౩ ॥ క్రోశపంచక = అయిదుకోసులు. తత్రత్యులన్=అచ్చటివారిని. దిగ్వేదండతుండా కృతారక్షుద్రేతర దోశ్చతుష్టయులఁగాన్=దిగ్గజముల తొండములకుఁ గలుగఁజేయఁబడిన వడిగల విశాలములయిన నాలుగుచేతులు గలవారినిగాను. రాజీవరాజీవస చ్ఛక్షూరమ్యులఁగాన్=తామరలపఙ్క్తికి ఉనికిపట్టులగు కన్నుల చేత అందగించువారిని. హిరణ్మయపటీసక్తోరులన్ = బంగారు పట్టు వస్త్రముతోఁగూడికొనిన తొడలుగల వారినిగాను ॥౨౩౪ ॥ బహువారములు=పలుతడవలు. పంచజనుండు=మనుష్యుఁడు. పంచతన్=చావును. ఒకఁడున్=ఒక్కఁడే ॥ ౨౩౫ । ఊడ్చినన్=విడిచినను. సార్వభౌముఁడు = చక్రవర్తి. మేల్కనినత్రేనుపు = మేలుపొందుటవలనిత్రేఁపు=చావు. నీల్గినయేనిన్ = చచ్చినపక్ష

క. యతిపతి! యేతత్క్షేత్రో, ర్జితచరితం బ్రకటనంబు చేయఁగఁ దగున
య్యితిహాస మొకటిగల దది, శ్రుతిపేయముచేయుమనుచు రుద్రుఁడుపల్కెన్.

శా. అంభోరాశిగభీర భీరహితచిత్తా౽౽భోగభోగావళీ
సంభారామరరాజ రాజకృతపూజాయోగ్య యోగ్యర్థిమి
త్రాంభోజాహిమధామ ధామహితనిత్యావాసలక్ష్మీసము
జ్జృంభాలంకృతవక్త్ర వక్త్రభిముఖ శ్రీమద్గుణప్రాభవా! ౨౩౮

క. శరమఠనవంశవర్ధన, కఠినకుఠారాగ్రదళిత గర్వితవిద్వి
డ్జఠరమునితుల్యవితరణ, పఠనకళాభ్యాసవిభవ పారీణమతీ! ౨౩౯

మాలినీ. కవిశుకసహకారా కల్పవృక్షావతారా
సవినయనిజమూర్తీ సర్వదిగ్గ్రాహికీర్తీ
భువనహితచరిత్రా పుణ్యదాక్షిణ్యమిత్రా
నవరసికవతంసా నవ్యసూక్తిప్రశంసా! ౨౪౦

గద్యము. ఇది శ్రీ పరమపదనాథ నిరవధికకృపాపరిపాక పరిచిత సరస కవితా
సనాథ రామకృష్ణ కవినాథప్రణీతంబైన పాండురంగమాహాత్మ్యం బను
పరమభాగవత చరిత్రంబునందు ద్వితీయాశ్వాసము.

---

మున. ముక్తుఁడు=మోక్షమును పొందినవాఁడు ॥ ౨౩౬ ॥ ఏతత్క్షేత్రోర్జితచరితక్ = ఈక్షేత్రము యొక్క శ్లాఘ్యమైనచరిత్రమును. ప్రకటనంబు=ప్రసిద్ధము. ఇతిహాసము=పూర్వకథ. శ్రుతిపేయముచేయుము=వినుము ॥౨౩౭॥ భీరహితచిత్తా=భయములేని మనసుగలవాఁడా. ఆభోగ...రాజ=విశేషములైన భోగములను అనుభవించుటయందు ఇంద్రుఁడా. యోగ్యర్థిమిత్రాంభోజాహిమధామ=యోగులు యాచకులు స్నేహితులు ననెడితామరలకు సూర్యుఁడా. ధామహితనిత్యావాసలక్ష్మీసముజ్జృంభాలంకృతవక్త్ర=ఇంటికి మేలై యెల్లప్పుడు వసించునట్టిలక్ష్మియొక్క విజృంభణముచేత అలంకరింపఁబడిన ముఖముగలవాఁడా. శ్రీమద్గుణప్రాభవా=సంపద్గుణములతోడి ప్రభుత్వముగలవాఁడా ॥ ౨౩౮ ॥ కఠినకుఠారాగ్రదళిత గర్వితవిద్విడ్జఠరమునితుల్యవితరణ = కఠోరమయిన గండ్రగొడ్డలిమొనచేత భేదింపఁబడిన గర్వించినశత్రువుల కడుపులుగల మునియైనపరశురామునితోఁబోల్పఁదగిన దాతృత్వముగలవాఁడా. పఠనకళాభ్యాస విభవపారీణమతీ=చదువుటవలని శాస్త్రాభ్యాససంపత్తిచేత పారమునుపొందిన బుద్ధిగలవాఁడా ॥ ౨౩౯ ॥ కవిశుకసహకారా = కవులనెడి చిలుకలకు తియ్యమామిడియైనవాఁడా. సర్వదిగ్గ్రాహికీర్తీ = ఎల్లదిక్కులనుగ్రహించునట్టి కీర్తిగలవాఁడా. పుణ్యదాక్షిణ్యమిత్రా = ధర్మము మోమోటముననెడి మిత్రులుగలవాఁడా. నవరసికవతంసా=తొమ్మిదిరసములు తెలిసినవారిలో శ్రేష్ఠుఁడా – లేక–నవీనులైన రసికులలో శ్రేష్ఠుఁడా. నవ్యసూక్తిప్రశంసా=శ్లాఘ్యములైన మంచిమాటల పొగడ్తగలవాఁడా ॥ ౨౪౦ ॥

శ్రీపాండురంగవిట్ఠలస్వామినే నమః.

# పాండురంగమాహాత్మ్యము.



## తృతీయాశ్వాసము.

క. శ్రీరమ్యాచరణతల లా, క్షారసరాగాభిరమ్య శంకావహదృ
గ్ధార సమారాధితరఘు, వీరా రామానుజయ్య వేదాద్రీశా! ౧

వ. ఆకర్ణింపు మా యర్ణవతూణీరుండు వీణామునిం గనుంగొని యిట్లనియె. ౨

ఉ. ప్రాసంగువిత్తువంటి నెఱ పాఱు కొలంబునఁ బుట్టి వేదముల్
చోసినగాఁడె శాస్త్రములు పుట్టినయిల్లు కళాకలాపముల్
డాసిన రచ్చ యంచు నఖిలంబు దనుం గొనియాడ నొప్పు ను
ద్భాసితభాసితద్యుతి సభాపతి నా నొకఁ డాహితాగ్నియై. ౩

వ. అతండు కళింగదేశాభరణం బగు పీఠికాపురం బధిష్ఠించి సకలమహీసుపర్వ
శ్రేష్ఠుండై వెలయు నంత. ౪

తే. ఆమహీసురు లేమకు నతులనిష్ఠ
నింగివేల్పుల నేలకు నేలవేల్పు
కొలము నింగికిఁ దెచ్చుచుఁ గొలువఁ బుత్రుఁ
డొకఁ డుదయించెఁ దత్కృపా భ్యుదయమహిమ. ౫

### నిగమశర్మోపాఖ్యానము.

మ. వనితామానససూనసాయకుఁడు జీవత్తాతపాదుండు భూ
జనసన్మాన్యవిశుద్ధవర్తనుఁ డుదంచత్త్యాగశీలుండు చం

---

లాక్షారస=లత్తుకవలని. రాగ=ఎఱ్ఱఁదనముచేత. దృగ్ధార = కంటిగెలుగలవాఁడా ॥ ౧ ॥ అర్ణవతూణీరుఁడు=సముద్రములు అమ్ముల పొదులుగాఁగలవాఁడు. వీణామునిన్=నారదుని ॥ ౨ ॥ ప్రాసంగువిత్తు=రాజనపువరి విత్తనము. నెఱపాఱుకులంబునన్ = ఉత్తమబ్రాహ్మణ వంశమునందు. కలాపములు=సమూహములు. డాసిన=సమీపించిన. రచ్చ=సభ. ఉద్భాసిత=మీఁదికి వెలిగింపఁబడిన. భా=వెలుఁగుచేత. సితద్యుతి = చంద్రుఁడు. ఆహితాగ్ని = ఎల్లప్పుడు అగ్నిహోత్రములు చేయువాఁడు ॥౩॥ పీఠికాపురంబున్=పిఠాపురమును. అధిష్ఠించి=ఉనికిచేసికొని. మహీసుపర్వ = బ్రాహ్మణులలో ॥ ౪ ॥ లేమకున్=భార్యకు. నింగివేల్పులన్ = ఆకాశమునందలి దేవతలను. నేలవేల్పు కొలమున్=బ్రాహ్మణ సమూహమును ॥ ౫ ॥ సూనసాయకుఁడు=మన్మథుఁడు. జీవత్తాతపాదుండు=బ్రతికియున్న తండ్రిగలవాఁడు. లేఁగొనబుంబ్రాయపుఁదేజముకూన=లేఁతదియుమనోజ్ఞము

ద్రునిపెన్నుద్ది సమగ్రకాంతిమహిమన్ నూనూఁగుమీసాలలే
గొనబుం బ్రాయపుఁ దేజుకూన యతఁ డుత్కోచుండు వాచాలతన్. ౬

వ. అజ్జగతీసుపర్వసంభవునకుఁ బిత్రుదత్తం బగు నిగమశర్మాభిధానంబు ప్రసిద్ధంబై యుండు వెండియు. ౭

తే. అతఁడనూచానసంతతి నవతరిలియు, సకలనిగమశిఖారహస్యములుగనియు
మనసుఁ దార్తీయపురుషార్థమునకె తార్చె, దైవఘటనావశంబుననో వశీంద్ర!.

చ. తలగడు గంగమర్దనము ధౌతపటావరణంబు సంస్కృతో
జ్జ్వలకలమాన్నభోజనము చందనచర్చ ప్రసూనదామకం
బును కపురంపువీడ్యమును భూషణపఙ్క్తులుకల్గి నిచ్చలున్
బులుకడుగంగఁబడ్డ నును ముత్యముఁ బోలుచు వాలుచుం బురిన్. ౯

సీ. కలదు లేదనువాద ములకోర్చిమీనుమీ సమువంటి యొంటిజందెము మెఱవఁగ
బహుసంకుమదపంక పాణింధమంబైన, తాళిగోణపుఁజుంగు నేలజీరఁ
గడలేని వీడ్యంపుఁ గప్పుచందురకావి, మోవిపల్లొత్తుల ముసుఁగుదన్న
సానతాఁకులుగల్గు సూనాస్త్రశంఖంబు, గతి నఖరేఖాంక గళము దనర

తే. సఖులుపరిహాసకులు వెంటఁజనగ యువతి, భుక్తనిర్ముక్తపరిధానయుక్తుఁడగుచు
నగర ఘంటాపథంబున నగుచుఁ దిరుగు, నొఱపుగలశీవి జాతిమాత్రోపజీవి.

గీ. భార్యపాలిండ్లురిక్తకుంభములు రోయి, వెలదిచనుదోయి నిండుకుండలు కులంబు
తరుణిఫాలంబు చవితిచందురుఁడు వేశ్య, నుదురు వానికిఁ బ్రతిపదిందుండు నయ్యొ.

---

నైన యౌవనపు తేజస్సుగలబిడ్డ. ఉత్కోచుండు=అధికుఁడు. ॥ ౬ ॥ ౭ ॥ అనూచాన=అంగముల తోడ వేదాధ్యయనముచేసిన బ్రాహ్మణునియొక్క. అవతరిలి=పుట్టి. నిగమశిఖారహస్యములు= వేదాంతరహస్యములను. తార్తీయపురుషార్థమునకె = మూడవ పురుషార్థమయిన కామమునకె. తార్చెన్=చేర్చెను ॥౮॥ తలగడుగు=తలకునూనెయంటి స్నానముచేయుట. ధౌతపటావరణంబు = మడుఁగువస్త్రము కట్టుకొనుట. సంస్కృతోజ్జ్వలకలమాన్న=పక్వముచేయుటచే ప్రకాశించునట్టి వరియన్నము. ప్రసూనదామకంబులు=పూవుదండలు. నిచ్చలున్=ఎల్లప్పుడును. పులు=(ముత్యముల) ముఱికి. వాలుచున్ = మీఱుచు_అతిశయించుచు ॥ ౯ ॥ సంకుమద = జవ్వాజిచేనైన. పాణింధమంబు=కొలిమితిత్తియైనది_వ్యాపింపఁజేయునది. తాళిగోణము=మూలగోఁచి. చందురకావిమోవి= సిందూరవర్ణముగల పెదవి. పల్లొత్తులన్=దంతక్షతములచే. ముసుఁగుదన్నన్ = మఱుఁగుపడఁగా. నఖరేఖాంకగళము=గోటినొక్కుల గుఱుతులుగల మెడ. యువతిభుక్తనిర్ముక్తపరిధానయుక్తుఁడు= యౌవనస్త్రీలు అనుభవించివిడిచిన కట్టువస్త్రముతోఁగూడినవాఁడు. ఒఱపు=చక్కఁదనము_అందము. శీవిన్=వైభవముతో ॥ ౧౦ ॥ రోయి వెలఁది=బోగముది. కులంబుతరుణి=పెండ్లాము ॥౧౧॥

సీ. ఉపాసనహోమాగ్ని యూఁదనొల్లఁడుగాని, విరహజ్వరార్తుఁడై వెచ్చనూర్చు
సంధ్యకుఁ బ్రార్థనాంజలి ఘటింపఁడుగాని, యెరఁగు నీర్ష్యాకషాయితల కర్థి
నాగమవాదంబు లౌఁగాదనఁడుగాని, విటవాదములు తీర్చు వేగి లేచి
కంబుభృత్పాదోద కంబు గ్రోలఁడుగాని, యౌవతాధరసీధు వాని చొక్కుఁ
తే. బుణ్యచిహ్నంబులపఘనంబున ఘటింప, సిగ్గుపడుఁగాని కరనఖ శిఖరలిఖిత
జాతనూత్నక్షతాంకముల్ సమ్మతించు, నారజముమీరి యాదుర్వ్యహారహారి.
తే. నిగమశర్మాభిధానంబు నేతిబీర, కాయయునుబోలె నయథార్థ గాథఁ దాల్ప
వైదికాచారదూరప్రవర్తనముల, వీట విహరించుచుండు నవ్వీటిప్రోగు. ౧౩
క. వెడవెడ దుర్వ్యవహారపు, నడవడి గడిదేఱ గురుజనముశిక్షింపన్
గడుసువడి విప్రతనయుఁడు, సడికోరిచి వంకపరక చాటున్ మానెన్. ౧౪
తే. తాత ముత్తాతతండ్రులుతరతరంబు, చీమవలెఁ గూడఁబెట్టి యూర్జితము సేయు
విత్తముడివోయెఁ దత్కరాయత్తమగుచు, నురగదష్టునిమేనినెత్తురునుబోలె.
సీ. దినవెచ్చమునకునై తనమేనఁగలసొమ్ము, కొదుకక బచ్చింటఁ గుదువవైచు
నిందుగీసినరీతి నించుకించుక చేరి, గిలుబాడుఁ దల్లిపైఁ గల పసిండి
తండ్రికి నిడ్డ పత్రములు దొంగిలిపోయి, పోయినంతకునిచ్చి పొరయు *విత్త
మిడ్డవడ్డికి నోర్చి మృత్యురూపములైన, సాహులచే ఋణగ్రాహియగుచు

---

ఘటింపఁడు=చేర్పఁడు. ఎరఁగున్=నమస్కరించును. ఈర్ష్యాకషాయితలకున్=ఇతరసాంగత్యమును ఓర్వలేక కన్ను లెఱ్ఱచేసికొన్న స్త్రీలకు. అర్థిన్=ప్రీతితో. ఆగమవాదంబులు=వేదవాదములు. వేగి=తెల్లవాఱి. కంబుభృత్=శంఖమునుబూనిన విష్ణుదేవుని. యౌవతాధరసీధువు=యౌవన స్త్రీసమూహముయొక్క మోవితేనెను. అని=త్రాగి. అపఘనంబునన్ = దేహమునందు. కర...క్షతాంకములు=చేతిగోటివాఁడిమొనలు గ్రుచ్చుటవలనఁగలిగిన క్రొత్తగాయపు గుఱుతులను. ఆరజము = ఇంపు. దుర్వ్యహారహారి=చెడ్డనడతలు గలవారిలో అందగించువాఁడు ॥ ౧౨ ॥ అయథార్థగాథన్= అబద్ధపుకథను. వీటిప్రోగు=కొల్లలరాశి_దుర్వ్యయము మిక్కిలిచేయువాఁడు ॥ ౧౩ ॥ వెడవెడ = కొంచెము కొంచెము. గురుజనము=తండ్రిమొదలగు పెద్దవారు. గడుసువడి = అసాధ్యుఁడై. సడికిన్=నిందకు. వంకపరక=వంకరపుల్ల ॥ ౧౪ ॥ ఊర్జితము=దృఢము—నానాట స్థిరపడినది. ఉడివోయెన్=ఉడిగిపోయెను_నశించెను. తత్కరాయత్తము=వానిచేతచిక్కినది. దష్టుని=కఱవఁబడినవాని ॥ ౧౫ ॥ కొదుకక=సంకోచపడక. ఇందుగీసినరీతిన్ = చిల్లగింజ రాచినవిధమున. గిలుబాడున్=అపహరించును, పోయినంతకున్=ఎంతధనమునకు పుచ్చుకొందురో అంతధనమునకు. పొరయున్=పొందును. ఇడ్డవడ్డికిన్ = ఎంతయెచ్చువడ్డి యేర్పఱిచినను అంతవడ్డికిని. సాహులచేన్ = సాహుకారులచేత. ఋణగ్రాహి = అప్పుతీసికొన్నవాఁడు. గుడ్డవృత్తులు = చేనిసేద్యపుఁబనులు.

---

* గొంత, మిండవడ్డికి నని పాఠాంతరము. మిండ=అధికము.

తే. గుడ్డవృత్తులు వృత్తులు గొలుచు గుత్త,చేలు గ్రామాంశములు నాధినేల లెల్లఁ
జనవరుల కమ్మఁజూపు నిచ్ఛావిహార,వర్తివాఁడేమిగానున్న వాఁడొకోఁడ.

క. అతఁడు కళింగోద్భవుఁడగు,కతమున నో స్రేలఁజూపఁ గసుగందక యో
గ్యతమస్వీకారమునకు, నితరుండై యుండె మునికులేశ్వర! వింటే. ౧౭

తే. పొందుఁబట్టుల నప్పులు పొడిచిపొడిచి, దొరతనంబునఁ జుట్టాలఁ దిరిసితిరిసి
నలఁగిశిశ్నోదరపరాయణత్వమునకుఁ, బార మెఱుగక తిరుగు నా బ్రాహ్మణుండు.

చ. తనచెలులిండ్లయం దదవ ద్రావుడు త్రావుచు నింటి కెన్నఁడుఁ
జనక దురోదరార్జితము చౌర్యహృతం బనృతోపపన్నముఁ
జెనఁటి పిసాళి వెచ్చములఁ జేయుచుఁ దొల్లిటివైభవంబు లె
ల్ల నడఁగ నవ్వెడంగు కడు లాఘవవృత్తికిఁ జొచ్చె నిచ్చలుఁ. ౧౯

క. మితిగడచిన ఋణదాతలు, వెతవెట్టఁగ నూరుచొరక వెలివెలిఁ దిరుగుఁ
దతిగూడు లేక యాఁకటఁ, గుతిలపడు నతండు గువ్వ గుత్తుకతోడఁ. ౨౦

క. వలువకుఁ గూటికినై నీ, చులవేడం బోడచొరవఁ జొచ్చు నతఁడు పూ
వులు ముడిచిన యంగళ్లనె, కలకల పీఁ డెల్ల నవ్వఁ గట్టెలు మోసెఁ. ౨౧

తే. పదనుదివిసిన కస్తూరి ప్రాఁచియలరు, పాయఁ బాఱినకూడు నీర్వట్టుమడుఁగు
గళితమణియగు సొమ్మునై కానఁబడియె,దుర్విదగ్ధుండు గొరవదూరుఁడగుచు.

క. ఆలో నొకనాఁ డాదు, శ్శీలరతుని యక్క యొత్తు శిక్షించెద నీ
బాలిశు నని తనమగనిఁ, బాలురఁగొని వచ్చె మాతృ భవనంబునకుఁ.

---

వృత్తులు=మాన్యపుఁ జేలు. కొలుచు=ధాన్యము. గుత్తచేలు=ఒకరివద్ద ధాన్యపు గుత్తకు తీసికొన్న చేలు. చనవరులకుఁ=అధికారులకు ॥ ౧౬ ॥ కళింగోద్భవుఁడు=కళింగదేశమునందుఁ బుట్టినవాఁడు. వ్రేలఁజూపఁ=చూచినవారెల్లను వీఁడిట్టివాఁడని వ్రేలితో నితరులకుఁ జూపుచుండఁగా. కసుగందక=కొంచెమయినను జంకక. యోగ్యతమస్వీకారమునకుఁ=మిక్కుటమయిన యోగ్యులయొక్క అంగీకారమునకు. ఇతరుఁడు = అన్యుఁడు_సరిపడనివాఁడు ॥ ౧౭ ॥ పొందుఁబట్టులఁ = సరిపడిన తావులందు. పొడిచి=తీసి. తిరిసి=యాచించి_అడిగి. పారము=దరి ॥ ౧౮ ॥ చెలులిండ్లయందుఁ= స్నేహితుల యిండ్లయందు. అదవద్రావుడు=స్థిరము లేని త్రాగుట. దురోదరార్జితము = జూదమున సంపాదింపఁబడినది. అనృతోపపన్నము=బొంకుచేతలభించినది. చెనఁటి=వ్యర్థము. పిసాళి =దొంగ యొత్తుఁగలది. వెడంగు=అవివేకి. లాఘవవృత్తికిఁ = తక్కువ వ్యాపారమునకు ॥ ౧౯ ॥ మితి = గడువు. వెత=వ్యథ = శ్రమము. తతిఁ = సమయమునందు. కుతిలపడుఁ = బాధపడును. గువ్వగుత్తుకతోడఁ_హీనస్వరముతో ॥ ౨౦ ॥ బోడచొరవఁ=సన్యాసి చొచ్చునట్టిచొరవతో ॥ ౨౧ ॥ పదను=తడి. తివిసిన=తీసిన_పోయిన. ప్రాఁచి = ప్రాఁతదైన. నీర్వట్టు = నీరు ఇంకినట్టి. గళిత=జాఱిన. దుర్విదగ్ధుఁడు=దుర్వ్యాపారములందు చొరవగలవాఁడు ॥ ౨౨ ॥ బాలిశుఁ =

వ. ఇట్లు పంచయోజనమాత్రదూరం బగు తనయూరనుండి వచ్చి పితృభవనం
బు చొచ్చి యచ్చటం గొన్నిప్రొద్దులు గడపి కొడుకుచెడునడవడికి నడలు
కడలిం బడి సుడివడియెడు తల్లిదండ్రులం దీండ్రగలవచనరచనాచమత్కారం
బుల నుదార ముదారోపణకరణోపచారంబులం గొంతకొంత వంతకుం
దొలంగించుచు మందిరముకుందారాధ నాతిథిసంతర్పణంబులు నేర్పునం
బచరింపించుచు జనయిత్రీదర్శితం బగుమూలవిత్తంబు నష్టావశిష్టం బగునది
గుప్తంబు సేయుచుం బశుశిశుదాస దాసీజనంబులం దనవారింగా మెలం
గించి నలంకువలకుం దొలంగించుచుఁ బుస్తకభాండాగారంబు నిజభర్త్రృ
హస్తాంతరంబున నాశుశుక్షణి శిథిలబంధన యాచకప్రముఖోపద్రవంబుల
వలనం బాంచి ప్రోచుచు విగళితసన్నాహం బగు గేహంబు యథాపూర్వనిర్వ
హణమనోహరంబుగా ననుసంధింపించి చదువుసంత సాగించి నడపించుచు
నిజానుజు దుర్వ్యసనంబువలన గానిం బొందని రాజానుగ్రహలబ్ధంబు లగు
నేకభోగగ్రామంబు లాత్మాధీనంబులుగా నొనరించుచుఁ దప్పిదారిన మడి
మట్ర చేను చెట్లున్నపట్లరసి తనపట్టులం గాపువెట్టుచు గుట్టీక నలంగియు
నత్తమామలచిత్తంబువచ్చునట్లు భక్తిశక్తులుమెఱసి పాటులంబడు మఱం
దలిసౌందర్యంబు ననివార్యజృంభణం బగు యౌవనారంభంబును వనచంద్రి
కావైభవంబును వనకేళిపలాశదోహదంబు నగుటకు వగచి తెగచి
కడుపుచుమ్మలుచుట్టి కన్నీరుట్టిపడం బొట్టుపొరలగుచుండు నంతం జుక్క-

మూర్ఛను. ॥౭౩॥ ప్రొద్దులు=దినములు. అడలు కడలిన్=దుఃఖసముద్రమునందు. సుడివడియెడు=కలతపడునట్టి. దీండ్ర=చొరవ. ఉదారముదారోపణకరణోపచారంబులన్=మిక్కిలి సంతోషమును హెచ్చించునట్లు చేసెడి యుపచారములచేతను. వంతకున్ దుఃఖమునకు. ముకుందారాధన=విష్ణుపూజ. పచరింపించుచున్ = చేయించుచు. జనయిత్రీదర్శితంబు = తల్లిచేత చూపఁబడినది. నలంకువలకున్=కష్టములకు. భాండాగారంబు=బొక్కసము. ఆశుశుక్షణి=నిప్పు. పాంచి=తొలంగించి. విగళిత సన్నాహంబు=తొలఁగిన ప్రయత్నముగలది - చక్కఁబఱుపఁబడనిది. అనుసంధింపించి=జతపఱచునట్లుచేసి. దుర్వ్యసనంబు వలనన్=దుష్టవిషయమునందలి యపేక్షవలన. ఆత్మాధీనంబులు = తనకు అధీనమైనవి. తప్పిదారిన=పొరపాటుచే తప్పిపోయిన. మట్ర=మళ్లలో చీలికగా నేర్పడిన పాది. పట్టులన్=బిడ్డలను. కాపు=కావలి. గుట్టీక = రహస్యము బయలుపఱుపక. నలంగియున్=శ్రమనొందియు. అనివార్య జృంభణంబు=అడ్డగింపరాని విజృంభణముకలది. యౌవనారంభంబు=క్రొత్తప్రాయము. వనచంద్రికా వైభవంబు = అడవిగాసిన వెన్నలకలిమి. అడవికి చేసిన. దోహదంబు=అకాలమునందు చిగిర్చుపూచుటకై చెట్లకు చేయుక్రియ. తెగచి = తెగించి. చుమ్మలుచుట్టి = వేదనపడి. ఉట్టిపడన్ = కాఱఁగా. పొట్టుపొరలగు చుండునంతన్=సంకటపడు

తెగిపడినవడువున నెక్కడనుండియో యాకస్మికంబుగ నింటికిం జలిదివంట కంబుఁగుడువం జనుదెంచి తన్నుంగాంచి డెందంబునం గొంచియుండ బోరాక చేరి నమస్కరించి తలవంచికొనియున్న తమ్మునింగని కదిసి కొదమ నెల వంకల వంకలొత్తుచు నెత్తురులుచిలుకుచుం గుకవిపదబంధంబునుంబోలె ననకఁ బ్రవృత్తంబులై మదోన్మత్తమత్తకాశినీదత్తంబు లగునఖాంకంబుల కతన గర్కశం బగునతనిశరీరంబు గౌఁగిలింపనగ్గలించి శంకించి యాసీమం తిని యొక్కింత ఋజుస్వాంతయై యా దుర్విదగ్ధ విదగ్ధాలాపంబులొలయ సీమంతపుంబెండ్లికొడుకవుగమ్మని హేతుగర్భితంబుగానాశీర్వదించి యతండు తమకంబుగమకంబునం బోవనుంకించిన వానిసోఁకోర్వమి యెఱింగి తరంగిత వినయ సౌహార్ద మార్దవ మధురంబు లగుమాటల తేటలం బందిరివెట్టి యిం దుబింబంబునుంబోని నిజనందనుం జెఱుతవాని మేనల్లుని నిందమని చంక కిచ్చి యెచ్చటికేగెదవు మీబావబంతి నారగింతువుగాక శాకపాకంబులు నిమిషంబులోనం గావింతు నని నిలిపి వెనుకదెస నెడగలసియున్న తత్కళ త్రంబునకు నేత్రసంజ్ఞ యొసంగుటయును. ౨౮

క. ఆ పైదలి ప్రాణేశ్వరు, శ్రీపాదద్వయము గడిగె శీతలవారిన్
వ్యాపృతనిజనిశ్వాసజ, తాపంబునఁ గొంతకొంత తప్తముగాఁగన్. ౨౯

క. విను వేల్పునకును మెచ్చొలఁ, యని బలువిందునకుఁబోలె నఖిలాన్నంబుల్
కనుగీటినంతలోననె, యనుజునకుఁ దదగ్రజాత యమరించి తగన్. ౩౦

చ. తలగడిగించి ధౌతపరిధానము గట్టఁగనిచ్చి లెస్సగా
నలకలయందుఁగల్గు తడి యాఱిచి క్రొవ్విరు లావటించి మై

చుండఁగా. వడువునన్=విధమున. ఆకస్మికంబుగన్=తటాలున. కుడువన్=భుజింపను. కొంచి = జంకి. కొదమనెలవంకలన్=బాలచంద్రరేఖలను. పదబంధంబు = పదములయొక్క కూర్పు. మత్త కాశినీ = క్రొవ్విన స్త్రీలచేత. నఖాంకంబుల = గోటినొక్కుల. కర్కశంబు = బిఱుసైనది. అగ్గ లించి = పూని. సీమంతిని = ముత్తైదువ. ఋజుస్వాంత = సరియైన మనసుగలది. విదగ్ధాలాపం బులు = నేర్పుమాటలు. హేతుగర్భితంబు = లోపలనణఁగిన హేతువుగలది. తమకంబు గమకం బునన్ = మోహముయొక్క ప్రయత్నముచేత - మోహసంబంధమైన ప్రేరేపణచేత. ఉంకించి = యత్నించి. సోఁకోర్వమి=తాను చెప్పిన మాటనువిన సహింపమి. తరంగిత=హెచ్చింపఁబడిన. సౌ హార్ద=స్నేహముతోడి. మార్దవ = సులభోచ్చారణముగల. ఎడగలసి = ఎడమై. తత్కళత్రంబు నకున్=వానిభార్యకు. ॥ ౨౮ ॥ పైదలి=ఇల్లాలు. వ్యాపృత...బునన్=వ్యాపింపఁ జేయఁబడిన తన నిట్టూర్పులవలని తాపముచేత. తప్తము = వెచ్చచేయఁబడినది ॥ ౨౯ ॥ మెచ్చొలయని=మెప్పులేని బలువిందునకున్=గొప్ప చుట్టమునకు. అగ్రజాత=అక్క ॥ ౩౦ ॥ ధౌతపరిధానము = మడుఁగు

మలయజచర్చ సేసి గృహమాధవదత్తమనోజ్ఞభోజనం
బు లోసఁగెఁ దల్లి తండ్రి నిజపుత్త్రులు భర్తయుఁ దో భుజింపఁగన్. ౨౭

ఉ. ఇష్టములైననంటకము లిట్లు భుజించి యతండు వార్చి సం
తుష్టమనస్కుఁడై తనదు తొయ్యలి వీడ్యముచుట్టి యీ మహా
శిష్టుఁడుఁబోలెఁ దిన్నెపయి చిర్నగవొప్పఁగఁ గూరుచున్నచోఁ
బుష్టిసమస్తముంగడపి పుచ్చి తదగ్రజ పూర్ణచిత్తయై. ౨౮

క. ఇంతలు నంతలు నగు తన, సంతానము చంట వెంట సందడిసేయన్
బ్రాంతమున నిలిచి తమ్ముని, కుంతలబంధంబు విడిచి కుశలాశయయై. ౨౯

తే. ఎలయఁసీత్కారములతోడనీళ్లుగ్రుక్కి, యంటుసంటులుపరికించియంట్లుబోడిచె
గోరుముక్కుల దిగదువ్వి తూరపెత్తి, నెఱులఁగలిగిన పేలన న్నింటిఁదిగిచె.

క. మెడమన్నునలఁచి యలకలు, ముడిగొని నిజపాణిపద్మములు గరగరగాఁ
గడుగుకొని తనకు మఱఁదలు, విడెమొసఁగుచుఁ బసిమిపసిఁడి వీవనవీవన్.

తే. చేటికానీతపీఠికా సీనయగుచుఁ, బద్మకర్ణికఁగొలువున్న పద్మవోలెఁ
గుడివలనరింతయోరగాఁ గొమరుమెఱసి, బిడ్డచనుఁద్రావనిల్లను బిసరుహాక్షి.

శా. ప్రారంభించిన వేదపాఠమునకున్ బ్రత్యూహమౌనంచునో
యేరా తమ్ముఁడ! నన్నుఁ జూడఁ జనుదే వెన్నాళ్లనోయుండి చ
క్షూరాజీవయుగంబు వాచె నినుఁగన్గోరుచున్ మీ బావయున్
నీరాకల్ మదిఁ గోరు చంద్రుఁబొడుపున్ నీరాకరంబుంబలెన్. 33.

శా. శ్రీలాలిత్యము నిత్యశుద్ధియుఁ గుణోత్సేకంబునుంగల్గి యు
ద్వేలస్ఫూర్తిఁ దలిర్చు తండ్రియును నబ్ధింజంద్రుఁడై తోఁచినన్

నోవతి. అలకలయందున్ = తలవెండ్రుకలయందు. క్రొవ్విరులు = అప్పుడు పూఁచినపువ్వులు. ఆవటించి = పెట్టి. గృహమాధవదత్త=ఇలువేలుపైన విష్ణుదేవునికి నివేదనచేయఁబడిన ॥ ౨౭ ॥ వార్చి=ఆచమనముచేసి. తొయ్యలి = ఆఁడుది_ పెండ్లాము. పుష్టిన్ = నిండుకొన్న తనముచేత ॥ ౨౮ ॥ ప్రాంతమునన్=వెంబడిని. కుంతలబంధంబు = తలవెండ్రుకలముడి. కుశలాశయ = మంచి మనసుగలది ॥ ౨౯ ॥ అంట్లన్ = అంటుపేలను. నెఱులన్=చుట్టవెండ్రుకలందు ॥ ౩౦ ॥ గరగరగాన్ = నిర్మలముగా ॥ ౩౧ ॥ఆనీత=తేఁబడిన.పీఠికా = పీటయందు. పద్మకర్ణికన్=తామర ముద్దునందు. పద్మ=లక్ష్మీదేవి ॥ ౩౨ ॥ ప్రత్యూహము = విఘ్నము. చక్షూరాజీవయుగంబు = కనుఁదామరలజంట _ రెండుకన్నులును. నీరాకరంబున్ = సముద్రమును ॥ 33 ॥ ఉత్సేకంబు= ఎత్తు_ఆధిక్యము. ఉద్వేలస్ఫూర్తిన్=అధిక ప్రకాశముచేత. తలిర్చు=అతిశయించు నట్టి. పోలున్ = తగును. భవాదృశుండు = నీవంటివాఁడు. ఇతరుఁడు=అన్యుఁడు _ అక్రమప్రవర్తకుఁడు. ఖనిన్ =

బోలుఁగాక భవాదృశుం డితరుఁడై పుణ్యంబులం బాసినన్
సాలగ్రామఖనిం జనించునెకదా జాత్యల్పపాషాణముల్. ౩౮

క. ఏ నమ్మడు గడవఁగఁ ద, త్సూనులు కసుగందు లగ్రజుండవు నీ వి
ట్లైనతటి నెంతదుఃఖమొ, యీ నీ ప్రోపాసపడెడు నిరుగురువులకున్. ౩౯

సీ. పరమేష్ఠినుండి నీ తరముదాఁక విశుద్ధ, తరమైనవంశంబు దలఁచవైతి
తటిఁద్రొక్కియున్న యీ తల్లితండ్రులఁజాల,పఱచవై సంతోష పఱచవైతి
వగ్నిసాక్షిగఁ బెండ్లి యాడిన యిల్లాలి, నిల్లాలితాకార నొల్లవైతి
ధర్మశాస్త్రార్థవి త్తముల వి త్తములచే, నలరించి విఖ్యాతి నందవైతి
తే. శీలమఖిలంబునిది పిల్లి శీలమనుచుఁ,జదువులివియెల్లఁజిల్కలచదువులనుచుఁ
దోడివారలు నవ్వ నాతోడ! యేల, చేలవైతివి యీగుణం బేల? నీకు.

వ. అని తదీయదురాచరణస్మరణసంతప్తస్వాంతయై యక్కంఠీరవమధ్య యమ
ర్షోత్కంఠ కలకంఠకులకంఠ కాకలీపాకలీలాపహం బగు నెలుంగు చెలంగం
గలంగి కుంఠితప్రబోధుం డగు నా శుంఠునిం గెరలి పలికియునలుకమగిడించి
యుదంచితప్రయోజనఘటనాపారవశ్యంబునసామరస్యంబుమీఱ నిట్లనియె.

చ. పడఁబడఁ బాఱుచున్ వడఁకు పట్టిన తల్లిని దండ్రి నేలలో
వెడలని తమ్ముఁ గుఱ్ఱల న వీనకులాంగన నోరులేని యీ
తోడుకుల బంటుఁ బైద విడఁ ద్రోవకఁ ద్రోవఁగ నెందు నీక పా
ల్పడినది కర్ణునౌదలనె భారతసంహిత నిల్చుచాడ్పునన్. ౩౭

---

గనియందు ॥ ౩౮ ॥ ఏనమ్మడున్=ఏనమ్మకమును. తత్సూనులు = వారికొడుకులు_తక్కిన కొడు కులు. కసుఁగందులు=మిక్కిలి పసిబిడ్డలు. ప్రోపు=పోషణమును. ఇరుగురువులకున్=తల్లిదండ్రులిద్ద ఱకును ॥ ౩౯॥ తటిఁద్రొక్కి-(చావు) సమయమును సమీపించి. పఱచవు-అల్పుఁడవు. ఇల్లాలితా కారన్=ఈ మనోజ్ఞమయిన యాకృతిగల దానిని. వి త్తములచేన్ - ధనములచేత. నాతోడ=నా సహోదరుఁడా. చేలవు=మూఁఢుఁడవు ॥ ౩౬ ॥ దురాచరణస్మరణ సంతప్తస్వాంత=చెడుపనులు చేయుటను తలఁచుటచేత సంతాపమునొందిన మనసుగలది. కంఠీరవమధ్య=సింహము నడుమువంటి నడుముగలది. అమర్ష =కోపమువలని. ఉత్కంఠ=గొంతెత్తి పలుకుటచేత. కలకంఠకుల =కోవెలల సమూహముయొక్క. కంఠ=గొంతునుబోలి. కాకలీ=సూక్ష్మమైన యవ్యక్తమధుర ధ్వనియొక్క. పాక=పరిపాకము యొక్క. లీలా=విలాసమును. అపహము=తొలఁగించినది. చెలంగన్=మ్రోఁ గఁగా. కుంఠిత ప్రబోధుండు=మొక్కపోయిన తెలివిగలవాఁడు. శుంఠునిన్=మూఢుని. కెరలి = కోపించి. అలుక=కోపము. ఉదంచిత ప్రయోజనఘటనా పారవశ్యంబునన్ = మేలైన ప్రయోజ నమునయొక్క సమకూర్చుటయందలి పరవశత్వముచేత. సామరస్యంబు = సమరసత్వము ॥ ౩౭ ॥

ఉ. నాదుసహోదరుండు సుజనస్తవనీయనయప్రసక్తి బ్ర
హ్మాదుల మెచ్చఁ జేసతని యజ్ఞమునం గడుఁ బూజ్యురాలనై
వేదియలంకరింతునని వేవురిలోపల నాడుకొందు నీ
వేదియు లేక సర్వగుణహీనుఁడవౌట యెఱుంగఁ దమ్ముఁడా! ౩౯

శా. వీరావేశముదాల్చి సర్వధనము న్వెచ్చింతుగాకేమి ము
క్కారుంబండు నఖండసేతువ్రతముల్ కాశ్మీరఖండంపుఁ గే
దారంబుల్ తెగనమ్ముఁగాజనునె నిర్ధారుండవే వెక్కు నె
వ్వారుఁ లేరె సహోదరాదులు కులధ్వంసంబు నీకర్మమే. ౪౦

ఉ. కామవికారమాత్మ నవగాఢతఁ దాల్చినయేని నిర్భర
శ్రీమెఱయంగ రూపగుణశీలకులోన్నతిగల్గు విప్రక
న్యామణులన్ సహస్రమయి నన్ వరియించి రమించరాదె యే
మీ మునులైగృహస్థులు రమించుట యెగ్గె కులాంగనాతతిన్. ౪౧

శా. లోలత్వంబున మత్తకాశినులకిల్లుం బొల్లునుం జెల్లఁగా
నేలా వెచ్చముసేయ నెవ్వలన మన్నీలాఢ్యులుం జాలరే
కోలంబో జనియించువేఁడినను వీడ్కోలాభమో తండ్రి! దు
శ్శీలాగారము వారయౌవతము నిస్సీ! మేటి వాటించునే. ౪౨

సీ. నర్మగర్భోక్తులు నక్కుటక్కులు వింత,నయగారములు బహునాటకములు
పిలుపిచ్చవిద్యలు పీఁకవన్నియలును, బెలుచఁదనంబులు ప్రేలడములు
వక్రభావంబులు వలకారిబాగులు, వలసియొల్లములును వట్టిపసలు
కేరడంబులు సాళగింపులు కిల్బిషాక్రీడనంబులు నడకించువగలు

తే. బాసపోసనములు విడంబములు భ్రమలు, లేనిమచ్చికలివియాదియైన వివిధ
దుర్గుణంబులప్రోవులు ద్రోహమతులు, వారకాంతలఁ దడవిన వచ్చుఁగీడు.

---

తొడుకులన్=ఆవులను. బంటుఁజైదన్=కొలువుడు కాండ్రను బిడ్డలను ॥ ౩౮ ॥ నయప్రసక్తి = నీతియొక్కకూడిక ॥ ౩౯ ॥ కేదారంబులు=వరిమళ్లు. నిర్ధారుండవే = పెండ్లాములేనివాఁడవా ॥ ౪౦ ॥ అవగాఢతన్=అతిశయమును. నిర్భరశ్రీ = నిండినసంపద ॥ ౪౧ ॥ మన్నీలు = రాజులు. కోలంబు=ఆట. దుశ్శీలాగారము=చెడ్డనడతకు ఉనికిపట్టు. వారయౌవతము=బోగము పడుచులగుంపు. ఇస్సీ=చీ ॥ ౪౨ ॥ నయగారములు=మోసపు మెత్తదనములు. పిలుపిచ్చ=మిక్కిలినీచము. పీఁకవన్నియలు=పైపైమెఱుఁగులు. పెలుచఁదనము=కఠినత్వము. ప్రేలడము = పలవరించుట. వలకారి బాగులు=వలపించునట్టి యలంకారములు. కేరడంబులు=పరిహాసములు. సాళగింపులు=కలగలుపుఁదనములు. కిల్బిషాక్రీడనములు=తప్పుడు ఆటలు. అడకించు=వంచించు. బాసపోసనములు =

చ. వినుమిఁక నైన యిట్టి యవివేకము మామకబుద్ధిపద్ధతిన్
నడువుము నీకుఁ గావలసె నా హరికౌస్తుభమైనఁ దెచ్చెదన్
గడుసరి యచ్చకూళపలు గాకుల వీడుము చేయిమీఁదుగా
నడచిన పూర్ణకాముఁడవు నాయనుజన్ముఁడ విట్లు సేయుదే. ౮౪

తే. అక్క యీరీతి నయము ప్రియంబుగలుగ, నానతిచ్చినసద్బుద్ధియాదరించెఁ
జాలదినములనుండియు మైఁ వడిన, బడుగుగావున వాఁ డన్న పానకాంక్ష.

సీ. రాజాలయమునకు రాకపోకలు సేయు, మాసినచదువులు మరలఁజదువు
నిన్నాళ్ల నెచ్చెలు లెదురైన తలవంచు, కులవధూరత్నంబుఁ గుస్తరించు
నాచార్యజనము ప్రత్యహము సంభావించు, సర్వావళికి నుపహారమిచ్చు
నర్చించు కుతపవేళాగతాతిథికోటిఁ, బసి నేదు దర్శించుఁ బైరుపచ్చఁ

తే. దండ్రియుద్గమనీయంబు తానెయొదుకు, నత్తికాభర్తతో నవ్వు నల్పసరణి
గ్రామకార్యంబుదీర్చు నంగడికి వచ్చి, తేనెపూసినకత్తి ధాత్రీసురుండు. ౮౬

వ. అతం డొక్కనాడు. ౮౭

సీ. గోమేధికోపలాంకురమానితంబులు, పుష్యరాగచ్ఛటాపుంఖితములు
వైడూర్యసంధానవర్ణనీయంబులు, హరినీలకీలనాభ్యంచితములు
కురువిందసందర్భగురుతరంబులు చతుర్విధవజ్రదళసమావేల్లితములు
మహనీయతరహరిన్మణిపరీతంబులు, నకలుషస్థూలముక్తికయుతములు

తే. పద్మరాగపరీరంభభాస్వరములు, దస్తవిద్రుమకృతసముద్గకభృతములు, [రించి
మాతృభూషలునత్తికామణ్డనములు, నిజయువతిదాల్చుసొమ్ములన్నియుహ

---

పొసఁగింపుమాటలు. తడవినన్=తలఁచినను ॥౮౩॥ గడుసరి=కఠినులైన. అచ్చకూళపలుగాకులన్ = అచ్చపుఁగ్రూరత్వముగల దుష్టులను ॥ ౮౪ ॥ బడుగు = చిక్కినవాఁడు ॥ ౮౫ ॥ మాసిన = మఱచిన. కుస్తరించుట్=ఊఱడించు. సంభావించుట్=గౌరవించును. ఉపహారము = కానుక. కుతపవేళ = పగలు రెండున్నరజామునకు పిమ్మటికాలము. పసిన్=పసులమందను. ఏదుట్ = కాపాడును. ఉద్గమనీయము=దోవతి. అత్తికాభర్తతోన్ = తోడఁబుట్టినదాని పెనిమిటితో. అంగడికిన్=రచ్చకు ॥౮౬,౮౭॥ ఉపల=తాయి. అంకురము=మొలకపోడి. మానితంబు=గౌరవింపఁబడినది. ఛటా=సమూహము. పుంఖితము = పొదుఁగఁబడినది. సంధాన=కూర్పుచేత. కీలన = చెక్కడము. అభ్యంచితములు=మిక్కిలి యొప్పినవి. కురువిందము=ఒకవిధమైన కెంపు. సందర్భము=కూర్పు. సమావేల్లితములు=చక్కఁగా మెఱయునవి. హరిన్మణి పరీతంబులు=పచ్చలచేతఁ బొదుగబడినవి. అకలుష=దోషములేని. పరీరంభ=పొదుఁగుడుచేత. భాస్వరములు=ప్రకాశించునవి. సముద్గక భృతములు = బరణులందుంచఁబడినవి. అత్తికామండనములు = అక్కసొమ్ములు ॥ ౮౮ ॥

క. ఒకనాటిరాత్రి పడుపడు, కకుఁ జెప్పక యిల్లువెడలి గాఢతరతమో
నికరమ తనదగుతోడుగ, నొకరుఁడుఁ బేరడవిఁ ద్రోవ నూడనిఁబాఱెన్. ౭౯

సీ. శోకించు వృద్ధభూసురుఁ డాత్మపితృదత్త, దర్భముద్రికకుఁజి త్తంబుగలఁగ
నత్తగారిచ్చిన హరిసుదర్శనపుఁ బేరునకు ముత్తైదువ వనటఁబొందఁ
గ్రొత్తగాఁ జేయించుకొన్నముక్కఱకునై, యడలుదుర్వారయై యాఁడుబిడ్డ
జామాత వెతఁబొందు వ్యామోహియై నవ, గ్రహకర్ణవేష్టనభ్రంశమునకు

తే. నెంతదుర్బుద్ధి యెంతదుర్భ్రాంతి యహహ, సర్వధనములునద్దురాచారశీలుఁ
డూచముట్టుగ నిలుదోఁచియుఁ గొనిచనుట, యెఱుఁగరోగాక యెవ్వేళ యెఱుకగ

ఉ. మోవఁదరంబుగాని ధనమున్ వెనుమోపుగ వాఁ డమర్చి యే [లదె
త్రోవయుఁగాని పేరడవిఁ దూఱి హుటాహుటి నొక్కరుండు లోఁ
జావున కంగవించి పెలుచం జనుచుండఁగ నొక్కనాఁటిసం
ధ్యావసరంబునం దొకపురాంతిక ఘోరవనాంతరస్థలిన్. ౮౧

మ. కరుణాదూరులు చోరు లంధతమసాకారుల్ పరార్థాపహృతి
త్వరితాంతఃకరణుల్ దురాసదులు విశ్వద్రోహు లుద్బాహులై
తెరువొక్కుమ్మడిఁ గ్రమ్మి ఱొమ్మగల సందీప్తాశుగశ్రేణి నే
సిరి ధాత్రీసురసూనుఁ గార్ముకరవాశ్లిష్టాశులై యీసునన్. ౮౨

క. కాయంబునఁ బెదపెదపలు, గాయంబులుచేసెఁగాని కడువాఁడిమినై
నాయమ్ము లమ్మహీసురు, నాయమ్ములు దాఁకవయ్యె నాయుర్మహిమన్.

క. ఒకనెత్తురుబొట్టును కూ, రక యసువులు వేపురొడియుక్రమమునదొంగల్
బకనిభు లాపత్రితుని దోఁ, చికొని రయంబడరఁ జనిరి చెట్టుకొకరుఁడై. ౮౪

---

గాఢతరతమోనికరమ = మిక్కిలి దట్టమయిన చీఁకటియొక్క సమూహమే. ఊడనిఁబాఱెన్ = పాఱిపోయెను ॥ ౭౯ ॥ పేరునకున్ = హారమునకు. వనట=దుఃఖము. జామాత=అల్లుఁడు. వెత= వ్యథ—దుఃఖము. కర్ణవేష్టనము = చెవిపోఁగు. ఊఁచముట్టుగన్=కొంచెమయిన మిగులు లేకుండ॥ ౮౦ ॥ హుటాహుటిన్=మిక్కిలి వేగమున. అంగవించి = సాహసించి ॥ ౮౧ ॥ అంధతమసాకారులు = కటికిచీఁకటివంటి యాకారముగలవారు. పరార్థాపహృతి త్వరితాంతఃకరణులు = ఒకరి సొత్తును అపహరించుటయందు వడిగల మనస్సుగలవారు. దురాసదులు = అసాధ్యులు. అగలన్= పగులఁగా. సందీప్తాశుగశ్రేణిన్ = మిక్కిలి వెలిఁగెడి బాణములపఙ్క్తులను. కార్ముకరవాశ్లిష్టాశులు = ధనుస్సుయొక్క ధ్వనితోఁగూడిన దిక్కులుగలవారు. దిక్కులందు ప్రతిధ్వనిపుట్టునట్టుగా వింటిని ధ్వనింపఁజేసినవారు. ఈసునన్=కోపముతో ॥౮౨॥ కాయము=దేహము. ఆయమ్ములు = ఆబాణములు. మర్మస్థానములు ॥ ౮౩ ॥ ఒడియుక్రమమునన్=పొంచి కమ్ముకొనెడి విధమున ॥

క. కాఁపుకొడుకు కొక్కరుండా, కాపురుషుం డెచ్చె నింటి కడ కనుకంపా
టోపోద్దీపితబుద్ధిఁ ద, దాపద్వినివారణక్రియాభిముఖుండై. ౫౫

సీ. పితృపరిత్యాగవర్ధితకిల్బిషముఁ బోవ, నెత్తుకై వడిఁ బ్రేళ్ల నెత్తురొత్తి
కూర్కుపాఁత్రిణముల మేల్కొలుపుచాడ్పునఁ గంట్ల, శాకినీకాండంబు సణిపి చూచి
సమయంబుగాదని శమనుదూతలఁ ద్రోయు, జాడమైనాటు శస్త్రములు పెఱికి
పతయాళువగు బొందిపడకుండుటకుఁ గండ్రపురులిచ్చు గతిఁ జాలఁ బొత్తులునిచి
తే. వట్టికూడును వేనీళ్లు పెట్టియొజ్జ, గలుగువీడ్యంబు లిప్పించి వలఁతియైన
వెజ్జు నెచరించి యరయించె విప్రసుతుని, కంటవత్తిడుకొని సైరికప్రభుండు.

క. నిరనిలసంచారస్థల, మరయిక సుస్నేహపూర మాయుస్థితి యా
యిరు దెఱఁగుబలిమి దుర్దశఁ, బొరయక దీపమ్ముపగిది భూసురుఁ డెసఁగెన్.

ఉ. తానప్రసంగముల్ దిగిచి తత్సరణిన్ దన పెంపు పెద్దగాఁ
బూని వచించు నక్కపట పూరుషు నిక్కము నమ్మె నెమ్మదిన్
జానపదాగ్రగామి తన జాతియు నాతియుఁ గూడి దేవునిం
గా నిజదేశికోత్తమునిఁ గాఁ బరమాప్తునిఁ గాఁ దలంచుచున్. ౫౮

క. తలలోపలనాలుక పూ, సలలో దారంబు పోలెఁ జల్లిన నీరుం
బలె వెలియెఱుఁగక మనసులు, గలసి యభేదమునఁ గాఁపు కడనతఁ డుండెన్

క. కల దాశూద్రవసతి శశి, కల దాననఁ జాలు నొకవి కారపుఁ గోడల్
చలదాలోలకటాక్షాం, చలదామనిబద్ధతరుణజనఖంజనయై. ౬౦

---

౫౪ ॥ కాపురుషున్ = నీచుని. అనుకంపాటోపోద్దీపితబుద్ధిన్ = దయాతిశయము చేత వెలుఁగు నట్టి బుద్ధితో. ఆపద్వినివారణక్రియ = ఆపదను తొలఁగించునట్టి వ్యాపారము ॥ ౫౫ ॥ వర్ధిత కిల్బిషము = వృద్ధినొందింపఁబడిన పాపము. కూర్కు = నిద్రించు. గంట్లన్ = గాయములందు. శాకినీకాండంబున్ = వత్తుల సమూహమును. సణిపి = చొప్పించి. పతయాళువు = పడునట్టి స్వభావము గలది. బొంది = దేహము. గండ్రపురులు = ఊఁతకోలలు. పొత్తులు = పొత్తిగడ్డలు. ఒజ్జ = కారము. వెజ్జున్ = వైద్యుని. ఎచరించి = ఎచ్చరించి — ఎచ్చరిక చేసి. కంటవత్తిడుకొని — ఏమఱక. సైరికప్రభుండు = కాఁపుదొర ॥ ౫౬ ॥ నిరనిల = గాలిలేని. అరయిక = విచారణ. సుస్నేహపూరము = (మెదటియందలి) మంచిచమురుయొక్క సమృద్ధి. దుర్దశన్ = చావును. ఎసఁగెన్ = అతిశయించెను ॥ ౫౭ ॥ పెంపు = పెంచుట = జానపదాగ్రగామి = పల్లెపట్టులయందుండు వారిలో ముఖ్యుఁడు — కాఁపువాఁడు. జాతి = కులమువారు = చుట్టములు. నాతి = పెండ్లాము. దేశికోత్తమునిఁగాన్ = గురుశ్రేష్ఠునిఁగా ॥ ౫౮ ॥ ౫౯ ॥ వసతిన్ = ఇంటియందు. శశికల = చంద్రకళ. చలదా...ఖంజన = చలించుచున్నవియు అంతట తిరుగుడుపడునవియు నైన కడకంటి చూపులనెడి యురులచేతఁ గట్టఁబడిన యౌవన పురుషులనెడి కాటుకపిట్టలుగలది ॥ ౬౦ ॥ ఆఁక = నిర్బంధము. కందు = వర్ణహీనమగు, తళుకుల్లు = తళతళ

ఉ. ఇంటికి నడ్డపూఁక యొక యింతయులేక చరించువాని చే
నంటినఁ గందు గెందళుకు లంగమునంగలవాని మిక్కిలిం
గంటికినించువానిఁ దెలి కన్నులవానిఁ బిసాళిబాఁపనిం
బంటది గోరు చారుకుచ పంజరకీరము గారవింపఁగన్. ౯౧

సీ. పలువికారంబులఁ గలగల్పుఁజూపుల, రాకపోకల బయల్ పాఱఁకఁజేయు
దమకంబుగమకంబు దత్తఱంబును హత్తి, మనసుసాఁగినపజ్జఁజొనుపుఁగోర్కి
కుదురుపాలిండ్లపైఁ గొంగుజాఱఁగఁ గొప్పు వీడ నూరక నవ్వు వెఱ్ఱినవ్వు
నేరాలిపట్టి బిట్టుత్తి చెక్కిలినొవ్వఁ, గఱచి వాఁడేడ్చినఁ గౌఁగలించు
తే. దండసకిమెడఁబుంజాల దండబెట్టుఁ, దిట్టుమెట్టులుబిగువంచుఁ దెగి కళాదు
వనితచిన్నారిపొన్నారి వయసువాని, విప్రనందనుఁ గన్నంత వెకలియగుచు.

క. దుర్లలితాతనువిలసన, నిర్లజ్జాస్వాంత కాంత నేరుపుమెఱయన్
జెర్లాటమాడు మోహము, లేర్లయి వర్తిల్ల నమ్మ హీసుపతోడన్. ౯౩

తే. దృష్టిపాతంబు నొడివిమై దెరలఁబట్టు, ఫాలపట్టికఁగనుపట్ట బాల చేల
నిఱియఁ దలఁగట్టి యొకమూలనొఱగు నేల, గ్రుడ్లనీరుట్టఁబఱచిన కొంగుమీఁద.

ఉ. తేలెడు కన్నదోయి వడ దేఱెడు ముద్దుమొగంబు సారెఁ గ్రై
వ్రాలెడు గొప్పకొప్పు వసి వాడెడు నన్నువకౌను కాఁకలం
దూలెడు లేఁతమేనునయి తొట్రిలు నమ్మగనాలి నాలి బా
గాలఘువర్తనుం డరసి యంగజబాధితగాఁ దలంచుచున్. ౯౪

క. ఎవ్వనికి వలచెనోకో యీ, జవ్వని యని రవ్వమీఱు సరసోక్తులు తే
నవ్వులు ముడిచినపువ్వుల, రువ్వులుఁ దనయందె సమధిరూఢముఁగుటన్. ౯౫

---

కాంతులు. ఇంచు=ఇంపగు. పిసాళి=వంచకుఁడైన. కీరమున్=చిలుకను ॥ ౯౧ ॥ కలగల్పు = ఐక మత్యము. తమకంబు గమకంబు=మోహముయొక్క ఆధిక్యము. హత్తి=పొంది. పజ్జన్=ప్రక్కను. ఏరాలిపట్టిన్ = తోడికోడలిబిడ్డను. బిట్టు=మిక్కిలి. దండసకిమెడన్ = దగ్గఱనుండెడి చెలికత్తెయొక్క మెడను. పుంజాలదండ=మెడను ధరించెడి యొకవిధమయిన యాభరణము. తెగి = తెగఁబడి. కళాదున్=అగసాలెవానిని. చిన్నారిపొన్నారి = మనోజ్ఞము. వెకలి=ఆసక్తురాలు ॥ ౯౨ ॥ దుర్లలితాతను విలసననిర్లజ్జాస్వాంత =దుష్టమయిన యొయ్యారముతోడి మన్మథోద్రేకము చేత లజ్జలేని మనసుగలది. చెర్లాటము=పరిహాసము ॥ ౯౩ ॥ గ్రుడ్లన్=కనుగ్రుడ్లయందు. ఉట్టన్= కాఱఁగా ॥ ౯౪ ॥ వడ=తాపము (లేక)బడలిక. వసివాఁడు=మిక్కిలివాఁడు. అన్నువకౌను=సూక్ష్మమయిన నడుము. కాఁక=తాపము. నాలి=కుత్సితము. లఘువర్తనుఁడు = నీచప్రవర్తనము గలవాఁడు ॥ ౯౫ ॥ రవ్వ=అల్లరి. రువ్వు=విసరివాటు. సమధిరూఢములు=చక్కగా ఎక్కినవి ॥ ౯౬ ॥

మ. బళిరా తేరకుఁ దేరదక్కె నిటులీ బంగారుకుండంచుఁ జం
కలు దాటించుచుఁ గెంపుమోవి దొడుకం గా గుబ్బపాలిండ్లు బి
ట్టలమంగా ముఖగంధపారణము సేయంగాఁ గటీసీమ ను
త్పలపత్త్రాళి ఘటింపఁగాఁ దివురు మిత్త్రద్రోహి మోహాంధతన్. ౬౭

సీ. తలఁపుండ్లుగడిగించి తను బ్రతికించెఁగా, యడవిఁ జోరాహతుం డైనఁదెచ్చి
కన్నబిడ్డలకన్న గారవంబునఁజన, విచ్చెఁగా నిచ్చలు నింటిలోన
గ్రాసవాసక్లేశ కశ్మలత్వ మడంచి, యనురక్తిఁ బెనిచెగా యనుదినంబు
గురువుగా వేల్పుగాఁ గూర్చుచుట్టంబుగా, భావించికొలిచెఁగాభక్తియుక్తి

తే. నెవ్వఁ డారెడ్డియింటికి నెగ్గుచాలఁ, జేయు గుడినుండిగుడిత్రాళ్లు దీయుకరణిఁ
గపటనటనానటుఁడు త్రాటఁ గట్టుబోయ, కాయజామేయసాయకాఘాతభీతి.

చ. కరఁగినడెందముల్ విడుపు గాననికోర్కులు పారవశ్యముల్
బొరసిననిట్టచూపులు గు ముర్కొను ముత్పులకాంకురావళుల్
చిరిఁగినసిగ్గులుంగలిగి చీఁకటివేఁకటిరేలఁ జాల వా
విరిఁ దలిరాకుఁబోఁడియు న లీకవిశిష్టుఁడు దుష్టచేష్టలన్ ౬౮

క. మతి బాపమనక పాపిణ, చ్యుతికర మగుతెగువ కతఁడు చొరఁబడె "నరకే
సతి కో దోషో మరణే, సతి కిం భయ" మన్నచదువు చదువంబోలున్.

ఉ. అద్దమరేయిదాఁక పొల మారసి మారశిలీముఖాహతిన్
నిద్దురఁగాచియున్న మగ నిన్ జగనీలిపిసాళిజంత య
మ్ముద్దియ సేవసేయ దొక ముచ్చటయాడదు మూఁగబోలె నే
సుద్దియు లేక కన్మొగిచి చూచు మనోగతిఁదోఁచుచెల్వునిన్. ౭౧

---

తొడుకంగాన్=గ్రహింప. అలమంగాన్=ఆక్రమింపను—పట్టను. తివురున్=యత్నించును ॥౬౭॥ చనవు=స్వాతంత్ర్యము. గ్రాసవాసక్లేశకశ్మలత్వము = అన్నవస్త్రములకై కష్టపడుటయనెడిమై లను. కూర్చు=ప్రియమైన. కాయజామేయసాయకాఘాతభీతిన్ = మన్మథునివైన మేరలేని బాణముల దెబ్బలవలని భయముచేత ॥ ౬౮ ॥ పారవశ్యము=చొక్కు. నిట్టచూపులు = చలింపని చూపులు. ముత్పులకాంకురావళులు=సంతోషమువలనిగగ్గురుమొలకలపఙ్క్తులు. చిరిఁగిన=చినిఁగిన= పోయిన. చీఁకటి వేఁకటిరేలన్=చీఁకటిగల రాత్రులందు. వావిరిన్=వాలాయముగ. అలీక విశి ష్టుఁడు = కపటమైన యోగ్యతకలవాఁడు ॥౬౯॥ నరకేసతి=నరకమగు చుండఁగా. కోదోషః = ఏమిదోషము. మరణేసతి=చావు అగుచుండఁగా. కింభయమ్=ఏమిభయము ॥౭౦॥ అద్దమరేయి= అర్ధరాత్రము. జగనీలిపిసాళిజంత = మిక్కిలి మాయచేష్టలను వ్యాపింపఁజేసెడి ధూర్తురాలు. చెల్వునిన్=విటుని. ॥ ౭౧ ॥ చంద్రికమోవి=ఎఱ్ఱఁదనము గల యధరము. ఆమని=వసంతఋతువు.

సీ. పౌన్నాకుపై తేనె సన్నచంద్రికమోవి, మాధుర్యమనక వే మాఱుఁబొగడి
యామని బుగబుగ లంగచంపకదామ, గంధంబనక పెక్కు గతులనెన్ని
పడనున్నపండ్లసంపదపెంపుపాలిండ్ల, బీరంబనక సారె సారెఁదలఁచి
తెలియనభ్రచ్ఛాయ వలమానకచభర,ప్రకటనం బనక మాటికిని మెచ్చి
తే. దినదినంబును గసికాటు చెనకువలన, దప్పిదీఱనితమకంబు దెప్ప రంబుఁ
బాపసమకట్టి జారుఁ డప్పాఱుఁ డసతి,నెత్తుకొనిపోవనిందందు నెడరువేచె.
క. ఆతఁడుఁ దన్నగరీపతి, జాతరసాటించెఁ బశువి సర మనితరసా
ధ్యాతతవాతామయని, ర్ఘాతాహతిఁ దూల గాలి గంగలకెల్లన్. ౨౩
సీ. గోర్వెచ్చచమురంటు కొనిరి మస్తకముల, జలకమాడిరి నిశామిళితవారి
కట్టిరి చిఱుతచౌకముల క్రొంబుట్టముల్, కాటుకదీర్చిరి కన్నుఁగవల
దిద్దిరి సిందూర తిలకంబు బటువుగా, నిక్కుఁగొప్పుల విరుల్ గ్రుక్కి రర్థి
నింబప్రవాళమాల్యంబులు వైచిరి చిట్టిపొట్టి ధరించి రిట్టునట్టు
తే. తరుణధావనధగధగ ద్దశనమణుల, హత్తుకొలిపిరి లేఁతవీ డ్యములడాలు
పర్వదినములఁ బామర ప్రమదలుదిత,నియమసంభావనారంభనిభృతబుద్ధి.
క. ఎడ్డెతనపుఁగయి సేఁతల, రడ్డులు నడచిరి పురస్సర ద్భార్యముగా
గుడ్డంబుచక్కి గట్టుం, బడ్డ మహాశక్తిదివ్య భవనంబునకున్. ౨౫
వ. అమ్మహోత్సవం బజప్రధానంబగుట విబుధసభయుంబోలియు మహాసురో
దారంబును, తమోవికృతివిధేయంబగుట విధుబింబంబునుంబోలియుఁ దారా

---

బీరంబు=బిగువు. అభ్రచ్ఛాయ=మబ్బునీడ. వలమానకచభర ప్రకటనంబు=వట్రువగాఁ జుట్టఁబడు చున్న కొప్పుయొక్క ప్రసిద్ధి. కసికాటు=తగిలీతగలక కఱచుట-కొంచెపు అనుభవము. చెనకు= తాకుట. తమకంబు దెప్పరంబు=మోహాతిశయమును. అసతిన్—అంకులాఁడి యగు నా కాఁపుదా నిని. ఎడరు=సందు. వేచెన్=కనుపెట్టెను ॥ ౨౨ ॥ అనితర...హతిన్=అనితరసాధ్య = ఇతరము చేత సాధింపరాని. ఆతత=విశేషమయిన. వాతామయ=గాలికుంటు తెవులనెడి. నిర్ఘాతాహతిన్= పిడుగు దెబ్బచేత. గాలిగంగలకున్=పిశాచరూపిణులైన క్షుద్ర స్త్రీదేవతలకు ॥ ౨౩ ॥ నిశామి ళిత=పసుపుకలసిన. బటువుగాన్ = వట్రువగా. నింబప్రవాళ మాల్యంబులు=వేఁపచిగురుదండలను. చిట్టిపొట్టి=చిన్నచిన్న సొమ్ములను. తరుణధావనధగధగద్దశనమణులన్=సమయమునందుఁ దోము కోఁబడిన దగదగ ప్రకాశించెడి రత్నములవంటి పండ్లయందు. హత్తుకొలిపిరి = కూర్చిరి. డాలు= కాంతి. పామరప్రమదలు = గ్రామ్యస్త్రీలు. నిభృత = దిద్దఁబడిన ॥ ౨౪ ॥ ఎడ్డెతనపుఁగయిసేత లన్=మోటుతనపు అలంకారములతో. పురస్సర ద్భార్యముగాన్ = ముందునడుచుచున్న భార్య లు కలుగు నట్టుగా. గుడ్డంబు చక్కిన్= చేనివెంబడి ॥ ౨౫ ॥ అజప్రధానంబు = మేఁకపోతులు ముఖ్యముగాఁగలది; బ్రహ్మముఖ్యముగాఁగలది. విబుధసభ = దేవసభ. మహాసురోదారంబు=అధికమైన

వియోగముదితంబును, బహుళధ్వనిపరీతంబగుట సత్కవిత్వంబునుబోలియు
నసాధువర్ణసంబాధబంధురం బయ్యె నయ్యెడ. ౭౬

సీ. అంభోధరముక్రింద నసియాడు నైరావతియుఁబోలెసిడిఁద్రేలెఁ దెఅవయోర్తు
చెందమ్మికోలన రం జిల్లునంచయుఁబోలె, నిప్పుటేటఁజరించెనెలఁతయోర్తు
తొలుసంజయండవర్తిలునంచయునుబోలె, నీఁగెబందిరిగుండ మింతియోర్తు
జలనీలిపై నెక్కు కలువమొగ్గయుఁబోలె, ననటాకునర్తించె నతివయోర్తు

తే. కాంతయొక్కర్తుమూఁపునఁగండలిచ్చె, మాఱుగాలిచ్చెనొకసుధామధురవాణి
లలనయొక్కర్తునోరితాళంబులిచ్చె, శక్తిజాతర సద్భక్తి శక్తులెసఁగ. ౭౭

క. బత్తులు నునువాకత్తుల, మొత్తిరి పశుసమజముండములు చండములౌ
నెత్తురుధారలు ఘోరవి, పత్తిమిరనవారుణప్రభలు ప్రబలంగన్. ౭౮

తే. పెలుచఁ గలుచొక్కు చెలువల తలకు నెక్కఁ
దోన దిక్కుల తల కెక్కఁదొడఁగెఁ దమము
దేవిగుడిలోన నొక్కొక్క దివియదోఁపఁ
దోన నొక్కొక్కచుక్కయుఁ దోఁచె మింట. ౭౯

క. ఎడరగుట దెలిసి పాఱుం, బోడువఁడు గొనిచనియె మాఱు భూమికి నట సం
దడి బొమ్మఁడు పెండ్లాడెడు, వడువునఁ గనుగాఁపుఁబూప వయసుమిటారిన్.

---

కల్లుచేత హెచ్చినది; గొప్పయసురులచేత దొడ్డది. తమోవికృతివిధేయంబు = తమోగుణవికారము నకు ఉనికిపట్టయినది; చీఁకటివికారముచేత లోఁకువైనది. విధుబింబము = చంద్రబింబము. తారావియోగముదితంబు = కంటిగ్రుడ్లయెడఁబాటుచేత సంతోషించినది _ అనఁగా కన్నులు తేలవేయుటచేత సంతోషించినది; తారయెడఁబాటుచేత సంతోషించినది. బహుళధ్వని పరీతంబు=అధికధ్వనిచేత ఆవరింపఁబడినది. సత్కవిత్వము = మంచికవిత్వము. అసాధువర్ణసంబాధ బంధురంబు= నీచజాతులగు జనుల యొరపిడిచేత ఒప్పిదమైనది; తప్పు అక్షరముల నింపుచేత ఒప్పిదమయినది ॥ ౭౬ ॥ అంభోధరము=మబ్బు. ఐరావతి = మెఱపు. సిడిన్=సిడిమ్రానియందు. చెందమ్మి=ఎఱ్ఱదామర. నిప్పుటేటన్ = నిప్పులయేటియందు. తొలుసంజ=ప్రాతఃకాలము. ఈఁగెన్ = చొచ్చెను. పందిరిగుండము = పందిటిలోని నిప్పులగుండమును. జలనీలి=పాఁచి. అనఁటాకునర్తించెన్=అరఁటియాకువేసి దానిపై నాట్యముచేసెను ॥ ౭౭ ॥ బత్తులు=భక్తులు. నునువాకత్తులన్=నునుపైనవాదరగలకత్తులచేత. పశుసమజ ముండములు=పసులగుంపుల తలలు. చండములు=భయంకరములు. ఘోరవిపత్తిమిరనవారుణప్రభలు = భయంకరమయిన యాపత్కాలమునందలి క్రొత్తవియగు ఎఱ్ఱనికాంతులు ॥ ౭౮ ॥ పెలుచన్=అధికముగా. తమము=చీఁకటి । ౭౯ ॥ పాఱుంబోడువఁడు= దుష్టబ్రాహ్మణుఁడు. కొని=తీసికొని. బొమ్మఁడు=బ్రాహ్మణుఁడు. కనుగాఁపుఁ బూపవయసు మిటారిన్ = పసిదియు పూవువలె మనోజ్ఞమయిన వయసుగలదియునైన కాఁపుపడుచును ॥౮౦॥

తే. కాఁపుఁగోడలుకంచంతకాఁపురంబుఁ,బాలవంటకులంబుఁగాడ్పఱచి యుఱికె
మగనినటువెట్టి రెండవ మగనివెంట, నువిదలకుబుద్ధిపెడతల నుండుఁగాదె.

ఉ. ఆకుమఱుంగుపిందెయయి యంతిపురంబునుబోలె నున్న రా
కాకుముదప్రియాస్య భయ గాఢతరత్వర నేగుఁ గాని లో
నాఁకలి దప్పియున్ రవికరార్తియు నెన్నదు మన్మథాస్త్రకీ
లాకులతప్తచిత్తులకు లక్ష్యమె తక్కిన నొప్పులెవ్వియున్. ౮౨

సీ. కఠినకంఠీరవాక్షతనఖక్షతజర, త్కరిశిరశ్శుక్తిశార్కరిలతలము
లాశాంతజంతుకంఠాసృగుగ్రవ్యాఘ్ర, ముఖగుహాభాంకార ముఖరితంబు
లశ్వద్విషద్విషాణాగ్రనిగ్రహవహ, త్ప్రస్తరప్రసవసౌరభమయంబు
లజ్ఞాతరవికర వ్యాపారభూరుహ, చ్ఛాయానపాయాతి శైత్యఖనులు

తే. గహనఘట్టాపథంబులుగడచినడచి,యొక్కపక్కణమీక్షించియూఱడిల్లి [క్షత్రి
యవరవర్ణస్నుషయుబ్రాహ్మణాధముండు, బోయకులమునఁగలసిరిపొలుపుద

తే. ఎన్నిజన్మంబులేనియుఁ జన్నపిదపఁ, గాని ప్రాపింపరాని ధరానిలింప
జాతి గడెలోన నప్పాప జాతి తొఱఁగి, కల్లుపెల్లానివేఁటాడుగరుసునొరసె.

---

కాడ్పఱిచి=చెఱిచి. ఉఱికెన్ = పాఱిపోయెను. పెడతలన్ = వెనుకటి తలయందు ॥ ౮౧ ॥ రాకా కుముదప్రియాస్య = నిండుపున్నమనాటిచంద్రునివంటి ముఖముగలది. భయగాఢతరత్వరన్=భయముచేత మిక్కిలి హెచ్చయిన త్వరచేత. రవికరార్తి = ఎండవలనిబాధ. మన్మథాస్త్రకీలాకులతప్తచిత్తులకున్ = మన్మథుని బాణములవలని మంటలచేత కలఁతపడి తపించునట్టి మనసు గలవారికి ॥ ౮౨ ॥ కంఠీరవ = సింహములయొక్క. అక్షత = మొక్కపోని. నఖ=గోళ్లచేనైన. క్షత=గాయములుగల. జరత్కరి = ముసలియేనుఁగులయొక్క. శిరః=తలలయందలి. శుక్తి=ముత్తెపుఁజిప్పలచేత. శార్కరిల=గులకగలవియైన. తలములు=ప్రదేశములును. ఆశాంత...ముఖరితంబులు—ఆశాంత=దిక్కుల కొనలయందలి. కంఠ=మెడలవలని. అసృక్=నెత్తుటిచేత. ముఖగుహా=నోళ్ల వలనవెడలెడి. భాంకార=భాంఅనెడిధ్వనులచేత. ముఖరితంబులు=మ్రోగునట్టి-ప్రతిధ్వనులిచ్చునవి. అశ్వద్విషత్=కారెనుబోతులయొక్క. విషాణ=కొమ్ములయొక్క. అగ్ర=మొనలచేత. నిగ్రహ=ఛేదింపఁబడుటచేత. వహత్=వహించుచున్న. ప్రస్తరప్రసవ=జాతిపువ్వులయొక్క. సౌరభమయంబులు=పరిమళ వికారములుగలవి. అజ్ఞాత...ఖనులు—అజ్ఞాత=తెలియఁబడని. రవికర=సూర్యకిరణములయొక్క. వ్యాపార=వ్యాపారముగల. భూరుహ=వృక్షములయొక్క. అనపాయ = అపాయములేని. అతిశైత్య=మిక్కిలి చల్లఁదనమునకు. ఖనులు=గనులు-స్థానములు. గహన=అడవులయొక్క. కడచి=దాఁటి. పక్కణము=బోయపల్లె. అవరవర్ణస్నుష=శూద్రునికోడలు. పొలుపు=ఒప్పిదము ॥ ౮౩ ॥ ధరానిలింపజాతిన్ = బ్రాహ్మణకులమును. పాపజాతి=దుర్జనుఁడు. తొఱఁగి=విడిచి. గరుసు=మేర ॥ ౮౪ ॥ మదాకులాఖేటరతిన్ = మత్తుచేత కలఁతనొందినవారిదైన వేఁటా

క. స్వఘ్రాణానిలసౌరభ, మాఘ్రాణింపఁగ మదాకులాళీతరతిన్
వ్యాఘ్రాదికభయదాటవి,శీఘ్రగతిన్ మెలఁగునసతి చెలువుఁడుఁ దానున్.

మ. గతి మధ్య స్తన కుంతల స్తబక వీక్షా గర్వదుర్వార యా
సతిచే మానమె యూనమయ్యె నికని స్సారంబు ప్రాణంబు దా
ల్చుతగుల్ గాదని రోసి యావృషలి వాలుందూపుఁగ్రొమ్మంట కా
హుతియౌ బర్హి మృగేంద్ర కుంభి చమరీ యూథంబు లేణంబులున్. ౧౬

సీ. జళుకులువార లెస్సగ దంచి వెదురుబి య్యమును బువ్వులవలె నలఁతిలోవి
వార్చిడించినక్రొత్త వంటకంబతిమాత్ర ఘాతశరావపాత్రమునఁ జాల
వక్షించి పలువన్నె వన్యామిషంబులు చుట్టువాఱఁగనుంచి చొక్కటముగఁ
గాఁచినగురునెయ్యి చేచాఁచఁజాలినం, తయుఁ గుమ్మరించి తత్తత్క్రమపూర
తే. మొకయలాబుశలాటుఖండోదరమున,బూన్చియటుడించితానునుబొత్తుగలసి
సామిదష్టాన్నకబళముల్ సామికొసఁగు,నగుచుఁజవులెచ్చరించుచునిగురుఁబో [డి.

శా. కాఁపుం గెంజిగురాకుఁబోఁడి పరలోకంబంత ప్రాపింపుడున్
వ్యాపాదంబున నాతఁ డొండుగడ రూపాజీవరాజాననం
దాపింఛచ్ఛదగుచ్ఛసచ్ఛవి మదాంధన్ బంధురశ్రోణి వీ
ణాపాణింధమపాణి నొక్కప్లవకన్యం గూడి క్రీడింపఁగన్. ౧౮.

వ. అపవిత్రం బగుపుత్రలాభంబు దత్కళత్రంబునందు సంభవించె నిట్లానష్ట
పూర్వద్విజన్ముండు కష్టమార్గంబున నెలసి నెలఁతయుం దానును బ్రాలు

---

డుటయందలియాసక్తిచేత॥౧౫॥గతి=నడక. మధ్య=నడుము.కుంతలస్తబక=కొప్పు.గర్వ=(వీనివలని) గర్వముచేత. దుర్వార=నిలుపరానిది. తాల్చుతగులు=ధరించుటయందలి యాసక్తి. కాదు=తగదు. వృషలి=శూద్రస్త్రీ. వాలుందూపుఁ గ్రొమ్మంటకున్ = అతిశయించిన బాణములవలని క్రొత్తమంటకు. బర్హి = నెమలి. కుంభి=ఏనుఁగు. ఏణంబులు=జింకలు॥౧౬॥జళుకులు=పొట్టు. అలఁతిలోవిన్= చిన్నవంటకుండయందు. అతిమాత్రఘాతశరావపాత్రమునన్=మిక్కిలి చక్కఁగాఁ గడుగఁబడిన మూకుటియందు. వన్యామిషంబులు = అడవిమృగముల మాంసములు. చొక్కటముగన్ = స్వచ్ఛముగ. గురునెయ్యి = గవయమృగముయొక్క నెయ్యి. అలాబుశలాటు ఖండోదరమునన్ = వెత్తిసొరకాయచిప్పలో. సామిదష్టాన్నకబళములు = సగముకఱచిన అన్నపుముద్దలు. సామికిన్ = ప్రియునికి ॥౧౭॥ వ్యాపాదంబునన్ = ద్రోహచింతచేత - వంచనచేత. రూపాజీవరాజాననన్= భోగముదానిని. తాపింఛచ్ఛదగుచ్ఛ సచ్ఛవిన్ = చీఁకటిమ్రానియాకు గుత్తులయొక్క మంచి కాంతివంటిదేహకాంతిగలదానిని. కటికినలుపైన దేహకాంతిగల దానిని.బంధురశ్రోణిన్=ఒప్పిదమయినపిఱుఁదులుగలదానిని. వీణాపాణింధమపాణిన్ = వీణావాద్యము చేతఁగలదానిని. ప్లవకన్యన్ = =ఘాళపడుచును ॥ ౧౮ ॥ ఎలసి = కూడి. పేశలంబు = ఒప్పిదమైనది. ఫణాధర...తలంబునన్ =

మాలి మృణాళనాళపేశలం బగుఫణాధరపరివృఢ ఫణాఫలకతలిమతలంబున
నంటసిలంబడ నెడనెడం బెక్కుపాతకంబులుపార్జించుచు వర్తించివర్తించి
యొక్కనాఁ డొక్కరుండునుం గుక్కురకుమారయుగళంబుఁ గుపితశరభ
నిభంబగుదాని గళగళాయమాన గళనిగళనియమితంబుగఁ గేలఁగీలించి
యొంటిపాటున వేఁటపై గలతివుట నూటాడుచుసమీపాటవీమధ్యంబుఁజొచ్చి
యాస్ఫోటించి పిక్కచెదరక దిక్కులుపరిభ్రమించి యదభ్రమదవిభ్రమ
భూయిష్ఠంబు లగుమృగంబులం దెగఁజూచి యేచి కన్నిచ్చకువచ్చు పెక్కునం
జుడులు చేవడించక కావడించి ప్రొద్దస్తమించునంతకు నిజనిశాంతంబునకుఁ
బఱతెంచునప్పుడు. ౮౯

మాలిని. కుపిత శమన చక్షుః క్రూర దుర్వార కీలా
స్థపుటిత మగు వహ్నిన్ దద్దివాకీర్తియిల్ ద్రమ
గ్గిపడియె మధుపాన క్షీబ జాయా తనూజా
త పరిజనయుతంబై దైవదుర్భావదృష్టిన్. ౯౦

చ. తనగృహ మిట్లపత్య పశు దారధనాదులతోడ ద్రగ్గఁగాఁ
గని వెఱఁగంది కంది కనుఁ గ్రంతల ముంతలఁ బోసినట్లు బో
రనఁ గడు బాష్పపూరములు గ్రమ్మఁగ నేడ్చుచు మూర్ఛవోయి య
ల్లనఁ దెలిసెన్ వినిందితకు లవ్యవహర్త మనోబలంబునన్. ౯౧

క. ఇలఁ జదికిలఁబడి పలుమఱు, దలదోర్చుచు వికృత మగువ దనమున లాలా
జలములు తీఁగెలుసాఁగఁగఁ, బలుకు నతం డాలిగుఱిచి పరిచితరక్తిన్. ౯౨

---

ఫణాధరపరివృఢ=శ్రేష్ఠమైనగొప్పపాముయొక్క. ఫణాఫలక=పలకవంటిపడగయనెడి. తలిమత లంబునన్=పానుపుమీఁదిప్రదేశమునందు.అంటసిలంబడన్=అంటునట్లుపడుటకు. కుపిత=కోపించిన. గళనిగళ=మెడగొలుసుచేత. తివుటన్=పూనికచేత. ఆస్ఫోటించి=చప్పట్లుచఱచి. పిక్కచెదరక= ఏబాధయునులేక. అదభ్ర విభ్రమభూయిష్ఠంబులు=మిక్కుటమయిన త్రిప్పాటచేనిండుకొన్నవి= మిక్కిలిత్రిప్పాటచేత అలసినవి. తెగఁజూచి=చంపి. ఏచి=అతిశయించి. చేవ=బలము. కావడించి= కావడిగట్టి. నిశాంతంబునకున్=ఇంటికి ॥౮౯॥ శమన=యమునిదైన.చక్షుః=కన్నులవలని.దుర్వార= నివారింపఁగూడని.కీలా=మంటలచేత. స్థపుటితము=ఆక్రమింపఁబడినది. తద్దివాకీర్తియిల్లు=ఆచండా లునియిల్లు.।ద్రమగ్గి=కాలి. మధుపాన...పరిజనయుతంబు=కల్లుత్రాగుటచేత మత్తుగొన్న పెండ్లాము బిడ్డలుపనివాండ్రు వీరితోడఁగూడినది. దైవదుర్భావదృష్టిన్=దైవముయొక్క చెడ్డతనపు చూపు చేతను ॥ ౯౦ ॥ కంది = తపించి. వినిందితకుల వ్యవహర్త =మిక్కిలి నిందింపబడిన కులవ్యవహారము గలవాడు ॥ ౯౧ ॥ తలదోర్చుచున్ = తలవేలవేయుచు. లాలాజలములు = జొల్లునీళ్లు ॥ ౯౨ ॥

ఉ. ఎల్లరు నెల్లచో ధనము లిచ్చి మృగాక్షులఁ గొంద్రుగాని యో
పల్లవపాణి! యేఁ బరమ పావనవంశము నిచ్చి కొంటి నీ
నల్లనిరూపు నిక్కమని నమ్మి ధ్రువం బదిగాక నేడు వి
ద్యుల్లతికాధికాభినయ ధూర్వహమూట యెఱుంగ నింతయున్. ౯౩

ఉ. సన్నపుసిబ్బెముల్ గలుగు చన్నులఁ బయ్యెదకొంగు వాలఁగాఁ
గిన్నరవీణె మోపి శ్రుతి గీల్కొన సారెలు చక్క నొత్తి య
ద్యన్నఖరప్రఘాణములఁ దంత్రులు మీటుచు నాలపించు నీ
తిన్ననియెల్గు నా చెవులఁ దేనియలొల్కఁ జవుల్ దలంచెదన్. ౯౪

ఉ. ఈ కడజాతినాతి కిహిహీ మహిదేవుఁడు చిక్కెనంచు న
న్రాకకుఁ బోకకున్ జనప రంపర కెంపగుచూడ్కిఁ జూచి యం
బూకృత మాచరించుటకు బుద్ధిదలంక కలంకముక్తచం
ద్రాకృతిఁ బొల్చు నీముఖము నం దమృతస్థితి గాంచి మించుటన్. ౯౫

ఉ. పుత్త్రిలు లేరె యెవ్వరికి భూమి మదన్వయవర్ధనుల్ భవ
త్పుత్త్రిలవంటివారు మును పుట్టరుగాక తదాస్యకాంతి త
ద్గాత్రవివృద్ధి తద్భుజయుగస్ఫురణంబు తదుక్తిలక్ష్మి త
న్నేత్రసరోజపత్రరమణీయత చూపఱఁ జొక్కఁజేయవే. ౯౬

క. అని తన యాలిని దనయా,లిని గనిమఱికాని కుడువ లేఁ గూడు జలం
బును ద్రావ లే ననుచు నన, శనమున నతఁ డేగఁ జొచ్చె జనరహితమహిన్

క. కాఁగఁ బుణ్యుఁడు దుఃఖపు, వ్రేఁగు వహించుట నెపోలె విషమాటవిలోఁ
దూఁగుచుఁ దూలుచు నీరము, లీఁగుచుఁ దలవాంచియురక యేగుచునుండెన్.

తే. నీచమగు మేను పాఱంగ వైచు కరణిఁ, బడిసరోరుహనేత్రు నపారకరుణ [ నతఁడు
నధమలోకంబు విడిచి యయ్యమరపథముఁ, జూచుటకుఁ బోలెఁ దను తా నె లేచు

ధ్రువంబు = శాశ్వతము. విద్యుల్లతికాధికాభినయధూర్వహము = మెఱపుతీగకంటె హెచ్చయిన అభినయభారమును వహించినది— మెఱపు తళుక్కనునంతలోపల నేనశించినది. ఇంతయున్ = కొంచెమైనను ॥ ౯౩ ॥ సిబ్బెములు = పొడలు. కీల్కొనన్ = కూడఁగా. సారెలు = వీణెమెట్లు. ఉద్యన్నఖరప్రఘాణములన్ = ఎత్తఁబడినగోటికొనలచేత. ఆలపించు = ఆలాపనచేయు ॥ ౯౪ ॥ అంబూకృతము = ఉమియుట. అమృతస్థితిన్ = అమృతముయొక్కయునికిని ॥ ౯౫ ॥ సరోజపత్రరమణీయత = తామరరేకులమనోజ్ఞత. చూపఱన్ = చూచువారిని ॥ ౯౬ ॥ అనశనమునన్ = అన్నములేమిచేత ॥ ౯౭ ॥ వ్రేఁగు = భారము. ఈరములీఁగుచున్ = పొదలుదూఱుచు. ఉరక ఊరక ॥ ౯౮ ॥ ౯౯ ॥ అనుద్దిష్టప్రయోజనుండు = ఉద్దేశింపని ప్రయోజనముకలవాఁడు. నిరంబు

వ. ఇట్లనుద్దిష్టప్రయోజనుండై బహుయోజనంబులు నిర్భోజనుండు నిరంబుభజనుండునై యాకుజనుండు పెక్కుదినంబులాక్రాంతమహాగహనవిహారణుండై యచ్చోట నిశాటపతి వక్షఃకవాటపుటవిఘటనపటు చటుల ఘటనఖరముఖరత్నాభరణాయమాన త్రిభువనభరణుం డగునృసింహుం డుపసంహృత వైకుణ్ఠనగరనివాసుండై విజయంచేసియుండునప్పుణ్యప్రదేశంబుం బ్రవేశించి.

ఉ. చేరువచేరువై కడుఁ బచేళిమమై తనుఁబాయు పూర్వసం
స్కారతపఃఫలంబున భజద్వృజినావలినాశకృన్నృకం
ఠీరవదేవనిత్యసద నీకృతసంగమతీర్థరాజవా
ర్ధారల నాడి తత్పరమ ధామపతిన్ బలుమాఱుఁ జూచుచున్. ౧౦౧

సీ. ఒకయింత తెప్పవే యకచూచుఁ బెఱవారి, తలగొట్టుకొని దుఃఖజలధిమునుఁగు
బిలముతెఱవుమంచుబృథివిలోఁజొరఁబాఱు, సమధిక స్తంభోద్భవముగమించు
తిరియువాడునుబోలె దెసలకుఁ జెయిచాఁచుఁ, దొరఁగునస్రంబుఁదొప్పఁదోఁ
హాహోయితేయనియఱచుభార్యగుఱించి, బహువిధాసక్తి విభ్రాంతిబొందుఁ [గు

తే. జేరఁగారాని దర్శన స్థితివహించు, బాడబస్ఫూర్తిలోఁగొన్న పగిదినుండు
దానవారాతికాఁబూనితదవతార, దశకమునుమున్నె తాల్చెనాధరణిసుతుఁడు

క. ఉడుగని పస్తులఁ జెవులను, గడియలువడ మేనువడఁకఁ గాలముగడవం
బడమిఁ బుడమివేలుపు వడి, చెడి పుడమింబడియె విగత జీవుఁడు నయ్యెన్.

ఉ. ఈవిధమయిన యయ్యధము హీనపుమే నపుడెక్కెఁ గాకఘూ
కావలిదావకీల లగు వాల్కలు ముంగల మొల్కలెత్తఁ దం
తావళజాలనీల మగు దండధరానుచరాగ్రణీబలం
బావలఁ దోలివ లాఁచి వెస యాతనపుందను వాఁగిరేగఁగన్. ౧౦౪

---

భజనుఁడు = నీళ్లుత్రాగనివాఁడు. నిశాటపతి = రాక్షసరాజు. విఘటన = ఛేదించుటయందు. పటు = సమర్థమైన. భరణుండు = భరించువాఁడు. సంహృత = నిలుపఁబడిన. విజయంచేసి = వేంచేసి ॥ ౧౦౦ ॥ పచేళిమము = పక్వము. భజద్వృజినావళి=చేసినపాపపఙ్క్తి. నృకంఠీరవదేవ= నృసింహదేవునికి. నిత్యసదనీకృత = శాశ్వతమయినయిలుగాఁజేయఁబడిన. వార్ధారలన్ = నీటిదారలయందు. ఆడి=స్నానముచేసి. తత్పరమధామపతిన్=ఆపరమపదనాయకుని॥౧౦౧॥ గమించున్= గమనించును. తలఁచును. తిరియు = తిరిపమెత్తు. తొరఁగు =కాఱు. అస్రము = కన్నీరు; నెత్తురు. తొప్పఁదోఁగున్ = మిక్కిలిమునుఁగును. విభ్రాంతి = భ్రమమత్తు. దర్శనస్థితి = చూపుయొక్కయునికి ;మతముయొక్కయునికి. బాడబస్ఫూర్తిన్ = బడబాగ్నియొక్కతోఁపికను ; గుఱ్ఱముయొక్కతోఁపికను ॥ ౧౦౨ ॥ గడియలువడన్ = అడుచుకొనఁగా ॥ ౧౦౩ ॥ దావకీలలు= కార్చిచ్చుమంటలు. ముంగలన్ = ముందుగా, ఆఁచి = ఆఁగించి, యాతనపుందనువు = యాతనా

సీ. లలనాధరోష్ఠలాలాజలాన్వితముగఁ, గ్రోలె మద్యముపేరి కులమునెల్ల
వావివర్తనల తా వావంతదలఁపక, కన్నిచ్చవడ రేఁచెఁ గామవిక్రృతి
జనులుప్రివ్వఁగఁదిట్టు సడికోర్చియార్జించెఁబశ్యతోహరవృత్తిఁ బసిఁడిపోగు
కన్నపెట్టియుఁద్రోవ గాచికొట్టియుఁ జంపె,లెక్కకుమిగులు భూలేఖవరుల

తే. మఱియు నీరీతి క్రూరుల మైత్రివడసె, నితరపాతకములుచేసె నెన్నియేని
వీనిబోదువుఁడుకట్టుడుఁద్రేయుఁడనుచు,జమునిదూతలుబాధింపజడిసియతఁడు

క. ఆక్రోశంబొనరించె ది, శాక్రామన్నాదముగ విశంకటగతి నూ
త్నక్రమ మగు నామొఱవిని,సక్రోధాక్రమణనిపుణ సంభ్రమమడరన్.

మ. అమరద్రోహివిరోధి మున్నచట రక్షార్థంబుగా నిడ్డ చ
క్రము విక్రాంతివహించి భాస్కరసహ స్రక్రూరమై వచ్చి య
య్యమదూతావళిహావళిం దెరల విప్రాధీనబంధప్రతా
నము ఖండించె నఖండితారశిఖస న్నాహంబు దిగ్గ్రాహిఁగన్. ౧౦౭

క. శీకులును గాందిశీకులు, నై కాలానుగులు గునుక నప్పు డరుదెంచెన్
శ్రీకాముకపారిషదా, నీకములు సుదర్శనాది నీరజములతోన్. ౧౦౮

క. అరుదెంచి జముపురికిఁజను,తెరువున మరలించి తెల్ల దీవితెరువునన్
హరిభృత్యులు నడపించిరి, గరుడాంచితయానమున నిగమశర్మాఖ్యున్.

సీ. ఉత్తాలఫణిభుగ్గ రుత్తాలవృంతాని లాశాంతఘర్మాంబు వయ్యె మేను
ప్రత్యగ్రముక్తాత పత్రీభవచ్ఛేష వారితాతపమయ్యెఁ జారువాళి

---

దేహము ॥౧౦౪॥ కన్నిచ్చ = కంటియిచ్చ. ప్రివ్వఁగన్ = ప్రువ్వునట్లు. సడికిన్ = నిందకు. పశ్యతోహర=చూచుచుండఁగాదొంగిలించువానిదైన. కన్నపెట్టి = కన్నము వేసి,భూలేఖవరులన్= బ్రాహ్మణశ్రేష్ఠులను. జడిసి=భయపడి ॥౧౦౫॥ ఆక్రోశము—మొఱ. దిశాక్రామన్నాదముగన్= దిక్కులనాక్రమించుచున్న ధ్వనికలుగునట్లుగా. విశంకట = మిక్కుటమయిన. అడరన్ = అతిశయింపఁగా ॥౧౦౬॥ ఇడ్డన్ = ఉంచిన. విక్రాంతి = విక్రమము. క్రూరము = భయంకరము. తెరలన్ = తొలఁగునట్లు. ప్రతానము = సమూహమును. అఖండితారశిఖన్ = ఖండముగాని అంచుమొనచేత.దిగ్గ్రాహిన్ = దిక్కులనుబట్టినది ॥౧౦౭॥ శీకులును = హింసకలవారును. కాందిశీకులును = భయపడి దిక్కులనుగూర్చి పరుగెత్తినవారును. కాలానుగులు = యమునననుసరించినవారు—యమునికింకరులు. గునుకన్ = మెల్లమెల్లనపాఱిపోఁగా. శ్రీకాముకపారిషదానీకములు= శ్రీవిష్ణుదేవునిపార్శ్వవర్తులయినదూతలసమూహములు. సుదర్శనాది నీరజములతోన్ = సుదర్శన=చక్రములోనగువానితోను శంఖములతోను॥౧౦౯॥ఉత్తాల...బువు ఉత్తాల=ఉన్నతమయిన. ఫణిభుక్=గరుత్మంతుని వైన. గరుత్ = ఱెక్కలనెడి. తాలవృంత=విసనకఱ్ఱలవలని. అనిల=గాలిచేత.

సూత్రవతీశదోర్వేత్రప్రదత్తావకాశామరంబయ్యెఁగటాక్షవిహృతి
భృగుభరద్వాజప్రభృతికృతస్వస్తివాగ్భరముఖరములయ్యెఁబార్శ్వతలము

తే. లరుణకిరణసహస్రాభ మభ్రగంబు, నగువిమానంబుపై నెక్కి నిగమశర్మ [దు
తీంద్రఁబుణ్డరీకాక్షుకోదండుతంద్రఁబోలి, పరమధామంబునకుఁబోవు పథమునం

సీ. ఆజానుదీర్ఘంబులై హరిన్మణిమయస్తంభంబులకుఁ గులస్వాములగుచు
దివ్యగంధములను ద్రేకించి విద్యుదంకురరేఖలకు జోడుకోడెలగుచు
దలచుట్టుదిరిగిరాఁగలిగి పాండురపద్మపత్రంబులకుఁ బ్రాణబంధులగుచు
సకలంబువెలిఁగింపఁజాలి బాలార్కబింబములకు ననుబింబపఙ్క్తులగుచు

తే. నాల్గుచేతులుగాంచననలినమాలి, కలువెడఁదకన్నులాస్యప్రభలుచెలంగ [ద్రి
గుముదుఁడనుపేరఁబరమేశుఁగొలిచినిలిచి, యున్నవాఁడాతఁడిప్పుడునోమునీం

తే. పుండరీకుండుశంఖకర్ణుండువామ, నుండుకుముదాక్షుడునువిజయుండుజయుడు
సర్వనేత్రుండునసుపార్శ్వచరులలోన, హరికిగుముదుండుమానసీయతవహించు

క. అమృతమయమూర్తి బుధహిత, విమలవిభోద్భాసిమసృణ విలసనశుభల
క్ష్మమహితవక్షుఁడువిధుఁడట, కుముదానందప్రదాన కుశలుఁడుగాఁడే. ౧౧౩

శా. ఏవంభూతమహాప్రభావనిధి లోకేశుం జితక్లేశు మం
దావిర్భావహాసైకమాత్రదళితోద్యద్దైత్యగర్వాంకురా

---

ఆశాంత=అంతటనుశమించిన. ఘర్మాంబువు = చెమటనీరుగలది. ప్రత్యగ్ర...ఆతపము=ప్రత్యగ్ర=క్రొత్తదైన. ముక్తాతపత్త్రనికరత్ = ముత్యాలగొడుగులగాన గుచున్న. శేష=ఆదిశేషునిగలన. వారిత=నివారింపఁబడిన. ఆతపము = ఎండగలది. సూత్ర...అమరంబు=సూత్రవతీశ=విష్వక్సేనునియొక్క దోః—చేతులయందలి. వేత్ర = ప్రేముచేత. దత్త = ఇయ్యఁబడిన. అవకాశ = ఎడముతోడి. అమరంబు = దేవతలుగలది. కటాక్షవిహృతి = కడకంటిచూపుయొక్క విహారము. స్వస్తివాగ్భరముఖరములు = మేలుఅనుమాటలయతిశయముచేతమ్రోఁగునవి. అభ్రగము = ఆకాశమునందుఁబోవునది. తీంద్రక్ = తేజస్సుచేత. పుండరీకాక్షుకోదండుతంద్రి = విష్ణువు ॥ ౧౧౦ ॥ హరిన్మణి = పచ్చ. ఉద్రేకించి = అతిశయించి. జోడుకోడెలు=సమానములు. పాండుర = తెల్లని. అనుబింబపఙ్క్తులు = అనుసరించినబింబములవరుసలు ॥ ౧౧౧ ॥ ౧౧౨ ॥ బుధహిత...వక్షుండు=బుధ=పెద్దలకు; దేవతలకు. హిత = మేలైన. విమల. = నిర్మలమయిన. విభా=విశేషకాంతిచేత. ఉద్భాసి=ప్రకాశించునట్టి. మసృణ=మెఱుఁగులు దేరునట్టి. విలసన = ప్రకాశముగల. లక్ష్మ=చిహ్నముచేత. మహిత=పూజ్యమయిన. వక్షుఁడు=ఱొమ్ముగలవాఁడు. విధుఁడు=చంద్రుఁడు; విష్ణువు. కుముదానందప్రదానకుశలుఁడు = కలువలకు; కుముదునికి, సంతోషమునిచ్చుటయందు నేర్పరి ॥ ౧౧౩ ॥ ఏవంభూత = ఇటువంటిదైన. జితక్లేశుక్ = జయింపఁబడిన దుఃఖములుగలవానిని. మందా...వేశుక్—మంద = కొంచెముగా. ఆవిర్భావ = పుట్టుచున్న. హాస = నవ్వు. ఏకమాత్ర = ఒకటి

రావేశుఁ నరకేసరిఁ గొలిచి ని త్యప్రీతి నున్నారు వా
గ్దేవీవల్లభముఖ్యనిర్జరులు త త్క్షేత్రాధిరాజంబునన్. ౧౧౪

క. ఆనెలవున నర్ధనిశల, వీనులకుం దోఁచు నేచి విధినందన! వై
మానికనాయకకృతఘం, టానాదము నృహరిబిగువు నగవుంబోలెన్. ౧౧౫

క. ఆక్షేత్రంబున నృహరికి, దక్షిణదిశ నే వసింతు తత్పరమతి నీ
యక్షులతో నీప్రమథా, ధ్యక్షులతో నీనగేశ్వరాత్మజతోడన్. ౧౧౬

క. మాతృవధము పితృవధమును, భ్రాతృవధము గురువధంబు ప్రకటించియు యో
ధాతృసుత! యీర్లి సురపుర, నేతృతఁ దెలివొందు నెట్టి నీచుఁడు నచటన్ ౧౧౭

క. కావున నరులకుఁ దక్షే, త్రావాసమె నర్వ నైహి కాముష్మికముల్
చేవలఁతులగుచుఁ దలకొను,నావుడు నామృడుఁగుతిొంచి నారదుఁ డనియెన్.

క. దేవ! భవత్కృప నరమృగ, దేవమహాక్షేత్రమహిమ దెలిసితి నస్మ
ద్భావముప్రమోదమేదుర,భావమునై కొనియెఁజనియెభ్రమమంతమమున్

క. దైవము తీర్థము క్షేత్రము, నావాచంయములు గుహుఁడు నడిగిన మీరల్
భావించి తెలుపు తత్త్వము,నావినుఁజొనుపు మనుపుననుఁబురవైరి! ౧౨౦

తే. అనుడు నుడురాజమకుటుఁ డిట్లను నృసింహ,తీర్థమునకుభిదేళిమదిక్కునందు
సిద్ధమానవవినుతప్ర సిద్ధి వెలయు,నాద్యమై ఘుర్మవీరానుహాస్రవంతి. ౧౨౧

తే. తీర్థసార్థావతంసమ త్తీర్థమభిమ, తార్థదశ్రీలఁ జంద్రభాగాఖ్య నందు[ము.
నందుఁదపమాచరించిమున్నింద్రుఁడొందె,నమరతతిలోనసుంద్రభోగాతిశయ

ఉ. తైర్థికు లర్థిఁ గొల్వఁదగు దానికియోజనమాత్రభూస్థలిన్
దీర్ఘపదాస్పదం బఖిల దివ్యమతివ్యవహారయోగ్య మి

---

చేత నే. దళిత = భేదింపఁబడిన. ఉద్యత్ = నిక్కుచున్న. దైత్య = రాక్షసులయొక్క. గర్వ = అహంకారమనెడి. ఆవేశున్ = ఒళ్లెఱుఁగమిగల వానిని. నరకేసరిన్ = నరసింహుని ॥ ౧౧౪ ॥ అర్ధనిశలన్ = సగమురాత్రులందు. ఏచి = అతిశయించి. విధినందన = నారదుఁడా. వైమానికనాయక = ఇంద్రునిదైన ॥ ౧౧౫ ॥ తత్పరమతిన్ = ఆసక్తమయిన బుద్ధితో ॥ ౧౧౬ ॥ నేతృతన్ = ప్రభుత్వముచేత ॥ ౧౧౭ ॥ చేవలఁతులు = హస్తగతములు. తలకొనున్ = కలుగును = లభించును. మృడున్ = శివుని ॥ ౧౧౮ ॥ నరమృగదేవ = నృసింహదేవుని. మేదుర = అతిశయించిన ॥ ౧౧౯ ॥ వాచంయములు = మునులు. మనుపు = రక్షింపుము ॥ ౧౨౦ ॥ భిదేళిమ = ఇతరమయిన — ఎదుటిదైన. స్రవంతి = ఏఱు ॥ ౧౨౧ ॥ తీర్థసార్థావతంసము = తీర్థసమూహములలో శ్రేష్ఠము. అభిమతార్థదశ్రీలన్ = కోరికలనిచ్చుటయందలి కలుములచేత. అందున్ = పొందును. సుంద్ర = విశేషమయిన ॥ ౧౨౨ ॥ తైర్థికులు = తీర్థయాత్ర చేయువారు. సమగ్ధనక్షమము = తగురీతిని నెఱవేర్పఁ

స్ఫారసమర్థనక్షమము నై తమముఁ విరియించుఁ బాతకా
నర్థము పౌండరీకమను నర్థము దూషితరోషభూషణా! ౧౨౩

శా. నక్షత్రంబులకుఁ క్షపాధిపతికిఁ నాకుఁ త్రియామాచరా
ధ్యక్షద్వేషికి భానుపుత్రికి మరుత్కల్లోలినీ వేణికిఁ
బక్షిశ్రేణికిఁ బక్షివల్లభునకుఁ భాసిల్లు దానఁ సమ
స్తక్షేత్రంబులలో ననూన మగు నే తత్క్షేత్ర మీక్షింపఁగఁ. ౧౨౪

క. ఇదమిత్థ మ్మని యేనను, మది మితిసేయంగనేర మౌనీశ్వర! త
ద్విదితప్రభావ మోపిన,విధమున వినిపింతు నీకు విను దృఢబుద్ధిఁ. ౧౨౫

తే. జమునిచెలియలు నిర్ఝరశైవలినియు, బెరసి మెఱసిననడుచక్కఁ బేరుగ్రుచ్చి
ఋషులుతెల్పిన తీర్థములెల్లఁ బౌండరీకషోడశకళఁబోల లేకజడియు. ౧౨౬

సీ. పాతకవ్రాతభూ జాతజాతానలం బాశ్రితాభీష్టపా కావసరము
విషధిరాట్పర్యంక విహరణస్థానంబు, నిఖిలపుణ్యక్షేత్ర ముఖముకురము
నమదస్మదాదినా నామరున్నాథంబు, వర్ణితాఖిలపుణ్య వైజననము
దైత్యభిన్నగరయా త్రావరస్థానంబు, వాఙ్మానసామేయ వైభవంబు

తే. వంకు వామదేవ వాల్మీకి వరతంతు, గర్గ గాధిపుత్ర గౌతమాత్రి
జహ్ను జామదగ్ని జాబాలి జైమిని,ప్రియకరంబు పౌండ రీకమనఘ! ౧౨౭

మహాస్రగ్ధర. కననీ గొడ్రాలు బిడ్డఁ గగనకుసుమముఁ గల్గనీ రాయి మాటల్
విననీ ముత్తుండు వెండిఁ విపులఁ బొడమనీ వింటివా పాండురంగా
వనిఁ బౌనఃపున్యజన్య వ్యవహృతిఁ గన వేవంక దుష్పంకశంకల్
వనరాశింజొచ్చునేర్లై వడివడి యడఁగుఁ వారిజభూప్రీణనూతీ! ౧౨౮

---

జాలినది. దూషితరోషభూషణా = దూషింపఁబడిన కోపముగలవారికి అలంకారమైన వాఁడా. కోపమునణఁచినవారి నేలువాఁడా ॥ ౧౨౩ ॥ క్షప = రాత్రి. త్రియామాచరాధ్యక్షద్వేషికిఁ = విష్ణువునకు. భానుపుత్రికిఁ = యమునానదికి. మరుత్కల్లోలినీ వేణికిఁ = గంగాప్రవాహమునకును. అనూనము=తక్కువకానిది—ఎచ్చు ॥ ౧౨౪ ॥ ఇదమిత్థమ్=ఇదియిట్లు ॥ ౧౨౫ ॥ శైవలిని= ఏఱు. బెరసి = కూడి. పేరుగ్రుచ్చి = పేరుచెప్పి. జడియుఁ=తొలఁగును ॥ ౧౨౬ ॥ భూజాతజాతానలంబు=కారుచిచ్చు. పాకావసరము = పంటకాలము. విషధిరాట్పర్యంక=సముద్రరాజు పడుకగాఁగల విష్ణునికి. ముకురము=అద్దము. అస్మదాది=నేను మొదలుగాఁగల. మరున్నాథంబు = దేవతాప్రభువులుగలది. వైజననము = ప్రసవించుకాలము. దైత్యభిత్=విష్ణునిదైన. వాఙ్మానసామేయవైభవంబు = వాక్కుచేతను మనసుచేతను మితిఁయేర్పఱుపరానివిభవముగలది ॥ ౧౨౭ ॥ వెండిఁ = మరల. విపులఁ=భూమియందు. పొడమనీ = పుట్టనిమ్ము. పౌనః పున్యజన్య వ్యవహృ

తే. క్షితిఁగురుక్షేత్రముఖమహాక్షేత్రతలము, లందుఁజేయననశ్వరంబగుచునిగుడు
దురితతతి గిట్టిని జతక్షిఁ దునుముగాన, మేటి యాక్షేత్ర మొకపరిపాటి గాదు.

క. దాన స్నాన నిధన వాః, పానాదులఁ జేయ నెట్టిఫలములు పెఱచో
నౌ నవి సకలముఁ జేకుఱు, మానవులకు నందు నిమిషమాత్రమునందున్.

శా. భర్మస్తేయము బ్రహ్మహత్యయు సురాపానం బగమ్యారహః
కర్మంబున్ గృహదాహ ధేనువధ వాక్పారుష్యముల్ మున్నుగా
దుర్మార్గుల్ పచరించు దుష్కృతతతుల్ దూలున్ మృగేంద్రధ్వనిన్
మార్మోమ్ముల్ వడు లేటిమూఁకలనఁ దన్నామంబు వాక్రుచ్చినన్. ౧౩౧

సీ. ఉరసిజాదృతవీణ సరసిజాసనురాణి, పూర్వకోటిగ మహోద్భుతచరిత్ర
గజవైరివాహ దుర్గాదేవి పశ్చిమకోటిగ లస్తకక్రోడసీమ
భువననాయకిగాఁగఁ బొగడొందియోజనార్ధము విస్తృతియుఁ దదర్ధంబు నిడుపు
గలిగిన తత్క్షేత్ర కార్ముకంబు ధరించి, జగదేకధన్వి శ్రీశార్ఙ్గపాణి

తే. తీర్థశరములు దొడివియు దీర్ణకలుష, విషమలక్ష్యపరంపరల్ విఱుగఁ జేయుఁ
గాన నదియ శరణ్యమై దీనుమిగులు, నైహికాముష్మికాకాంక్షులగునరులకు.

తే. ఆత్మనామవసచ్చతురక్షరముఁ, యందుఁ బురుషార్థములు నాల్గు ననఁగిపెనఁగి
తలలు ముదిరిన దురితదంతావళములఁ, బౌండరీకంబు హరిలీలఁ జెండివైచు.

శా. ఆక్షేత్రంబుననుండు నట్టనడుమన్ యక్షాత్ష కేళీరతుం
డక్షోభ్యుం డజరుం డనాదినిధనుం డక్షామరక్షామయుం

తిన్ = మరల మరలపుట్టుటయను వ్యవహారము చేత. కనవు = పొందవు. ఏవంకన్ = ఏతట్టును. దుష్పం కశంకలు = చెడ్డపాపములనెడి సందేహములు. వడివడి = వేగముచెడి. వారిజభూగ్రిణసూతీ = బ్రహ్మ కుమారుఁడా ॥ ౧౨౮ ॥ అనశ్వరంబు = నశింపని స్వభావముగలది. నిగుడు = అతిశయించు. పరి పాటి = పర్యాయము ॥ ౧౨౯ ॥ నిధన వాఃపానాదులన్ = చచ్చుట నీళ్లుత్రాగుట మొదలగువాని చేత. ఔన్ = కలుగునో ॥ ౧౩౦ ॥ భర్మస్తేయము = బంగారు దొంగిలించుట. అగమ్యారహః కర్మంబు = పొందరానిదానితోఁ గలయుపని. గృహదాహ = ఇల్లుకాల్చుట. పచరించు = జరపు = చేయు. తూలున్ = నశించును. లేటిమూఁకలు = జింకలగుంపులు ॥ ౧౩౧ ॥ ఉరసిజాదృతవీణ = స్తనముల చేత ఆదరింపఁబడిన వీణగలది. కోటిగ = కొనయందు పొందినది. లస్తకక్రోడసీమన్ = వింటినడు మైనలోపలిప్రదేశమునందు. కార్ముకంబు = విల్లు. ధన్వి = విలుకాఁడు. శరములు = జలములనెడి బాణ ములు. తొడివి = తొడిగి-సంధించి. ఉదీర్ణ = గొప్పవైన. విషమ = సమముకాని. లక్ష్యపరంపగలు = గుఱులబారులను. దీను = బాగు. మనోజ్ఞత. ఆకాంక్షులు = కోరువారు ॥ ౧౩౨ ॥ వసత్ = ఉన్న. అనఁగిపెనఁగి = కలసిమెలసి యుండి. దురిత = పాపములనెడి. హరి = సింహము. చెండి = నఱికి ॥౧౩౩॥ అక్షకేళీరతుండు = జూదము నందాసక్తుఁడు. అక్షోభ్యుండు = కలఁతరానివాఁడు. అజరుండు = ముది

దీక్షామాత్రకృతాఖిలుండు నవశక్తీశుండు కృష్ణుండు ప్ర
త్యక్షంబై యనుడున్ మరున్ముని యుమాప్రాణేశుతో నిట్లనున్. ౧౩౪

క. అద్భుతమయ్యెడు నిఖిలజ, గద్భరితుఁడు యోగిహృదయ గమ్యుం డచ్చో
నుద్భవమొందుట కీకథ, సద్భద్రా! నొడువు సుప్రసన్నత ననుడున్ ౧౩౫

ఉ. ఆపురవైరిపల్కుఁ గలహాశిఁ గుశేశయపౌత్ర! విన్ము మున్
ద్వాపర ముజ్జగిల్లుతఱి దాంతుఁడు శాంతుఁడు హృద్విపక్షశి
క్షాపటుశక్తి విష్ణుపద సంభృతభక్తియునై జనించె ని
ష్పాపుఁడు పుండరీకుఁడను బ్రాహ్మణుఁ డొక్కరుఁ డక్కజంబుగన్ ౧౩౬

సీ. పాతకంబుల పంచబంగాళముగఁ జేయుఁ గనుఁగొన్నమాత్ర మోక్షంబు నొసఁగు
ముమ్మొగ్గు పుష్కరంబునకు నల్మొగ్గు పంపకు నిదియనఁదగుఁ బ్రకటమహిమ
బిందుసరఃప్రతిబింబమై పర్వి స్వర్గద్వారమునకంటెఁ గరము మేటి
యగుఁ జంద్రభాగ మహాపుష్కరిణితటంబులఁ జూతఖర్జూర పనసజంబు

తే. కాంచనయుతంబు నృత్యచ్ఛిఖండికూజ, దిష్టపరపుష్టగాయద ళీంద్రజుష్ట
మలసకల్హారపవననమ్రాగ్రదళము, నైన యాశ్రమ మమరించి యుండు నతఁడు

సీ. నిండుమనంబున నుండు నారాయణుం, డెటఁగించెనో నీట వఱలు నునికి
నొసలిలోపలిచక్కి నెసఁగు చంద్రుఁడు దిద్దెనో మింటఁ బ్రవేలెడు దీమసంబు
మూలాలవాలస్థలీ లేలిహానంబు గొలిపెనో పవనంబు గ్రోలునేర్పు
కమలంబు లిరుమాఁడు గఱపెనో సూర్యావలోకనంబునకాత్మ లోఁగనిధృతి

---

మిలేనివాఁడు. అనాదినిధనుఁడు = పుట్టుచావులు లేనివాఁడు. అక్షామ=కఱవులేని. ఈక్షామాత్రకృతాఖిలుండు=చూపుమాత్రము చేతనే చేయఁబడిన సమస్తమునుగలవాఁడు. ఎల్లలోకములను చూపుచేతనే కలుగఁజేయువాఁడు. నవశక్తి-ఈశుండు _ తొమ్మండ్రు శక్తులకును భర్త. మరున్ముని_దేవముని=నారదుఁడు ॥ ౧౩౪ ॥ హృదయగమ్యుండు=మనస్సులందుఁ బొందఁదగినవాఁడు. సద్భద్రా=మంచి మేలుగలవాఁడా ॥ ౧౩౫ ॥ కలహాశిన్=నారదునిగూర్చి. కుశేశయపౌత్ర=తామరకుమనుమఁడా. ఉజ్జగిల్లుతఱిన్ = తొలఁగునట్టి సమయమునందు—ముగియునప్పుడు. హృద్విపక్షశిక్షాపటుశక్తి=తనలోని శత్రువులగు కామక్రోధాదులను శిక్షించుట (అణఁచుట) యందు దృఢమయిన శక్తిగలవాఁడు. సంభృతభక్తి=పూర్ణమయిన భక్తిగలవాఁడు. అక్కజంబుగన్=ఆశ్చర్యముగా ॥ ౧౩౬ ॥ పంచబంగాళముగన్ = శూన్యముగా. ముమ్మొగ్గు = మూఁడంతలు. నృత్యచ్ఛిఖండి=ఆడుచున్న నెమళ్లుగలది. కూజదిష్టపరపుష్టగాయదళీంద్రజుష్టము=కూయుచున్న యిష్టములైన కోవెలలచేతను, పాడుచున్న గండుతుమ్మెదలచేతను సేవింపఁబడినది. అలసకల్హారపవననమ్రాగ్రదళము = మెల్లని సౌగంధికములమీఁది గాలిచేత వంగిన మీఁది ఆకులుగలది ॥ ౧౩౭ ॥ వఱలు=ఉండు. చక్కిన్=ప్రదేశమునందు. దిద్దెనో=నేర్పెనో. దీమసంబు=ఉపాయము. మూలాల

తే. యనఁగ దత్తత్క్రియలయందునలఁత లేక, భూరికైవల్యసామ్రాజ్యభోగకాంక్ష
బాధనిష్ఠానురక్తిఁ దపంబొనర్చి, కుదిసి ముల్లోకములును గగ్గోలుపడఁగ. ౧౩౮

తే. భక్తిసంయుక్తియనుపోఁత పాలనొయ్యఁ, జెట్టుకట్టుచు మునిశాఖినిట్టమూప
నిజమనోమార్గసంవస న్నీలవర్ణ, కైతవంబునలోఁ జేగ గలయ నూరె. ౧౩౯

తే. పుండరీకాఖ్యుఁడగుటనో పుండరీక, నేత్రభృంగంబు తనలోన నెలవుకొనఁగ
క్షితిసురేంద్రుండుతపమిట్లు చేయుచున్న, కాలమున నేగధరవిష్ణుఁగనుగొనంగ

తే. డెందమునబుట్టునలతముకుందువలనఁ, దీర్పనూహించిచనుమహీదేవికొసఁగె
కలశపాథోనిధానంబుగన్నఁగవల, తెలివిబలితంపునమృతవర్తియనుబోలె.

సీ. నీరజోదరయోగ నిద్రావరణసీమ, చతురంబుసితసామజప్రభునకు
పానలుబ్ధాబ్దప్రపాకల్పనము సూతి కానికేతనము పుష్కరసదనకుఁ
గామధుక్సందాన నీమధ్యదేశంబు, రసవతి దేవతా విసరమునకు
గోత్రభిల్లోకచకోరదృగ్గోత్రంబు, మందురాస్థాన మమర్త్యహారికి

తే. కాయమానంబుబలిగృహాంగణవసుధకు, సకలవాహినుఁలకుజనాంతికపదంబు
సారలోహారరము భూధ్రవైరిబద్ధ, బుద్ధిఁ జొరఁబొందియున్న దంభోళికబ్ధి.

చ. అమితపిశాచభర్త త్రిపురాంతకుఁడొందిన రాజశేఖర
త్వముఁ బెనుగొల్లఁడచ్యుతుఁడు దాలుచు శ్రీపతిభావమున్ మరు
త్క్రమనులు కూటిపేదలటు గాక సదా యమృతాన్నభోజులౌ
క్రమము సుధాబ్ధిపుణ్యమునఁ గల్గినవంచు నుతించు లోకముల్. ౧౪౩

---

వాలస్థలీతేలిహానంబు = వేళ్ళతోడి పాదునందుండెడిపాము. కొలిపెనో = సరిపఱిచెనో-బోధించెనో. క్రోలు=త్రాగు. ఇరుమూడు=ఆఱు. లోగని=తగ్గని. బాఢ=దృఢమైన. కుదిసి = అణఁగి. గగ్గోలుపడఁగన్=కలఁత నొందఁగా ॥ ౧౩౮ ॥ ఒయ్యన్=తిన్నగా. చెట్టుకట్టుచున్ = చెట్టుగా నేర్పడుచు. మునిశాఖి=మునియనెడి వృక్షము. నిట్ట=నిక్కను. సంవసత్=ఉన్న. నీలవర్ణకైతవంబునన్=విష్ణుదేవుని మిషచేత. చేగ=చేవ ॥ ౧౩౯ ॥ నెలవుకొనఁగన్ = ఉనికిచేయఁగా. ధర = భూమి ॥ ౧౪౦ ॥ అలఁత=శ్రమము. పాథోనిధానంబు=సముద్రము. తెలివి = తేటఁదనమనెడి ॥ ౧౪౧ ॥ చతురంబు=ఏనుఁగులుండుశాల. సితసామజప్రభునకున్ = ఐరావతమునకు. పానలుబ్ధాబ్దప్రపాకల్పనము = త్రాగనిచ్చగల మేఘములకుఁ జలిపందిరిగాఁ జేయుట. సూతికానికేతనము = పురిటిల్లు. పుష్కరసదనకున్=లక్ష్మీదేవికి. కామధుక్సందానని = కామధేనువుయొక్క దామెన త్రాటిదైన. రసవతి=రసముగలది. గోత్రభిల్లోకచకోర దృగ్గోత్రంబు - గోత్రభిల్లోక=ఇంద్రలోకమునందలి. చకోరదృక్=స్త్రీలయొక్క. గోత్రంబు=వంశము-జన్మస్థానము. మందురాస్థానము = లాయము. అమర్త్యహారికిన్=ఉచ్చైశ్శ్రవమునకు. కాయమానంబు=పందిరి. జనాంతికపదంబు = రచ్చపట్టు. సారలోహారరము=దృఢమయిన యినుపతలుపు. భూధ్రవైరి=ఇంద్రుఁడు. దంభోళికిన్

ఉ. ధేను గజాశ్వ రత్న సుదతీప్రముఖాఖిల వస్తుకోటి వై
మానికభర్త మున్గొనియు మచ్చరమారఁ బయోధిలోఁతు గా
కో నెసకొల్పెనో బలుమొగుళ్ల విప్లుష్ట కరీషపిండ రే
ఖానిభవృత్తి నత్తఱిఁగు గా కల సీ రవి ద్రావనేటికిన్. ౧౪౪

శా. అంతర్మగ్నదిగంతదంతికటని ర్యద్దానధారాఝరా
క్రాంతంబుల్ నిజవేగభగ్నవపురుగ్రగ్రాహముల్ మేఘఘో
షాంతేవాసివిశంకటధ్వనులు నాగావాసగాహుల్ పయ
స్సంతానంబులు గ్రాలు పాలకడలిన్ జాగ్రత్ప్రచారంబులై. ౧౪౫

శా. మాణిక్యంబులు మున్నుగా నిగుడు భ్రామ్యద్భంగసత్వంబు ల
క్షీణశ్రీ గెరలన్ జలద్విపకర చ్ఛిన్నప్రవాళద్రుమ
శ్రేణీ గర్వము డిగ్గి యౌర్వదవసంశీర్ణంబులై కానన
క్షోణుల్ వోలె దలిర్చు నిచ్చలు సుధాకూపారపారస్థలుల్. ౧౪౬

క. తరుణప్రవాళశోణో, దరతలమై శంఖ చక్ర ధరమై వరపు
ష్కరపుష్కలమై హరికర,సరసీరుహమనఁగఁ గలశ జలనిధి చెలఁగున్.

తే. నూత్నవీచుల సముపోఢరత్నపుష్ప, నికరనిబిరీస మగు నీరు నించి తెచ్చి
యబ్ధి వేలాసమాభ్యాగతాతురాచ,లాస్థలకు నర్థిఁ బాదార్ఘ్య మాచరించు.

---

=వజ్రాయుధమునకు ॥ ౧౪౨ ॥ ౧౪౩ ॥ వైమానికభర్త = దేవేంద్రుఁడు. మచ్చరము=పగ. ఎస కొల్పెనో=ప్రేరేపించెనో. మొగుళ్ళన్ = మేఘములను. విప్లుష్ట కరీషపిండరేఖానిభవృత్తిన్ = మిక్కిలి కాల్పఁబడిన యెండుపేఁడముద్దవిధమును బోలిన వ్యాపారముతో ॥ ౧౪౪ ॥ అంత ర్మగ్న=లోపలమునిఁగిన. కట=చెక్కిళ్ళనుండి. నిర్యత్=కాఱుచున్న. ఝర=సెలయేళ్ళచేత. ఆ క్రాంతంబులు = ఆక్రమింపఁబడినవి. భగ్నవపురుగ్ర గ్రాహములు = చెడినదేహములు గల భయం కరములయిన ప్రాణిహింసక మత్స్యములుగలవి. నాగావాసగాహులు = పాతాళమునందు మునిఁ గినవి. పయస్సంతానంబులు = జలచరముల సమూహములు. జాగ్రత్ప్రచారంబులు = ఎచ్చరిక తోడి సంచారములుగలవి ॥ ౧౪౫ ॥ భంగసత్వంబులు = అలలలోని ప్రాణులు. కెరలన్ = రేఁగఁగా. జలద్విప=నీరేనుఁగులయొక్క. ఔర్వదవ=బడబాగ్నియనెడి కార్చిచ్చుచేత. సంశీర్ణం బులు=మిక్కిలిచెడినవి. తలిర్చున్=చిగిరించును. పారస్థలులు=గట్టుప్రదేశములు ॥ ౧౪౬ ॥ శోణో దరతలమై=ఎఱ్ఱనిలోపలి భాగముగలదై. వరపుష్కర పుష్కలమై = మంచిజలముచేతసమృద్ధమై. కలశజలనిధి=పాలసముద్రము. చెలఁగున్=ప్రకాశించును ॥ ౧౪౭ ॥ నూత్నవీచులన్=క్రొత్తలయిన యలలయందు. సముపోఢరత్న = మంచిపండు పోఁకవంటి రత్నములనెడి. నిబిరీసము = నిండినది. ఆతుర=శ్రమనొందిన ॥ ౧౪౮ ॥ అవర్తగర్త = సుళ్ళనెడి బొక్కఁలయందు. అంశువులు=వెలుఁ

తే. వార్ధినావర్తగర్తప్రవర్తులగుచు, నుదరరత్నాంశువులు గ్రమ్మ, త్రిదశులమర
తరులు నలకం గదన్మాలతలము లమృత, సేకమున వెండిచిగిరించు చిగురులనగ.

వ. ఇట్లగణితగుణాభిరామం బగు నమ్మీనధామంబు సంగ్రామాభీరుం డగుశూ
రుండునుంబోలెఁ బెనువాలుగంటులం గనుపట్టి కుశలభటవిముక్తం బగు విశి
ఖంబునుంబోలె నెల్లకందువల నుమీఱి పాటలస్ఫురితంబై జరఠవిలోచనం
బునుంబోలె నీరుపాపలం బొదువుటగలిగి పేదవడినపుడమివేలుపుంబోలె
బలియింటివాకిటనడంగి వీరభద్రగదావిదారితం బగుపూషార్కవదనగహ్వ
రంబునుంబోలెఁ బలువరుసబిగి దెరల నొరలి మతంగకులకన్యకయుంబోలెఁ
బలుకందగునిలుకడ దాల్చి విభావరీవిరామసమయంబునుంబోలె వెల్లదీవియ
లమించుటకుగుఱియై మఱియు నొక్కొక్కచోటఁ గుముదోదరవిశదంబులు
నొక్కొక్కయెడ నీలోత్పలమాలికామేచకంబులు నొక్కొక్కకడ శుకచం
చూపుటపాటలంబులు నొక్కొక్కచక్కి ముక్తాశుక్తిశబరోదరంబులు నగు
ణోపలపట్టంబులం బొట్టవెంచుచు నిట్టలంబుగ మిట్టించు వేలానిలసముద్ధూ
తనూతనశీకరనికరంబులవలన నలినభవాండంబునకుఁ గర్పూరకరండభావం
బు నుత్పాదించుచు నుత్తాలకాలస్కంధ పలాశకులాసితద్యుతికూలంక
షంబు లగు బాలశైవాలవల్లీమతల్లికల నల్లిబిల్లిగొను నుల్లోలప్రవాళశాఖా
శిఖలవలన నుదవాసక్లేశంబున నుద్ధుకుడిచి వెలుపటికిం బుటమెగయుచు

---

గలు. అమృత సేకమునన్ = అమృతముతో తడుపుటచేత ॥ ౧౪౯ ॥ మీనధామంబు=సముద్రము. అభీరుండు=భయపడనివాఁడు. వాలుఁగంటులన్=కత్తిగాయములచేత; చేఁపల సంబంధములచేత. కుశల=సమర్థుఁడైన. విశిఖంబు=బాణము. కందువలను = జాడలచేతను; సంకేతస్థలముల చేతను. పాటలస్ఫురితంబు=పండఁబాఱుటను తోఁపించునది. జరఠ=ముసలివాని. నీరుపాపలంబొదువుట = నీటిమనుష్యులను పొదువుట; జలము కంటిపాపలపైకమ్ముట. బలి=బలవంతుఁడు; బలిచక్రవర్తి. పలువరుస బిగి తెరలన్ = పండ్లవరుస బిగువు వదలఁగా; అనేకములైన వరుసలుగల బిగువుతోడి యలలచేత. ఒరలి=ధ్వనించి. పలుకన్=నిందింప; చెప్ప. విభావరీ=రాత్రి. వెల్లదీవియల మించు టకున్=తెల్లఁబాఱిన దీపములచేత మించుటకు; శ్వేతద్వీపమును ఆక్రమింపఁజేయుటకు. మేచకం బులు=చామనిచాయలు. పాటలంబులు=ఇంచుకయెఱుపులు. శబరోదరంబులు=చేఁపకడుపులు; నీటి లోపలి భాగములు. ఇట్టలంబుగన్=అధికముగ. మిట్టించు=మీఁదికెగయు. కరండభావంబు=బరణి విధమును. ఉత్తాల...షంబులు=పొడవైన చీకటి మ్రానియాకుల మంచినల్లని కాంతిచేత గట్టు నొరయుచున్నవి. బాలశైవాల వల్లీమతల్లికలన్=ప్రశస్తములైన లేఁత పాఁచితీఁగలతో. అల్లిబిల్లి గొను=పెనఁగొను. ఉల్లోలప్రవాళ శాఖాశిఖలవలనన్ = పెద్దయలలలోని పగడపుఁదీఁగల కొనలవ లన. ఉదవాసక్లేశంబునన్ = నీళ్ళయందుండుటవలని శ్రమచేత. ఉద్ధుకుడిచి=ఊపిరి త్రిప్పలేక శ్రమ

నుద్దామధూమధోరణీవ్యాజంబునం దలలువీడ నీడాడంబోడచూపు నిబిడ
బడబానలకీలాకలాపంబులశంక నంకురితంబుసేయుచు సలిలకరటి చటులతర
రదనశిఖరవిఘటితగర్భగిరిగైరిక సంక్రమణారుణంబు లగు మృదుసముదిత
తరంగకిశోరంబులచేతపిహితావకాశంబై లక్ష్మీనారాయణశరీరారూఢవిసృ
మర ఘుసృణ రజోరంజితంబును తదీయవిలుంఠనావిర్భూతవ్రీడాపీడనంబు
నగు తలిమతలంబువిలసనంబు వశీకరించుచు సాత్వికుక్రియ విధువిజృంభణ
ముదితంబును పంటకారుపగిదిం బ్రసన్నశరీరంబును సత్యలోకంబునాకృ
తిం గమలభూయిష్ఠంబును విలాసినీకరంబుకరణి వివిధమణికిరణపుంజరంజితో
ర్మికంబును పరబ్రహ్మంబువిధంబున నహార్యపదంబునై యొదవు నాఁ డవ
కడలి పుడమిముద్దియకుఁ దద్దయుఁ బ్రియంబు పుట్టించె నిత్తెఱంగున. ౧౫౦

ఉ. ఎన్నఁగ నింతరత్నచయ మింతగభీరిమ యింతదానసం
పన్నత యింతశుద్ధి యని బ్రహ్మయు నోరుమెదల్పలేని య
త్యున్నతిగన్న పెన్గడలి నుత్థితనై వెలిదీవి చెన్నగున్
వెన్నెలయేటిలోనఁ బ్రభవించిన కప్రపుఁగొండకైవడిన్. ౧౫౧

శా. ధూతాతంక మపేతపంకము బుధస్తుత్యంబు నిత్యంబు వి
ఖ్యాతం బాతపశీతవాతసహ సాంద్రానందయోగీంద్రసం

---

పడి. పుటమెగయుచున్=దాఁటుచు. ధోరణి=వరుస. ఈడాడన్ = ఇక్కడనక్కడ. అంకురితము=మొలచినది. సలిలకరటి=నీరేనుఁగుల యొక్క. చటులతర=మిక్కిలి వాఁడులైన. రదనశిఖర=దంతముల కొనలచేత. విఘటిత=భేదింపఁబడిన. సంక్రమణ=చేరికచేత. మృదు = తిన్నని. సముదిత=పుట్టిన. తరంగకిశోరంబులచేతన్ = చిన్నయలలచేత. పిహిత=కప్పఁబడిన. ఆరూఢ = ఎక్కిన-పూయఁబడిన. విసృమర ఘుసృణరజోరంజితంబు=ప్రసరించునట్టి కుంకుమపువ్వు రేణువులచేత ఎఱ్ఱవారినది. విలుంఠనావిర్భూత = పొరలికవలనఁబుట్టిన. తలిమతలంబు=పఱుపుమీఁదిచోటు. వశీకరించు=వశముచేయు. విధు=చంద్రునియొక్క; విష్ణువుయొక్క. విజృంభణముదితంబు=విజృంభణముచేత సంతోషించినది. పంటకారు=శరత్కాలము. ప్రసన్నశరీరము = తేటపాఱినదేహముగలది. కమలభూయిష్ఠంబు=బ్రహ్మకుఁబ్రియమయినది; కమలములచేత అతిశయించినది. కిరణ = కాంతులచేత. ఊర్మికము=ఉంగరములుగలది; అలలుగలది. అహార్య పదంబు=అచలస్థానముగలది; కొండలకు స్థానమయినది ॥ ౧౫౦ ॥ గభీరిమ=గాంభీర్యము. పెన్గడలిన్ = పెద్దసముద్రమునందు. ఉత్థితము=మీఁదికిలేచినది. కప్రము=కర్పూరము ॥ ౧౫౧ ॥ ధూతాతంకము = తొలఁగింపఁబడిన భయముగలది. అపేతపంకము = పోయిన పాపములుగలది. సహ=సహించునట్టి. సాంద్ర=అధికమైన. సంకేతంబు=గుఱుతుగలది. ఆతతభూతి=విశేష సంపదగలది. భూతిలకలక్ష్మీకారి=భూమికిబొట్టుకలిమిని జేయునది, తోరంబు=గొప్పది. జగత్సేవ్యైక భవ్యోన్నతిన్=లోకముచేత సేవిం

కేతం బాతతభాతి భూతిలక లక్ష్మీకారి తోరంబు నై
శ్వేతద్వీపము దీపితం బగు జగ త్సేవ్యైకభవ్యోన్నతిన్. ౧౫౨

ఆ. వణఁకుగుబ్బలికిని వైడూర్యశృంగంబు, మొలచినట్లు మిన్ను మోచియున్న
తెల్లదీవియందు దీపించు వైకుంఠ, పురము కనకవప్ర పరివృతంబు. ౧౫౩

ఉ. సారసువర్ణనీరమయ సాలవిశాలము నీలవర్ణసం
చారచమత్క్రియాచరణ శాలియునై పురి చెన్నగున్ మహా
మేరువు కౌఁగిటం బొలుపు మీఱి మహోత్కటకూటసంచర
ద్వారణరాజమై సొబగు దాల్చిన రోహణశైలమో యనన్. ౧౫౪

సీ. త్రైవిక్రమాంఘ్రి మున్ తవిలిపిడిన పద్మజాండఖండములీల నలరుఁ గోట
పలుమాఱు గమతాధి పతిపూనిడించుమందరములభాతి సౌధములు వెలయు
నిజవిహారార్థంబు నృహరియైహరిచేయు, వసతులోయనఁ గేళివనములెసఁగు
శాంబరీమత్స్యసం చారోచితాపర, శరధులక్రియ పద్మ సరసు లమరు

తే. నఖిలభువనాంతరాళ పు రాధిదేవ, తావితానంబు తత్సేవ కై చరించు
సరణిఁ జూపట్టుదురు శర త్సమయపూర్ణ, రాజవదనలు వైకుంఠ రాజధాని.

సీ. జలధివీచీవాత్యఁ జలిదాఁకెఁగాయని, యక్కున నందంద యలమియఁమి
పాత్రిమట్టియాకొత్తి రాయిడిఁబొందెఁగా, యనిసన్నపొత్తుల నునిచియునిచి
వాపోయివాపోయి వసివాడి యాఁకిట, బెగడెఁగాయని యుగ్గు వెట్టి పెట్టి
పెనుజీఁకటులుగ్రమ్ము పెన్బైటవసియించి, వెలిచెఁగాయనిపుల్ల విఱిచివిఱిచి

తే. మంచిలక్షణములఁబుట్టుమచ్చవాఁడు, నేత్రములువిప్పనట్టియానెత్రుగందు[లు
వఱలనేతెంచెనెవ్వారివాఁడొయనుచు, విలయహరిఁదెచ్చి పెనుతురవ్వీటిసతు

---

పఁదగిన ముఖ్యమును మేలైనదియునగు గౌరవముచేత ॥ ౧౫౨ ॥ వణఁకుగుబ్బలికిన్ =హిమవత్పర్వతమునకు. మోచి=అంటి. కనకవప్రపరివృతంబు = బంగారుకోటచేతఁ జుట్టఁబడినది ॥ ౧౫౩ ॥ సాల = ప్రాకారముచేత. నీలవర్ణ=విష్ణుదేవుని. కూట=శిఖరములందు. సొబగు=అందము. రోహణశైలము = రత్నపర్వతము ॥ ౧౫౪ ॥ త్రైవిక్రమ=త్రివిక్రమ దేవునిదైన. లీలన్=విధమున. వసతులు=ఉనికితావులు. శాంబరీమత్స్య=మాయచేపకు—విష్ణువు అవతారమయిన చేపకు. శరధులక్రియన్=సముద్రములవలె. పద్మసరసులు = తామరకొలఁకులు. శరత్సమయ పూర్ణరాజవదనలు= శరత్కాలపునిండుచంద్రునిఁబోలిన మొగములుగలవారు – స్త్రీలు ॥ ౧౫౫ ॥ వీచీవాత్యన్ = అలలమీఁది సుడిగాలిచేత. అక్కునన్ = ఱొమ్మునందు. అలమి=చేర్చి. రాయిడి=ఒరపిడి. పొత్తులన్=పొత్తిగుడ్డలమీఁద. వాపోయి=ఏడ్చి. వసివాఁడి=మిక్కిలివాఁడి. పుల్లవిఱిచి=పుల్లలువిఱిచి–మంత్రించి. నెత్రుగందు=నెత్తురుముద్దవంటి లేఁతబిడ్డ ॥ ౧౫౬ ॥ తెర=తెరచీర ; మృగములను

వ. మఱియు నప్పురంబు పలుదెరలుతిరిగివచ్చుట నాఖేటస్థలంబును నర్తనప్రదేశంబునుంబోలె లెస్సవారింగలిగిగజగ్రహణసంవిధానంబును,సుజనునింబోలెం బెక్కుపట్టులంగనుపట్టి కురువింద మందిరంబును, కశ్యపమునీశ్వరుంబోలె హరికి గిరిగుహయును, మాధవునకు నుపవనవిశేషంబును, చక్రికి శ్రీఖండ తరుకోటరంబునునై యడరం బుడమినిడువాలుగంటితడవుమెచ్చుచుంజొచ్చి వియచ్చరసంబాధబంధురంబు నిసర్గ శృంగారతరంగితంబు నగురాజమార్గంబునం జనిచని ముందట నేత్రసన్నిహితజగత్త్రియంబునుంబోలె బహువిధజనాకీర్ణంబై యుదీర్ణవైభవంబునవర్ణింపందగి బృందారక ద్విరదంబుచందంబున వలభిదారూఢోపరిభాగంబును జాంగలక్షేత్రంబువైచిత్రి యవనికామహితంబును నాటకసంధానంబుకైవడి శుద్ధమిశ్రవిష్కంభసంభృతంబును దధీచిశరీరంబుకరణి సురభిగోముఖావిద్ధంబునై యొప్పు గూఢపదతల్పు దివ్యభవనంబుదఱిసి విరసజనహృదయంబులం దగులువడని బ్రహ్మవిద్యయుంబోలె నజిహ్వప్రకారంబున సప్తకక్ష్యాంతరంబులతిక్రమించిముందట.

సీ. నవసుధాపరిఖాంబునివహమువ్బెడుచోట, మెఱుఁగుఁబుత్తడికోటమించుచోట
నిగిడియీగులకెంపు నెలకట్టుగలచోటఁ, గల్వకావిరికారు గ్రమ్ముచోట [ట
నలరుమొమ్మొనలకట్టావులూరెడుచోటఁ, గెలఁకులకొలఁకులు దొలఁకుచోట
గంధర్వగాంధర్వ గంధమింపగుచోట, గరుడకేతనములు గ్రాలుచోటఁ

---

పట్టెడి సాధనవిశేషము. ఆఖేటస్థలంబు=వేఁటాడుచోటు. నర్తన=ఆటాడునట్టి. లెస్సవారిన్ = మంచిపల్లమును ; మంచిజలమును. సంవిధానంబు = కబళము ; మంచియాజ్ఞగలది. పట్టులన్ = చోట్లయందు. హరి=సింహము; విష్ణువు. మాధవుఁడు=వసంతుఁడు; విష్ణువు. చక్రి=పాము; విష్ణువు. శ్రీఖండతరువు=గంధపుమ్రాను. కోటరము=తొఱ్ఱ. నిడువాలుగంటి=నిడుపును మనోజ్ఞమునైనకన్నులుగలది—స్త్రీ. వియచ్చర సంబాధబంధురంబు = దేవతలచే ఇఱుకటమై యొప్పినది. నిసర్గ=స్వభావముచేఁగలిగిన. ఉదీర్ణ=మిక్కుటమైన. ద్విరదంబు=ఏనుఁగు. వలభిదారూఢోపరిభాగంబు = ఇంద్రుఁడెక్కిన మీఁదిభాగముగలది; ముంజూరుపట్టెమీఁద పొందిన మీఁదిభాగముగలది. జాంగలక్షేత్రంబువైచిత్రిన్ = మెట్టపొలము విధమున. యవనికామహితంబు = ఓమముచేత పూజ్యమయినది, తెరచీరచేత దొడ్డది. విష్కంభ సంభృతంబు=విష్కంభమనెడి యంగముచేత చక్కగాభరింపఁబడినది; గడెమ్రానిచేఁ జక్కగా భరింపఁబడినది. సురభిగోముఖావిద్ధంబు = మనోజ్ఞమయిన వజ్రాయుధపుమొనచే తొలువఁ బడినది, మంచివాసన ద్రవ్యములచేత అలుఁకబడినది. గూఢపదతల్పు=శేషశాయియైన విష్ణునియొక్క. తఱిసి=సమీపించి. అజిహ్వప్రకారంబునన్ = నాలుక లేనిదానివలె; కప్పవిధమున. సప్తకక్ష్యాంతరంబులు=ఏడుతొట్టికట్లు ॥ ౧౫౭ ॥ నవసుధా=క్రొత్తయమృతపు. పరిఖాంబునివహము = అగడ్త నీటిసమూహము, పుత్తడి=బంగారు. ఈఁగుల్లకెంపు =

తే. బరమయోగివరేణ్యాని ర్భరసమాధి, సౌఖ్యసంపదనిరపాయ సంప్రదాయ
సిద్ధిదులకించుచోట న శేషభువన, వివిధధర్మంబులావిర్భ వించుచోట. ౧౫౮

క. బహుయోజన విస్తీర్ణము, బహునారీజనయుతంబు బహువిధమహిమా
వహము నగునొక్క కేళీ, గృహమున నానందకోర కితమానసుఁడై. ౧౫౯

మ. కలదోఃకంకణఝుంకృతంబుల మరుత్కన్యల్ సుధాబిందుపి
చ్ఛిలనీహారమయూఖబింబసదృశ స్విన్నాననశ్రేణి వ
ర్తిల నొయ్యొయ్యన నూఁప నూఁగు ఫణభృత్పర్యంకభోళికన్ లచ్చిని
ట్టలపుంజన్గవఁబోలు మున్నొరగు ముం డాచేసి యుల్లాసియై. ౧౬౦

క. దీపించువానిఁ ద్రిభువన, దీపకుఁ డగువానిఁ జంద్ర దినకరమయవీ
క్షాపాతదళితనిజభ, క్తాపద్ధ్వాంతప్రవాహుఁ డనఁదగువానిన్. ౧౬౧

తే. నగవునురవులుమణిపూరనలినహంసి, కుస్తలగ్రాహములునేత్రకుముదరుచియు
గలుగుతనుకాన్తికాళిన్దిగన్నతరుణ, తరణియనుబోనియురమురత్నంబువాని

తే. పుండరీకతపోజాతభువనపీఠ, విన్నపముసేయు నజునంస వీథిఁ గేలు
సాచి హేమాద్రికంధరా సక్తమేఘ, మాలికం బగుగగనంబుఁ బోలువాని.

తే. లలితలక్ష్మీనఖాంకుర లాలనమున, గ్రమకల్హారదళగంధ గౌరవమున
నతులనైపథ్యరత్నచంద్రాతపమున, నొప్పుమీరిన నునుసేస కొప్పువాని.

తే. ఊరయుగళంబుమీఁదఁ జెల్వారునడిమి, తానవంబునెపంబునదనుజసదన
నిర్మిత స్తంభసంభవ నిజపురాణ, పురుషహరిలీలఁ దెలిపెడు పొలుపువాని.

---

చింతామణి. నెలకట్టు=తాతికట్టడపునేల. కావిరి = నలుపు. కట్టావులు=మిక్కిలి శ్వాసములు. తొలఁకు=తొనుకు. గాంధర్వగంధము=పాటవలనివాసన. క్రాలు=ప్రకాశించు. నిర్భర=హెచ్చైన. తులకించు = ప్రకాశించు ॥ ౧౫౮ ॥ కోరకిత = మొలకలెత్తుచున్న ॥ ౧౫౯ ॥ కలదోఃకంకణ = అవ్యక్త మధురములైన చేతికడియములయొక్క. మరుత్కన్యలు=దేవతాస్త్రీలు. పిచ్ఛిల=పేరిన. స్విన్న=చెమటపట్టిన. ఒయ్యొయ్యనన్ = మెల్లమెల్లఁగా. ఫణభృత్పర్యంకభోళికన్=పాముఉయ్యాలయందు - శేషశయ్యయందు. నిట్టలపుం జన్గవన్=ఎచ్చైన స్తనములజంటను. మున్నొరగు=ముందటి యొరగుదిండు. మున్ డాచేసి = ముందటి తట్టానించుకొని ॥ ౧౬౦ ॥ వీక్షాపాత = చూపుయొక్క పాటుచేత. ఆపద్ధ్వాంత ప్రవాహుఁడు = ఆపదలనెడి చీఁకట్ల వ్యాపనము గలవాఁడు ॥ ౧౬౧ ॥ గ్రాహములు = మొసళ్లు. తరుణతరణి = లేఁతసూర్యుఁడు ॥ ౧౬౨ ॥ అజునంసవీథిన్ = బ్రహ్మయొక్క మూఁపుప్రదేశమునందు. కంధరాసక్త మేఘమాలికము = మెడయందంటిన మబ్బుచాలుగలది ॥ ౧౬౩ ॥ నైపథ్య=అలంకారమువలని. చంద్రాతపమునన్=వెన్నెలచేత. సేసకొప్పు=కొండెసిగ ॥ ౧౬౪ ॥ తానవంబు=సూక్ష్మత్వము. పురాణపురుష హరి = పురాతనుఁడైన నృసింహుఁడు ॥ ౧౬౫ ॥ అభినవాయాతున్=క్రొత్తగావచ్చినవానిని. నాభివేశంతజలజము=బొడ్డుపడియ

తే. అభినవాయాతుఁ దనపుత్త్రునజునిఁ గాంచి, సంతసంబున నాభివేశంతజలజ
ముబ్బి వెలిఁ గ్రాయుపుప్పొడియొఱపునెఱపు, హళఁదిపుట్టంబుకటిసీమనమరువాని
తే. అడుగునడుగులఁబొడమ చిహ్నంపుమీల, మేనిచిప్పలుపోలె నానానిలింప
కనకకోటీరహీరాగ్ర ఘర్షణమున, మెఱుఁగువచ్చిన నఖపఙ్క్తి మించువాని
తే. ఆద్యుఁ బ్రణవస్వరూపు వేదాంతవేద్యు, మోక్షవిద్యోపదేష్టనిర్ముక్తజనను
విష్ణుఁ బ్రభవిష్ణు నిత్యవర్ధిష్ణుఁ గాంచి, మ్రొక్కె నారీజనోచితంబుగ ధరిత్రి.
క. మ్రొక్కి వినుతించెఁ దనమది, నెక్కొను నెగులెల్ల నేలనెలఁతుక కన్నీ
రొక్కొక్కబొట్టు మెఱుఁగుం, జెక్కుల దిగజాఱ గోరఁ జిమ్ముచు హరికిన్.
క. బలుఁ వేఁగునొప్పి నిమ్మై, నిలపలికినపలుకు కతన హృదయము గలఁగెన్
నలినోదరునకు విలయా, నిలయాతాయాతచలిత నీరధిపోలెన్. ౧౭౦

వ. ఇవ్విధంబున నమ్మధుమథనుండు వసుంధరమీఁదంగల కనికరంబునం దరం
గితంబగునంతరంగంబు తదభిరక్షణంబునకభిముఖంబుగావించి యటమున్న
యకాండప్రళయం బగుపుండరీకుతపోదహనంబు దురవగాహంబును త్రిభు
వనదాహదోహళంబునగునని విన్నపంబుచేసి డాసియున్న విరించిం గించి
త్ప్రహసితాననుండై కనుంగొనుచు. ౧౭౧

సీ. శాంబరీకచ్ఛపేశ్వరకంఠసందీప్త, తాపింఛవల్లిమ తల్లి యనఁగఁ
బవనపారణపతి స్ఫాటికస్తంభజంభద్విషన్మణిసాల భంజియనఁగ
సవనవరాహదంష్ట్రాఖనిత్రప్రోత, కనకాక్షఘనకాల ఖండమనఁగఁ
గకుబంతకరివరస్కంధసింధుద్వీప, సాంసారికాసిత హంసి యనఁగ

---

యందలితామర. వెలిగ్రాయి = బయటనుమియు. ఒఱపు = అందము. హళఁదిపుట్టంబు = పసుపు
పచ్చనివస్త్రము || ౧౬౬ || హీర = వజ్రమణులయొక్క. ఘర్షణమునన్ = ఒరపిడిచేత || ౧౬౭ ||
|| ౧౬౮ || నెక్కొను = పాదుకొను. నెగులు = దుఃఖము || ౧౬౯ || బలుఁ వేఁగునొప్పిన్ = అధిక
భారమనెడివ్యాధిచేత. నలినోదరునకున్ = విష్ణుదేవునికి. యాతాయాతచలితము = పోకరాకలచేత
చలించినది || ౧౭౦ || మధుమథనుండు = విష్ణువు. అటమున్న = అంతకుముందే. అకాండప్రళ
యఁబు = కాలముగానికాలమున నగుప్రళయము. తపోదహనంబు = తపస్సువలనియగ్ని. దురవ
గాహంబు = ఆకళింపుచేసికొనశక్యముగానిది. త్రిభువనదాహదోహలంబు = మూఁడులోకములను
గాల్చుటకుసమర్థమయినది. డాసి = సమీపించి || ౧౭౧ || శాంబరీకచ్ఛపేశ్వర = మాయతాఁబేటి
రాజుయొక్క. తాపింఛవల్లి=చీఁకటిమ్రానితీవ్య. పవనపారణపతి = సర్పరాజు. జంభద్విషన్మణి=
ఇంద్రనీలము. సాలభంజి = పుత్తడిబొమ్మ. సవనవరాహ = యజ్ఞవరాహముయొక్క. ఖనిత్ర =
గుద్దలిచేత. ప్రోత = గ్రుచ్చఁబడిన. కాలఖండము = కడుపులోనియవయవవిశేషము. కకుబంతకరి =
దిగ్గజము. సింధుద్వీప = ఏటినడిదిబ్బయందలి. అసితహంసి = నల్లఆఁడుహంస. భూరిభూభృ

తే. భూరిభూభృచ్ఛిఖోద్యన్మయూరియనఁగ, నృగుభగీరథభరతాదినృపభుజాగ్ర
ఘటితకాలాగరుస్థాసకంబనంగఁ, దగు వసుంధరఁ గృపఁ బల్కు దైత్యభేది.

శా. ఓయంభోరుహపత్రనేత్ర! మది నీ యుద్వేగముఁ మాను దై
తేయప్రాయనృపాన్వవాయముల మర్దింతుఁ భవద్భారముఁ
బాయం ద్రోయుదుఁ జేయుదుఁ సుఖులగా మద్భక్తియుక్తాత్ములఁ
మాయామానుషమూర్తినై పొడమి నా నావిక్రమక్రీడలఁ. ౧౨౩

సీ. క్రూరాసిధారావిదారితద్విపకుంభ, కూటముక్తాశుక్తి గోస్తనములఁ
బటుగదాపాతనిర్భగ్నసైంధవశిర, స్స్రవదస్రకుంకుమస్థాసకముల
శరలూనరథకేతు సౌవర్ణకింకిణీ, కుసుమగుచ్ఛచ్ఛటాగుంభనముల
ముసలమర్దితపదాతిసహస్రభూషాన వీనరజఃపటీవేల్లనముల

తే. విజయలక్ష్మికి నైపథ్యవిభవ మొసఁగి, చటులరోషకషాయితాశయవిరోధి
యూథమథనక్రియాహేతు యుద్ధకేళిఁ, దేలి నీ కిత్తు నానంద మోలతాంగి!

వ. మత్కృతంబులు మదీయరచితంబులు నగు నగణితాహవక్రీడనంబుల సక్రోధవిరోధివధంబొనరించి తదీయకంఠనాళకరాళ రుధిరధారాసారంబుల నీకుం దాపోపశమం బాపాదించెదం బాపకారినిరసనంబు నాకు నవశ్యకృత్యంబగుట యెఱుంగవే యుత్తరంబగు భవద్భారంబు తొలంగించుటయ కాదు సముత్పాదితత్రిభువనోపప్లవం బగు పుండరీకతపోదహనవిహారంబు వారించుతలంపునున్నయది యిన్నలువ యిప్పుడిటమున్న తన్నిమిత్తంబని పనివిన్నవాఁడు

---

చ్ఛిఖోద్యన్మయూరి=విస్తారమయినకొండలనెడి శిఖలుపుట్టుచున్న ఆఁడునెమలి. కాలాగరుస్థాసకము=నల్లయగరుతోఁజేరినకుంకుమపువ్వు మొదలగువానిపూఁత ॥౧౨౨॥ ఉద్వేగముఁ=మనోవ్యథను. దైతేయప్రాయ = రాక్షసులనుబోలిన. అన్వవాయములఁ = వంశములను ॥ ౧౨౩ ॥ అసి= కత్తి. కూట = శిఖరమునందలి. ముక్తాశుక్తి = ముత్తెపుఁజిప్పలచేనైన. గోస్తనములఁ = నలువదిపూసల హారములచేతను. పాత = పాటువలన. నిర్భగ్న = మిక్కిలిభంగమునొందిన. సైంధవశిరస్స్రవదస్రకుంకుమస్థాసకములఁ=గుఱ్ఱములతలలయందుండి కాఱుచున్న నెత్తురనెడి కుంకుమపువ్వుతోడి పరిమళచందనపుపూఁతలచేతను. శరలూన=బాణములచేతనఱకఁబడిన. సౌవర్ణ = బంగారుమయములైన. గుంభనములఁ = కూర్పులచేతను. నవీనరజఃపటీవేల్లనములఁ=క్రొత్తధూళియనెడి జాలరులచేతను. నైపథ్యవిభవము=అలంకారవైభవమును. చటుల=చలించెడి. రోషకషాయిత=కోపముచేత ఎఱ్ఱవారిన. ఆశయ = మనసుగల(లేక)స్థానమయిన ॥ ౧౨౪ ॥ క్రీడనంబులు=ఆటలు. సక్రోధ=కోపముతోఁగూడిన. కంఠనాళ=గొంతుక్రోవులందలి. ఆసారంబులఁ = ఎడతెగనిధారలుగలవానలచేత. ఆపాదించెదను = కలిగించెదను. పాపకారినిరసనంబు=పాపముచేయువారిని చంపుట. ఉత్తరంబు = అధికము. సముత్పాదిత = కలుగఁజేయఁబడిన. ఉపప్లవంబు = ఉపద్రవముగలది.

ఎన్నికదినంబులనిన్నియు శుభోదర్కంబులయ్యెడునని పుడమిపడఁతి యడ లుడిపి సగౌరవంబుగావీడుకొలిపి పరమపురుషుం డంతర్ధానంబునొందె. శతా నందుఁడును సానందంబుగ యథాస్థానంబునకుం జనియె నిట్లు. ౧౭౫

ఆ. పుండరీకుతపము భూదేవిభారంబు, ఫలమునందఁజేయఁ దొలఁగఁద్రోయఁ
గోరి మర్త్యుఁడయ్యె శౌరి పరార్థమై, పురుషవరులు వికృతి పొరయుటొప్పు.

శ్రీకృష్ణావతార చరిత్రము

సీ. వసుమతీభార నిర్వాపణోద్యుక్తుండు, వర్ధితయాదవా న్వయపయోధి
దేవకీవసుదేవ శేవధి నందమం దిరరసాలావాస పరభృతంబు
పూతనాప్రాణసం ఘూతవాతూలాహి, శకటాంగ విఘటన చటులబుద్ధి
సమదతృణావర్త సంవర్తసమవర్తి, పాతితార్జునపాద పద్వయుండు
తే. వత్సహృత్సాయకం బభి వ్యథితబకుఁడు, మర్దితాఘుండు కాళియ మానభేది
నిష్ఠురానలపారణ నైష్ఠికుండు, కృష్ణుఁ డాశ్రితలోకవ ర్ధిష్ణుఁ డలరు. ౧౭౭

సీ. కనుగట్టి గాంగేయ గర్భు డాఁగుడుమూఁత, లాడించె వత్సాప హరణవేళ
నాలమందలఁబోవ శైలమెత్తెడిపూన్కిఁ, గేలిమై కందుక క్రీడసలిపెఁ
బాటించెఁగంబాల యాట రాసక్రీడ, నాభీరభీరుమ ధ్యాంకపాళి
వెలయించె యక్షాక్షవిహరణం బలకాధి రాజ కింకరశిరో రత్నరాజిఁ
తే. దన్నుబిల్లాడె నంగుష్ఠ దళితసర్ప, తనుసుదర్శననామవి ద్యాధరేంద్ర
కఠినజఠరచ్ఛలమునన గ్రజుఁడుదాను, నందసూనుండుబృందావనంబునందు.

---

నలువ = బ్రహ్మ. ఇటమున్న = ఇంతకుముందె. పనివిన్నవాఁడు = వచ్చినాఁడు. శుభోదర్కం బులు = శుభముగాఁగలకాలములు. అడలు = దుఃఖము. ఉడిపి = మాన్పి. వీడుకొలిపి = పంపి. అంత ర్ధానంబుఁ = కనఁబడకపోవుటను. శతానందుఁడు = బ్రహ్మ ॥ ౧౭౫ ॥ వికృతి = వికారమును. ౧౭౬ ॥ నిర్వాపణ = నశింపఁజేయుటయందు. శేవధి = నిధి. రసాల = తియ్యమామిడిచెట్టునందు. పరభృతంబు = కోకిలము. వాతూల = గాలికి. అహి = పాము. సంవర్త = నాశమునకు. సమవర్తి= యముఁడు. వత్సహృత్సాయకంబు = వత్సాసురుని హృదయమునకు బాణము. అభివ్యథిత = బాధ నొందింపఁబడిన. మర్దితాఘుఁడు=మర్దింపఁబడినఅఘాసురుఁడుగలవాఁడు. నిష్ఠురానలపారణనైష్ఠి కుండు = క్రూరమయినదవానలమును భక్షించునట్టినిష్ఠగలవాఁడు ॥ ౧౭౭ ॥ గాంగేయగర్భుఁ= బ్రహ్మను. ఆభీరభీరు = గోపికాస్త్రీలయొక్క. అంకపాళిఁ = కౌఁగిలింతయందు. యక్షాక్షవిహ రణంబు = కుబేరాక్షుముఅను ఆట. అంగుష్ఠదళితసర్పతను=బొటనవ్రేలితోఁబోఁగొట్టఁబడినపాము దేహముగల ॥ ౧౭౮ ॥ అమానుషంబులు= మనుష్యవిషయములుకానివి. వెన్నునకుఁ = విష్ణునకు. ప్రీణనంబు = తృప్తిని. మత్తకాశిని = ఉత్తమస్త్రీ. తదాదేశంబునఁ = ఆయనదైనయాజ్ఞచేత.

## శ్రీరాధాదేవీ చరిత్రము.

వ. ఇవ్విధంబున నమ్మన్మథుకైటభవిరోధి మాయామానుషవిగ్రహంబునంగీకరిం
చియు నమానుషంబు లగువిక్రమవిశేషంబులం బ్రవర్తించుచుండె నంత
నటమున్న యవ్వెన్నునకు మనఃప్రీణనంబుగావింపందలంచి విరించి నిఖిల
భువనమోహినియగునొక్కశక్తింబుత్తెంచుటయునమ్మత్తకాశినితదాదేశం
బున నందుమఱంది యగు శతగోపుం డనుగోపాలునకుం గూరిమిపుత్త్రియై
పెరుగుచుండె నంత దంతావళ మరాళ శిఖావళగమనంబులగమకంబుదమ
కుందొడవగుచు నిగుడునడవడులం బెడంగారి బంగారంపుమెట్టకెందమ్ములకు
నెత్తురుంబొత్తుచుట్టంబులనం జూపట్టు చిగురుటడుగులును, దారలగౌరవం
బునుముత్తియంబులక్రొందళుకునుచంద్రమండలంబునఖండలావణ్యంబును
సేవగించు చరణనఖముకురంబులును,మకరధ్వజశరధి శాలిగర్భ గోపుచ్ఛ
కాహళా సందర్భంబుల సౌభాగ్యంబు నావరించు చిఱుతొడలును, వలుద
తనంబులు సలపందనంబులు నిద్దంపుఁదనంబులు తద్దయుంగలిగి కరికరాకా
రంబులై కరభనిభంబులై కనకకదళీమృదులంబులు నైన పెందొడలును,
కరటిశిరః కఠినంబును రథాంగరమాధురంధరంబును పులినఘనంబు నగు
జఘనంబును, ఆవర్తవర్తులంబును నితాంతపున్నాగలతాంత కాంతంబును
నతిగంభీరంబు నగు నాభిసరోవరంబును, అసితబిలేశయ బాలికంబునకు
నేలికయై చలిచీమచాలునకుంబోలికయై శైవాలవల్లికిందల్లియై చెలువారు
నూగారును, ఆగడపలంగడవవైచి వీచీరేఖలంబోఁద్రోచి కుసుమనారాచు
కేళాకూళింగల జాళువాసోబనంబులఁ బ్రతిఘటించు త్రివళీవిభాగంబులును,

---

శిఖావళ = నెమలి. గమకము = మనోజ్ఞత. తొడవు = ఆభరణము. బెడంగారి = అంటగించి. కెందమ్ములకున్ = ఎఱ్ఱతామరలకు. చూపట్టు = తోఁచు. లావణ్యంబు=కాంతి.సేవగించు=రోయు. ముకురంబులు=అద్దములు. మకరధ్వజశరధి=మన్మథునియమ్ములపొది. శాలిగర్భ=వరిపొట్టు.గోపుచ్ఛ=ఆవుతోఁక. కాహళ=తుతార. సందర్భంబుల = కూర్పులయొక్క. వలుదతనంబులు=లావుఁదనములు. సలపందనంబులు=రానురానులావుతగ్గియుండుటలు. నిద్దంపుఁదనములు=నునుపుఁదనములు. కరభనిభంబులు=చిటికెనవ్రేలి మొదటనుండిమనికట్టుదాఁకనుండుఅరచేతిలోపలిపార్శ్వభాగమును బోలినవి. మృదులంబులు=మెత్తనివి. రథాంగరమాధురంధరంబు=చక్రసంపద్భారమునువహించినది. జఘనంబు=మడికట్టు.ఆవర్తవర్తులంబు=సుడివంటిగుండ్రఁదనముకలది. పున్నాగలతాంతకాంతంబు=పువ్వువంటిమనోజ్ఞతకలది. గభీరంబు=లోఁతుగలది.అసితబిలేశయబాలికంబునకున్=నల్లత్రాచుపిల్లకు. చెలువారు=అందగించు. ఆగడపలన్=దొంతిమబ్బులను. వీచీరేఖలన్=అలలచాళ్ళను. కేళాకూళిన్=క్రీడాసరస్సునందు.జాళువాసోబనంబులన్ = బంగారుమెట్లను. ప్రతిఘటించు=ఎదిరించు.

కమలకోరక కనకకలశ కరికుంభప్రముఖంబు లగు నుపమాద్రవ్యంబులకొ్రవ్వడంచి పచారించి పిక్కటిల్లి పెరిగి నిక్కి కక్కసించి కవజక్కవలఁ బెక్కువలలం బెట్టుచుఁ జూపట్టు దోర్మూలకూలంకషంబు లగుకుచలికుచంబులును, ప్లక్షపల్లవవల్లభంబును చపేటపుట పరిస్ఫుటంబును నగు వేదీమధ్యనిభ మధ్యంబును, ఫణిఫణాఫలక భాసురంబులును తాంబూలీదళతరుణంబులును నై నిగనిగనిపసిండితగడుం దెగడు కరమూలంబులును, కందర్పకళల చెన్నునం బూవు బెత్తులయెత్తున సోగతీఁగలబాగున బుజగలిగిన బుజంబులును, కలువ ఱేకులచెలువున జోకమీరువాలారుకొనగోరులును పవడంపుఁజివురులపగిది గల రక్తాంగుళిప్రవాళంబులునుంగలిగి నెత్తురుట్టిపడుకరతలంబులును, కంబుబిబ్బోకావహంబునుక్రముకతరుకమనీయంబును కోమలాంశుమత్ఫలాముకుళమోహనంబునగు కంధరాభోగంబును, సమ్మిశ్రవటఫలద్వయశోభాద్వైతనిబిడం బగుచిబుకంబును, చక్కెరలధిక్కరించి తేనెలంబోనాడి చెఱకురసంబుల నిరసించుమధురిమనమరు నధరబంధుజీవప్రసూనంబును, మొల్లల నుల్లసంబాడి యాణిముత్తియంబులను త్తరించి సుధాబిందువులఁ బలువరుసల సరసంబాడుపలువరుసయు, సంధ్యారాగరంజితం బగు కళారాజరేఖ పొత్తువడయు నుత్తరోష్ఠపుటంబును, పరిస్ఫుటనాసికాసుగంధనిశ్వాసధారాధో

---

త్రివళీ=కడుపుమీఁది మూఁడుముడుఁతలయొక్క. కమలకోరక=తామరమొగ్గ. ఉపమాద్రవ్యంబుల=సరిపోల్చువస్తువుల. పచారించి=వ్యాపించి. పిక్కటిల్లి=కదిసి. కక్కసించి=బాధించి. దోర్మూలకూలంకషంబులు = చంకలపార్శ్వముల నొరయునవి. లికుచంబులు=గజనిమ్మ (పండ్లు) ప్లక్షపల్లవ=జువ్విచిగురులను. వల్లభంబును = ప్రియమయినదియు. చపేటపుట=చాఁచినవ్రేళ్లుగల అఱచేతిలోపలిభాగమువలె. పరిస్ఫుటంబు = ప్రకాశించునది. వేదీమధ్య=యజ్ఞవేదిక నడిమిభాగముతోడ. ఫణాఫలక=పలకవంటిపడగవలె. తాంబూలీదళ=తములపాకులయొక్క. పసిండి=బంగారు. తెగడు=తిరస్కరించు. కరమూలంబులు=చంకలు. పూవుబెత్తుల=పువ్వులసరముల. ఎత్తునన్ = విధమున. సోగ=నిడుపైన. బుజ=వక్రువతనము. జోక=అందము. వాలారు=వాఁడులైన. ప్రవాళంబులు = చిగుళ్లు. కంబుబిబ్బోకావహంబు=శంఖమునకు అందమును కలిగించునదియు. క్రముకతరుకమనీయంబు=పోఁకమ్రాని మనోహరత్వముగలది. కోమలాంశుమత్ఫలాముకుళమోహనము=మృదువైన యరఁటిమొగ్గవలె మోహమును బుట్టించునది. కంధరాభోగంబు=మెడయొక్కవైశాల్యము. చిబుకము=గడ్డము. పోనాడి=నిందించి. నిరసించు=తిరస్కరించు. మధురిమన్=తియ్యఁదనముచేత. బంధుజీవప్రసూనంబు=మంకెనపువ్వు. ఉల్లసంబాడి=పరిహసించి. ఆణి=గుండ్రఁదనముగల. ఉత్తరించి=దాఁటి=మీరి. పలువరుసలన్=బహువిధములయిన బావ మామ మొదలగువరుసలచేత. రంజితంబు=ఎఱ్ఱనైనది. కళారాజరేఖ. కళామాత్రమైనచంద్రరేఖ. పొత్తు=స్నేహము. ఉత్తరోష్ఠపుటంబు=పైపెదవి. సుగంధనిశ్వాస ధారాధోరణీనిశితమార్గంబు=మంచివాసనతోడి యూర్పుల ప్రసరణముయొక్క

రణీ నిశితమార్గంబునుంబోని య య్యూర్ధ్వోష్ఠబింబఫలంబుమీఁది నిమ్నభావంబును, సూనసాయకుదోనివిల్లును పల్లవకరవాలులాంగలాయుధంబును సామివికసితచంపకకోరకంబును నువ్వుఁబువ్వును నవ్వుచునివ్వటిల్లునుల్లక్షిత నాసికాశిఖరంబును, సితమయూఖరేఖాసఖం బగు నొసలును, నింబకిసలయంబుల కపనయంబొందించు ముక్కును, నరంటిమొక్క మొదలియాకు టెక్కులనెక్కసక్కెంబు సేయుచుఁ గాయజుసింగిణులవంగడం బగునెలవంకి కన్నుబొమలకొమలును, చకోరంబుల ప్రకారంబును జేరలతీరును సారసంబులదారసంబును మీలమేలును మెఱపులయొఱపును మసతూపుల కోపును నుత్పలంబులయొప్పును కైరవంబులగౌరవంబును నేణనేత్రంబులవైచిత్రియు విసూత్రితంబులుగావించి మించు శ్రవణపుటకూప పతయాళువు లగువిలోల విలోచనంబులును, దర్పణంబుల దర్పంబును సరోజంబుల యోజయు సుధాకలశంబుల విలసనంబును నంబురుహబింబంబులమదంబునుంబోషించి య శేషకళాకలాపపాణింధమస్వరభాస్వరం బగు వదనవలయంబును, శ్రీకారంబులజోకయుఁ దొమ్మిదింటిలెక్కలయొమ్మికయు మోదుగువిసలసిరులను బోసరించి వాసివడయు శ్రుతిశష్కులికలును, నిష్కలంకంబులై నిబిడంబులై నిద్దంబులై నీరంధ్రంబులై నీలంపుగుంపులసొంపు లాముతించు మంచినెఱికురులునుం గలిగి వలరాజునెత్తపలకతళుకునం గనుపట్టుపేఁపునేపారి యామోదపారిజాతామోదమేదుర విలాసంబుల భాసిల్లె వెండియు.        ౧౭౯

ఆ. వివిధయువతికోటి వేమఱు సృజియించి, యవ్విధాతృఁ జేయ నజ్జుఁడు తలఁచి
   కేలుదోయిగడుగ వ్రేళుల తుదనంటు, జలకణంబు లేమొ సతినఖాళి. ౧౮౦

---

అడ్డములేని చుఱుకుగలదారి. పోని=వంటి. బింబఫలంబు=దొండపండు. నిమ్న భావంబు=పల్లము. దోనివిల్లు=అల్పధనుస్సు. పల్లవకరవాలు=మన్మథునియొక్క. సామి=సగము. చంపకకోరకంబు = సంపెఁగమొగ్గ. ఉల్లక్షిత=మీఁదికినిక్కిన. నాసికాశిఖరంబు = ముక్కుమొన. సఖుము=మిత్రము. ఎక్కసక్కెంబు=పరిహాసము. వంగడంబు=వంశము. తారసంబు= తలపడుట—అతిశయము. ఒఱపు=అందము. కోపు=విధము. విసూత్రితంబులు=సూత్రములేనివి. పతయాళువులు=పడునట్టి స్వభావముకలవి. విలోల=మిక్కిలి చలించెడి. ఓజ=విధము. విలసనము=ప్రకాశము. పాణింధమ=ఊఁదుతిత్తి. అంబురుహబింబంబుల = చంద్రబింబముల. జోక=విధము. ఒమ్మిక=ఇమిడిక. పోసరించి = బలిసి. శ్రుతిశష్కులికలు = చెవులనెడి చక్కిలములు. నిబిడంబులు=నిండుకొన్నవి. నిద్దంబులు=మెఱుఁగుగలవి. నీరంధ్రంబులు=సందులేనివి. సొంపులు=అందములు. ఆముతించు = పూజించునట్టి. నెఱి=వంకరగల. వలరాజునెత్తపలకతళుకునన్ = మన్మథుని సొగటాలాడుపలకయొక్క ప్రకాశముచేత. ఏపారి=అతిశయించి. ఆమోదమేదుర = పరిమళాతిశయముయొక్క. ॥ ౧౭౯ ॥

తే. అంబుజాననపెందొడ లరఁటులగుట, దానఁగలిగిన లావణ్య సూనభరము
వలనిపై తేకులొకరెండు వ్రాలిపోర, గిలఁబడినరీతి మీఁగాళ్లు లలరు సతికి.

క. మదిరాక్షిజంఘ లంగజు, గదలగు నూహింపఁ గావు కాహళులైన
న్నదుకువడక గీపెట్టక, పదనుదివిసి రాగిదేఱి పలుకకయున్నే. ౧౪౨

తే. కరికరంబులు త్వగ్దోషకల్మషంబు, నపనయింపంగ సతియూరు లైపొడమియుఁ
బుష్కరంబులతగులంబుఁబూనెచరణ, దంభమునబూర్వవాసనతలఁగుకొట్లు

తే. బిసరుహాననకటిసీమ పృథివియగుట
నిక్క మటుగాకయున్నఁ బై నెలవుకొను నె
కాంచియును మధ్యమాయయుఁ గ్రమనాభి
లక్ష్మియును ద్వారవతియు సలక్షణముగ. ౧౪౪

తే. సకియనాభి యమునునుండి జవ్వనంపు, బాలకృష్ణుండు వెడలింప బయలుపడిన
కాలియఫణీంద్రుఁడేమొ రోమాళిమధ్య, విష్ణుపదమునణఁగినవిధముగలిగె

ఉ. మానవతీలలామతను మధ్యమమర్గజవైరి కుల్కి త
ద్యానమరున్మదావళము యౌవనపుంబొదరిల్లు దూఱఁగాఁ
గానఁగవచ్చు కుంభములు గావుగదా కుచకుంభయుగ్మకం
బౌనటులైన వల్లభన ఖాంకుశరేఖలుగల్గి మీటగున్. ౧౪౬

తే. వళులులావణ్యవారిధి వలననిగుడు, వీచిలతికలుకాఁబోలు వెలఁదికేలు
విపులకంకణమంగుళీవిద్రుమంబు, మత్స్యరేఖాంకితమునగుమహిమకలిమి.

తే. ముదితకరమూలములయొప్పు ముచ్చిలించి
యాకయుండిననొక్కనాళీకభవుఁడు
ఫణిగణంబులఁ దదోగ్గ పద్మరాగ
యోగమున ఱాలు మోపించుచున్నవాఁడు. ౧౪౭

---

౧౪౦ ‖ సూనభరము = పూగుత్తి ‖ ౧౪౧ ‖ ౧౪౨ ‖ త్వగ్దోష కల్మషంబున్=తోలువలని దోష మయినముఱికిని. పుష్కరంబుల = తామరల ; తొండపుఁగొనల. తగులంబున్=ఆసక్తిని—సంబంధమును. దంభమునన్ = నెపముచేత. తలఁగుట=తొలఁగించుట ‖ ౧౪౩ ‖ కాంచి=మొలనూలు; ఒకపట్టణము. మాయ=ఇంద్రజాలము—లేమి, ఒకపట్టణము. ద్వారవతి = ద్వారములుగలది; ఒకపట్టణము.‖ ౧౪౪ ‖ రోమాళి=నూఁగారు. విష్ణుపదమునన్ = విష్ణుని పాదమునందు; ఆకాశమునందు ‖ ౧౪౫ ‖ ఉలికి=భయపడి. మరున్మదావళము=దేవతలయేనుఁగు ‖ ౧౪౬ ‖ కంకణము= నీటిబొట్టు ; ముంజేతికడియము. విద్రుమంబు=చిగురు; పగడము. మత్స్యరేఖ=చేఁపరేఖ ; చేఁపల

ఆ. కంబుపాణి తనకుఁ గాంతుండుగాఁగల్గు, టెఱిఁగి కంఠకంబు నింతిదాల్చె
నొక్కొ యొప్పుగాదె యుత్తమసతులకుఁ, బతులుపూనినట్టి వ్రతముదాల్పు.

తే. సోమబింబాస్యదశనవాసోమతల్లి, యొప్పు చంద్రికనెఱడాలు గుప్పళించి
జిలుఁగుఁబలుచనివాసోవిశేషములకు, జెన్నెసగుగాదెయెటువంటికన్నెకలిమి

తే. అలరుఁదేనియ నానిచి మొలకగట్టి, శర్కరాబీజములు సుధాశాదభూమి
భానజుఁడువిత్తమొలచిన పైరుపేర, వెదవిలాసంబుపూఁబోఁడి పెదవిపదవి

తే. దాడిమీబీజరాజికెందళుకుమొల్ల, మొగ్గలపిసాళమునుముత్య ములసుపాణి
తమ్మిపువ్వింటఁగొలువున్న నెమ్మివడయు, దంతురాలకసుస్నిగ్ధదంతపఙ్క్తి.

తే. క్షీరకంఠంబులనిబ్రహ్మవారువముల, గెంటసంబాదునడగల్గు కిసలయోష్ఠి
సుస్వరములెక్కగనునోటుసూపినిత్య,పల్లవగ్రాహిపాండిత్య పరభృతములు.

క. వదనారవిందదళమున,మృదుగతి జను మందహాస మిషచంద్రిక ల
మ్మదదంతావళగమనకు,నుదధిశయనదృక్చకోర యుగహర్షదముల్. [ము

తే. యువమనోజాంగలక్షేత్రముత్తరించి,గరుసువడదున్ను మదనలాంగలికుహాల
కామినీమణిముక్కుగాకయున్న, నాసికాభరణపుఁగఱ్ఱు నాటునోటు.

క. బిసరుహరజమునఁ బైకం, దుసిమిన దగదగవెలుంగు నుడురాజుక్రియన్
బిసరుహపాణిముఖాంబుజ,మసమాయుధసాధకుంభ మైజృంభించున్. ౧౮౬

క. ఆవృత్తోర్మిలులితరా, జీవములకు మరుపతాక జీవంబులకున్
జీవంజీవంబులకా,జీవంబులు చెలువకన్ను సిమలమెఱుంగుల్. ౧౮౭

తే. వాసుదేవాదినవశక్తి వైభవంబు, రుక్మిణీసత్యభామల రూపరేఖ [దకమను.
యిదియొవహియించుననవల్పయిడినపదునొ,కొంటిలెక్కనఁగనుబొమ్మలువి

---

చాలు ॥ ౧౭౭ ॥ ౧౭౮ ॥ కంబుపాణి=విష్ణువు ॥ ౧౭౯ ॥ దశనవాసోమతల్లి=మేలిమైన పెదవి. చంద్రిక=వెన్నెల; కుసుంబావర్ణము. గుప్పళించి=వ్యాపింపఁజేసి. జిలుఁగు=సూక్ష్మమైన. వాసోవిశేషములకున్ = వస్త్ర విశేషములకు. కన్నెకలిమి=నూతనసంపద ॥ ౧౮౦ ॥ శాదభూమి=అడుసునేల. వెద=విత్తనాలుజడ్డిగమునందు దిగవిడుచుట ॥ ౧౮౧ ॥ కెందళుకు=ఎఱ్ఱనిమెఱపు. పిసాళము=వికాసము. సుపాణి=స్వచ్ఛమయిన మెఱుఁగునీరు. దంతురాలక = నొక్కుల పొడివెండ్రుకలుగలది ॥ ౧౮౨ ॥ గెంటసము=పరిహాసము. ఓటు=ఓటమి=అపజయము. పల్లవగ్రాహి=చిగుళ్లనుగ్రహించునది; విటులనుగ్రహించునది. పాండిత్య=నేర్పుగల. పరభృతములు = కోకిలములు ॥ ౧౮౩ ॥ ౧౮౪ ॥ జాంగలక్షేత్రము = బీటిపొలము. గరుసు=మేర—మెత్తని. నాటునోటు = నాటునా ॥ ౧౮౫ ॥ రజమునన్=పుప్పొడిచేత. ఉసిమినన్=తోమి కడిగివేయఁగా. జృంభించున్=విజృంభించును ॥ ౧౮౬ ॥ లులిత=చలింపఁజేయఁబడిన. మరుపతాక జీవంబులకున్ = మత్స్యములకును, జీవంజీవంబులకున్=చకోరములకును ॥ ౧౮౭ ॥ నవశక్తులు—ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియా

చ. పడతిముఖాంశునిష్కములు భాసురవర్ణ లలాటపత్రకం
బిడి ఋణలీలఁ గైకొనియె నిందుఁడు నద్దము సాక్షిగాఁగ నె
న్నఁడొ జలజాత మప్పు జత నంబుగఁ దీర్పనిబల్మి నొక్కపే
రడుసున నీట నెండ నిల నాఁగిన దూఁగిన నోర్చుచుండుటల్. ౧౯౯

తే. సితకరశ్రీఁబయోరుహ శ్రీని జేయు, కాంత మొగమని శ్రుతిపుటీ కైతవమున
నలువ వ్రాసినశ్రీకార ములయుగంబు, వర్ణనాతీతరుచిమించు కర్ణయుగళి.

సీ. ముఖ మంబురుహమని ముమ్మరంబుగ నప్ప ళించుతేనియదిండి లెంకలనఁగ
నాననచంద్రుని యంకకర్దమ మొక కడకోసరించిన పాడవనంగ
నధరసుధాపూరి తాస్యహేమకలశి మూసిన నీలంపు మూఁకుడనఁగ
వదనపద్మనిధిపై వ్రాలినయువమనో మోహాంధకారస మూహమనఁగఁ

ఆ. గఱకుఁదనముఁ జాలఁ దఱచుఁదనంబును, నెరులసిరులుగలిగి విరులపేరి
కీర్తిబుగులుకొనగఁ గిసలయాధరగొప్ప, కొప్పు కప్పుమీఱి యొప్పుటొప్పు.

క. వలరాజు కేలివాలుం, బలకయుబలె నలరు వేణి పాణింధమమై
లలితాంగి వెన్నుపట్టియ, ధళధళమనుకుందనంపుఁ దగడుఁ దెగడున్. ౨౦౨

శా. ఈ ధారన్ భువనైకమోహనకళా హేలావిలాసంబులన్
రాధాకన్యక ధన్యకాంతిఁ దనరారన్ దద్వశాశారతిన్
గోధుగ్బాలకదివ్యమూర్తి యగుశ్రీ గోవిందుఁ డంభోజినీ
మాధుర్యంబున కగ్గలించు నళిస మ్రాడాకృతిం గైకొనున్. ౨౦౩

క. ఆ రాధామాధవులకుఁ, గోరిక లన్యోన్యహృదయ కోటరముల నం
కూరితములయ్యె దినముఖ, వారిజగర్భముల నుబ్బు వాసనలక్రియన్.

---

శక్తి, ఉత్సాహశక్తి, ప్రభుశక్తి, మంత్రశక్తి, సత్వశక్తి, రజశ్శక్తి. తమశ్శక్తి ॥౧౯౮॥ నిష్కములు=వరహాలు. పత్రకంబు = పత్రము. ఆఁగినన్=అడ్డగించినను. తూఁగినన్=ఊఁగినను ॥ ౧౯౯ ॥ ౨౦౦ ॥ ముమ్మరంబునన్ = అధికముగ. అప్పళించు=కప్పునట్టి. తేనియదిండిలెంకలు = తుమ్మెదబంట్లు. ఓసరించిన = తొలఁగించిన. పాడవు= ఆకృతి. హేమకలశి = బంగారుకలశము. విరులపేరికీర్తి= పువ్వులనెడి కీర్తి. బుగులుకొనఁగన్=వ్యాపింపఁగా ॥ ౨౦౧ ॥ వాలున్=కత్తియు. పలకయున్= కేడెమును. పాణింధమమై = చీఁకటియై. తెగడున్ = తిరస్కరించును ॥ ౨౦౨ ॥ ఈధారన్= ఈవిధమున. హేలా=ఒయ్యారముగల. గోధుగ్బాలక దివ్యమూర్తి=గొల్లపిల్లకాయయొక్క అప్రాకృతమయిన యాకారముగల వాఁడు. అంభోజినీ = తామరయొక్క. అగ్గలించు = ఉత్సహించు. అళిసమ్రాట్ = తుమ్మెదరాజుయొక్క ॥ ౨౦౩ ॥ కోటరములన్ = తొఱ్ఱలయందు. అంకూరిత

శా. చాణక్యప్రథితప్రభావ సుషమా సర్వస్వపుష్పాస్త్ర శ్రీ
వాణీ నిత్యనివాస నేత్ర ముఖ సే వా సావధానాఖిల
క్షోణీనాథచమూపనందనభుజా కోదండలంకారి య
క్షీణోదర్క జితార్క సూనృతలతా శృంగారచైత్రాగమా! ౨౦౫

క. సకలాస్థానసరోవర, నికరమరాళాయమాన నిజకీర్తివిభా
ముకురప్రతిఫలితదయా, సుకృతవితరణప్రతాప శుభముఖ్యగుణా!. ౨౦౬

మాలిని. వితరణరణదక్షా వేదపద్యాసపక్షా
చతురమతివిశేషా సారసంగీతపోషా
క్రతుభుగధిపభోగా కావ్యదత్తానురాగా
ప్రతిభయభుజగర్వా భక్తికాభ్యాస శర్వా! ౨౦౭

గద్యము. ఇది శ్రీ పరమపదనాథ నిరవధిక కృపాపరిపాకపరిచిత సరసకవితా సనాథ రామకృష్ణకవినాథ ప్రణీతంబైన పాండురంగ మాహాత్మ్యం బను పరమభాగవతచరిత్రంబునందుఁ దృతీయాశ్వాసము.

---

ములు = మొలకలెత్తినవి. దినముఖ = ప్రాతఃకాలమునందు ॥ ౨౦౪ ॥ ప్రథిత = ప్రసిద్ధమయిన. సుషమాసర్వస్వ = మనోజ్ఞతయొక్క సమస్తమునుగల. భుజాకోదండ లంకారి = చేత విల్లుపట్టుటయందు శ్రీరాముఁడా. అక్షీణోదర్క=తక్కువకాని భవిష్యత్ఫలములుగలవాఁడా. జితార్క= (తేజస్సుచేత) జయింపఁబడినసూర్యుఁడుగలవాఁడా. చైత్రాగమా=వసంతుఁడా ॥ ౨౦౫॥ ౨౦౬॥ సపక్ష = సమానపక్షముగలవాఁడా. క్రతుభుగధిప = దేవేంద్రునియొక్క. ప్రతిభయ = శత్రువులకు వెఱపునుగలుగఁజేసెడి. భక్తికాభ్యాసశర్వా = సేవకాభ్యాసమునందుశివుఁడా ॥ ౨౦౭ ॥



శ్రీకృష్ణాయనమః.

# పాండురంగమాహాత్మ్యము.

## చతుర్థాశ్వాసము.

క. శ్రీద్యుతిసువర్ణరేఖా, విద్యోతిత సదన నికష విద్వదనీక
ప్రద్యోతన నుతగుణశత, వేద్యా రామానుజేంద్ర వేదాద్రీశా! ౧

వ. ఆకర్ణింపు మా నిలింపనదీకిరీటుండు హాటకగర్భసంభవునితో నిట్లనియె. అట్లు దినదినప్రవర్ధమానం బగు ననురాగంబు చిగుఱుంగొమ్మనుం జేగ యై కొన సాగుచునికిం దనికి రాధ మాధవుం దనకు నధినాథుంగాఁ గోరి గోవర్ధనాచలసమీపవర్తి యగు ఋణవిమోచనతీర్థంబునం దపంబు సేయం గడంగి. ౨

సీ. ననలక్రొందోడిమ యొత్తిన గంటగిలు మస్తకం బెట్టులోర్చెనో కఱకుజడలు
కస్తూరితిలకంబు గాలివాఱిన నేర్చు, నొస లెట్లు ననిచెనో భసితమునకు
వజ్రాలనూలు నోర్వని కటీతటి యెట్లు, తాళెనో పటుదర్భదామకాంచి
జిలుఁగుదువ్వలు వింత బెళకినఁ గరుదాల్చు, తను వెట్టులోర్చెనో ధాతువస్త్ర

తే. భరణమునకంచు జనము లచ్చెరువునొందఁ, గొమ్మ గావించె దపమట్టి క్రూరనిష్ఠ
కడలికంపించుక్రియ జగంబడలి వణఁకఁ, దత్సమయజాత హేమంతతరుణవాత్య. ౩

శా. తత్తాదృఙ్మదజృంభమాణతరుణీ తారుణ్యసంపద్దశా
ప్రోత్తుంగ స్తనవిస్తు లోష్ణకవచంబుల్ పూనఁగా నోఁచుటల్

---

లఘుటీక.—విద్యోతిత = ప్రకాశింపఁజేయఁబడిన. నికష=సానఱాయియైన. అనీక =సమూహము గల. ప్రద్యోతన=సూర్యుఁడా - విద్వాంసుల యొరయికచేత త్వష్టచేత సానపెట్టఁబడిన సూర్యుని వలెఁ బ్రకాశించువాఁడా ॥ ౧ ॥ నిలింపనదీకిరీటుఁడు = శివుఁడు. హాటకగర్భ సంభవునితోన్ = నారదునితో. చేగ=చేవ. తనికి = ప్రకాశించి ॥ ౨ ॥ ననలక్రొందోడిమ యొత్తినన్ = పువ్వుల క్రొత్తతోడిమ యొత్తుకొనినను. కంటగిలు=నొచ్చుకొను. ఏర్చు=మండు. ననిచెనో=అనురాగము నొందెనో. నూలు=మొలనూలు. దర్భదామకాంచి=దర్భత్రాటిమొలనూలు. జిలుగుఁదువ్వలువ = సన్ననికట్టుకోక. ఇంత బెళకినన్ = కొంచెము ఒరసికొన్నను. గరుదాల్చు=గగుర్పాటునొందు. ధాతువస్త్రభరణమునకున్ = కావికోక కట్టుకొనుటకు. కొమ్మ=స్త్రీ—రాధ. అదలి=శోకించి. తరుణవాత్యన్ = చక్కఁగా సుడిసివీచునట్టి గాలిచేత ॥ 3 ॥ తాదృఙ్మదజృంభమాణ = దాని వంటి మదముచేత విజృంభించుచున్న. ప్రోత్తుంగ = మిక్కిలి యున్నతములైన. భోగ్యలకున్ =

చిత్తానందముగల్గు భోగులకు నిస్త్రింశోగ్రసంపాతమై
యుత్తాలంబగు సీతుకందువ కరం బుద్వేగ మొందింపఁగన్. ౪

తే. చంద్రబింబాస్యకుచశైల జన్మభూమి, గానరాహూపుఁబోలె నక్కడిఁదిచలికి
నించుకంతయుఁగంపింపదివముకొనుచు, ముజ్జగంబులుపచరింపమూలెటికై.

తే. పారదంబునఁదోఁచిన పసిఁడితీఁగ, పగిది రాజిల్లె రాధ చంపకసువర్ణ
వర్ణమగుమేను కుముదధవళతుషార, పటలకంచుకవేల్లన ఘటనకలిమి. ౬

తే. నవ్యకాలాగరూద్వర్తనములసతుల, చన్నుఁగొండల నుష్ణాగ్ని సంభవించె
మతిసమగ్రులుధూమానుమానకలన, నగ్నిసాధింతురచలంబులందునెపుడు౭.

తే. సురలు కళలెల్లఁగ్రోలిన సోముతనువు, కప్పురముగుమ్మరించినఁగనకక్రోలి
పువ్వుఁదేనియచనినయంభోరుహంబొ, యనఁగమంచింకిబ్రహ్మాండ మగలెఁ

క. అగలుం గుంకుమపువ్వును, దొగరుంజేలలును సీతుఁద్రోవంగల వే [జలిని
పొగలేని ముర్మురంబులు, మగువలపాలిండ్లు భోగ మహనీయంబుల్. ౯

క. పైనిగుడు మంచు తువ్వర, వానలచేఁ దడిసి కమల వనలక్ష్మి హరి
ధ్యాననిమీలితలోచన, యౌ నల రాధావధూటి కనుగలమయ్యెన్. ౧౦

తే. కాలుఁగాలును గేలును గేలు మోవి, మోవియును దార్చి భోగిసమూహమమరె
నూహసేయంగ భోగిసమూహమునకుఁ, బొసఁగ మసకంపుఁబెనఁకువ లెసఁగుఁ

క. శ్యామలకాలాగురునవ, ధూమమెదకుసుఖమొనర్పఁదోరపుఁగన్నుల్ [గాదె
వేమెఁగుచుకరణి సౌధ, స్తోమ మమరెఁ గప్పఁబడిన సోరణగండ్లన్. ౧౨

క. అంత వసంతము జితహే, మంతము దీపించె మత్త మధుకరకలభా
క్రాంత ముసపుష్పరసవే, శంతముసకలద్రుపులఁ బిసాళముచెలఁగన్. ౧౩

---

భోగపురుషులకు; సర్పములకు. నిస్త్రింశోగ్రసంపాత = కత్తియొక్క భయంకరమైనపాటు. ఉత్తాలము = అధికము. సీతుకందున = చలికాలము. ఉద్వేగము = భయమును ॥ ౪ ॥ కడిఁది = అసాధ్యమయిన. ఇవము కొనుచున్ = చలిగొనుచు ॥ ౫ ॥ పారదంబునన్ = పాదరసమునందు. కుముద ధవళ=తెల్లగలువ తెలుపుగల. తుషారపటల=మంచు సమూహము నెడి. కంచుక = కవచముయొక్క. వేల్లన=చుట్టుకొనుటతోడ. ఘటన=కూడిక. కలిమిన్=కలుగుట చేత ॥ ౬ ॥ ఉద్వర్తనము=నలుఁగు ॥ ౭ ॥ క్రోలి = త్రాగి. అగలెన్ = భేదిల్లెను ॥ ౮ ॥ అగలు= అగరు. చేలలు = వస్త్రములు. మర్మురంబులు = కుమ్ములు. ॥ ౯ ॥ అనుగలము=అనుకూలము ॥ ౧౦ ॥ మసకంపుఁబెనఁకువలు=సంభోగమునందలి యిచ్చచేఁ బెనఁగులాడుటలు ॥ ౧౧ ॥ శ్యామల= చామనిచాయగల. తోరపు = విశాలములయిన. సోరణగండ్లన్ = కిటికీలచేత ॥ ౧౨ ॥ జితహేమంతము = గెలువఁబడిన హేమంతఋతువుగలది. మత్తమధుకర కలభాక్రాంతము= మత్తుగొన్న కొదమ తుమ్మెదలచేత ఆక్రమింపఁబడినది. ఉరుపుష్పరస వేశంతము = అధికమయిన పూఁదేనె

ఉ. కెంజిగురాకుడాలు దుల కించిన ధాతుపటంబుచాయఁ జే
యం జదుకెక్కు-పుష్పాదుల నంటిన తేఁటులు భూతిభృజ్జటా
పుంజముఁ బోలఁగా విపిన భూములలో మధులక్ష్మి పొల్చె నీ
లాంజనవర్ణుఁ గోరి తప మర్మిలి నరించు మృగాక్షికై వడిన్. ౧౪

క. ఆవిర్భవించె నీల, గ్రీవాలికకీలికీల కేవలసఖమై
పూవులకారుడివోవం, గా వేసవి హాసవిపుల ఖరకరమగుచున్. ౧౫

వ. అప్పు డప్పటుగభస్తి హస్తియుంబోలె పద్మినీ ప్రమోదావహ కరప్రచారుండై, దవదహనంబు కురు మహీవిభుండునుం బోలె స్వగోత్ర నిర్భేదన నిపుణంబై, మల్లియలవెల్లు కన్నడకవితావితానంబునుంబోలె షట్పదవృత్త విలాసభాసురంబై, సరసులుసరసులుంబోలె వనితావిహారమహనీయంబులై రహివహించె. అంచలంచలం జంచలాచపలంబులును విపులంబులునగు పడమటిపవనంబులు పొరుగులయుపవనంబులం బెరుగు కిరువలివారువంబులకు గమనాధ్యయనగురువులుంబోలె వడిమెఱసి నుడిసి యసితయగు వసుధఁ గాఁడి నెఱెయలువాఱినం దదుదరవిస్ఫురితాంత్రలతామతల్లికల వెల్లునం బాతాళవ్యాళంబులు గానవచ్చె. పెచ్చువెరుగు ఖరకరకరనిపాతంబుల

---

పడియలుగలది. సకలద్రుములన్ = అన్ని వృక్షములందును. పిసాళము = వికాసము. చెలఁగన్ = అతిశయింపఁగా ॥ ౧౩ ॥ డాలు = కాంతి. తులకించిన ధాతుపటంబు చాయన్ = ప్రకాశించిన కావికోకచాయను. చదుకెక్కు = బురదలుదేఱునట్టి. భూతిభృజ్జటాపుంజమున్ = భస్మమును భరించుచున్న జడలసమూహమును. మధులక్ష్మి = వసంతఋతుసంపద. నీలాంజనవర్ణున్ = నల్లకాటుక వన్నెగలవానిని-కృష్ణుని ॥ ౧౪ ॥ నీలగ్రీవాలికకీలికీల కేవలసఖము = శివునినొసటియగ్ని జ్వాలకు ముఖ్యమిత్రము. పూవులకారు=వసంతఋతువు. ఉడివోవఁగన్ = ఉడిగిపోఁగా. వేసవి= గ్రీష్మఋతువు. హాసవిపుల ఖరకరము=తేజరిల్లుటచే అతిశయించిన సూర్యుఁడుగలది ॥౧౫॥ పటుగభస్తి = సూర్యుడు. పద్మినీప్రమోదావహ కరప్రచారుఁడు = తామరతీఁగకు సంతోషమును కలుగఁజేయుచున్న కిరణములవ్యాపనముగలవాఁడు. కురుమహీవిభుండు=దుర్యోధనుఁడు. స్వగోత్ర నిర్భేదననిపుణము = తనవంశమును భేదించుటయందు సమర్థము ; తనదైన పర్వతమును భేదించుట యందు సమర్థము. షట్పదవృత్తవిలాసభాసురంబు = షట్పదము అనెడివృత్తముయొక్క ప్రకాశముచేత ప్రకాశించునది ; తుమ్మెదలయునికివలనివిలాసముచేత ప్రకాశించునది. సరసులు = కొలఁకులు. రహిన్ = బాగుగను. అంచలంచల—ప్రతిపార్శ్వమునందును. చంచలాచపలంబులు = మెఱుపులవలెఁజలించునవి. కిరువలివారువంబులు = జింకలు. అసిత = నల్లనిది. కాఁడి = నాటి. నెఱెయ = పగులు. తదుదర = వానిలోపలిభాగమనెడికడుపులోని. విస్ఫురిత= ప్రకాశించునట్టి. ఆంత్రలతా = ప్రేఁగులతీఁగెలయొక్క. మతల్లికల = శ్రేష్ఠముల. వెల్లునన్ = అతిశయముచేత.

నాతప్తంబు లగునెలవులం దొరఁగిపరఁగువెలఁదివెన్నెల నీర్వట్టు వెన్నెల
పిట్టలు పొట్టలునిండ నాస్వాదించె. రక్కసజవ్వనులు మవ్వంపుమచ్చికల
నిచ్చలుఁగ్రీడింప నా వ్రీడావతుల యతులనాభీవివరంబుల నింకినవియుం
బోలె నమలయుదకంబులింకె. విచికిలమాలికాలంకృతచూళీభాగులును నా
రంజితధాతుపటల పరభాగులు నగుభోగులబాగున గ్రుడ్డుమోచు నెఱచీ
మలచాలు చెమ్మయిమ్ములం గ్రుమ్మరం దొడంగె. వ్యావహారికసత్యత్వంబు
ప్రకటించు ప్రపంచంబుచేత వంచితులగు నెఱుక లేని కరటులకరణి హరిణం
బులుమరీచికావీచికాపానవివశంబులై దిశలఁబరిభ్రమించె. ముచుకొనుసం
పెఁగల సౌరభంబునకుం దాళని రోలంబంబులలీల వియోగిలోకంబులు
విషయవిముఖంబులయ్యె. ఇసుకమెదువునెలవులం బన్నిన పసుపుటాకుం
జప్పరంబులలోనం గుప్పళించిన కప్పురంబుతోడి కురువేరుపరిమళంబులును
జాజివిరులవలపును. వట్టివేళ్ల వాసనలుం గల ప్రపాపాలికాపఘనవర్జితంబు
లగు కలశోదకంబులుఁగ్రోలి సేద దేఱి తెరువరులు తాలవృంతానిలంబుల
బలుపుకొలిపి మున్ను పరిక్షీణంబు లగు ప్రాణపవనంబులం బోసరింపం జే
సిరి తత్కాలంబున. ౧౬

క. ఆ పద్మిని దినకరకర, తాపమునకు నోర్చి ఘోర తప మొనరించెన్
శ్రీపతియడుగులగోడుగుల, ప్రా పొదవినవారిఁ దాప భర మేలంటున్. ౧౭

తే. ఇట్టు లత్యుగ్ర మగుగ్రీష్మ మేసరేఁగి, కాలవశమునఁదనుఁదాన దీలుపడియెఁ
బెచ్చు వెరగెట్టిదియు హెచ్చుపేర్చు టెల్ల, స్రగ్గుటకెయనిలోకోక్తి చాటుగాదె.

---

వ్యాళంబులు = పాములు. ఖరకరకరనిపాతంబునన్ = సూర్యునికిరణములపాటుచేత. ఆతప్తంబులు = అంతట తపింపఁజేయఁబడినవి. వెలఁది = స్వచ్ఛమయిన. నీర్వట్టువెన్నెలపిట్టలు = దప్పిగొన్న చకోరపక్షులు. ఆస్వాదించెన్ = త్రాగెను. రక్కసజవ్వనులు = వయసుగలరాక్షసస్త్రీలు. మవ్వంపుమచ్చికలన్ = కోమలములైన యాసక్తులచేత. వ్రీడావతి = సిగ్గుగలది—ఆఁడుది. నాభివివరంబులన్ = బొడ్డుబొక్కలయందు. విచికిల = మల్లెపువ్వులయొక్క. ఆరంజిత = అంతటను ఎఱ్ఱవాఱిన. బాగునన్ = విధమున. చెమ్మయిమ్ములన్ = తడితావులందు. కఱటులకరణిన్ = మూఢులవిధమున. మరీచికా వీచికాపానవివశంబులు = ఎండమావులయలలను త్రాగుటకై సోలినవి. మెదువు = మెత్తని. గుప్పళించిన = నిండించిన. వలపు = వాసన. ప్రపాపాలికాపఘన వర్జితంబులు = చలిపందిరులనుండు పడుచులదేహములనుండి విడువఁబడినవి సేద = బడలిక. బలుపుకొలిపి = బలముకలుగఁజేసి. పోసరింపన్ = బలియ ॥ ౧౬ ॥ పద్మిని = పద్మినీజాతిస్త్రీ; తామరతీఁగ ॥ ౧౭ ॥ ఏసరేఁగి = మిక్కిలివిజృంభించి. దీలుపడియెన్ = బలముతగ్గినదాయెను. పేర్చుట = అతిశయించుట. స్రగ్గుటకె = తగ్గుటకె ॥ ౧౮ ॥ కోల్కొను = వర్ధిల్లు. కైపు = విజృంభణము.

క. దీప మణఁగఁ జీఁకటియును, గోపముడుగ శాంతిగుణముఁ గోల్కొనుక్రియ నా
టోపోద్భట మగు వేసవి, కైపు సడిలఁ దోఁచెఁ గారు కాలము దళమై. ౧౯

క. ఆకాశతత్త్వతనుఁ డగు, కాకోలగ్రీవు కంఠ కాళిమ యనఁగాఁ
గోకిలనీలము జలధర, పాకము పర్యాయవృద్ధిఁ బ్రబలఁ దొడంగెన్. ౨౦

సీ. ఘళుఘళుక్కనినింగిఁ దాటించెఁ బలుమారు, నీరాళ్లగొండిఁ గన్నియమెఱుంగు
పౌలస్త్యపవనసంపాతజాతప్రీతి, నివిరిన మ్రాఁకుల నెలమి వచ్చెఁ
బ్రథమోదబిందుసంభారంబు మందునా నియ్యయ్యెఁ బగిలిన నేలమేని
కుఱుము మంతురసానియును బోలెఁ గనుపించెఁ దోరంపు మణులవిదూరభూమిఁ

తే. గెరలి సకిలించె షణ్ముఖు మఱువమావు, పరిమళము చూపెఁ గరిశుష్కపల్వలంబు
గడిమి చిగిరించె గ్రాజవంగడము ననిచె, నఖిలహితమైన మేఘోదయంబునందు

తే. కారుచిచ్చను భృగురాము కారణమునఁ, బెటిలి నిర్వంశమైన భూభృత్కులంబు
క్షేత్రముల వంశవృద్ధి రాజిల్లె మఱియు, జలధరోదయవిప్రప్రసాదలబ్ధి. ౨౨

తే. ప్రబలు వడగండ్లు నిష్ఠ్రిగోపములు జంబు, ఫలములును బొల్చెఁ బచ్చికపట్టులందు
వనధినీరానఁ దెరలు నశ్మములనెల్ల, నంబుదంబులు వెలిగ్రాసె నఱుఁగక నఁగ

తే. మోవిచెలువంబు గేదంగిపూవుఱేకు, సోయగము నూఁపుఁగన్నుల సొబగు జికుర
బర్హిబర్హప్రభయుఁ జూపి ప్రతిఘటించె, నంబుధరకాలసౌభాగ్య మంబుజాక్షి

సడిలన్ = సళ్ళఁగా—తగ్గఁగా. కారుకాలము = వానకాలము ॥ ౧౯ ॥ కాళిమ = నల్లఁదనము. జలధర = మేఘములయొక్క. పర్యాయవృద్ధిన్ = క్రమముగా నగునట్టివృద్ధిచేత ॥ ౨౦ ॥ నింగి = ఆకాశము. కన్నియమెఱుంగు = క్రొత్తమెఱపు. పౌలస్త్యపవనసంపాతజాతప్రీతిన్ = ఉత్తరపుగాలిసోఁకుటవలనఁ బుట్టినప్రీతిచేత. ఇవిరిన = ఎండిన. ఎలమి = వికాసము. ప్రథమోదబిందుసంభారంబు = తొలఁకరి వానచినుకులసమూహము. మంతురసాని = మంత్రసాని. మఱువమావు = మూఁగగుఱ్ఱము. పల్వలంబు = అడుగుపడియ. వంగడము = వంశము—సమూహము. ననిచెన్ = పూచెను. మేఘోదయంబునందున్ = వానకాలమునందు ॥ ౨౧ ॥ పెటిలి = పెట్లి. నిర్వంశము = వంశములేనిది; వెదుళ్లులేనిది. భూభృత్కులంబు = రాచకులము; పర్వతసమూహము. క్షేత్రములన్ = భార్యలయందు; పొలములయందు. వంశవృద్ధి = వంశముయొక్కవృద్ధి; వెదుళ్లవృద్ధి. లబ్ధిన్ = పొందుటచేత ॥ ౨౨ ॥ పొల్చెన్ = ఒప్పెను. ఆనన్ = త్రాఁగఁగా. తెరలు = బయలువెడలు. అఱుగక = జీర్ణింపక ॥ ౨౩ ॥ మోవి = అధరము; ఒకానొకపండు. గేదంగి పూవుఱేకు = పచ్చమొగలిపూఱేకు; మొగలిఱేక నెడి యాభరణము. సోయగము = అందము. ఊఁపుగన్నుల సొబగు = చలింపఁజేయునట్టి కన్నులయొక్క యందము; చలింపఁజేయఁబడునట్టి నెమలిపురి కన్నులయొక్క యందము. బర్హిబర్హప్రభ = నెమలికుంచెయొక్క ప్రకాశము; దర్భపోచలయొక్క ప్రకాశము. ప్రతిఘటించెన్ = ఎదిరించెను. అంబుధరకాల సౌభాగ్యము =

క. సలిలంపువ్రద్ధజలధర, ములు పూనిన యూఁతకోల మొత్తములక్రియన్
దొలువానకాళు లెసఁగెన్, గలహంసకులంబు లెల్లఁ గలఁగంబడఁగన్. ౨౫

శా. అద్రిగ్రావము లుర్వి రాల బలఘో షాడంబరంబుల్ వియో
గిద్రోహం బొనరింప వారినిధి కెం గేలంటఁగా వాహినుల్
భద్రేభప్రతిమానమూర్తి యగుచున్ పాథోధరశ్రేణి కుం
భద్రోణంబులు గుమ్మరించె విమలాంభఃపూరధారావళిన్. ౨౬

క. పాపట తెలుపున డిగినా, సాపుటముక్తాఫలప్రచారంబై రా
థాపృథునక్షోరుహముల, పై పై ప్రథ మోదబిందుపటలము నిగిడెన్. ౨౭

సీ. పెరిగి సూచీముఖాభేద్యంబు లగుసాంద్ర కారధారాచ్ఛటల్ గాఱుకొనినఁ
గర్ణజ్వరాపాదకంబులై దంభోళి, గంభీరరవములు గడలుకొనిన
ముజ్జగంబులముచ్చ ముణిఁగింపఁగాఁ జాలు, నీఁదగాడుపులు బిట్టెదురుకొనిన
దుర్గమకర్దమస్తోమసంఛన్నభూ ముల సోనవానలు ముంచుకొనినఁ

తే. జెదర కడకాలఁగన్నువచ్చినవిధాన, నాథసంకేతముల కేగు నడికిరేలు
కాయసంభవబాధాస హాయమగుచు, స్వైరిణీకోటి నిర్భయ స్వైరధాటి.

క. త్రిదశగురుప్రతిమానులు, నిది పగ లిది రాత్రి యనుచు నేఱుపఱుప లే
రు దళితహరినీలమణి, చ్ఛదనీలము మొగులు సూర్యచంద్రులమిౕంగన్.

క. తరణిలయానంతరమునఁ, గర మమరు దిగంతములను ఖద్యోతంబుల్
మరలఁగ దైజసస్సృష్టికిఁ, బరమాణుచయంబుగూడఁ బడుచందమునన్. ౩౦

వర్షాకాలముయొక్క మనోజ్ఞత్వము ॥ ౨౪ ॥ సలిలంపు = నీళ్లుగల. ఊఁతకోల = ఊనుకొను కఱ్ఱ. వానకాళులు = వానచినుకులధారలు ॥ ౨౫ ॥ గ్రావములు = రాతిగుండ్లు. వియోగి = విరహి; తనవారి నెడఁబాసినవాఁడు. ద్రోహంబు=చెఱుపును. కెంగేలు=ఎఱ్ఱడాలుగలచేయి. వాహినులు=నదులు. పాథోధర=మేఘములయొక్క, కుంభద్రోణంబులు=కుండలుతూములునుగా. అంభః=నీళ్ళయొక్క ॥ ౨౬ ॥ ౨౭ ॥ సూచీముఖాభేద్యంబులు = సూదిమొనచేతను భేదింపరానివి. ఛటలు = సమూహములు. గాఱుకొనినన్ = నిండుకొనఁగా. ఆపాదకంబులు = కలుగఁజేయునవి. దంభోళిగంభీరరవములు = వజ్రాయుధముయొక్క వెలితిలేనిధ్వనులు. ముచ్చముణిఁగింపఁగాన్ = మిక్కిలి ముడుఁగుకొనునట్లు చేయను. ఈఁదగాడుపులు = శీతవాయువులు. బిట్టు = శీఘ్రముగ. దుర్గమ = అణఁపరాని. కర్దమ = బురదయొక్క. సంఛన్న = చక్కఁగాఁ గప్పఁబడిన. సోనవానలు = ముసరువానలు. నాథసంకేతములకున్ = ప్రియుల యేర్పాటుతావులకు. నడికిరేలు=అర్ధరాత్రములందు. కాయసంభవ = మన్మథునియొక్క. స్వైరిణీకోటి = అంకుటాండ్ర సమూహము. స్వైర=యథేచ్ఛమయిన ॥ ౨౮ ॥ ప్రతిమానులు = సమానులు. మొగులు=మేఘము ॥ ౨౯ ॥ తరణిలయానంతరమునన్ = ప్రొద్దు గ్రుంకిన పిమ్మట. ఖద్యోతంబులు = మిణుఁగురుఁ బురుగులు.

సీ. ఇంద్రచాపంబుగా దిది మౌళితలమున, సవరించు బర్హిపింఛంబుగాని
భిదుర ఘోషంబుగా దిది పాంచజన్యసంజాతగంభీర ఘోషంబు గాని
యాశ్రయించిన బలాకావళి గా దిది, హారిముక్తాహార యష్టిగాని
యిది కోలమెఱుంగుగా దుదిరిబంగారంపుఁ,బసిమిగ్రమ్మెడుపచ్చ పట్టుగాని
తే. వృష్టి గా దిది కరుణాంబు వృష్టిగాని, నీలమేఘంబుగా దిది నీలవర్ణుఁ
డౌర నామ్రోలఁ బ్రత్యక్షమయ్యెననుచు,హర్షపులకితతనువయ్యెనవ్వధూటి 3౧

వ. ఇట్లనవరతధ్యానధారా ప్రవాహమగ్నహృదయ యగునాగగనావలగ్నకు
నిఖిలజగద్వలయంబును విష్ణుమయంబై తోఁచె నంత భక్తవత్సలుం డగు
శ్రీవత్సవక్షుండు. 3౨

సీ. అరచంద్రులోనిచి హ్నంశంబునుంబోలె,నుదుటఁగస్తురిబొట్టుపదనుకొనఁగ
గగనంబునందలి ఖరమరీచియుఁబోలె, నురమునఁ గౌస్తుభం బొఱపుమీఱ
సురభూజశాఖలఁ జుట్టుతేఁటులుఁబోలెఁ, గేలఁ బచ్చలకడియాలు మెఱయఁ
గొదమసంపెఁగ మొగ్గ తుదబొన్న విరిఁబోలె,ముక్కున ముంగఱముత్యమమర
తే. నీలగిరిగప్పువెన్నెల నిగ్గుఁబోలె, నవకమగుమేన హరిచందనంబు వొదువ
వివిధమణిభూషణప్రభల్ వెలయఫలిత,కల్పతరులీల రాధయ గ్రముననిలిచి. 33

ఉ. శ్రీదనరన్ గృపారసము చిల్కఁ దపోనలజాయమానహృ
త్ఖేదము మానిపించి తన కేలను గేల్దెమలించి నిర్భరా
హ్లాద మెలర్ప నయ్యువతి నర్ధశరీరమునట్లు ప్రోచె న
య్యాదవరాజవంశమణి యద్రిజనేలిన శూలిపోలికన్. 3౪

తైజస = తేజస్సుగలవానియొక్క ॥ 3౦ ॥ బర్హిపింఛము=నెమలిపురి. భిదురఘోషంబు=పిడుగు చప్పుడు. బలాకావళి = కొంగలచాలు. హారి=మనోజ్ఞమయిన. యష్టి=సరము. కోలమెఱుంగు = వంకరలేని మెఱపు. ఉదిరి=అపరంజి. హర్షపులకితతనువు = సంతోషముచేతగగుర్పాటునొందిన దేహముగలది ॥ 3౧ ॥ అనవరతధ్యాన ధారాప్రవాహమగ్న హృదయ=ఎడతెగనిధ్యానముచేయు ధోరణియనెడి ప్రవాహమునందు మునిఁగిన మనసుగలది—ఎడతెగక ధ్యానముచేయునది. గగనావలగ్నకున్ = ఆకాశమువంటి నడుముగలదానికి—రాధకు. జగద్వలయము=వలయాకారమయిన లోకము. శ్రీవత్సవక్షుఁడు = శ్రీవత్సమను మచ్చ ఱొమ్మునందుఁగల కృష్ణమూర్తి ॥ 3౨ ॥ పదను కొనఁగన్ = చెమ్మగిల్లఁగా. ఖరమరీచి = సూర్యుఁడు. ఒఱపు = అందము. సురభూజ = కల్ప వృక్షముయొక్క. కొదమ = లేఁతదైన. విరి = పువ్వు. ముంగఱ=ముక్కఱ. నిగ్గు = తేటిన కాంతి. నవకము = మృదువైనది. హరిచందనంబు = పచ్చగంధము. అగ్రమునన్=ఎదుట ॥ 33 ॥ చిల్కన్=ప్రసరింపఁగా. జాయమాన=పుట్టుచున్న. ఖేదము=శ్రమము. తెమలించి=కదలించి. ఎలర్పన్=అతిశయింపఁగా. ప్రోచెన్ = పోషించెను ॥ 3౪ ॥ సంగమ = చేరికచేత. ముదితునిన్ =

క. రాధాసంగమముదితుని, మాధవుఁ గని యోటువడిన మాడ్కిఁ దెరలె శం
పాధరము తనదువర్ణము, బాధితమగునేని వెలుకఁ బాఱు ఘనుండున్.౩౫
క. నీలాంజనవర్ణుఁడు రా, ధాలీలావతిని పెనఁగి తనరెడుకరణిన్
గాలము శరత్సమాగమ, హేలాసౌభాగ్యమహిమ నేపువహించెన్. ౩౬
సీ. కలఁకనీరెంతయు గతకల్మషముఁ జేసెఁ, గతకాఫలమురీతి గలశసూతి
పాపటదీర్చెభూ భాగంబు నాస్యాన, శాదంబు శకటౌఘ చక్రధార
శిఖితాండవముకళా సికఁ జేసి సడలించెఁ, గఱకుటీఁకలపేరి కాసెబిగువు
లుడిగినజడివాన లుదయించెవెండియుఁ, గరిఘటామదవృష్టి కైతవమున
తే. తెల్లు శోభిల్లె మంకెన లుల్లసిల్లెఁ, గాలకంధరవాహంబు గజ్జురేఁగె
ముదితశతగోపకన్యకా వదనతులిత,లలితరుచిఁ బొల్చె రాకాకళాధరుండు.
క. చనుమొలకలుగల కన్యా, జనములఁ బుపడించెఁ బద్మసరసీరేఖల్
ననవిలుతుమిట్టకోలలు, వనరుహముకుళములు గాన వచ్చుటకతనన్. ౩౮
క. అలరాధికాధరాధర, దళముల యదుభర్తనిలుచు దంతక్షతరే
ఖలుబోలెఁ గ్రొత్తమంకెన,యలరులపైఁ దేఁటులమరె నాసమయమునన్ ౩౯
తే. పాంచజన్యంబు రాధికా చంచలాక్షి, కంధరకునోడి యొచటనో క్రాఁగిపోవఁ
దద్గతధ్వని తద్భర్త దాయయనియొ,చేరె వృషభంబు కంఠకు టీరవాటి.
తే. పుండరీకుని రక్షింప భూమిభార, మణఁప నవనీతలంబున నవతరిలిన [లె.
యల్లునిగుఱించివచ్చుదుగ్ధాబ్ధియనఁగఁ,జంద్రికాపాండుజలధరచ్ఛాయపొద
సీ. కలుగకుండిననేమి కిడిమిపువ్వులతావి, ననిచిన మరువమెంతటికినోప
దోఁదవకుండిననేమి మదకేకినటనంబు,చాలదె యంచల సంభ్రమంబు

---

సంతోషించినవానిని. ఓటువడిన = జయింపఁబడిన. తెరలెన్ = చలించెను. శంపాధరము = మేఘము. వెలుకఁబాఱున్ = వెలవెలఁబోవును. ఘనుండు = గొప్పవాఁడు; మేఘుఁడు ॥ ౩౫ ॥ పెనఁగి = కలసిమెలసి. తనరెడు=అతిశయించెడు. శరత్సమాగమ = శరత్కాలము రాకయొక్క. హేలా=విలాసముయొక్క. ఏపు=ఆధిక్యమును ॥ ౩౬ ॥ కతకాఫలము=చిల్లగింజ. కలశసూతి=అగస్త్యుఁడు. ఆస్యానశాదంబు=ముఖభాగంబునందలిబురదను. శిఖి=నెమలి. కళాసికఁజేసి=నాట్యక్రియావిశేషముచేత. కరిఘటా=ఏనుఁగు గుంపులయొక్క. కైతవము=నెపము. కాలకంధర వాహంబు గజ్జురేఁగెన్ = వృషభముయొక్క మదమతిశయించెను. కళాధరుండు=చంద్రుఁడు ॥ ౩౭ ॥ ననవిలుతుమిట్టకోలలు=మన్మథునివైన కఱకుబాణములు. వనరుహముకుళములు=తామరమొగ్గలు॥ ౩౮ ॥ ౩౯ ॥ కంధర=మెడ. క్రాఁగి=తపించి. దాయ=శత్రువు. కుటీరవాటికన్=గుడిసెచాలునందు ॥ ౪౦ ॥ ౪౧ ॥ ననిచిన=చిగిరించిన. పొలపము=ప్రకాశము. శాలి=వరిపైరుయొక్క. సోన=ముసురు. కడమ

మెఱువకుండిననేమి మెఱుఁగులపొలపమే తన్మాత్రములె శాలి ధళధళములు
నుడియకుండిననేమి సోనవానలపెల్లు, గజదానవృష్టికిఁ గడమ కలదె
తే. కారుకాలానఁ గలిగిన గౌరవంబు, చౌకయైతోఁచె శరదృతు సౌష్ఠవమున
నురిలితొల్లిటియధికారి యోసరిలిన, వెనుకయధికారియవికావె విభవకళలు.

ఉ. పాఁడియుఁబంటయుం గలిగి పంకవిహీనమనోహరాంబువుల్
వేఁడిన నెల్లచోటఁ బ్రభవింపఁగ భానుఁడు శీతభానుఁడున్
గాఁడిన మేఘకాళిమవికారము దూరముసేయ నెంతయున్
నాఁడెముచూపె శారదదినంబులు నిర్మలమూర్తికాకృతిన్. ౪౩

సీ. రత్నగట్టరి మహీరమణు లశ్వములకు, భూరినీరాజనపూర్వకముగ
ఫలకగ్రహణముఁ జౌపదములగరిమంబుఁ, బరఁగె బాలకులకు గుఱువులిండ్ల
దుమికిచిచ్చఱతోరణములుదూఱినవారు, దూఱరై రిక్తాంతతోరణములు
భుజియించెఁ బ్రజభుజాభోజనంబులుసిగ బంటిగాఁ దొలిక్రొత్త వంటకముల
తే. నఖిలదిగ్జయకాంక్షఁ బుష్పాయుధుండు, వెలిగుడారంబులోవచ్చి విడిదిచేసె
మురళిమ్రోయించెద్రిభువనీమోహనముగ, రాధకింపుగనాదినారాయణుండు

వ. ఇట్లు నిజజలనిమజ్జజ్జంతుజాలంబులకు ఋణత్రయవిమోచనహేతు వగునా ఋణవిమోచనతీర్థంబునందపంబుచేసి రాధ కృతార్థయయ్యె నయ్యాదవకిశోరంబును గృశోదరీసహాయుండై మాయాశబలితుండగు జీవపురుషుని పరుసున వివిధభోగపరాయణుండై పరఁగుచుండె నయ్యెడఁ బుండరీకుని ప్రకారం బాకర్ణింపుము. ౪౫

క. ఉపమింపఁగరాని తప, స్తపమునఁ గడువాఁడిమీఱు ధరణీసుమన
స్తపనుఁడు కమలవికాసం, బెపుడును నుడివోని తావి నింపువహింపన్. ౪౬

---

=తక్కువ. కారుకాలానన్ = వర్షఋతువునందు. ఉరిలి=వదలి. ఓసరిలినన్=తొలఁగఁగా ॥ ౪౨ ॥ పంకవిహీనమనోహరాంబువులు = బుఁదలేనితేటయైనమనోహరజలములు. వేఁడినన్= కోరినను. శీతభానుఁడు = చంద్రుఁడు. శారద = శరత్కాలమునందలి ॥ ౪౩ ॥ నీరాజన = ఆరతులు. ఫలకగ్రహణము – పలకపట్టించుట. చౌపదముల = చిందులుద్రొక్కుటలయొక్క. చిచ్చఱతోరణములు = నిప్పుగుండములచాళ్లు. సిగబంటిగాన్ = తలమునుఁగ. వంటకములు = అన్నములు. మురళి=పిల్లనగ్రోవి. ॥౪౪॥ నిజజలనిమజ్జజ్జంతుజాలంబులకున్=తననీటియందుమునిఁగినప్రాణిసమూహములకు. ఋణత్రయవిమోచనహేతువు=దేవఋణముఋషిఋణముపితృఋణముననుమూఁడు విధములయినఋణములను తీర్చుకొనుటకుకారణము. అయ్యాదవకిశోరంబు = ఆయదువంశస్థుఁడైనపిల్లకాయ=కృష్ణుఁడు. మాయాశబలితుఁడు=మాయచేతపలురూపములఁగనఁబడినవాఁడు. పరుసునన్ = విధమున ॥ ౪౫ ॥ తపస్తపమునన్ = తపస్సనెడివేసంగియందు. ధరణీసుమనస్తపనుఁడు = బ్రా

క. ఆద్యశివాధిష్ఠితమై, యుద్యజ్జ్యోతిర్విలాస యుతమై స్వశిరః
పద్యోద్భవమై కడు నన, వద్యము నౌ దళశతార వనజమునందున్. ౮౭

చ. జొటజొటధారగా వడియు చుంగడలెత్తు సుధారసంబు గ్రుం
గుటగుట నప్పటప్పటికిఁ గ్రోలుచు నాలుగురెండు మూలలన్
గుటిలతదాల్చుభోగిని గగుర్పొడ మించుచు దక్షిణశ్రవ
స్తటవిసరత్ప్రమోదనినదంబునఁ జొక్కుచు మబ్బుగ్రక్కుచున్. ౮౮

ఉ. విచ్చినకమ్మదమ్ములకు విందులుపెట్టు వెడందకన్నులన్
బచ్చనిపట్టుఁ బేరురముఁ బ్రాఁకినమచ్చయుఁ బీలినెట్టెమున్
బచ్చికచాయయుం జిఱుత పాయముగల్గువెలుంగు నిచ్ఛలో
రచ్చయొనర్ప నందలి పరాకునఁ దేలుచు వేడ్కనేలుచున్. ౮౯

చ. గురుజన భక్తియుం గపట గోపకుమారపదాబ్జసక్తియున్
దరలఁగఁ బాపభూరుహవితానము లీనముగాఁ జెలంగు భా
స్వరతరయోగసింధువున సౌఖ్యమునొందుచుఁ జిద్బిసాంకురా
హరణమొనర్చి భూమిసుర హంసము చాలఁ బ్రశంసనొందఁగన్. ౯౦

సీ. తన మొగంబులుఁ బ్రాఁతమినుకుమానికములగములుద్భవిల్లెడుగనులుగాఁగఁ
దన కమండలువారి దనుజారిపాదార్ఘ్య,మలవరించుట కూటచెలమగాఁగఁ
దనమదినెద్దిదోఁ చినదియొక్కొక్క,రూపాంతరంబునఁ బ్రోదివడయఁ
దనకట్టు నజినరత్నము సృష్టిదీక్షకై, కప్పినయదిపోలెఁ గప్పఁదేర
తే. వీచువీవనచేఁబూని వెనుకఁదనకు,జిఱుతచనుదోయి యొరగుగాఁ జేసిపలుకుఁ
జెలువగొలువంగఁదొలుకారుకలఁకపులుఁగు,మావురాహుత్తునిలిచె బ్రాహ్మణుని [మ్రోల.

చ. నిలిచి నిలింపలోకతటి నీతటినీరజ హేమనీరజో
జ్జ్వలబిసనాళఖాదనము వంకన పొంకముమీరు గ్రొవ్వునన్

---

హ్మణుఁడనెడిసూర్యుఁడు. ఉడివోని = మానని ॥ ౮౬ ॥ ఉద్యత్ = వెలుఁగుచున్న. స్వశిరఃప
ద్యోద్భవము = తనశిరోమార్గమునందుఁబుట్టినది. దళశతారవనజము = సహస్రారకమలము ॥౮౭॥
కడలెత్తు = అలలుకొట్టు ॥ ౮౮ ॥ పీలినెట్టెము=పికిలిపిట్టయీఁకలుచెక్కినతలపాగ. ఇచ్ఛలోన్ =
మనస్సునందు. రచ్చయొనర్పన్ = కొలువుచేయఁగా-వసింపఁగా ॥ ౮౯ ॥ తరలఁగన్=చలింపఁగా.
భాస్వరతర = మిక్కిలివెలుఁగునట్టి. చిద్బిసాంకురాహరణము = జ్ఞానమనెడి తామరతూఁడుమొ
సునుభుజించుట ॥ ౯౦ ॥ ప్రాఁతమినుకుమానికములగములు = వేదములనెడి రత్నసమూహములు.
ప్రోది = రక్షణము. అజినరత్నము = శ్రేష్ఠమయినచర్మము. ఒరగు = ఆనుకొనెడిదిండు. పలుకుఁ
జెలువ = సరస్వతి. తొలుకారుకలఁకపులుఁగుమావురాహుత్తు = బ్రహ్మ. (తొలుకారుకలఁక
పులుఁగు=వర్షాకాలముకలఁతనొందుపక్షి ; హంస. మావు = గుఱ్ఱము. రాహుత్తు=రౌతు) ॥ ౯౧ ॥

గళముగ దల్పలేని తురగంబు దటాలున డిగ్గి నమ్రతా
కలితశరీరునిం దిగిచి కౌఁగిటఁ జేరిచెఁ బుండరీకునిన్. ౯౨

ఉ. చేరిచి సేమమే ? సితకుశేశయలోచనగోచరాత్మ ! నీ
వారికి నీకు నన్న విని వారిరుహాసనుఁ బల్కె నమ్మహో
దారుఁ డమేయభద్రసము దాయనిదానము నీవు వచ్చుటన్
సారసగర్భ! యింకఁ గొన సాఁగుజుమీ కుశలంబు మాదెసన్. ౯౩

క. అని పరమాసన మిడి త, న్ననిమిషు లర్చించునట్లు లర్చించె జగ
జ్జనన స్థితి లయకారణు, జని నజునిన్ సుజనమతిర జనిరజనీశున్. ౯౪

క. అర్చించి నిలిచి చేతులు, గూర్చి పురస్థ్సలికిఁ జాఁచి గోవిందపదా
బ్జార్చారసపానవిధుఁ డ, నర్చితదితరుఁడు క్షితిసు రాగ్రణి పల్కెన్. ౯౫

సీ. విజ్ఞానవంద్యుఁ డీ విశ్వనిర్మాత యా త్మారాముఁ డీ త్రిలోకాధికారి
భ్రూమధ్యజనితరుద్రుం డీ మహామతి, యజ్ఞాతచర్యుఁ డీ ప్రాజ్ఞతముఁడు
సర్వావయవజప్ర జావ్రజుం డీ వేల్పు, ముఖ్యాత్ముఁ డీ త్రయీ మూలభూతి
దక్షాదికప్రజో ద్భవహేతు వీ యయ్య, కర్తైకసాక్షి యీ నిర్మలుండు

తే. శాశ్వతుండీతఁడద్భుతైశ్వర్యుఁడితఁడు, శాంతుఁడీతఁడువాఙ్మనఃకాంతుఁడితఁడు
ననఁగ వెలుఁగొందు నీవునాకతిథివైతి, వేను తొలుమేనఁ జేసిన దెట్టినోము.

మ. అరుణావిష్కృతిభాస్కరోదయముఁ బద్మామోద మంభోరుహా
కరమున్ వేలుపు విల్ ప్రవర్షణము నోంకారంబు మంత్రాక్షర
స్ఫురణంబున్ బ్రకటింపఁగా మొదల నుద్భూతంబులైనట్లు లీ
శ్వరుఁ డేతెంచుటకున్ ద్వదాగమము హా! సంసూచకంబయ్యెడున్. ౯౭

ఉ. త్వాదృశులందు నాదకము దాలుచు వేల్పు వసించునట్లు ల
ర్చాదుల నూఁదియుండఁ డనియాడుదు రట్లగుటన్ సమస్తవ
స్తూదయహేతుభూతి వెలుఁగొందెడు మీ రిటకిట్లు వచ్చుటన్
శ్రీదయితాగమంబు కిడుఁ జేసువ యా నని నిశ్చయించితిన్. ౯౮

---

నీరజ = రేణువులులేని. బిసనాళఖాదనమువంకన = తామరతీఁగకాఁడలనుతినెడిప్రక్కనే ॥౯౨॥ సితకుశేశయలోచన గోచరాత్మ = విష్ణుఁడువిషయమయినమనసుగలవాఁడా ॥ ౯౩ ॥ జనిన్ = పుట్టుకగలవానిని. రజని = రాత్రికి ॥ ౯౪ ॥ ౯౫ ॥ నిర్మాత = నిర్మించువాఁడు. భ్రూమధ్యజనితరుద్రుండు = కనుబొమనడుమఁబుట్టిన రుద్రుఁడుఁగలవాఁడు. త్రయీ = మూడువేదములసముదాయము. వాఙ్మనఃకాంతుఁడు = సరస్వతికి ప్రియుఁడు ॥ ౯౬ ॥ అరుణావిష్కృతి = అరుణోదయము. హా=ఔరా ॥ ౯౭ ॥ ఊఁది=అవలంబించి. శ్రీదయితాగమము=విష్ణుదేవునిరాక ॥ ౯౮ ॥

క. నా విని నగు మొగమున న, ద్దేవజ్యేష్ఠుండు వాసు దేవప్రియు సం
భావించి సజలజలధర, రావనిభగభీరకంఠ రవ ధ్వని బలుకున్. ౫౯

చ. ఒసఁగెద నీకు వేఁడు వర మోపరమవ్రత! యెద్దియేనియున్
మసలక యన్న నన్నయస మన్వితుఁ డిట్లను నట్టిదేనియున్
బిసరుహగర్భ! దుర్భవవిభేదనుపైఁ దలఁపుం దదీయసం
గసుఖ మఖండధర్మపరికర్మముఁ గూర్మి నొసంగు నా కొగిన్. ౬౦

చ. అనవుడు నట్ల యిచ్చి కమలాసనుఁ డాశమశాలిఁ బల్కె నో
మునివర! నీవు సేయు తప మున్ జపమున్ బెరరేఁప నెల్లి నే
టన భవదగ్రవీథికిఁ గడారపటుం డిట వచ్చు మున్నె యా
యన నిను నేలినాఁడు చరితార్థుఁడ వీవు చతుర్థసంపదన్. ౬౧

క. నీ యీ క్షేత్రము నో మునినాయక! దేవర్షి నరగణప్రార్థిత ని
శ్శ్రేయసవదాన్య మగునని, పోయెఁ బయోజాతసూతి పోయిన నతఁడున్.

ఉ. ధాతఁ దలంచి మ్రొక్కి యవదాతసరోజదళాక్షుఁ గాంచి లో
బ్రాఁతి పెనంచి యన్నలువ పల్కులు సత్యములౌ కొ వాక్కథా
ప్రోత ముకుందుఁ డెందు నను బోఁటికి దక్కునె దక్కకేమి భ
క్తాతురతాపహారి దను జారి యనా వినమే బుధోక్తులన్. ౬౩

సీ. అవచూడ బర్హిబర్హమున నొండొంటిసిక్కములంటి చల్దిచిక్కముదలిర్పఁ
బంటకారెల్లిదమ్మి దంట గెంటసమాడు, వెడఁదకన్నులకాంతి వెల్లివోడువ
మెఱుఁగుఁ జెక్కులమీఁద మిట్టించి మొసలివాగడమద్దికాయల తళుకులమర
వక్షస్స్థలమున శ్రీవత్సకౌస్తుభనైజ యంతు లిందిరతోడి వంతువడయ

తే. నిమ్ననాభియుఁ ద్రివళి వల్గితజఠరము, కరకలితచిత్రభస్త్రశంఖములునమర
మన్ననంబున నేప్రొద్దు మలయుచున్న, ధూర్తబాలుడు నామ్రోలఁ దోచునొక్కొ

---

కంధరము = కంఠము ॥ ౫౯ ॥ మసలక = ఆలస్యముచేయక. దుర్భవవిభేదనుపైన్ = చెడ్డజన్మములను చెఱుచువాఁడైనవిష్ణునిమీఁద ॥ ౬౦ ॥ పెరరేఁపన్ = ప్రేరేపింపఁగా. కడారపటుండు= గోరోజనపువన్నెవస్త్రముగలవాఁడు-కృష్ణుఁడు. చరితార్థుఁడవు=కృతార్థుఁడవు. చతుర్థసంపదన్= మోక్షముకలిమిచేత ॥౬౧ ॥ నిశ్శ్రేయసవదాన్యము = మేలునిచ్చునది ॥ ౬౨ ॥ అవదాత = తెల్లని. ప్రాఁతి = ప్రేమ, వాక్కథాప్రోత = మాటలచేతనుకథలచేతను గూర్పఁబడినవాఁడగు ॥ ౬౩ ॥ అవచూడ = సిగయందలి. పంటకారు = శరదృతువు. వెలిదమ్మిదంటన్ = శ్రేష్ఠమయినతెల్లదామరను. గెంటసమాడు = పరిహసించు. వెల్లివోడువన్ = ప్రవహింపఁగా. మిట్టించి=మీఁదికెగిరి. మొసలివాగడమద్దికాయలతళుకులు = మకరకుండలములకాంతులు. వంతు = సామ్యము. నిమ్న =

క. అని యీగతి మీమాంసా, వనిమానసమృగము ద్రిప్ప వైష్ణవరత్నం
బునకు నిజదక్షిణేక్షణ, వనజచ్ఛద మదరె శుభని వహపిశునంబై. ౬౫

తే. నాఁడు మఱునాఁడు నవ్విప్రనందనుండు, ధాత మాటల చందంబు దానవారి [నీఁగి
తనకడకు వచ్చు రాముల దలఁచి తలఁచి, యుచ్చటల యేటి తరఁగల మునీఁగిము

వ. మూఁడవనాఁడు యథాకాలప్రబుద్ధుండై పూర్వాశ్రితసిద్ధాశ్రమంబున బద్ధ
పద్మాసనాసీనుండై. ౬౭

క. కరివదనదేవతామిళ, దరుణాభ చతుర్దళాఢ్య వాదిమసాంతా
క్షరయుత మగు నాధారాం, బురుహంబునఁ గలుగు వలపు బుగులుకొనంగన్.

క. పూనఁ దటిత్ప్రభ షడ్దళ, మై నలువ వసింప బాది లాంతాక్షరసం
ధానస్ఫుట మగు స్వాధి, ష్ఠానాబ్జమునందు వెడల సత్సౌరభముల్. ౬౯

క. డాద్యము ఫాంతికమును నీ, లద్యుతియుఁ బురాణపురుష లాలితము సుధీ
వేద్యము నగు దశపత్రస, ముద్యన్మణిపూరకమున మొలవఁగఁ దావుల్. ౭౦

క. శైవము ద్వాదశదళరే, ఖావళితకఠంబు కమ్రకనకచ్ఛాయా
శ్రీవహము నౌ ననాహత, మే వేళం జెడనిగంధ మిగురొత్తింపన్. ౭౧

---

లోఁతైన. త్రివళి= మూఁడుముడుఁతలచేత. చిత్రభస్త్ర=నానావర్ణములుగలతిత్తి. మలయు=తిరుగు. ౬౪॥ మీమాంసావనిన్=పరబ్రహ్మప్రతిపాదకశాస్త్రమనెడిభూమియందు. దక్షిణేక్షణవనజచ్ఛదము = తామరరేకువంటికుడికన్ను. పిశునంబు = తోఁపించునది ॥ ౬౫ ॥ ౬౬ ॥ ప్రబుద్ధుఁడు = మేలుకొన్నవాఁడు ॥ ౬౭ ॥ కరి...యుతము = విఘ్నేశ్వరుఁడు దేవతయు ఇంచుక యెఱ్ఱని కాంతియునాలుగురేకులునుగలదియు వశషసవర్ణములతోఁగూడినదియును. ఆధారాంబురుహంబు= ఆధారకమలము. బుగులుకొనఁగన్ = నిండుకొనఁగా ॥ ౬౮ ॥ తటిత్ప్రభన్ = మెఱుపుయొక్క వెలుఁగువంటివెలుఁగుతో. షడ్దళము = ఆఱురేకులుగలది. నలువ = బ్రహ్మ. బాదిలాంతాక్షరసంధానస్ఫుటము =బభమయరలవర్ణములకూర్పుచేత ప్రకాశించునది. స్వాధిష్ఠానాబ్జము = స్వాధిష్ఠానకమలము. సత్సౌరభములు = మంచివాసనలు ॥ ౬౯ ॥ డాద్యము=డవర్ణము మొదటిదిగాఁగలది. ఫాంతికము = ఫవర్ణముకడపటిదిగాఁగలది. అనఁగాడఢణతథదధనపఫవర్ణములుకలది. నీలద్యుతి= = నల్లనికాంతిగలది. పురాణపురుషలాలితము = విష్ణుదేవతాకమగుటచేమనోజ్ఞమైనది. సుధీవేద్యము = పండితులచేఁదెలియఁదగినది. దశపత్రసముద్యన్మణిపూరకమునన్ = పదిరేకులచే వెలుఁగునట్టిమణిపూరకకమలమునందు. మొలవంగన్ = పుట్టఁగా. తావులు = పరిమళములు ॥ ౭౦ ॥ శైవము = శివుఁడుదేవతగాఁగలది. ద్వాదశదళరేఖావళితకఠంబు = పంద్రెండు రేకులచేత చుట్టఁబడినకఠవర్ణములాద్యంతములుగాఁగలది. అనఁగా కఖగఘఙచఛజఝఞటఠవర్ణములుగలది. కమ్రకనకచ్ఛాయాశ్రీవహము = ప్రకాశించునట్టిబంగారువన్నెయొక్క కలిమినివహించినది. బంగారువన్నెగలిగిప్రకాశించునది. అనాహతము = అనాహతకమలము. ఇగురొత్తింపన్= చిగుర్చునట్లుచేయఁగా—అతిశయింపఁజేయఁగా ॥ ౭౧ ॥ పదియాఱుసారంబులు = అకారము మొదలుగాఁగలపది

క. పదియాఱు ఱేకులందును, బదియాఱు సారంబు లుండఁ బరమజ్యోతి
ష్ప్రదమై సురమునివశతన్, బొదలు విశుద్ధమునఁ బొంక ముగఁ బరిమళముల్
క. దళయుగమున హంక్షంబులు, పొలుపొందఁ జిదంశమగుచు భూరిమణివిభా
వలిఁ దగు నాజ్ఞాపురమునఁ, గలవాసన లేసరేఁగి కడలుకొనంగన్. ౨౩
ఉ. ఇంతకు నూర్ధ్వమై శిరసు నిక్క నధోముఖమూర్తిఁ బొల్చి య
త్యంతవికాసశాలియయి యాద్యశివాశ్రయమై సహస్రప
త్రాంతర చిత్సుధారస మహోఝరదుర్దిన మాచరించు న
ద్దొంతరపువ్వునం గలుగు తోరపుఁగంపులు పెంపుమీఱఁగన్. ౨౪
చ. కనదరుణప్రభావిభవ గర్వ మఖర్వముగా నొనర్చుచుం
దనువు తళుక్కునన్ మెఱవఁ దత్సరసీరుహపఙ్క్తి పేరి ని
చ్చెన వడినెక్కి నిక్కి నిజ జిహ్వికఁ జాఁచి లలాటమధ్యసం
జనితసుధామయూఖసుధ సర్వపురంధ్రిక గ్రోలి సోలఁగన్. ౨౫
క. హృన్మణిసూత్రాకృతి యగు, చిన్మూర్తిఁ బురాణపురుషు శేషావాసుం
గన్మొగిచి లోనిచూపున, సన్మాన్యుఁ డతండు చూచు సమయమునందున్. ౨౬
దండకము. కడిఁదియసురు ధేనుకున్ ధేనుకుత్కీల దంభోళిసంస్తంభి దోస్తంభ
సంభూత శౌర్యాగ్నిచేఁ గ్రాఁచి గోలోకముం గాచి గోవర్ధన క్ష్మోణిభృత్కూం

---

యాఱచ్చులును. పరమజ్యోతిష్ప్రదము = మేలయిన వెలుఁగునకుచోటు. సురమునివశతన్ = నార దుఁడు అధిదేవతగాఁగలదియగుటచేత. విశుద్ధమునన్ = విశుద్ధకమలమునందు. పొంకముగన్ = పొందికైనదికాఁగా ॥ ౨౨ ॥ దళయుగమునన్ = రెండు ఱేకులచేత. హంక్షంబులు = హం క్షం అనువర్ణములు. పొలుపొందన్ = పొందుపడఁగా. చిదంశము = జ్ఞానాంశమైనది. భూరిమణివిభా వలిన్ = విశేషమయిన మాణిక్యకాంతి పఙ్క్తులచేత. ఆజ్ఞాపురమునన్ = ఆజ్ఞాచక్రమయిన కమ లమునందు. ఏసరేఁగి = మిక్కిలిరేఁగి. కడలుకొనంగన్ = అతిశయింపఁగా ॥ ౨౩ ॥ ఇంతకున్ = ఈ చెప్పఁబడిన వానికన్నిటికి. ఊర్ధ్వమై = మీఁదై. శిరసునిక్కన్ = మూర్ధస్థానమునందు. ఆద్య = మొదటివాఁడైన. సహస్ర...దుర్దినము = సహస్రపత్ర = వేయిరేకులుగల సహస్రార కమ లముయొక్క. అంతర = లోపలి. చిత్ = జ్ఞానరూపమైన. సుధా = అమృతము యొక్క. రస = జల ముచేసైన. మహోఝర = దొడ్డసెలయేటివలన. దుర్దినము = మబ్బుకమ్మటచే సూర్యరశ్మిలేని దిన మును. ఆచరించు నద్దొంతరపువ్వునన్ = చేయునట్టి యాదొంతి పువ్వునందు. తోరపుఁగంపులు = అధికపరిమళములు. పెంపుమీఱఁగన్ = వృద్ధిచేత అతిశయింపఁగా ॥ ౨౪ ॥ అఖర్వము = తక్కువ కానిది. మెఱవన్ = వెలుఁగఁగా. జిహ్వికన్ = నాలుకను. సుధామయూఖసుధన్ = చంద్రుని యందలి యమృతమును. సర్వపురంధ్రిక = ఉత్తమయైన సర్వస్త్రీ ॥ ౨౫ ॥ చిన్మూర్తిన్ = జ్ఞాన స్వరూపుని. మొగిచి = మూసి ॥ ౨౬ ॥ కడిఁది = అసాధ్యుఁడైన, ధేనుకుత్కీల = గోవర్ధన పర్వ తముచేత. దంభోళిసంస్తంభి = వజ్రాయుధమును నిలిపిన. దోస్తంభ = స్తంభమువంటి భుజమునందు.

దరక్షోణిఁ గ్రీడించువిన్నాణి పెన్నాటకంబైన క్రాల్గన్నులఁగల్గు పెందళ్కు
లఁ నల్గడఁ జిల్కు నెమ్మోముజాబిల్లి శోభిల్ల నుత్ఫుల్ల గల్లద్వయిన్ హత్తి
మత్తిల్లి నర్తించుచున్ మాకరాకార రేఖాభిరామంబు లౌ కుండలంబుల్
సమగ్రప్రభామండలంబుల్ చలింపన్ నిలింపాళిగాసాకృతిన్ మాసరంబైన
మాయూరపింఛంబుతో నైక్యముంబొందుచిక్కంబుచే గొప్పయై కొప్పుగన్ప
ట్టఁగన్పట్టఁగా రాని వేడ్కన్ మహాఫాలపట్టంబుపై నెట్టుకో, నిగమకమలగంధ
ముల్ సంధిలం జేయు నాసాపుటిన్ బ్రస్ఫుటస్ఫూర్తి వర్తింప దృప్యద్ధనుస్సంప
దల్ పెంపుమీరంగ రంగద్రుచిన్ శాక్వరస్కంధబంధుత్వగంధంబు రూపించు
మూఁపుల్ పురాయింప నింపారు రేఖాత్రయీమైత్రి నేత్రప్రియంబిచ్చు
చున్ గంబుపాకంబునం బంధురంబై వలత్కంధరంబొప్పఁగప్పైకునీలంపుఁ
గంబంబులంబోలు బగ్గేలు లీలావిభూషావళిం జాలభాసిల్ల నుల్లోకసౌందర్యధు
ర్యస్థితిన్ విస్తృతంబౌ నురస్సీమ జీమూతమై హారవర్షోపలశ్రేణి రాణించు మిం
చుం బురాణింపఁగాఁ జేయ నచ్ఛోన యుచ్ఛ్యానజానుచ్ఛవిన్ దుచ్ఛముం జేసి
కంజాతవాసాంఘ్రికంజాతలాక్షాంకశంకావహంబైన పంకేజరాగంబిగుర్వం
గ, శ్రీచరణయుగళహాటకంబై కినద్ధాటికోద్యత్తులాకోటులూటాడుచున్
జాటువాచాటతం జాటి ముప్పేటగాఁ జుట్టినన్ దీగ చుట్టుల్ గటిన్ సంఘటిల్లన్

---

సంభూత=పుట్టిన. శౌర్యాగ్నిచేన్=శూరత్వపు నిప్పుచేత. క్రాఁచి=కాల్చి. గోలోకమున్=గోవుల సమూహమును. క్షోణిభృత్=కొండయొక్క. కందరక్షోణిన్=గుహాప్రదేశమునందు. విన్నాణి=నేర్పరి. పెన్నాటకంబు = మిక్కిలి నలించుటగలది. క్రాలు=ప్రకాశించునట్టి. పెందళ్కులన్ = అధికమయిన తళతళయను కాంతులను. చిల్కు = వ్యాపింపఁజేయునట్టి. ఉత్ఫుల్లగల్లద్వయిన్ = వికాసముగలచెక్కిళ్ళజంటయందు. హత్తి=అంటి. మాకరాకార రేఖాభిరామంబులు=మొసలియాకృతివంటియాకృతిగలరేఖలచేతమనోజ్ఞములయినవి. సమగ్రప్రభామండలంబులు=కొఱఁతలేని వెలుఁగుల సముదాయముగలవి. మాసరంబు = అతిశయించినది. మాయూరపింఛంబు = నెమలియీఁకల కుచ్చు. శాక్వరస్కంధ బంధుత్వ గంధంబునన్= ఎద్దుమూఁపురమునుబోలి నిక్కుగల గర్వమును. పురాయింపన్ = విజృంభింపఁగా. కంబుపాకంబునన్ = శంఖమువిధమున. బంధురంబై =నిమ్నోన్నతములుగలదై. వలత్కంధరంబు = గుండ్రని మెడ. ఉల్లోక = లోకాతీతమయిన. హారవర్షోపలశ్రేణి = ముత్యాలపేరులనెడి వడగండ్లచాలు. రాణించు = ప్రకాశించునట్టి. మించున్=మెఱుపును. పురాణింపఁగాన్=వర్ధిల్ల. ఉచ్ఛ్యాన = దట్టమయిన. జానుచ్ఛవిన్ = మోకాళ్ళకాంతిని. కంజాతవాస = లక్ష్మీదేవియొక్క. లాక్షాంక = లత్తుకగుఱుతులనెడి. శంకా = సందేహమును. ఆవహంబు = కలిగించునది. పంకేజరాగంబు = పద్మరాగము-కౌస్తుభమణి. ఇగుర్వంగన్ = చిగిరింపఁగా—ప్రకాశింపఁగా. హాటకంబు = బంగారు. ఊటాడుచున్ = కదలాడుచు. చాటు = చాటించు. వాచాటతన్ = మాటకారితనమును. కటిన్ = మొలను. తటిల్లేఖ = మెఱుఁపుతీఁగ.

దటిల్లేఖ లేఖర్షభుం జేరి రంజిల్లునా నుల్లలత్కాంతి గోయష్టి యుత్కృష్టమై
హెచ్చుగా నిచ్చకున్ వచ్చుచున్ గ్రచ్చకాయల్ కరాధిష్ఠితాజాండషండంబు
లోనాఁ గడున్ జిత్రభస్త్రంబునన్ నిల్పినం బొల్పుగాఁ గల్పకస్వచ్ఛగుచ్ఛంబు
సత్యార్థమై నిత్యముం గ్రొత్తగాఁ బూనియున్నాఁ డనన్ భవ్యశంఖంబు సవ్య
గ్రహస్తంబునం దిమ్ముగా దివ్యభూషావిశేషార్భటుల్ గ్రమ్మ లేఁదెమ్మెరల్
గ్రమ్మఁగా నమ్రదిక్పాలకక్రమ స్తుతుల్ స్వస్థలంబంటఁగా నంటగా రాకరాకాసు
ధాభానుభానూజ్జ్వలజ్జ్వాలకీలాకులప్రౌఢరీఢాకృదారూఢగాఢత్విడోఘంబు
మోఘంబుగా మేఘవీథిం ధరాధోజగద్ధోరణిన్ దోరణల్ గట్ట, యాదవరమ
ణుండు నాభిసంజాతకంజాతజాతుం డఖండాంఘ్రిపీఠీభవద్విశ్వవిశ్వంభరాభా
గుఁ డాభోగవద్భోగిభోగాసనుం డాసవామోదమాధుర్యధుర్యాసురస్త్రీకపో
లద్వయీపత్రరేఖాపకారక్రియా క్రూరచక్రాంకుఁ డోంకారసర్వస్వ నిర్వా
హకుం డుర్విచే దుర్వహాంగప్రభాగుర్విచే నోషధుల్ గన్నపృథ్వాఖ్యపృథ్వీశ
ముఖ్యుండు పుండ్రేక్షుకోదండలక్ష్మాభుఁ డంచద్దరస్మేరసారుం డుదారుండు
దారోత్తముల్ నీలయున్ బాలయున్ లక్ష్మియున్ బక్ష్మలాక్షీ శిరోరత్నమున్
భూమియున్ భామయున్ బ్రేమఁ గామించి వెన్నాడఁగా మించి పంచాబ్దుఁ
డయ్యున్ గడున్ బ్రోడలౌ బోడలుం జూడఁగా లేని పెన్నిక్కు నిక్కంబ యావి
ష్కృతిం జూపి దీపించియుండెన్. ౨౨

---

లేఖర్షభున్ = ఇంద్రుని. ఉల్లలత్ = తళతళలాడుచున్న. గోయష్టి = ఆవులనుదోలెడుకఱ్ఱ. కరాధిష్ఠిత = చేతియందుంచుకోఁబడిన. షండంబులు = సమూహములు. లేఁదెమ్మెరలు = లేత వాయువులు. నమ్ర = వంగిన. కమ్ర = మనోజ్ఞమైన. సుధాభాను = అమృతకిరణుఁడు —చంద్రుఁడు. ఉజ్జ్వలత్ = వెలుఁగుచున్న. జ్వాలకీలాకుల = మంటల లేశముచే కలతనొందిన. రీఢాకృత్ = అవమానపఱచుచున్న. ఆరూఢ = మీఁదికి ప్రసరించిన. గాఢత్విడోఘంబు=అధిక కాంతి సమూహము. మోఘంబు = కొట్టుపడినది—వ్యర్థము. అధోజగద్ధోరణిన్ = క్రిందిలోకము విధమున. దోరణల్గట్ట = బారులుదీర. నాభిసంజాత కంజాతుండు = బొడ్డునందుఁబుట్టిన బ్రహ్మగలవాఁడు. పీఠీభవత్ = పీఠముగాఁజేయఁబడిన. విశ్వ = సమస్తమయిన. విశ్వంభరాభాగుఁడు = భూప్రదేశము గలవాఁడు. ఆభోగవత్ = పరిపూర్ణత్వమువంటి. భోగిభోగాసనుండు = పాముదేహముపీఠముగాఁ గలవాఁడు. ఆసవ = మద్యముయొక్క. ఆమోద = పరిమళముయొక్క. పత్రరేఖా = మకరికాపత్రపురేఖలకు. చక్రాంకుఁడు = చక్రము గుఱుతుగలవాఁడు. దుర్వహాంగప్రభాగుర్వి = వహింపరాని అవయవముల కాంతిచేత గొప్పది. పుండ్రేక్షుకోదండ లక్ష్మాభుఁడు=మన్మథుల యొక్కలక్షును బోలినవాఁడు. అంచద్దరస్మేర సారుండు = ఒప్పిదమయిన చిఱునవ్వుయొక్క సత్తగలవాఁడు. దారోత్తములు = ఉత్తములాండ్రయిన భార్యలు. పక్ష్మలాక్షీ = స్త్రీ. వెన్నాడఁగాన్ = వెంటనంటిరాఁగా. బోడలు=ఏకదండిసన్యాసులు. పెన్నిక్కున్ = దొడ్డతావునందు.

క. కనుదెఱచి తనదులోనం, గనుదేజము ముందరఁ గాంచి కమలాసనుఁ డా
డినయట్ల నిక్కమయ్యెనె,విన గన నిది క్రొత్తయనుచు వెసనుత్థితుఁడై.

సీ. చామరధ్వజశంఖ చాపప్రముఖచిహ్న, లలితపదార్పణా లంకృతమహీ
దళితోపరిత్వగుజ్జ్వలదంశుమత్ఫలా, స్తంభాభిరామోరు దండయుగళు
వరదానముద్రాబ్జ ధరణభూషితకటి, న్యస్తకుంచితసము న్నతభుజాఢ్యు
సింహావలగ్నల క్ష్మీపరిహాసితో యజగర్భ గర్భవృ త్తావలగ్ను

తే. జలదసంకాశు నిర్వ్రీడ జఘనదేశుఁ, గోటికందర్పలావణ్యు గుణశరణ్యు
విష్ణునిజభక్తవర్ధిష్ణుఁగృష్ణుఁ గాంచి,పఱచె సాక్రోశుఁడగుచు నా బ్రాహ్మణుండు.

చ. పఱచిన దేవకీసుతుఁడు పక్కున నవ్వి నెఁ గ్రమ్మఱిల్లి మైఁ
దఱచుగ రోమహర్షణ ము దంచితభక్తిభరాకులత్వ మే
ర్పఱచుచుఁ గేల్మోగిడ్చి పలుపల్కుల తళ్కుల సన్నవెన్నెలన్
బఱపుచుఁ బ్రస్తుతించె ముని బంధవిభంజను భక్తరంజనున్. ౮౦

మాలిని. విధి శివ సనకాదుల్ వేదముల్ గూడి నిన్నే
మధుమథన ! యితండి మ్మాడ్కివాఁ డంచు నెన్నన్
విధురులయినచోటన్ నేర్చునే గాఢమోహాం
బుధి వడిఁ బడుచు న్నాబోఁటి నీ పాట మెన్నన్. ౮౧

తరల. హరిహయోపలభూధరాకృతి నంద మొందినయట్టి నీ
యురుభృగుస్తుతిపాత్రమున్ గట కోజ్జ్వలంబు నఖాఘుర

---

ఆవిష్కృతిన్ = అవతరించుటను ॥ ౭౭ ॥ ఉత్థితుఁడు = లేచినవాఁడు ॥ ౭౮ ॥ పదార్పణ = అడుగులు పెట్టుటచేత. దళిత = భేదింపఁబడిన - ఒలువఁబడిన. ఉపరిత్వక్ = మీఁదితోలువలన. ఉజ్జ్వలత్ = వెలుఁగుచున్న. అంశుమత్ఫలాస్తంభ = అరఁటికంబములవలె. ఊరుదండ=దండాకారమయిన తొడలయొక్క. అబ్జధరణ = కమలమును ధరించుటచేత. కుంచిత = వంపఁబడిన. సమున్నత=మిక్కిలిపొడువులైన. సింహావలగ్న లక్ష్మీ పరిహాసి=సింహము నడుముయొక్క యందమును పరిహసించునది. వృత్త=వట్రువైన. జలదసంకాశున్ = మేఘమును బోలినవానిని. నిర్వ్రీడజఘనదేశున్ = సిగ్గువిడిచిన మొలగలవానిని - దిగంబరుని. సాక్రోశుఁడు=తిట్టుటతోఁగూడినవాఁడు ॥ ౭౯ ॥ క్రమ్మఱిల్లి = వెనుకకుతిరిగి. రోమహర్షణము = గగుర్పాటు. భక్తిభరాకులత్వము = భక్త్యతిశయమువలని కలఁతపాటు. తళ్కుల = తళతళలాడుచున్న. పఱపుచున్=వ్యాపింపఁజేయుచు. బంధవిభంజనున్ = మోహబంధములను జెఱుచువానిని ॥ ౮౦ ॥ విధురులు= వికలత్వమునొందినవారు. నీపాటము=నీమహిమమును ॥ ౮౧ ॥ హరిహయోపల=ఇంద్రనీలమణుల. భృగు=చఱియ ; భృగువనెడిముని. కటక = కొండమీఁది చదరపునేల ; కడియము. పాదము=

త్నరుచిమిత్రము నైనపాదము నంజనించిన గంగ ని
త్యరతిఁ బూని తలంతుఁ దాప నిదాఘవృత్తినివృత్తికిన్. ౮౨

భుజంగప్రయాతము. స్ఫురన్నాభిగర్తప్రభూతాంబుజాతో
దరక్షోణిలో వేల్పు తాతన్ విధాతన్
నిరాతంకసర్గైక నిర్ణేతఁ గంటిన్
హరీ! తాతకుం దాత వైయుంట యొప్పున్. ౮౩

స్రగ్విణి. నీతిమై వైన్యభూనేతవై రత్నసం,ఘాతదివ్యౌషధిగ్రామముల్ భూతహృ
త్ప్రీతి గన్నట్టివే స్ఫీతహర్షోత్కటున్,భూతధాత్రీగవిన్ బూతనాఘాతనా! ౮౪

లయగ్రాహి. ఆగమసముద్ధరణ రాగరసలంపటను ధాగమనియామకరసాగరిమ
భోగపదవీనిహిత భాగవతభూగగన భాగపరిపూర్ణపర భాగవపురగ్రా [కారీ
త్యాగగుణధుర్య మునియాగపరిరక్షకహలాగతసమిద్విజయసౌగతమతార్వో
ద్యోగ కలికాలకలుషాగకులిశాంకకొనసాగినకృపన్ మనుపు యోగిహితమ ౮౫

మ. రవిధామంబులు సిద్ధమంత్రములు చంద్రజ్యోత్స్నికల్ సన్మణి [మ్మున్
ప్రవరశ్రేణులు భవ్యభేషజతతుల్ పాథోధరంబుల్ సుధీ
భవనిస్తారక! నేమమిచ్చి జగమున్ బాలించు మర్యాద నీ
యవతారంబు లశేషలోకహితచర్యాధుర్యసంచారముల్. ౮౬

ఉ. అంజనపుంజనవ్యతర మై తగు నీ తిరుమేనికిప్పుడ
ల్మింజులుకొంగఁ జేకుఱుఁ జుమీ కమలేక్షణ! సూక్ష్మదృక్కులౌఁ
గంజభవాదివృద్ధులకు గాఢతరాక్షరలక్ష్మి మ్రొయెందుఁ గా
నం జనుఁ గాదె కప్పుకత నన్ మునుదోఁపని యక్షరస్థితుల్. ౮౭

కొండవెంబడి చిన్నకొండ; అడుగు. తాపనిదాఘవృత్తి = తాపత్రయమనెడి వేసఁగికాలము యొక్క ప్రవర్తనము ॥ ౮౨ ॥ నాభిగర్తప్రభూత = బొడ్డుబొక్కయందుఁ బుట్టిన. నిరాతంక = భయములేని. సర్గ = సృష్టికి. తాత=బ్రహ్మ; తండ్రి ॥ ౮౩ ॥ వైన్యభూనేత = వైన్యుఁడను రాజు—పృథుచక్రవర్తి. దివ్యౌషధిగ్రామములు=ఒప్పిదములైన ఓషధుల సమూహములు. స్ఫీత= అధికమైన. ఉత్కటున్ = మదించినదానిని. భూతధాత్రీగవిన్ = భూమియైన ఆవును ॥ ౮౪ ॥ లంపట = అత్యాసక్తిగల. పదవీ = మార్గమునందు. నిహిత=ఉంచఁబడిన. వపురగ్రా = దేహము కొనగలవాఁడా. హలాగత = నాఁగటివలన వచ్చిన. సమిద్విజయ = యుద్ధమునందలి గెలుపు గలవాఁడా. సౌగత = బుద్ధునిదైన. కలుషాగకులిశాంక = పాపములనెడి కొండలకు వజ్రాయుధ చిహ్నముగలవాఁడా. మనుపు = రక్షింపుము ॥ ౮౫ ॥ జ్యోత్స్నికలు = వెన్నెలలు. భేషజ = మందులయొక్క. పాథోధరంబులు = మేఘములు. సుధీభవనిస్తారక = విద్వాంసులను జన్మముల వలననుండి తరింపఁజేయువాఁడా ॥ ౮౬ ॥ అంజనపుంజ = కాటుకరాశివలె. నవ్యతరమై=మిక్కిలి

క. కమిచి యణురేణుతృణకా, ష్ఠములం బరిపూర్ణవృత్తి సమకూరెను నీ
యమితమహామహిమాబ్ధికిఁ, గమలభవప్రముఖు లెన్నఁగా బుద్బుదముల్.

పృథ్వి. జగత్పతి! భవత్పదాబ్జయుగభక్తిసంయుక్తితో
గగుర్పొడువ నన్యథా గతియెఱుంగ కెవ్వాఁడు నీ
యగణ్యగుణకీర్తనం బధిగమించుటన్ మించెనే
నగాధభవసాగరం బతఁడు దాఁటు నొక్కెత్తునన్. ౮౯

క. భవదంఘ్ర్యుపాసనకుఁ బు, ణ్యావసతి సుఖంబె వెఱతు నయ్యా భవంబుల్
సవరింప యుష్మదర్చా, ప్రవణమతిం జేయు నన్నుఁ బరధామపతీ! ౯౦

క. జయ విజయపూర్ణపార్శ్వవి, జయ జయకల్పనధురీణ సమదదనుజరా
ణ్జయ సంరక్షితభువనా, జయ జయసగుణాగుణాత్మ జయ శార్ఙ్గధరా!

సీ. నడతు నీ క్షేత్రంబు నకుఁ జెయిచాఁచి య ర్చింతు నీ నమ్మిన సేవకులను
మ్రొక్కుదు నీ పాద ములకు జిహ్వావీథి, నీనామములు వకా ణింతునెపుడు
నర్పింతు నీ సేవ కై సర్వదేహంబుఁ, జింతింతు నీలీలఁ జిత్తసరణిఁ
దనివోక నీచక్కఁ దనము సంవీక్షింతు, నీయవధానంబు నెమ్మి వింద

తే. బ్రహ్మరుద్రాదులకుఁ గానఁ బడనినీవు, నేడునా మ్రోల నిలిచితి నీలవర్ణ!
వర్ణనాతీతమత్ప్రాగ్భ వప్రవృత్త, పుణ్యపరిపాక మేరికిఁ బొగడఁదరమె.

శా. నిత్యస్ఫూర్తిసనాథులై రి విధి కంఠేకాలముఖ్యుల్ క్షిత
క్షిత్యానంద! యనాదిమూర్తి వగు నీ చేఁ దత్సనాథత్వసం
పత్త్యావిష్కృతి నాకునుం గలుగుఁ ద త్ప్రాయుండనే కాన నే
మృత్యుక్రూరభయంబుఁ బాసితిని జు మ్మీ నీ దయాసంపదన్. ౯౩

శ్లాఘ్యమై. తిరుమేని = మంచి దేహముయొక్క. వృద్ధులకున్ = పెద్దలకు ॥ ౮౭ ॥ కమిచి = గ్రహించి - లోపలనణఁచుకొని. బుద్బుదములు = నీటిబుగ్గలు ॥ ౮౮ ॥ సంయుక్తి = కూడిక. అధిగమించుటన్ = చదువుటచేత. అగాధ = మిక్కిలిలోఁతైన. ఒక్కెత్తునన్ = ఒక్కపూనికతో ॥౮౯॥ వసతి = ఉనికిపట్టు. సవరింపన్ = పొందను. ప్రవణ = అభిముఖమైన. పరధామపతీ = పరమపదము నేలువాఁడా ॥ ౯౦ ॥ ౯౧ ॥ వకాణింతున్ = వక్కాణింతును = చెప్పుదును. తనివోక = తృప్తి లేక. అవధానంబు = ఎచ్చరిక — ఎచ్చరికతోఁ జేయు ప్రసంగమును. నెమ్మి = నెమ్మది. ప్రాగ్భవ = పూర్వజన్మమునందలి ॥ ౯౨ ॥ నిత్యస్ఫూర్తిసనాథులు = శాశ్వతమైన స్ఫురణతోఁ గూడినవారు. విధి కంఠేకాల ముఖ్యులు = బ్రహ్మ శివుఁడు మొదలగువారు. క్షిత్యానంద = భూమిని సంతోషింపఁ జేయువాఁడా. తత్సనాథత్వ సంపత్త్యావిష్కృతి = ఆకూడుకొన్న తనపు కలిమియొక్క వెల

మ. అని లోకత్రయమోహనుం డగు రమాప్రాణేశు నెమ్మోమునం
దనచూడ్కుల్ నిగుడంగ భూమిసురరత్నం బూరకున్నంత నే
మునుగా ధాతృసమన్వితాఖిలమరు న్ముఖ్యుల్ దగన్ మ్రొక్కి మో
ద్యున కే లింపుగ నమ్మునీశ్వరుగుణం బుల్ సారె గీర్తించిరన్. ౯౪

క. విని ముగ్ధహాసరుచిరా, ననుఁడై తనచుట్టునున్న నానామరరా
జనికాయముతోఁ బలుకున్, దనుజారి మహీసురాస్య దత్తేక్షణుఁడై. ౯౫

సీ. దాంతుండు సత్యసంధాధురంధరుఁడుమ ద్భక్తుండుపితృహితోద్యముఁడునైన
యిద్ధరామరసూతి కీప్సితంబొసఁగ నే, వచ్చుచో మీరెల్ల వారు నితని
కర్మిలి సాహాయ్య మాచరించుటకునై, యేతెంచినారు నా కెవ్వరేని
హితులు వారలపను లెల్ల మీయవి కాన, పరతాపతప్తులు పరముదేక

తే. ముదితు లస్మత్ప్రశంసాభిముఖులునైన, వారునాభక్తులగువారువారియందుఁ
బ్రీతిగలవారి నేనుద్ధరింతుఁ గీడు, వలన వారలకంటె న వశ్యమగుట. ౯౬

క. సద్భక్తసేవచేతన్, మద్భావము తుష్టిగన్న మాడ్కిఁ దపశ్శిలా
ద్యుద్భూతప్రతిమార్చల, ముద్భరితముగాదు నిక్క ముగఁ దలపోయన్. ౯౭

మ. వలనాయేటికి నాశ్రయించి మనఁగా వానీరమున్ నీరమున్
దలవెత్తే పచరింప నేటికి సమిద్దానంబు దానంబు న
చ్చలమా యేటికి నెత్తిఁగొట్టుకొనఁగా సన్న్యాసము న్న్యాసమున్
గలిఁ దేఁ జాలు మదీయభక్తిరుచిభక్తశ్రేణి కశ్రాంతమున్. ౯౮

తే. సర్వధర్మవిహీనప్రచారుఁడైన, నాత్మమద్భక్తిగలదేని యతఁడచూవె
నాకునత్యంతహితుఁడును శ్లోకరతుఁడు,నిఖిలధర్మప్రవర్తన నిశ్చితుండు. ౯౯

ఆ. అస్మదంకధారి యగుభక్తవరుమేను, నాకుఁ గూర్చినట్లు నాకులార!
వదలకేవసించు వైకుంఠనగరంబు, నందుఁగొలుప దంత రంగమునకు. ౧౦౦

---

యుట ‖ ౯౩ ‖ ఇంపుగన్ = ఇంపుకాఁగా ‖ ౯౪ ‖ ముగ్ధహాసరుచిరాననుఁడు= మనోజ్ఞమయిన చిఱునవ్వుచే వెలుఁగునట్టి ముఖముగలవాఁడు ‖ ౯౫ ‖ దాంతుండు = ఇంద్రియనిగ్రహముగల వాఁడు. ఉద్యముఁడు = ప్రయత్నముగలవాఁడు. అర్మిలిన్ = ప్రేమతో. పరముదేకముదితులు = ఇతరుల సంతోషము ఒకటిచేతనే సంతోషించినవారు ‖ ౯౬ ‖ తుష్టిన్ = సంతోషమును. ముద్భరితము = సంతోషమును పొందినది ‖ ౯౭ ‖ వానీరము = ప్రబ్బలిచెట్టు. సమిద్దానంబు=సమిధల నిచ్చుట – హోమము. అచ్చలము = ఆగ్రహము. న్యాసము = ధనమును దాచిపెట్టుట ‖ ౯౮ ‖ సుశ్లోకరతుఁడు = మంచికీర్తియందాసక్తుఁడు. నిశ్చితుఁడు = నిశ్చయింపఁబడిన వాఁడు ‖ ౯౯ ‖ అంక = చిహ్నమును. నాకులార = దేవతలారా. కొలుపదు = సరిపడదు ‖ ౧౦౦ ‖ ౧౦౧ ‖

క. నాయందు భక్తుఁ డుండుఁ, బాయక యే నధివసింతు భక్తునియందుఁ
మాయిరువురకుం గలుగుఁ, గాయప్రాణానుకూల్య కౌశల్యంబుల్. ౧౦౧

ఆ. మహితపుణ్యులైన మద్భక్తవరులకుఁ, గానివాఁడు నాకుఁ గానివాఁడు
భాగవతుల నన్ను భావించి యొకటగాఁ, గన్నవాఁడు నన్నుఁ గన్నవాఁడు.

క. మీయెడ మద్భక్తిగుణో,చ్ఛ్రాయము గనుఁగొంటి నేను సత్యంబు బహూ
పాయంబుల మద్భక్తుని, కై యిట కేతెంచుట న్వియచ్చరులారా! ౧౦౩

మ. సురకర్మంది హిరణ్యదైత్యసుతు వ్యాసుఁ శౌనకుఁ శ్రీపరా
శరు రుక్మాంగదు నంబరీషు సరమాజానిఁ వసిష్ఠుఁ బురం
దరపుత్రుఁ శుకు దాల్భ్య భీష్ము వెఱఁగొం దంజేయు మద్భక్తిత
త్పరుఁ డీ పుణ్యుఁడు పుండరీకుఁ డితనిఁ భావింతు మేలీవులఁ. ౧౦౪

ఆ. వినుఁడు మీకునేనిఁ గనరాని యీహితం, బీ తపస్వివరుని కిత్తు నేడ
యెద్దివేఁడె భక్తుఁ డద్దియయొసఁగంగఁ, గట్టినాఁడఁ గేలఁ గంకణంబు.

క. అని దేవకీకుమారుఁడు, మునివదనముఁ జూచి పలుకు మోదాంబుదగ
ర్జనమనఁ బ్రసాదసాగర, జనితధ్వనియనఁగ నిగుడు సరసారభటిఁ. ౧౦౬

ఉ. నీ పితృభక్తి నీ తపము నీ వనిశంబు నొనర్చు నర్చయు
ద్దీపితహర్షుఁ జేసె జగతీసురనందన! నన్ను నీకు నా
రూపము భక్తి మత్సదన రోహణశైలము చాలదక్కఁ గాం
క్షాపరిపూర్తిగా వరమొసంగెద వేఁడు యథారుచిప్రభఁ. ౧౦౭

క. భాగ్యమనై యిహపరపరి, భోగ్యార్థమనై యగణ్యపుణ్యమనై వై
రాగ్యజ్ఞానోన్నతులగు, యోగ్యతములపాల వాలి యుండుదుఁ జుమ్మీ. ౧౦౮

వ. విశేషించి నీయెడం బ్రసన్నుండనై యున్నవాఁడ నభీష్టవృష్టిఘనాఘనం బగు మదీయఘృణాగుణంబునకు భాజనంబవైతివి జగజ్జాలంబునవస్తుజాలం బు నీకుదుర్లభంబులే దనిపలుకు యదువల్లభువలనం బ్రబోధితుండై. ౧౦౯

---

౧౦౨ ॥ ఉచ్ఛ్రాయము = ఆధిక్యము ॥ ౧౦౩ ॥ సురకర్మంది = నారదుఁడు. సరమాజాని = విభీషణుఁడు. పురందరపుత్రుఁడు = అర్జునుఁడు. మేలీవులఁ = శ్రేష్ఠమయిన దానములచేత ॥ ౧౦౪ ॥ ఈహితము = కోరిక ॥ ౧౦౫ ॥ మోదాంబుదగర్జనము = సంతోషరూపమయిన మేఘముయొక్క యుఱుము. ప్రసాదసాగర = అనుగ్రహమనెడి సముద్రమునందు ॥ ౧౦౬ ॥ రోహణశైలము = రత్నపర్వతము ॥ ౧౦౭ ॥ పరిభోగ్యార్థము = చక్కఁగా అనుభవింపఁదగిన వస్తువు. వాలి=అతిశయించి ॥ ౧౦౮ ॥ అభీష్టవృష్టి ఘనాఘనంబు = కోరికలను కురియునట్టి వానకాలపు మబ్బు. ఘృణాగుణంబు = దయాగుణము. భాజనంబు = పాత్రము. ప్రబోధితుఁడు = మేలుకువ

సీ. పుండరీకుఁడు పల్కు బుద్బుదాభములైన, సిరులు నిక్కాగామింపఁ జేరికల్ప
విటపిఁ గుల్మాషముల్ వేఁడు వెఱ్ఱిగలాఁడె,నిఖిలదుర్లభుఁ డగు నీవు నన్నుఁ
గరుణింతు వరమిత్తుఁ గాతు నీడేరుతు,నని యున్కి భయమేది?యద్భుతార్థ
మర్థింతు నిపుడున్న యట్ల యస్మన్నామ, చిహ్నితై తన్మహాక్షేత్రతీర్థ

తే. మధ్యతలమున నిలుపు నామనవిఁ జేసి,సకలజనులకు మోక్షరాజ్యము నొసగుచు
నిదియ నాకోర్కి జగదేకహితము నిదియ,దీని మీఱిన సిరి యొల్ల దేవదేవ!

వ. అని వెండియు నతండు చాపలాతిశయంబునఁ జర్వితచర్వణంబుగా సర్వసు
పర్వదుష్ప్రాపం బగు నీ రూపంబు కృపాపరతంత్రంబగుచు నాకు నగపడుటకు
భూతవ్రాతంబులు ప్రభూతాద్భుతరసమసృణమానసంబు లగుచు నున్న
యవి భవదీయం బగు నకారణసుకృతత్వంబునకు నియంతయుం గలఁడె?
యుత్తరంగం బగు సంసారతరంగమాలి మునుంగుచుఁ బొనుంగుపడి యనంగీ
కృతవిజ్ఞానజ్ఞానవిలాసులై దోసంబులఁ జేసిన కరువులనం దగు నలసులకు
వెలసులభంబు నధికఫలంబును నగు యుష్మద్దర్శనంబు భవభయకర్శనంబు
నుపసర్గజలదవర్గస్పర్శనంబు నపవర్గదర్శననిదర్శనంబునునగుఁగాక. ఏతత్క్షే
త్రంబు నీయాజ్ఞ నశేషక్షేత్రవిశేషోత్తంసం బగుంగాక. ఈతీర్థంబు నస్మ
న్నామాంకిత సమర్థనంబున నుత్తమం బగుంగాతమని. ౧౧౧

ఉ. ఆనతశాలియై యటులు ప్రార్థన సేయు మునీంద్రు శాంబరీ
మానుషవేషధారి దయమానమనస్థితి బిగ్గ నవ్వుచున్

---

నొందింపఁబడినవాఁడు ॥ ౧౦౯ ॥ కల్పవిటపి = కల్పవృక్షము. కుల్మాషములు=గుగ్గిళ్లు. కలాఁడే= కలఁడా. ఉన్కి=ఉండుట. ఏది=చెడి. అద్భుతార్థము = వింతయైన విషయమును. అర్థింతున్ = కోరెదను. అస్మన్నామచిహ్నితై తన్మహాక్షేత్ర తీర్థమధ్యతలమునన్ = నా పేరిచేగుఱుతిడఁబడిన యీగొప్ప క్షేత్రమునకును తీర్థమునకును నడిమితావునందు ॥ ౧౧౦ ॥ చర్వితచర్వణంబుగాన్ = నమలినదానినే నమలుటగా – చెప్పినదానినే చెప్పి. దుష్ప్రాపంబు = పొందరానిది. అద్భుతరసమసృణమానసంబులు = ఆశ్చర్యరసము చేత చిక్కనైన మనసుగలవి. నియంత=నియమించువాఁడు. ఉత్తరంగము = లేచిన అలలుగలది. తరంగమాలి = సముద్రము. పొనుంగుపడి = తేజస్సుచెడి. కరువులు = పోఁతపోసెడి యచ్చులు. అలసులు = మందులు. భవభయకర్శనంబు = జన్మముల వలని భయమును క్షీణింపఁజేయునది. ఉపసర్గజలదవర్గస్పర్శనంబు=ఆపదలనెడి మేఘసమూహము లకుగాలి. అపవర్గదర్శన నిదర్శనంబు = మోక్షమును జూపుటకుఁ దార్కాణము. అశేషక్షేత్ర విశేషోత్తంసంబు=ఎల్లవిశేషించిన క్షేత్రములలోనుత్తమము. సమర్థనంబునన్=నెరవేర్చుటచేత ॥ ౧౧౧ ॥ శాంబరీమానుషవేషధారి=మాయామనుష్యవేషమును ధరించినవాఁడు. దయమాన=దయ గలదిగాఁ జేయఁబడుచున్న. బిగ్గ=గట్టిగా. వీనులన్=చెవులను. కన్గడలన్ = కడకన్నులచేత.

వీనులఁ దాఁకు గస్తడల వేమఱు చూచుచుఁ బల్కుఁ జిల్కుఁ బూఁ
దేనియసోనవెల్లువలఁ దెప్పలఁ దేలెడు మేలిపల్కులన్. ౧౧౨

సీ. అతిదుర్లభంబు వేఁడితి దుర్లభుఁడనైన, నే నీకు దక్కుట మానివర్య
త్వత్ప్రియార్థముగ నీ స్థలమునఁ బరివార, యుక్తుండనై నిల్చి యున్ననన్ను
సేవించువారెల్లఁ జిరపుణ్యవంతులు, నిహపరసుఖలాభ హృష్టమతులు
కలికాలకల్మష గరళకూటాటోప, కాకోలకంఠులు గళితభవులు [సమస్త
తే. నయ్యెదపు సర్వదివ్యోత్తమాస్మదాజ్ఞఁ, బూని యీ క్షేత్రమును దీర్థమును
భువనవర్ణితవిఖ్యాతిఁ బొదలుగాత, మెల్లపుణ్యస్థలములకు నెక్కుడగుచు.

క. త్వన్నామచిహ్నితంబగు, నిన్నేల యె తెల్లదీవి యేనుండుటకున్
మన్నించి భక్తవాంఛా, భ్యున్నతులొసఁగుటయె నాకు యుక్తవ్రతమున్.

సీ. వినుధాతృసుత! యప్పుడనిమిషులసురారి, కృపకునచ్చెరువొంది కేలు మొగిచి
పరమేశ యోభక్తపరతంత్రభావాను వర్తి పరబ్రహ్మ వరద ! నిన్ను
నరచేతిమణిఁ జేసి యవనివారలకెల్లనపవర్గ మొసఁగు నీ యయ్య నెట్లు
పోలు విశ్రాణన సాలంబు యాచక, కాంక్షితమాత్రాప్తి కారణంబు
తే. నీకె తగు నీతనికె తగు నిఖిలగమ్య, పూజవడయంగఁ బూజించి పొగడువడయ
నని మురద్వేషిఁ బుండరీకునిఁ బొగడుచుఁ, జనిరి సమ్మర్దముగ నిజస్థానములకు

ఆ. పొగడి రఖిలమునులు జగము లానందించె, నాటపాటచూపి రమరరమణు
లాదినంబు సుదిన మయ్యె దుర్దినమయ్యె, విబుధతరులతాంత వృష్టిగురియ.

సీ. శిఖిపింఛధారియై చేదోయికటినిల్పి, హరితీర్థమునఁ బశ్చిమాభిముఖుఁడు
క్షేత్రంబునందుఁ బ్రాగ్గిగభిముఖుండునై, రెండుమూర్తులు దాల్చుచుండునతని
పదపీఠమై యొప్పు ఫణిభర్త రమగొల్చు, హ్రీయన శ్రీయన రెండుగడలఁ
జామరహస్తయై ఛందోమయాకృతి, ఖగలోకనాథుఁడ గ్రమున వెలయు

---

చిల్కు = కురియుచున్న. సోన = వానవలని. తెప్పలఁదేలెడు = ఈఁదులాడుచున్న ॥ ౧౧౨ ॥ దక్కుటన్ = అధీనుఁడనగుటచేత. హృష్ట = సంతోషించిన. కలికాల...కంఠులు = కలికాలము నందలి పాపములనెడి విషసమూహముయొక్క విజృంభణమునకు శివులైనవారు. గళితభవులు = తొలఁగిన జన్మములుగలవారు ॥ ౧౧౩ ॥ చిహ్నితము = గుఱుతు పెట్టఁబడినది ॥ ౧౧౪ ॥ ధాతృసుత = నారదుఁడా. అపవర్గము = మోక్షము. విశ్రాణనసాలంబు = కల్పవృక్షము. యాచకకాంక్షితమాత్రాప్తికారణంబు = అడిగినవారి కోరికలనుమాత్రము పొందించుటకు హేతువు. సమ్మర్దముగన్ = సందడిగా ॥ ౧౧౫ ॥ దుర్దినము = చెడ్డదినము; మబ్బు ఆవరించుటచే సూర్యరశ్మి కానరానిదినము. లతాంతవృష్టి = పూలవాన ॥ ౧౧౬ ॥ ఫణిభర్త = సర్పరాజు = శేషుఁడు. ఛందోమయాకృతిన్ = వేదస్వరూ

తే. దక్షిణంబున సనకప్రధానమునులు, దానుబొగడుచు సేవింపఁ దమ్మిచూలి
యేను యదుప్రిలు సేవింతు మెడమవలన, వెనుకనుండుదురింద్రాదివిబుధవరులు.

వ. వత్సా ! శ్రీవత్సలాంఛనుభక్తవత్సలత్వంబు నీవు నెఱింగినయదియకదా వినుమత్తెఱంగున మెఱుంగుటొల్లియ గొల్లదొర కరకలితచిత్రభద్రజలజ శుక్తియు విరచితవినతముక్తియుఁ గుటిలకోమలవినీలకుంతలనికరుండును నపరిమిత కరుణాకరుండును, గటితటఘటితదోస్తంభయుగళుండును జటుల నిశాటగళనిగళుండును, మకరకుండలమండితకపోలఫలకుండును యదుకుల తిలకుండును,క్షుల్లకాశిక్యసఖ్యాభిరామ మృదులోరుద్వయుండునునద్వయుం డును, బుండరీకప్రభృతిమునిజన సేవ్యమానుండును నమానుండును, అఖండ జ్ఞానానందైకవిగ్రహుండును విదళితజగన్నిగ్రహుండునై పంచాబ్దంబును పంచశరసహస్రాతిశాయివిలసనసరసంబును నిచ్ఛాదిగంబరంబును నైన ప్రాయంబును నవరత్నసానుప్రాయంబును, బాహ్యాభ్యంతరికద్వారాష్టక విస్పష్టంబు నదభ్రంబు నభ్రంకషంబును శరదభ్రశుభ్రంబును నగుమహా ప్రాసాదంబునందు వాసవ వైశ్రవణ వైవస్వతప్రముఖ మఖభుగలఘుకిరీట మణిగణ ఘృణిమంజరీ పింజరీకృతం బగుశేషపీఠంబు నధిష్ఠించి చరణద్వ యాంతరాళోపలాలిత గోయష్టిలతామతల్లియై భువనత్రితయకామితకల్పవ ల్లియు నైనతనయాకృతి యవికృతభావంబునం బ్రభవింపఁ దక్షేత్రతీర్థమ ధ్యంబుల నంగీకృతాధ్యాసీనుండై వాసుదేవాదివ్యూహంబులు జ్ఞానక్రియాది

---

పముతో. తమ్మిచూలి=బ్రహ్మ ॥ ౧౧౭ ॥ శ్రీవత్సలాంఛనుభక్తవత్సలత్వంబు=శ్రీవిష్ణుదేవుని భక్తుల యందు ప్రేమగలిగినతనము. మెఱుంగుటొల్లియ=మెఱయుచున్న వస్త్రము, జలజశుక్తి = శంఖ మనెడి ముత్తెపుఁజిప్పగలవాఁడు. కుటిల=వంకరైన. చటులనిశాటగళనిగళుఁడు=క్రూరులైనరాక్షసుల మెడలకు సంకెలయినవాఁడు. మండిత=అలంకరింపఁబడిన. కపోలఫలకుఁడు = పలకలవంటి చెక్కిళ్లుగలవాఁడు.క్షుల్లకా=సూక్ష్మమైన. అద్వయుండు=తనకురెండవదిలేనివాఁడు. విదళితజగన్నిగ్రహుండు=ఖండింపఁబడిన లోకముల భయముగలవాఁడు. అతిశాయి=మించిన. సానుప్రాయంబు =కొండచఱియను పోలినది. విస్పష్టంబు=విడువఁబడినది. అదభ్రంబు = అల్పముకానిది. అభ్రంకషంబు=ఆకాశమునొరయునది. ప్రాసాదంబు=నగరు. మఖభుక్ =దేవతలయొక్క. అలఘు=దొడ్డ వైన. ఘృణిమంజరీ పింజరీకృతంబు=కాంతిసమూహముచేత ఎఱుపుమించిన పసుపువన్నెగలదిగాఁ జేయఁబడినది. అధిష్ఠించి = ఆశ్రయించి—చేరి. అంతరాళ = నడుమ. ఉపలాలిత = బుజ్జగింపఁ బడిన—నిలుపఁబడిన. గోయష్టి = పెలగోల. లతామతల్లి = శ్రేష్ఠమయినతీఁగె. భువనత్రయకామితకల్పవల్లి = మూడులోకముల కోరికలనిచ్చుటకు కల్పవృక్షము. అవికృతభావంబు = వికారము లేనితనము. అధ్యాసీనుఁడు = కూర్చున్నవాఁడు. వ్యూహంబులు = స్వరూపరచనలు. నిగమంబులు

శక్తులు వసురుద్రాదిత్యాదిమరుద్విశేషంబులు నశేషనిగమంబులు నఖిల
శుద్ధాంతంబులు సమస్తతీర్థసార్థంబులు సకలమంత్రరహస్యంబులు సర్వాగం
ధర్వస్వరసారస్యంబులు విశ్వ విశ్వాధికైశ్వర్యంబులు ననశ్వర సంపదలం
బొదలి సేవింపఁ బెంపుమెఱసియుండెనని వెండియుఁ గుండలికుండలుండిట్లనియె.

క. నారద ! ధృతహేమరసా, సారచ్ఛురితంబు విష్ణుసదనం బది వే
దీరచితారాత్రికతతి, భూరమణీమణికిరీట ముం బురుడించున్. ౧౧౯

క. అలతీర్థస్థలి క్షేత్ర, స్థలి లీలావిగ్రహద్వితయయుతుఁడై భా
సిలుపౌండరీకవల్లభుఁ, దలచినఁ గనుఁగొన్నఁ గరగతము లిహపరముల్.

క. వినఁబడఁడు చెవులఁగన్నులఁ, గనఁబడఁడత్యుగ్రనారకవ్యథచేతన్.
బొనుఁగుపడి జడియు వైష్ణవుఁ,డనవధిదురితప్రవర్తి యయ్యెఁగుమారా !

చ, ఇరుగడలన్ ద్విరూపములఁ గృష్ణుఁడు దైత్యనిరాకరిష్ణుఁ డ
ప్పరుసున నుండ నన్నడిమి భాగమునందు వసింతు రెవ్వ రా
నరులు మనుష్యరూపభరణంబునఁ గ్రీడయొనర్చు యక్షకి
న్నరగరుడోరగద్యుచర నాథులుగాఁగొని మ్రొక్కఁగాఁదగున్ ౧౨౨

ఉ. ఎయ్యది దివ్యసేవ్యతర మెయ్యది మానిమనోభిగమ్యమై
నెయ్యది నీవు నేను భజియింపఁగ నింపగు నెల్లనాడు నా
దయ్యపువెల్గుసుమ్ము సతతస్థితి వెల్గెడుఁ బుండరీకవా
గ్ధాయ్యలఁ బ్రజ్వరిల్లును జగత్త్రియదుష్కృతదాహదక్షమై. ౧౨౩

మ. అలసంబుల్ మునిరాట్ప్రణీతములు ప్రాయశ్చిత్తముల్ పాతకం
బుల నిర్జింపఁగ విష్ణుభక్తియ తగున్ బో దానికిం బూనఁ బా

---

= వేదములు. శుద్ధాంతంబులు = ఏకాంతస్థానములు. సార్థంబులు = సమూహములు. సారస్యంబులు = సరసభావములు. విశ్వ=సమస్తమైన. అనశ్వరసంపదలు = చెడనికలుములు. కుండలికుండలుఁడు = శివుఁడు ॥౧౧౮॥ హేమరసాసారచ్ఛురితంబు = బంగారునీటి వానకురియునది. ఆరాత్రికతతి = ఆరతులసమూహము. పురుడించున్=పోలును ॥౧౧౯॥ కరగతములు = చేతినిబొందినవి. చేతిలోనివి ॥ ౧౨౦ ॥ పొనుఁగుపడి= తేజోహీనుఁడై. జడియు=తొలఁగునట్టి. అనవధిదురితప్రవర్తి = మేరలేని పాపములనుచేసినవాఁడు ॥౧౨౧॥ నిరాకరిష్ణుఁడు = తిరస్కరించువాఁడు. పరుసునన్ = విధమున. ద్యుచరనాథులు = గంధర్వశ్రేష్ఠులు ॥౧౨౨॥ సేవ్యతరము = మిక్కిలిసేవింపఁదగినది. అభిగమ్యము= పొందఁదగినది. దయ్యపువెల్గు = దేవజ్యోతి. వాగ్ధాయ్యలన్=వాక్కులనెడిఅగ్నిని ప్రజ్వలింపఁజేసెడిబుక్కులచేత. ప్రజ్వరిల్లుచున్=మిక్కిలివెలుఁగుచు. దుష్కృతదాహదక్షము= పాపములను గాల్పఁజాలినది ॥ ౧౨౩ ॥ అలసంబులు=మాంద్యముగలవి. పూనన్ = సరియగుటకు.

ములపల్గాటులు చీరలం దుడిచినం బోనేర్చునే మాంత్రికా
కలితాహిప్రతివీరమంత్రపదరేఖాశ్లాఘుచేతంబులన్. ౧౨౪

సీ. జగదధిష్ఠానంబు సచ్చిదానందాత్మ, కము నందనందనాత్మకము క్షేత్ర
తీర్థస్థితము పృథగ్దీపితంబు నృసింహ,రామమత్స్యాదివిగ్రహము లెట్టి
యవియనఁదగియుండు నట్టిదయగు దాని,హేతికులఘతమఃప్రోతమతులు
గాంచి యర్చలయందొకటిగాఁగఁదలఁచి వికత్థనంబొనరించి గరుసు లేని

తే. రౌరవంబుల డిందిపారంబు లేక, వనరుదురుగాని విజ్ఞానవంతులైన
వారు శిలగాఁగఁదలఁచ రెవ్వారు దృష్టి,గోచరబ్రహ్మమని చూచికొలిచియునికి

శా. ఆవాణీరమణుండు ప్రార్థనము సేయన్ దేవకీదేవియం
దావిర్భావముఁ బొంది యేరికి నలభ్యంబైన శేవన్ జగ
జ్జీవాతుస్థితినుండు నిందుదొర విస్మేరాననున్ నిత్యసం
సేవం దెల్చు జితేంద్రియుండు తమముం జించుం గనుం దత్త్వమున్. ౧౨౬

తే. భక్తిగద్గదరీతివాగ్భరములొలయ, నటనముఁ గూడి గోపికానాథు ప్రోల
నిలిచి కీర్తించు పుణ్యుండు నలినబంధు,దళనమొనరించి తత్త్వపదమునకరుగు

క. హరి సోపహారిలక్ష్మీ, శ్వరు నెవ్వరు చూతురట్టి వారలు సకలా
మరపూజ్యులు వారందునఁ, బొరసిన పుణ్యము లగణ్యములు గుణజలధీ!

క. ఇతిహాస పురాణ కథా, శ్రుతిస్మృతులు నందగోపసుతుకట్టెదురన్
సతతము పఠియించు మహా, మతి పరమపదంబు నందు మతిమన్ముఖ్యా!

క. తీర్థమున నాడి బ్రహ్మా, భ్యర్థితలీలావతారు భక్తాధారున్
బార్థసఖుఁ గొల్వఁగల మా, ర్తాస్థలకున్ గలవు సచ్చిదానందంబుల్.

---

పల్గాటులు=పండ్లునాటిన గాయములు ॥ ౧౨౪ ॥ సచ్చిదానందాత్మకము=సత్తుచిత్తుల స్వరూపము ఆనందముగాఁగలది. నందనందనాత్మకము = కృష్ణుఁడు స్వరూపముగాఁగలది. పృథగ్దీపితంబు=వేఱుగా వెలుఁగునది. హేతికులు = ఆయుధములు పూనినవారు. అఘతమఃప్రోతమతులు = పాపములనెడి చీఁకట్లచే కట్టఁబడినబుద్ధిగలవారు. ఒకటి=అన్యము. వికత్థనము=అబద్ధము. గరుసు=మేర. వనరుదురు=దుఃఖింతురు ॥ ౧౨౫ ॥ శేవన్=విధమున. జగజ్జీవాతుస్థితిన్=లోకమునకు ప్రాణరక్షకమైనయునికితో. విస్మేర = చిఱునవ్వుతోడి. తెల్చు= అర్చించు ; మ్రొక్కు ॥ ౧౨౬ ॥ వాగ్భరములు = మాటల యతిశయములు. నళినబంధుదళనము = సూర్యబింబముయొక్క భేదించుటను. తత్త్వపదమునకున్ = పరబ్రహ్మస్థానమునకు ॥ ౧౨౭ ॥ సోపహారిన్ = కానుకతోఁగూడినవానిని. అందునన్=ఆదర్శనమునలన. పొరసిన=పొందిన ॥౧౨౮ ॥ మతిమన్ముఖ్యా=బుద్ధిమంతులలోప్రధానుఁడా ॥ ౧౨౯ ॥ ఆడి=స్నానముచేసి. అభ్యర్థిత=వేఁడఁబడిన. సచ్చిదానందంబులు = శాశ్వతములయిన జ్ఞానసంతోషములు ॥ ౧౩౦ ॥ భూర్ణిహుండు=కడుపులోని పిండములను జంపినవాఁడు,

సీ. భ్రూణహుండును సురాపుఁడు బ్రహ్మఘాతియు, గురుతల్పగ స్తేయి గోవధోప
జీవి పితృద్రోహి శిశుహన్త్ర పరదార,రతులు నిందకుఁడు సర్వస్వభోక్త
సత్యరిక్తుండును సర్వాభిమర్శి హేతికుఁడు సర్వాపలాపకుఁ డశుచియు
నిజధర్మవిద్వేషి నీచుండు పాషండ, షండ ప్రవణుఁడు స్వేచ్ఛావిహారి [దలఁ
తే.కృతమెఱుంగనివాఁడుసూనృతములేని,వాఁడునమ్మినఁజెడఁజూచువాఁడు మొ
పాపకారులకేనియుఁ బౌండరీక, తీర్థహరిమూర్తియుగమిచ్చు దివ్యపదము.

చ. అలఁతి పిసాళి నవ్వు మధు రాధరబింబఫలంబు తమ్మితే
కుల నగు సోగకన్నులు ప్ర కుంచితకుంతలచారుఫాలముల్
బలుచనిచెక్కు-లం గలయఁ బర్విన కుండలరత్నకాంతులున్
గల శిఖిపింఛలాంఛను మొగంబు గనందగు ధూపవేళలన్. ౧౩౨

క. క్షణము క్షణార్ధంబైనఁ ద్రి, క్షణలలితం బగుపయోధి శయనువదనమీ
క్షణ మొనరించు కృతికి నా, క్షణమునఁ గల వఖిలసుకృత జాతఫలంబుల్.

సీ. ముప్వంకమురువుతోమురళియొక్కొకవేళ, మోయించుభువనైక మోహనముగ
గ్రీడించునొకవేళఁ దోడిబాలురఁగూడి, యక్షీణగతిఁ గుబేరాక్షకేళి [ముగఁ
సవరించునొకవేళ జలవిహారముచాలఁ, బ్రేమ భీమరథీ గభీరవారి
కొలువుండు నొకవేళ నలినసంభవ పుండరీకాక్షమదాదులు ప్రీతిఁగొలువ
తే. నురగరిపువాహనమునొక్కొక్కవేళ, వేడ్కవెంచేసిమెఱయుఁదిర్వీధులందు
నెన్నికల్పంబులరిగినయేనయొడ్ల, వెలయుప్రాయంబుగలకొయ్యవిఠ్ఠలయ్య

శా. శ్రీరంగంబున ద్వారకన్ గయఁ గురు క్షేత్రంబునన్ నైమిశా
ఖ్యారణ్యాం జనశైల పుష్కర మహేంద్రానంతశయ్యా హరి
ద్వార శ్రీపురుషోత్తమంబుల నయోధ్యన్ సేతు గంగాభిసం
గామాఢస్థలిఁ బౌండరీకమునదై త్యారాతి యుండుం గడున్. ౧౩౫

---

గురుతల్పగ=గురుభార్యను పొందినవాఁడు. స్తేయి=దొంగ. గోవధోపజీవి=ఆవులను జంపితిని బ్రతుకువాఁడు. శిశుహంత=పసిబిడ్డలను జంపువాఁడు. పరదారరతుఁడు=అన్యునిభార్యను పొందువాఁడు. నిందకుఁడు=ఒకరిని నిందించువాఁడు. సర్వస్వభోక్త=ఎల్లసొత్తును భుజించువాఁడు. సత్యరిక్తుఁడు=నిజములేనివాఁడు. సర్వాభిమర్శి = అన్నిటి నంటువాఁడు. హేతికుఁడు = కొఱవి పెట్టువాఁడు. సర్వాపలాపకుఁడు = సర్వమును దాఁచుకొనువాఁడు. ప్రవణుఁడు = ఆసక్తుఁడు ॥ ౧౩౧ ॥ అలఁతి =అల్పము. పిసాళి=మనోజ్ఞము. సోగ=దీర్ఘము. ప్రకుంచిత=మిక్కిలివంకరయిన. కలయఁబర్విన = అంతటవ్యాపించిన. శిఖిపింఛలాంఛను = కృష్ణునిదైన ॥ ౧౩౨ ॥ కృతికిన్=కృతార్థునికి ॥ ౧౩౩॥ ముప్వంక మురువు = మూడువంకలతోడి మనోజ్ఞత. కుబేరాక్షకేళి = వెన్నెల కుప్పలయాట. ఏన=

క. హరియుత్తరభాగంబునఁ, బురుషుఁడు దాఁ బాపమైనఁ బుణ్యం బైనన్
సురకానియంత చేసినఁ, బరిణతమై మేనుకుఁ దర భారముఁ జూపున్. ౧౩౬

కాకము, హంస, చిలుక, పాము, తేనెటీఁగ, ఆవు ఇవి మోక్షము నొందినకథ.

సీ. సమ్మార్జనమున ధ్వాంక్షము నుపలేపనం బున మరాళము రంగమునవిచిత్ర
శుకము దీపాంకుర ప్రకటనంబునఁ బాము, పదపద్మతీర్థాను భవముచేతన
సరఘయు నూధస్య పరిషేచనంబున, ధేనువు మోక్షంబు తెరువుగనిరి
గానవేతత్పరి కల్పనంబునఁ బొందు, రంగాధినాథుఁ జేరంగవలయు

తే. ననిన నారదుఁ డిట్లను నభవ! జ్ఞాన, విరహితంబులు జడములు వీని కెట్లు
మనుజకృత్యంబు చేకూరె మధువిరోధి, యెట్లు వరమిచ్చె నని వేఁడ నీశుఁ డనియె.

ఉ. మూర్తిమదిక్షుకార్ముకసముజ్జ్వలకీర్తియుఁ బోని చంద్రికా
స్ఫూర్తి వెలుంగఁ జేయుచు నభోవనకేసరి చంద్రుఁ డుబ్బఁగాఁ
గార్తికపూర్ణిమన్ యదుశిఖామణి మున్నొకనాఁడు చూళికా
వర్తితపింఛగుచ్ఛలసనంబున భీమరథీతటంబునన్. ౧౩౮

మ. సురలీలావతులున్ నరాంగనలు చక్షుశ్శ్రోత్రకన్యల్ స్మర
జ్వరపీడాశయులై తనుం గొలువ రాసక్రీడఁ బెన్ప్రోడయై
కరలీనోర్మికలంగులీచలనరింఖత్కాంతులై క్రాలఁగా
మురళీనాదవినోదకేళిఁ దవిలెన్ మోదంబు సాదంబుగన్. ౧౩౯

క. ఆనాదము దవ్వున జగ, తీనివసన్మోనిహోమధేనువు కటిసాం
ద్రానంద మొదవ విని తన, మేనుమఱచి కురిసె నపరిమితదుగ్ధంబుల్. ౧౪౦

ఉ. కాననగంధవాహవశగంబగుటన్ వెస నొందు తత్పయః
ఫేనకణంబు వచ్చి మురభేదను మౌళి నలంకరించె శ్రీ
జానియుఁ బాటమాని నిజసౌధమునందు సుఖించుచుండె నా
ధేనువు లెస్సగా ముదిసి దేహము నూర్చి భవాంతరంబునన్. ౧౪౧

---

అయిదే ॥ ౧౩౪ ॥ ౧౩౫ ॥ పరిణతము=నెఱవేఱినది ॥ ౧౩౬ ॥ ధ్వాంక్షము=కాకి. సరఘ=తేనె టీఁగ. ఊధస్య పరిషేచనము=పాలచేఁదడుపుట ॥ ౧౩౭ ॥ మూర్తిమత్=స్వరూపముగల. ఇక్షు కార్ముక = మన్మథునియొక్క. చూళిక=పిల్లజుట్టు. లసనంబునన్ = ప్రకాశముచేత ॥ ౧౩౮ ॥ చక్షుశ్శ్రోత్రకన్యలు = నాగకన్యలు. స్మరజ్వర = మన్మథతాపమువలని. పెన్ప్రోడ = మిక్కిలి నేర్పరి. కరలీనోర్మికలు = చేతియందణఁగిన యుంగరములు. రింఖత్ = చలించుచున్న. సాదంబుగన్=గతికాఁగా ॥ ౧౩౯ ॥ సాంద్రానందము=అధికసంతోషము. దుగ్ధంబులు=పాలు॥ ౧౪౦॥ గంధవాహ = గాలియొక్క. తత్పయః ఫేనకణంబు = ఆపాలనురుఁగుచుక్క. శ్రీజాని = లక్ష్మీ

## సుశీల యను పతివ్రతాస్త్రీ చరిత్రము.

క. హరివాళిపతితనిజదు, ర్ధరసోత్కరధేనుకణకృత పరమసుకృత
స్ఫురణంబుననొక వైష్ణవ, వరునకుఁదనుజాతయగుచు వసుధంబుట్టెన్. ౧౪౨

వ. సుశీలాభిధాన యగు నబ్బాల గుణగణభాస్వరయై యథోచితకాలంబున.

ఉ. తాళివిభుండుగట్టిన మొదల్ పతిదేవత యాసుశీల పెం
గోలతనంబునన్ మగఁడు కొట్టినఁ దిట్టిన రట్టుచేసినం
దాళి దినంబుఁ దచ్చరణ తామరసంబులుగొల్చు నేలయుం
బోలునె యీపె కంచుఁ గృతబుద్ధులు వృద్ధులు ప్రస్తుతింపఁగన్. ౧౪౪

సీ. రూపహీనుఁడు మహా క్రోధనుఁ డతిలోభి, బద్ధమత్సరుఁ డన్యబుద్ధి మాయి
చంచలస్వాంతుఁడు సకలబంధువిరోధి, బహుశపథోక్తిలంపటుఁడు శఠుఁడు
సంతతావిశ్వాససస్యప్రరోహుండు, గర్వపర్వతమస్తకస్థితుండు
కలహాశనుండు తర్కక్రియాకుశలుండు, సంగతోన్మాదోత్తమాంగకుండు

తే. నగునయేనియునటువంటిమగనితోడ, గాపురముసేయుసతిదొడ్డగరితయగుచు
గసిడికోఁతకునోర్చిలో విసిగికొనక, ధాతదూరకతండ్రిచేఁతకు వగవక. ౧౪౫

శా. ఆతీవ్రాంశుని వేఁడి కోర్చు మను ఛాయాదేవియుంబోలె స
త్పాతివ్రత్యగుణాభిరామయగు నా భామాలలామంబు సం
ప్రీతింజేయు నసహ్యదర్శనములన్ బిర్వీఁకులం బెట్టు దు
ర్జాతున్ వీతదయానయున్ దదుచితాచారంబులన్ నిచ్చలున్. ౧౪౬

ఉ. కొన్నిగొణింగి కొన్నినిసి కొన్నితుటారములాడి మానరా
కెన్నక నిన్నినాళ్లకివి యున్నని కూటికిఁబిచ్చపాటి గొ
మ్మన్న మహాప్రసాదమని హర్షరసోల్లసదాననాబ్జయై
యన్నలినాక్షి భర్తయిడు నన్నియగైకొను మ్రుక్కుధాన్యముల్. ౧౪౭

---

భర్త. భవాంతరంబునన్ = జన్మాంతరమునందు ॥ ౧౪౧ ॥ ౧౪౨ ॥ ౧౪౩ ॥ తాళి=తాళిబొట్టు. గోలతనంబునన్ = ఏమితెలియని తనముచేత. రట్టు=అల్లరి. తాళి=ఓర్చి ॥ ౧౪౪ ॥ బద్ధమత్సరుఁడు= మిక్కిలి చలముగలవాఁడు. మాయి = కపటముగలవాఁడు. శపథోక్తిలంపటుఁడు = ఒట్టుపెట్టుకొనుటయందాసక్తుఁడు. అవిశ్వాససస్యప్రరోహుండు = అపనమ్మకమనెడి పైరును మొలపించువాఁడును. సంగతోన్మాదోత్తమాంగకుండు= కూడినపిచ్చికి తలయైనవాఁడు. కసిడికోఁతకున్ = కాపాడుటకు. చేఁతకున్=పనికి ॥ ౧౪౫ ॥ తీవ్రాంశుని=సూర్యుని. పిర్వీఁకులంబెట్టు = బాధించు ॥ ౧౪౬ ॥ తుటారములు = అలత్యపుమాటలు. పిచ్చపాటి=కొంచెపాటి. మ్రుక్క=ప్రాఁతగిలి సారముచెడిన ॥ ౧౪౭ ॥ సమ్మార్జనాచరణము=కసవూడ్చుట. గోముఖస్త్రీ=అలుకునట్టి యలంకారము.

సీ. చతురసమ్మార్జనాచరణంబుదొలునాటి, ప్రాఁచివన్నియతోఁపు వడుటఁగాఁగ
గోమయగోముఖ శ్రీముంగిటఁ ఘటించుటలు ముఖమజ్జనకలనఁగాఁగఁ
గమనీయపూర్ణకుంభములపూజాక్లృప్తి, కుచలికుచాకల్ప రచనఁగాఁగ
నన్నసంపాదనార్థాగ్నిఁ బుట్టిన ధూమ, పటలిసంస్కారధూపంబుఁగాఁగ
తే. విఘటితకవాటకద్వార విశదనయన, యర్చితాధరగేహళి కాధరోష్ఠ
భాండగోపనయవనికాంబరపరీత, యింతిగృహలక్ష్మి యత్యంతకాంతిఁ దనరు.
సీ. ప్రస్తుతంబనిపదార్థములు రాజులవేఁడి కొనితెచ్చి యమ్మించు కోమటిండ్ల
మూసి ముల్లడిచి గుమ్మలకొల్చుపై మెత్తు, లూడ్వఁడు పస్సైన నుండుగాని
యెట్టిచుట్టంబేని యింటికే తేర రెండవసూతకము దెల్పి యవలఁ జొనుపు
మున్ను ప్రతిశ్రితముచే సినపైఁడి రాకున్న, ముచ్చిచ్చునను వేఁగు వచ్చుదనుక
తే. వనరు "శాకాయ లవణాయ వా" యటంచుఁ,
బెనఁగు "ధూళిః పరగృహాదపి" యనునాస
ముంచియోగకుఁ గాటు పాము నకు బలియ,
నొసఁగఁ డని భర్తకై పొక్కు నువిద మదిని. ౧౬౯
వ. ఇవ్విధంబున నవ్విధుబింబవదన వివిధకుటిలాచారచతురుం డగు జీవితేశ్వరు
నీశ్వరుంగాఁ దలంచుచుఁ దదుపాసనంబు తనకు నిహపరసిద్ధిసంసూచకం
బుగ నిండుడెందంబునం గోచరింపంజేయుచుఁ గీర్తితచరిత్రంబునం బ్రవర్తి
ల్లుచుండు నంత. ౧౭౦
క. అట నొకనాఁడా భూసుర, కుటుంబినీసదనమునకు కుహనావటువున్
బటువగుమైజిగిఁ దెగడున్, బుటువగు నొకవడుగు వచ్చె భుక్త్యాపేక్షన్. ౧౭౧

---

క్లృప్తి = నియతి. ఆకల్పరచన = వస్త్రాద్యలంకారము చేసికొనుట. యవనికాంబరపరీత = తెరచీరచే ఆవరింపఁబడినది ॥ ౧౬౮ ॥ ప్రస్తుతంబు = వివాహాది కార్యము. గుమ్మలకొల్చు = బుట్టలలోని ధాన్యము. రెండవసూతకము = మృతాశౌచము. ప్రతిశ్రితము = ఒకరియధీనము. పైఁడి = ధనము. వనరున్ = దేవురించుచు యాచించును. శాకాయలవణాయవా = కూరకైనను, ఉప్పునకైనను. ధూళిః పరగృహాదపి = పొరిగింటనుండి దుమ్మయినను రానిమ్ము. పొక్కున్ = దుఃఖించును ॥ ౧౬౯ ॥ విధుబింబవదన = చంద్రబింబము వంటి మొగము గలది — స్త్రీ. చతురుఁడు = నేర్పరి. జీవితేశ్వరున్ = పెనిమిటిని. ఉపాసనము = పరిచర్య. నిండుడెందంబునన్ = కొఱఁత లేని మనసుతో. కీర్తిత = పొగడఁబడిన ॥ ౧౭౦ ॥ కుటుంబిని = ఇల్లాలు. కుహనావటువున్ = కపట బ్రహ్మచారియైన వామనుని. పటువు = మిక్కుటము. మైజిగిన్ = దేహకాంతిచేత. తెగడుంబుటువు = తిరస్కరించునట్టి పుట్టుక గలవాఁడు — చక్కదనము గలవాఁడు. వడుగు = బ్రహ్మచారి. భుక్త్యాపేక్షన్ = భోజనముచేయ

వ. వచ్చిన నమ్మచ్చెకంటి గెంటని నెయ్యంబులియ్యం బగు నంతఃకరణంబున నడలుగడలుకొన గ్రామాంతరాసక్తుండగుప్రాణనాథుండు తనుంబిలిచిన యట్లయిన లోనింటిబోనమాని తొంగిచూచుతఱిం బొడకట్టి బొట్టునకు మేదావిమేదునలవాటునం గందిన యంగుళీద్వితయంబు దేఁటిగుట్టినం బృథగ్వర్ణమూర్తులగు సంవర్తికలుగలజలరుహంబనఁ బ్రశస్తంబగుహస్తంబెత్తి స్వస్త్యస్తుతే యని యాశీర్వదించుటయుఁ గృతనమస్కారయై యాసారసామోద మృదులస్వరంబున నిట్లనియె. ౧౫౨

సీ. ఎందుండిరాక యిం దేతేరఁగతమేమి, గ్రాసార్థిభావంబు గానవచ్చె
నగునన్న నట్లేని మొగసాలనుండుఁ డా యనయూరలేఁడుయామార్గమునకె
కావింతునన్నసంస్కారంబు మీరార గింతురుగాని వే గిరమె యనుడు
మాణవకుఁడుపల్కు మగువ ! నేడేన్నాళ్ల నుండియుగుడువఁ గూడోదవకునికి
తే. వేఁడియగుదాఁకనోరువమాఁడుగలిగెఁ, బులిసినదిగద్దెనన్నంబు పోఁకయంత
యొసగి క్షుత్తార్పవెసచల్దిమెసవనైన,పాపముడిపించుకొందుఁదపంబుకలిమి
తే. అనుడు నెలనాగయిట్లను ననఘ ! నీకుఁ,జలిదియేనెట్టులిడనేర్తుక్షణములోన
వంటగావింతు భుజియించివలయునెడకు,నేగునావినిసతిఁబల్కుఁ బాఁగవడుగు
తే. త్రోవగమియించుచోటనోపూవుఁబోఁడి! యవరవర్ణసమాచారమైనఁ జెడదు
బ్రాహ్మ్యమీతడవేటికిఁ బ్రాణరక్ష,నెఱపుమొకయింతమెదుకిన్ని నీళ్లునొసఁగి
తే. వాఙ్మనఃకాయకర్మప్రవర్తనముల, సంభవించిన పాపంబు సంహరించి
యతిథిగృహమేధికిచ్చుశాశ్వతసుఖములు,విననె"యభ్యాగతస్స్వయంవిష్ణు"
తే. అతివ! తీర్థాదరత్వర నసుగుదెంచి, త్రోవనాఁకటివేళకు దొరకకునికి [వనఁగ
కాంచనీయాననయేఁగూటికలనజఠర,వహ్నినొకయేనకాదెట్టి వాఁడునెరియు

---

నపేక్షతో ॥ ౧౫౧ ॥ గెంటని= తొలఁగని. లియ్యంబు=ఐక్యము. అంతఃకరణంబునన్=మనసుతో. అడలు=భయము. కడలుకొనన్=అతిశయింపఁగా. బోనమాని=వంటచేయు తావునుండి. పొడకట్టి =కనఁబడి. మేదావి=ఔపాసనముచేసిన నిప్పుమసి. మేదు=మెదుపునట్టి. అలవాటునన్=వాడుక చేత. పృథగ్వర్ణమూర్తులు = వర్ణముమాఱిన స్వరూపముగలవి. సంవర్తికలు = క్రొత్తరేకులు. స్వస్త్యస్తుతే = నీకు మేలగుఁగాక. సారసామోద=తామరవాసనవంటి దేహవాసనగలది ॥ ౧౫౨ ॥ గ్రాసార్థిభావంబు = అన్నముగోరిన వానితనము. మొగసాలన్=ఇంటిముందటిచవికలో. ఏన్నాళ్ల నుండి = అయిదుదినములనుండి ॥ ౧౫౩ ॥ బాఁగవడుగు = ధూర్తుఁడైన బ్రహ్మచారి ॥ ౧౫౪ ॥ గమియించుచోటన్ = నడచునప్పుడు. అవరవర్ణసమాచారము=శూద్రునియాచారమువంటి యాచారము. బ్రాహ్మ్యము=బ్రాహ్మణధర్మము ॥ ౧౫౫ ॥ అభ్యాగతస్స్వయంవిష్ణుః=అభ్యాగతుఁడుతానే విష్ణువు ॥ ౧౫౬ ॥ ఎరియున్=కాలును తపించును ॥ ౧౫౭ ॥ బడుగులు=చిక్కినవారు. కడఁక =

వ. నాతోడంగూడియాడువడుగులు బడుగులయ్యును వడిచెడక కడంకమెఱసి యే మసంకల్పించి మున్నె తేరసమకట్టిన పౌండరీకంబునకుం బాండురంగ సేవాసావధానులై చనిరి నేనుకూటిబీద తోడుదప్పిన తెఱంగున నిచ్చటం దడసితి వెండియు వినుము. ౧౫౮

క. తరుణి! "క్షుధాతురాణాం, నరుచిర్నచకాల" మనుచు నరులాడుటలో
నరసి వివేకింపంగందగు, తెరువరులకుం బాయసంబు తిరిసినం గలదే. ౧౫౯

ఆ. ఎంతభాండశుద్ధి యెటువంటిగృహశుద్ధి, యెట్టిచిత్తశుద్ధి యిచట చలిది
కూడుచిక్కనెడం బురోడాశమునకు నో,యమ్మ! సాటివచ్చునదియుంగాక.

క. అనుచితశతము లొనర్చియుం, దనువులు రక్షించుకొనరె దమశమతేజో
ధను లగుగాధిసుతాదులు,తనప్రాణమునిలుపు కన్న ధర్మముగలదే. ౧౬౧

తే. తొలుత నే వేడినప్పుడు చలిది నీకు, ననఘ! నేనెట్లిడుదాన నంటి గాన
యశనశేషస్థితికిసంది యంబువలదు,చాలుంజాలదొయనువృథా శంకవిడువు.

క. సతి! యాత్మస్తుతియుతిగ, ర్హితమని నా పెంపుదెలుప నేనొకండ మనో
గతిందృప్తిగనిన భువన, త్రితయమ్మునకుం బరితుష్టి తిలకించుంజూమీ. ౧౬౩

వ. అని యంత నిలువక. ౧౬౪

క. పెట్టకపోననియాంకటం, దొట్టిగిలంబడుచుం బడుచు దురదురం జని వే
నట్టింటం గూరుచుండిన, నెట్టునసంజాల కమ్మృగేక్షణ భీతిన్. ౧౬౫

సీ. పరిహరించుటకీడు తెరువరిం బసిబిడ్డ, నర్థి నాంకటిచేత నలయువానిం
బర్యుషితమును నర్పణసేయంజాలంబా, పము రాదె యుపచారపరత మెలంగ
మినుకొక్కటిచ్చిపొమ్మనినంబోవునొపోవం,డధ్వప్రయాసవిహ్వలుండితండు
చాలునోచాలదో చలిదియు మద్భర్త, పాథేయశేష మల్పంబెయగుటం

---

పూనిక. ఏతేగన్=పోను. సమకట్టిన = యత్నించిన. సావధానులు = ఎచ్చరికతోఁగూడినవారు. తడసితిన్=జాగుపడినిలిచితిని ॥ ౧౫౮ ॥ క్షుధాతురాణామ్ = ఆఁకటిబాధగలవారికి. రుచి=చవి. న=లేదు. కాలంచ=కాలమును. న=లేదు. తిరిసినన్=బిచ్చమెత్తినను ॥ ౧౫౯ ॥ పురోడాశము = హోమశేషమైన యన్నము ॥ ౧౬౦ ॥ అనుచితశతములు = అనేకములయిన తగనిపనులు. దమశమతేజోధనులు = ఇంద్రియనిగ్రహము శాంతి వీనివలని, తేజస్సే ధనముగాఁ గలవారు. నిలుపు = నిలుచుట ॥ ౧౬౧ ॥ అశనశేషస్థితికిన్ = భుజింపఁగా మిగిలియుండుటకు. చాలున్ = చాలునో ॥ ౧౬౨ ॥ గర్హితము = నిందింపఁబడినది. పెంపు = ఘనత. మనోగతిన్ = మనసునందు. కనినన్ = పొందినను. పరితుష్టి = తృప్తి. తిలకించున్ = ప్రకాశించును - కలుగును ॥ ౧౬౩ ॥ ౧౬౪ ॥ తొట్టగిలంబడుచున్ = తత్తఱపడుచు. పడుచు = పిల్లకాయ. దురదురన్ = శీఘ్రముగా ॥ ౧౬౫ ॥ పరిహరించుట= విడుచుట - లేదు పొమ్మనుట. పర్యుషితము = చల్ది. మినుకు

తే. జాలకుండిన నగుఁ జెట్ట బాలుఁడితఁడు, కొసరి గొంతెమకోరికల్ కోరెనేని
యిడకపోఁబోలదిడఁబోలదీరుదివియఁ, బేనురాకున్నైర్థికుల్వెళుచులంద్రు
తే. వంటయగుదాఁకనుండఁ డీ వడుగు బండి,మీఁదఁబోవుచునున్నాఁడుమేటిధాటి
నైనదయ్యెడుఁగాకేమి యప్పటికిని, మీఁదుగడగట్ట నేలంచు మించుఁబోఁడి.
శా. రారయ్యా! యని శుద్ధిమచ్చరణు గోత్రాదేవతాపుత్రు వి
స్మేరాగ్నిప్రభుఁ గూరుచుండనిడి ప్రోల్చేపట్టు గావించి నీ
రారంబండిన ప్రాఁతరాజనపు ది వ్యాన్నంబు నొక్కింత నా
ర్ధారాధౌతముఁ గుండయూడ్చి యొసఁగెన్ రంభాపలాశంబునన్. ౧౬౮
తే. ఒసఁగియవ్యంజనంబుదధ్యోదనంబు, నారగింపుడుష్ణమియింపుఁడనుచుఁబలికి
ముదితముదితాత్మభావసంపదయుఁబోని, సలిలపరిపూర్ణమగుగిండినిలిపిచ
క. చే నాపోశనమున్పుచు, ధ్యానంబొనరించి యతఁడు తగుననుమతిఁ జం [నిన
ద్రానవచేఁగొని మెసఁగున్, బ్రాణాహుతి విరచితముగఁ బర్యుషితంబున్.
తే. తిరిగిచూచినయంత నా ద్రిమ్మరీఁడు, సిక్థమొక్కటియేనియుఁ జిక్కనీక
మ్రింగిమీఁదులుచూచుచున్నదులఘణితిఁ,బిలిచియిట్లనుశరదిందుబింబముఖిని
తే. చూడుమీసారిభాండమోశోభనాంగి,భిస్సటంబొండెఁ దాఁటిదప్పినదియొండెఁ
గలుగులేకుండనూడ్చితె మ్మలఘుజఠర,జాతవేదంబు హెచ్చె నీ స్వల్పభుక్తి
చ. అనుటయు సంభ్రమంబడర నంగన తొల్తటినాటియామినిం
దనకని వండి డించికొని నాథుఁడు పల్లియ కేగునెంజిలిం

= చిన్నమనెడి బంగారునాణెము. అధ్వప్రయాస విహ్వలుఁడు = దారి బడలికచేత అవయవ
ములస్వాధీనతలేనివాఁడు. పాథేయశేషము = దారికికట్టియియ్యఁగామిగిలినది. చెట్ట = కీడు. గొం
తెమకోరికలు = కోరరాని కోరికలు. పోలదు = తగదు. తైర్థికులు = తీర్థయాత్రచేయువారు—
బ్రాహ్మణులు. వెళుచులు=విరసపుమాటలాడువారు ॥ ౧౬౬ ॥ ౧౬౭ ॥ శుద్ధిమచ్చరణున్=కాళ్లు
గడుగుకొన్నవానిని. గోత్రాదేవతాపుత్రున్=బ్రాహ్మణకుమారుని. విస్మేరాగ్నిప్రభున్ = వెలుఁగు
చున్ననిప్పునుబోలిన తేజస్సుగలవానిని. ప్రోల్చేపట్టుగావించి = ముందఱిచోటుశుద్ధిచేసి. నీరా
రన్ = నీళ్ళసమృద్ధితో. వార్ధారాధౌతమున్ = నీటిదారలచేత పరిశుద్ధముగాఁజేయఁబడినదానిని.
రంభాపలాశంబునన్=అరఁటాకునందు ॥ ౧౬౮ ॥ అవ్యంజనంబు = కూరలులేనిది. దధ్యోదనంబు
= పెరుగన్నము. ముదిత = స్త్రీ; సంతోషించినది. సలిల= నీటిచేత. గిండి = చిన్ననోరుగలచిన్న
చెంబు ॥ ౧౬౯ ॥ మెసఁగున్=భుజించెను ॥ ౧౭౦ ॥ త్రిమ్మరీఁడు = యథేచ్ఛముగా ప్రవర్తించు
వాఁడు. సిక్థము = మెదుకు ॥౧౭౧॥ భిస్సటంబు = మాఁడు. అలఘుజఠరజాతవేదంబు = అధిక
మయినజఠరాగ్ని ॥౧౭౨॥ యామినిన్ = రాత్రియందు. నెంజలిన్ = విచారముచేత. తనికి=సం
తాపించి. అట్టుకన్=అటుకయందు. అట్టుకట్టి = అట్టుగా నేర్పడి. అభినవోదనంబు = క్రొత్త

దనికి భుజింపకున్కి భరితంబయి యట్టుక నట్టుకట్టి యొ
ప్పు నభినవోదనంబొసఁగెఁ బూని తదాజ్ఞను శ్రావమూఁకుటన్. ౧౭౩

తే. ఒసఁగియెడపేర్పులోఁగాఁగుచున్నయాల, పాలువడ్డించుటయునవనిపాల !
వేళ,మవలివారలచేతికినందియిచ్చు,వడువున భుజించె వడు వివుర్వ్యంటకంబు.

క. భుజియించి మఱియుఁ దెమ్మని, గజిబిజిసేయుటయు సతియుఁ గలఁగక వికస
న్నిజవదనయగుచు హస్తాం,బుజములు మొగిడించి పల్కె భూసురసూతిన్.

శా. అన్నంబొండొక లేదు చల్ది యదివి న్మధ్వశ్రమారూఢ ! తె
మ్మన్నం దెచ్చెద సాధుగుప్తములు న వ్యంబుల్ కజాయంబు లిం
దెన్నే నున్నవి క్రొత్తయట్టికలఁగా దే లేచి వార్వ్యండు వే
గ న్నిర్మించెదఁ గూడుఁ గూర మఱియుం గైకోలు మేల్భుక్తికిన్. ౧౭౬

ఉ. నా విని నాతిఁ బల్కెఁ గుహనావటు వోవనితామతల్లి ! యో
పావనశీల ! తైలపరిపక్వము లెన్నియుఁ దెమ్ము గాదనన్
లేవడిమైనభుక్తిఁగొని లేవ దిగంబడ దాఁకలింతయున్
ధావనమాచరించుకత నన్ దడవున్ నిలఁబోల దిచ్చటన్. ౧౭౭

మహాస్రగ్ధర. అనినన్ వడ్డింపఁజొచ్చెన్ హరిణనయన నిం డారుదెందంబుతో వే
గన భావిప్రాణనాథాగ్రహసహమతితోఁ గమ్మనై కారమై నే
తన వండంబొల్చి చేతం దడవినఁదుమురై తాఱుటల్ లేక సద్యో
జనితంబుల్ వోలెఁ జాలం జవులొదవు సమచ్చండికాపూపపఙ్క్తుల్. ౧౭౮

---

యన్నము—చల్దికాదనుట. శ్రావమూఁకుటన్ = కంచమువంటిమూఁకుటియందు ॥ ౧౭౩ ॥ ఎడపేర్పులోన్ = దాలియందు. ఆలపాలు = ఆవుపాలు. వేళము=శీఘ్రముగ. వడువు=బ్రహ్మచారి. ఇవుర్వ్యంటకంబు=ఇగురపెట్టినయన్నము ॥ ౧౭౪ ॥ గజిబిజి=తొందర. కలఁగక = కలఁతనొందక ॥ ౧౭౫ ॥ ఒండొక = కొంచెమైనను. అధ్వశ్రమారూఢ = త్రోవనడచినబడలిక హెచ్చినవాఁడా. సాధుగుప్తములు=బాగుగాదాఁచఁబడినవి. నవ్యములు=క్రొత్తవి. కజాయంబులు. పిండివంటలు. ఎన్నేని=కావలసినన్ని. అట్టికలన్=అటికలయందు. కాదేని=అవిసరిపడనియెడ. వార్వ్యండు=చేయికడుగుకొనియాచమనము చేయుఁడు. నిర్మించెదన్=చేసెదను. మఱియున్=మరల. కైకోలు=అంగీకారము. భుక్తికిన్=భోజనమునకు ॥౧౭౬॥ ఎన్నియున్=ఎన్నియున్నవో అన్నియును. కాదనన్ = కాదుఅనను. లేవడి = దారిద్ర్యము—తక్కువ. దిగంబడదు = తగ్గదు. ఇంతయున్ = కొంచెమయినను. ధావనమాచరించుకతనన్ = పరుగెత్తుటచేత ॥ ౧౭౭ ॥ నిండారు = నిండిన. భావిప్రాణనాథాగ్రహసహమతితోన్ = పిమ్మట పెనిమిటికోపమునుఓర్చునట్టిబుద్ధితో. నేతన=నేతితోనే. పొల్చి = ఒప్పి. తుమురై = పొడియై. తాఱుటలు = మఱుఁగు పడుటలు. సద్యోజనితంబులు = అప్పుడుపుట్టినవి ॥ ౧౭౮ ॥ అరుణగ్రహణప్రవణపురుషోపధికృతంబులు = ఎఱుపును అనఁగా కోప

వ. ఇట్లరుణగ్రహణప్రవణపురుషోపధికృతంబులు ప్రాణవల్లభసమ్యగభిరక్షితం
బులు తదుపహితగణనావహంబులునచ్ఛిద్రముద్రాముద్రితంబులునై సజ్జన
వితరణంబులగతి మహితభాజన నిహితంబులు ననురక్తవధూహృదయం
బుల పగిది నతిస్నేహపిచ్ఛిలంబులు నుపవనంబులయుపమ సురభిష్ఠంబులు
నైన పిష్ట వికారంబులు నిర్వికారుండై భూసురకుమారుండు నిరవశేషం
బుగా నాహరించియు వెండియు నవనతాననం బగుమిథ్యాలజ్జాభినయంబు
నఁ దనబహుభోక్తృత్వంబు నపశ్లోకకలుషితం బగునని విశంకమానమా
నసుండుచుంబోలెఁ గానందగు నా పొట్టినెట్టికసీలదిట్టపడుచు కడుపునిండమి
యొఱుంగితరంగితాద్భుతాంతరంగయైయాకురంగనయనయిట్లనివితర్కించు.

క. ఇసుమంత గాని లేఁడీ, పసిబాలుఁడు కూడుగూటి పాయమువాఁడి
ట్లెసరి బహుభక్ష్యరాసులు, మెసఁగెడి విసువఁడు ప్రతుష్టి మేకొనఁడుగదే.

ఉ. మాయపుబిడ్డ యీనిసువు మానిసిపుట్టువుగాదు దేవతా
నాయకుఁడో చతుర్ముఖుఁడో నాభవబంధము లూడ్వనున్న నా
రాయణమూర్తియో యెఱుఁగ రాదొకయించుకయుఁ బుభుక్షపైఁ
జేయిదొలంగఁ డప్పములు నెల్లెసమస్తము నంచు నివ్వెఱన్. ౧౭౧

చ. తలఁచు మనంబులోన వసు ధామరయాజకధర్మపత్ని ని
ర్మలకనకావదాతముఁ గ రాళతరాలఘులీలమాలికో

---

మునుపొందుటయందు ఆ సక్తుఁడయిన పెనిమిటిచేత కపటముగా చేయఁబడినవి. ప్రాణవల్లభసమ్యగభిరక్షితంబులు = పెనిమిటిచేత లెస్సగాఁగాపాడఁబడినవి. తదుపహితగణనావహంబులు = అతనిచేత పెట్టఁబడిన లెక్కనుపొందినవి. అచ్ఛిద్రముద్రాముద్రితంబులు = సందులేక వాసెనకట్టుచేత ముద్రవేయఁబడినవి. వితరణములగతిన్ = దానములవలె. మహితభాజన నిహితంబులు = దొడ్డపాత్రమునందుంచఁబడినవి. అనురక్తవధూ = అనురాగముగల స్త్రీల యొక్క. స్నేహపిచ్ఛిలంబులు = స్నేహముచేత పేరుకొన్నవి; నేయిపేరుకొన్నవి. ఉపమన్ = విధమున. సురభిష్ఠంబులు = మంచిపరిమళముగలవి. పిష్టవికారంబులు = పిండివంటలు. నిరవశేషంబుగాన్ = మిగులులేకుండ. ఆహరించి = భక్షించి. అవనతాననంబు = వంచినమొగముగలది. మిథ్యాలజ్జాభినయంబునన్ = అబద్ధపుసిగ్గునుతోఁపించునట్టి చేష్టలచేత. బహుభోక్తృత్వంబు=తిండిపోతుతనము. అపశ్లోకకలుషితంబు = అపకీర్తివలనకలఁతనొందింపఁబడినది — అపకీర్తినొందినది. విశంకమాన = మిక్కిలిసంశయించుచున్న. నెట్టికసీలదిట్టపడుచు=నైష్ఠికశీలుఁడైన ధైర్యముగల బాలునియొక్క. తరంగితాద్భుతాంతరంగ=అతిశయించిన యాశ్చర్యమునొందిన మనసుగలది. వితర్కించున్ = తనలోఁదానుఆలోచించెను ॥ ౧౭౯ ॥ ఇసుమంత = రవంత. విసరి = విజృంభించి. ప్రతుష్టి = తృప్తిని. మేకొనఁడు=పొందఁడు ॥ ౧౭౦ ॥ నిసువు = శిశువు. నివ్వెఱన్ = నిండినయాశ్చర్యముతో ॥ ౧౭౧ ॥ నిర్మలకనకావదాతము = స్వచ్ఛమయిన బంగారమువంటిదియు, తెల్లనిదియు. కరాళతర = మిక్కిలియున్నత

జ్జ్వలము జగత్క్రియాచరణ సాక్షి ముదక్షిమదంగభాగతా
తిలకితవిభ్రమం బగు ను దీర్ఘమహత్త్వము దివ్యతత్త్వముల్. ౧౮౨

క. సతి యీగతి "శ్రియమిచ్ఛే, ద్ధుతాశనా" త్తనుట యెఱిఁగిహుతవహునఖిలే
ప్సితవితరణగుణలీలా, చతురుం బ్రార్థింపఁ దత్ప్రసాదముకలిమిన్. ౧౮౩

సీ. ఒకకొన్నివడియంబులొకకొన్నివపుగులు, నొకకొన్నితెఱగులయొలుపుఁబప్పు
లొకకొన్నిదబ్బెడ లొకకొన్నితాలింపు, లొకకొన్నివిధముల యొఱ్ఱచేరు
లొకకొన్ని కలకల్పు లొకకొన్ని బజ్జులు, నొకకొన్నిరీతుల యూర్పువగలు
నొకకొన్నిసిగరులునొకకొన్నియంబళ్లునొకకొన్నివహులపుపాపోత్కరములు

తే. వివిధఫలకందమూలంబుఁ వియ్యఁగొన్ని, యూరఁబిండులునొకకొన్నియొక్క
కొన్ని,యూరఁగాయలుపచ్చళ్లు నొక్కకొన్ని, పెరుగుపాత్రేనెనేతులుపెచ్చు [పెరుగ.

చ. అమితములై మహానసము నందవు డుద్భవమొందుచున్న య
న్నములు సుపక్వగంధముల నందములై యటు నోవుచోట న
య్యమరతరుప్రసూనతతు లంగనపైఁ గురియంగఁ బుట్టు గం
ధము లిటు డిగ్గుచోటఁ దగుఁ దద్ద్వితయాదచితోపగూహముల్. ౧౮౫

శా. ఆలీలావతి నిత్యసత్యశమ దైర్యౌదార్యసంశుద్ధులం
జాలన్ మెచ్చి వటుత్వముం దొఱఁగి సాక్షాత్కారముంబొందె ను
ద్వేలాలోలకృపాజపాప్రసవకాం తిభ్రాంతికృల్లోచనా
జ్వాళిందాశ్రిత రాధికాసురత రాగాంకూరఁ డా శౌరియున్. ౧౮౬

సీ. నీలంబు భక్తాను కూలంబు హరిదంత, చేలంబు నవనీత చోర మాది
మూలంబు గరుణావి శాలంబు కృతజగ, జ్జాలంబు శ్రితలతావాలమమర
మేలంబు భవవనో త్కీలంబు తల్పిత, వ్యాళంబు శిక్యావచూళ మమిత
లీలంబు హృతమను త్సాలంబు శశిసఖ, ఫాలంబు వరదానశీల మఖిల

---

మయిన. ముదక్షిమత్ = సంతోషించినకన్నులుగల. తిలకితవిభ్రమంబు = బొట్టుగలదిగాఁజేయఁబ డినవిలాసముగలది. దివ్యతత్త్వముల్ = అప్రాకృతమయినపరబ్రహ్మమును ॥ ౧౮౨ ॥ శ్రియమిచ్ఛే ద్ధుతాశనాత్. హుతాశనాత్ = అగ్నిదేవునివలన. శ్రియమ్ = సంపదను. ఇచ్ఛేత్ = కోరవలసినది. హుతవహున్ = అగ్నిదేవుని. అఖి...తురున్ — అఖిల = సకలమైన. ఈప్సిత = కోరికలను. వితరణ = ఇచ్చునట్టి. గుణ = గుణముయొక్క. లీలా = వ్యాపారమునందు. చతురున్ = నేర్పుగలవానిని ॥ ౧౮౩ ॥ దబ్బెడలు = ఒకవిధమయిన భక్ష్యములు. ఒఱ్ఱ = కారముగల. ఊర్పు = పిండిమిరియము. సిక[రులు] = తాలింపుమజ్జిగ. వహుల = విధముల ॥ ౧౮౪ ॥ మహానసము = వంటయిల్లు. ఉపగూహములు = ఆలిం గనములు ॥ ౧౮౫ ॥ ఔదార్య = ఇచ్చునట్టిస్వభావము, వటుత్వము = బ్రహ్మచారితనము. సాక్షా

తే. కాలజంఘాలమనుకకృత్రిమక్ష్వేళమతిక, రాళమాపత్పయోదవాతూలమునగు
యదుకులసరోమరాళంబునతివగాంచి,నతియునుతియునొనర్ప నన్నగధరుండు

ఉ. ఆసతిఁ బల్కె—నీ హృదయ మారయఁగోరియ యిట్లొనర్చితిన్
గాని కుశేశయాననలు గల్గిరయేనియుఁ గల్గనిమ్ము నీ
చేసినభాగ్య మేసతియుఁ జేయదు నీయెదుటన్ మునీశ్వరా
భ్యాసదురాసదం బగుమ దాకృతి యీగతి నుల్లసిల్లుటన్. ౧౮౮

క. సుచరిత్ర! నేడు నీచే, తిచలిది భుజియింపఁ జాల దృప్తియొదవెడిం
బచరణగా దిమ్ములమును, రుచియింపదు శబరివిందు ద్రోవదివిందున్. ౧౮౯

క. అతిమానుష మసిధారా, వ్రత మగు మను వంటనిప్పు వంటి దిదియనన్
బతిదేవతవై మను నీ, గతి భావారూఢమయ్యెఁ గా జగములకున్. ౧౯౦

చ. తనుశతకోటులెత్తి బహుధర్మవినిర్మితిఁ బేర్మిగాంచినన్
ననుఁగనలేనిలేఁతలకు నాతి! యభోగ్యము భాగ్య మీవు ప్రా
గ్జననమునం దొనర్చితి వొ కానొకయర్చన నన్నుఁగూర్చి దా
నన నమకూరెఁజుమ్ము సుజనవ్రజనందితచర్య నీదెసన్. ౧౯౧

తే. అతివ ! తొల్లింటిపుట్టువు నందునొక్క, హోనివేలిమిజన్నైవై మన్ననాడు
నామధురవేణునాదంబునమదిగరఁగి, తొరఁగఁజేసితి సుస్నిగ్ధదుగ్ధరసము.

క. ఆపాలనురువు పవన, వ్యాపారముచేతఁ దెరలి వచ్చినిలిచె లీ
లాపింఛచ్ఛవిభర్త్సిత, తాపింఛ మదీయమౌళి తటిఁ గుచలికుచా ! ౧౯౩

---

త్కారము = ప్రత్యక్షము. ఉద్వేల=మిక్కిలి. ఆలోల=అంతటచలించిన. జపాప్రసవ=దాసనపుఁ బువ్వు. అళింద=ముంగిటిని. అంకూరుఁడు = మొలకలుగలవాఁడు ॥ ౧౮౬ ॥ హరిదంతచేలంబు = దిగంబరము – దిస మొలగలది. ఆలవాలము = పాదియైనది. అమరమేలము = దేవతలకూడికకలది. భవవనోత్కీలంబు=జన్మములనెడి వనమును పెల్లగించునది. తల్పితవ్యాళంబు=పానుపుగాఁ జేయఁబడిన పాముగలది. శిక్యావచూళము = (చల్ది) చిక్కముతోడిసిగగలది. హృతమరుత్సాలంబు=అపహరింపఁబడిన దేవతలచెట్టు (పారిజాతవృక్షము) గలది. అఖిలకాల జంఘాలము = ఎల్లకాలమును వడిగనడుచునది. అశనకృత్తక్ష్వేళము=అన్నముగాఁజేయఁబడిన విషముగలది. అరికరాళము = పగవారికి భయమును పుట్టించునది. ఆపత్పయోదవాతూలము = ఆపదలనెడి మేఘములకుగాలి. నతి =నమస్కారము ॥ ౧౮౭ ॥ కుశేశయాననలు = తామరలవంటి మొగములుగలవారు = స్త్రీలు. అభ్యాసదురాసదంబు=అభ్యాసముచేత పొందఁదగనిది ॥ ౧౮౮ ॥ పచరణ=కపటనటనము. ఇమ్ముల౯ = బాగుగా. ద్రోవది=ద్రౌపది ॥ ౧౮౯ ॥ మనవు=బ్రతుకు ॥ ౧౯౦ ॥ లేఁతలు = అల్పులు. అభోగ్యము = అనుభవింపఁదగనిది. ప్రాగ్జననము = పూర్వజన్మము ॥ ౧౯౧ ॥ వేలిమిజన్నైవు = హోమధేనువవు. మన్న=బ్రదికిన. సుస్నిగ్ధ=మిక్కిలి చిక్కనైన ॥ ౧౯౨ ॥ లీలాపింఛచ్ఛవి =

క. దానఁ బయస్సంతానము, దానంబున నన్నుఁ దనుపు దానవయితి చం
 ద్రానన! తత్ఫలమునఁ గా, దా నీకునుదక్కితిన్ ముదముమదిఁబొదలన్. ౧౯౪

ఆ. ఒక్కఁడకృతసత్క్రియుండనువిప్రుండు, గలఁడు ఘోరకఠిన కలుషబుద్ధి
 వసుధయెల్లఁ దిరుగువసుధానువనుపేరి, పట్టణముననుండుఁబుట్టువడుగు. ౧౯౫

సీ. ధనవంతుఁడయ్యునుద్వాహంబుదొఱఁగిమూఁతులునాకుపెఱవితంతువులఁదగి
 కులవంతుఁడయ్యుఁ బెద్దలఁబాసివిహరించుఁ, బాషణ్డషణ్డానుబన్ధియగుచు [లి
 మతిమంతుఁడయ్యు నా మ్నాయముల్ చెవిఁబెట్టఁ, డశ్లీలఖేలనవ్యసనమెసఁగి
 స్థితిమంతుఁడయ్యు లక్ష్మికిఁగాక త్రిమ్మరు, పలుగూడుమరిగియాఢ్యులభజించి

తే. తలఁచుబ్రహ్మస్వదేవస్వములకునెగ్గు, కుప్పఁజిచ్చిడిపేలాలు కొఱుకఁ దివురు
 గ్రహణకాలంబునందుమున్గఁడుజలముల, సెబ్రచెంచడమాబ్రాహ్మణబ్రువుండు

వ. వాఁడొక్కకందువ నొక్కవెలయాలికిం జిక్కి మహీమండలకుండలం బగు
 పౌండరీకంబునఁ గొండొకకాలంబుండి యొక్కపెనుఁబండువునఁ గన్నులపం
 డువగుమదీయనైవేద్యప్రకల్పనంబుధూపోత్సవానంతరంబున నెడముగాచి
 చూచి తనవలయుతెఱంగునం జని బహువిధం బగుకాలంబు మని ముదిసి
 తనువువిడిచి యత్యుత్తమం బగుధరామరవంశంబునం బుట్టి పుట్టిన నాటనుం
 డియుంజదువుచదువునన చదురుండై నిండుప్రాయంబున నిన్నుం జెట్టవట్టించి
 యిట్లున్నవాఁడు వినుము. ౧౯౭

తే. తరుణిమద్భక్తదర్శనోత్సవసుకృతము, పాపవహ్నికిసలిలమై భద్రమొసగెఁ
 గాక లేకున్న నితఁడుప్రాగ్జనినొనర్చు, కల్మషములకునిష్కృతిగలదెయెందు

వ. అవ్విధంబుగ సోపహారం బగుమదీయరూపంబు నాకస్మికంబుగఁ గనుంగొని

---

విలాసరూపమైన నెమలియీఁకల కుచ్చుకాంతిచేత. భర్త్సిత = తిరస్కరింపఁబడిన. తాపింఛ = చీఁకటిమ్రానుగలది ॥ ౧౯౩ ॥ పయస్సంతానము దానంబునన్ = పాలసమూహము నిచ్చుటచేత. పొదలన్ = వర్ధిల్లఁగా ॥ ౧౯౪ ॥ ౧౯౫ ॥ ఉద్వాహంబు = పెండ్లి. వితంతువులన్ = విధవలను. షండ = సమూహముతోడి. అనుబంధి = సంబంధముగలవాఁడు. అశ్లీలఖేలన = అసభ్యపు మాటలాడుటయందు. స్థితి = ఉనికి — కలిమి. ఆఢ్యులన్ = ధనవంతులను. కుప్పన్ = పెంటదిబ్బయందు. తివురున్ = యత్నించును. మున్గఁడు = స్నానముచేయఁడు. సెబ్రచెంచడము = చెడ్డడేగ — చెడ్డడేగవలె ప్రాణిహింసచేయువాఁడు. బ్రాహ్మణబ్రువుండు = నీచబ్రాహ్మణుఁడు ॥ ౧౯౬ ॥ కందువన్ = సమయమునందు. పెనుఁబండువునన్ = గొప్పయుత్సవమునందు. చదురుఁడు = చతురుఁడు = నేర్పరి ॥ ౧౯౭ ॥ ప్రాగ్జనిన్ = పూర్వజన్మమునందు. కల్మషము = పాపము. నిష్కృతి = ప్రాయశ్చిత్తము ॥ ౧౯౮ ॥ సోపహారంబు = నైవేద్యముతోఁగూడినది. భస్మసాత్కృత = బూడిదయైన. నీరసయవస

భస్మసాత్కృత దుష్కృతనీరసయవసరాశియై భూసురకేసరికిశోరంబై వాసి వడసియు నతండు కట్టిండియగుటకుఁ గారణంబు వినుము. ౧౯౯

క. నీభావశుద్ధి యారయ, శోభనచారిత్ర! యేను జువ్వె యతనికిన్
లోభక్రోధముల మనః, క్షోభముగావించి బాలి శుండనిపింతున్. ౨౦౦

క. పతికొట్టినఁ బతిదిట్టినఁ, బతినిర్దయుఁడగుచు నెట్టి పాటుపఱచినన్
మతి నన్యథాత్వమొందరు,పతిదేవత లతివ! నీకుఁ బ్రతియగువారల్. ౨౦౧

తే. నిష్ఠురత్వంబుతొలఁగించి నేటనుండి, నీకు ననుకూలుఁడయ్యెడు నీవిభుండు
మత్పదద్వయభక్తిస మగ్రులైన, సుతులనేవురఁ గాంచెదూ ర్జితవిభూతి.

ఆ. వెండిఁబైఁడిద్రవ్వి తండంబుగామేలి, కూడుఁ బాఁడి యింటఁ గొలఁదిమీర
నోములెల్లనోఁచి నూతేండ్లుబ్రదికి నీ, భర్తతోడఁ బరమ పదముగనుము.

ఉ. మన్ననచేసినాఁడు మురమర్దనుఁ డంచు నహంకరింప కో
కిన్నరకంఠి! యట్లయినఁ గీడొదవున్ విను తొంటికిన్న న
స్మన్నిహితాంతరంగవయి సత్యసమార్జవశుద్ధిలక్ష్మికిన్
వన్నియపెట్టుమీ మహిత వర్తనకీర్తులు నిర్వహించుచున్. ౨౦౪

క. తృష్ణారహితులు మత్పద, నిష్ణాతులు నిత్యసత్య నిరతులు నగు శ్రీ
వైష్ణవులఁ గాంచి నను(ఁ)గా, విష్ణుపదవలగ్న! గారవించికొలువుమీ. ౨౦౫

క. అని వరమిచ్చి మహీసుర, వనితన్ మన్నించి భక్తవత్సలుఁ డరిగెం
దననెలవునకు సుధారస, మునఁ గుముదినిఁ దేర్చియగుపూర్ణేందుఁడనన్

ఆ. అట సుశీలమగఁడు నదుదెంచిమొక్కకొన్ని,దివసములకుదొరలఁదిరియునాస
గోసి తనకులంబు వాసియువన్నెయుఁ, దలఁచుకొనుచుఁ దెలివిమొలకలెత్త

తే. అతనిఁదమసామ్ముచేసిమున్నాఁగియున్న, మోహముఖులైనజ్ఞాతులమూలఁ
సంహృతాసుపులైననిర్జరులకరణి,మదివివేకాదివర్గమభ్యుదయమయ్యె.ద్రోఁచి

రాశి = ఎండినగడ్డిప్రోగు. భూసురకేసరికిశోరంబు=బ్రాహ్మణశ్రేష్ఠునిబిడ్డ. వాసి=ఘనత. కట్టిండి =కట్టుతప్పినవాఁడు-అక్రమమైన నడవడిగలవాఁడు ॥ ౧౯౯ ॥ బాలిశుండు=మూర్ఖుఁడు ॥ ౨౦౦ ॥ ౨౦౧ ॥ ఊర్జిత=ఎన్నఁడును జెడని ॥ ౨౦౨ ॥ త్రవ్వితండంబు = అపరిమితము ॥ ౨౦౩ ॥ తొంటి కన్నన్=మునుపటికంటెను. అస్మన్నిహితాంతరంగవు = నాయందుంచఁబడిన మనసుగలదానవు. సమార్జవ = మంచి ఋజుభావముయొక్క ॥ ౨౦౪ ॥ నిష్ణాతులు = నిష్ఠగలవారు. విష్ణుపదవలగ్న = ఆకాశమువంటి నడుముగలదానా—సూక్ష్మమైన నడుముగలదానా ॥ ౨౦౫ ॥ కుముదినిన్=కలువ తీఁగను ॥ ౨౦౬ ॥ తిరియు=యాచించు. కోసి=నఱికి-విడిచి ॥ ౨౦౭ ॥ ఆఁగి=ఆక్రమించి. మోహ ముఖులు = మోహుఁడు మొదలగువారు - మోహము మదము మొదలగునవి. జ్ఞాతులన్=దాయా

క. కోపంబు నాఁగి మిక్కిలి, పాపమునకులోఁగి బుద్ధి పశ్చాత్తాపా
టోపశిఖఁ గ్రాఁగి కరుణా, ద్వీపవతీలహరిఁదోఁగి విప్రుఁడుమఱియున్.

సీ. కాలీచపడనిండ్ల కడకేగి వనరుచుం డెడువాఁడు వైరాగ్య నిష్ఠుఁడయ్యెఁ
గయ్యాలక్రచ్చయై కాలుద్రవ్వుచుసదా మండువాఁడతిశాన్తిమహితుఁడయ్యెఁ
గసరియెంగిలిచేతఁ గాకివేయనివాఁడు, సతతాన్నదానప్రశస్తుఁడయ్యె
బ్రహ్మకల్పముదాఁకఁ బ్రతుకాసఁగడకట్టు వాఁడస్థిరముగవిశ్వముఁదలంచెఁ
తే. బాటిగాఁగొనకా పద్మభవునినైన, నిరసము సేయువాఁడు వినీతుఁడయ్యె
నొరులలచ్చికిముచ్చిరియుడుకువాఁడు,సర్వసముఁడయ్యెవిష్ణుప్రసాదమహిమ.

ఉ. పాళముమీరు పెద్దపెద పాళములై బలితంపుఁగాఁగులన్
మూలుగుచున్న ప్రాఁబసిఁడి ముంచి ధనార్థులకిచ్చు విష్ణుదే
వాలయసుప్రతిష్ఠలకు నై యొసఁగున్ సతికేలనించు నా
నాలఘుకర్మనిర్మితికి నగ్రకులేంద్రుఁ డనుగ్రహంబునన్. ౨౧౧

క. ఆయాలుమగలు విష్ణుప, రాయణులై సెక్కగతుల వ్రతములు తఱితోఁ
జేయుచునుండఁగ నట ని, శ్శ్రేయసపద మైన పౌండరీకక్షోణిన్. ౨౧౨

మ. యమరాడ్దూతశిఖావతంసము చిరప్రాణంబు దూరప్రియా
గమశంసిస్ఫుటకాలీకలన మేకప్రక్రియాపాతదీ
క్షము శీతస్తబలీయ మొక్కబలిభుగ్రాజంబు రాజిల్లు శ్రీ
రమణాగారపురోధరోత్థచలపత్రస్థూలశాఖాశిఖన్. ౨౧౩

---

దులను—తనలోనిశత్రువులను. సంహృతాసురులు=చంపఁబడిన రాక్షసులుగలవారు. అభ్యుదయమయ్యెన్=పుట్టెను ॥ ౨౦౮ ॥ ఆఁగి=అణఁచి. లోఁగి=వెనుదీసి. కరుణాద్వీపవతీలహరిన్=దయయనెడి నదీ ప్రవాహమునందు. తోఁగి=మునిఁగి ॥ ౨౦౯ ॥ ఈచవడన్=పచ్చకొనిపోఁగా. వనరు=దేవురించు. కయ్యాలక్రచ్చ = జగడగొండి. కాలుద్రవ్వుచున్ = కలహమునకు యత్నించుచు. మండువాఁడు = కోపవికారమును జూపునట్టివాఁడు కసరి = కోపించి. కడకట్టు = నిర్ణయించు. పాటిగాన్=లక్ష్యముగా. ముచ్చిరి=దుఃఖపడి. ఉడుకు=తపించు ॥ ౨౧౦ ॥ పాళము=మేర ; కడ్డి. బలితంపుఁగాఁగులన్ = మిక్కిలి పెద్దవైన బానలయందు. మూలుగుచున్న = స్థిరముగా కదలకయున్న. ప్రాఁబసిఁడి = బహుదినముల నాటిధనము. నిర్మితికిన్=చేయుటకు ॥ ౨౧౧ ॥ నిశ్శ్రేయసపదము=మోక్షస్థానము ॥ ౨౧౨ ॥ చిరప్రాణము=బహుకాలము బ్రదికియుండునది. దూర...శంసి—దూర=దూరమునందలి. ప్రియ=ఇష్టవస్తువుయొక్క. ఆగమ=రాకను. శంసి=కోరునది. స్ఫుటకాకలీకలనము=స్ఫుట=స్పష్టముగావినఁబడెడి. కాకలీ=సన్నని కంఠస్వరముతోడ. కలనము=కూడినది. ఏకప్రక్రియా పాతదీక్షము=ఒకవిధమైన పాటునందలిదీక్ష (నియమము) గలది. బలిభుగ్రాజంబు=శ్రేష్ఠమయినకాకి. శ్రీరమణా...శిఖన్=శ్రీవిష్ణుదేవునిగుడికెదుట మొలచిపెరిగిన రావిచెట్టుయొక్క

శా. తాతల్ తండ్రులు మామ లల్లుఁడును ముత్తాతల్ సహాయుల్ సహ
శ్రోతల్ భ్రాతలు సేవకుల్ హితులు మిత్రుల్ పుత్త్రు లోలిం దివా
భీతాభీతములై తనుం గొలువఁగాఁ బెన్మ్రాఁకులై వాయస
వ్రాతశ్రేష్ఠము గ్రాలు రేలునగలున్ భ్రాంతాగమాంతంబులన్. ౨౧౪

చ. అది యొకనాఁడు విట్ఠలగృహాంగణభూబలిపీఠవర్తులా
మెదుకులు మేయఁ గన్గొని యమేయగతిన్ బఱవన్ దదాయత
చ్ఛదభవభూరిమారుతవశంబున నయ్యెడ ధూళిపోవ న
భ్యుదితములయ్యె దాన గుడి యూడ్చినఁ గల్గు నగణ్యపుణ్యముల్. ౨౧౫

వ. ఇట్లతర్క్యోపపన్నం బగుపన్నగశయనసదనసమ్మార్జనసముదితసుకృత
పరిపాకంబునఁ గాకంబు నతిలోకంబయ్యె వినుము. ౨౧౬

క. కలహంస మొకటి యదుకుల, కులహంసముగుడిఁ జరించుఁ గుసుమాయుధకీ
ర్తిలతాగుచ్ఛము గైవడి, జలరుహసంభవమరాళసంకాశగతిన్. ౨౧౭

వ. ఇట్లు వర్తించి వర్తించి. ౨౧౮

మ. కుతుకం బింకక కుంకుమద్రవమిళద్గోరోచనాపంకని
ర్మితపత్త్రాంకకలంకితాంబుధికుమారీహారివక్షోరుహ
ద్వితయాస్ఫాలనలాలనోచితపయోవిస్ఫారకాసారసం
తతి నా నీడభవంబు క్రీడసలుపున్ దద్దివ్యధామంబునన్. ౨౧౯

సీ. మొనరెండుగాఁగఁ ద్రెవ్వినవిద్రుమపుఁ గందము నేలుముక్కునఁ దడవితడవి
మొగవిచ్చుపసిఁడిగేదఁగిఱేకుఁ గమిమించు, విశదచ్ఛదములను విద్రిచివిద్రిచి
నగుమొగంబుల దాస నపుగ్రొవ్విరులనవ్వు, చిగురాకునడుగులఁ జిమ్మిచిమ్మి
నిద్దంపుఁబండువెన్నెలగుత్తికఁ గొత్తి మలయు మైముంపులఁ గలఁచికలఁచి

---

లావైన కొమ్మకొనయందు ॥ ౨౧౩ ॥ సహశ్రోతలు=పసతోడి వినికిగలవారు. దివాభీతాభీతములు =గ్రుడ్లగూబవలని భయములేనివి. భ్రాంతాగమ=రావిచెట్టుయొక్క ॥ ౨౧౪ ॥ బలిపీఠవర్తులు = బలిపీఠముసందుండునవి. అమేయ = కొలఁదిపెట్టరాని. ఛద=ఱెక్కలవలన ॥ ౨౧౫ ॥ అతర్క్యోపపన్నంబు = ఊహింపరానివిధమునఁ గలిగినది. సమ్మార్జన సముదిత = ఊడ్చుటవలనఁ బుట్టిన. అతిలోకంబు = లోకాతీతము ॥ ౨౧౬ ॥ కలహంసము = ఉత్తమజాతిహంస; శ్రేష్ఠుఁడు. సంకాశ=పోలిన ॥ ౨౧౭ ॥ ౨౧౮ ॥ ఇంకక=తగ్గక. పత్త్రాంక = మకరికాపత్త్రచిహ్నములచేత. కలంకిత=కలంకముగలవిగాఁ జేయఁబడిన. హారి=మనోజ్ఞమైన. ఆస్ఫాలన = చఱచుటలచేత. పయోవిస్ఫార = జలములచేత అతిశయించిన. నీడభవంబు=పక్షి. తద్దివ్యధామంబునన్=ఆదేవాలయమున ॥ ౨౧౯ ॥ ద్రెవ్విన=తెగిన. కందమున్=గడ్డను. మొగవిచ్చు=ముఖభాగము విరియునట్టి. విద్రిచి=విదలించి. నిద్దంపు=నునుపైన - తేటయైన. మలయు=విజృంభించు. ముంపులన్ = ముంచుటలచేత. ప్ర

తే. శార్ఙ్గి సౌధఘ్రాణకా సారసార, సారసామోదమేదుర వారిఁ దేలి
వచ్చియాయుంచగుడిలోనుజొచ్చెనొక్క, నాఁడుపవలింటిబీటెండ వేఁడిఁదలఁకి

క. అది తన దేహం బచ్చట, విదలింపం బత్త్రసలిల విప్రుషములచేఁ
జొదుకొదవించుచు గాడ్పులు, పొదవెట్టు రజోవికార ములు దూరముగన్.

తే. సలిలఖగమున కేతదాచరణమునన, గలిగె నాకస్మికంబుగఁ గంబుపాణి
గర్భగేహోపలేపసంస్కారసార, సుకృతపరిపాకనిరపాయ శోభనంబు.

క. శుక మొకటి చంచుజితకిం, శుకమై హరిహయశరాస సుసచిరవపురం
శుకమై కుసుమాకరకిం,శుక మానందమున నంద సుతుఁగుడిఁ బెరుగున్.

చ. అలమి త్రిలోకముల్ గెలుచు నత్తఱి తేసవహించు దోడిఁచి
ల్కలు దగ దొట్టి ముందరికి లాగకయుండినఁ దాన తద్భరం
బెలమివహింప మెచ్చి మరుఁ డిచ్చు మణీమయమాలికాత్రయిన్
గళమునఁ దాల్చు చిత్రశుక నాథుఁడు రేఖలపేర నిచ్చలున్. ౨౨౪

క. కీరమది యొక్కహరిపరి, చారికచేరికవసించుఁ జదివింపఁగ మే
పారసి యొసఁగ భవనమార్జారాదులవలనఁ దన్నుసంరక్షింపన్. ౨౨౫

క. దేవాలయమునఁ గొన్నిని, జావాసమునందుఁ గొన్ని యహములు దగఁ బై
చేవదలకపాటించుచుఁ,బూవుంబలేఁబువ్వుబోఁడిపులుఁగుంబ్రోచున్. ౨౨౬

మ. పసుపార్చుం దడియొత్తు నెండ సెకఁ గంపం బాగి మైదువ్వుచున్
వసయున్ వెన్నయుమేపుమేపునొసఁగున్ వల్లించు శ్రీరామనా
మసుధామాధురి సాధురీతి కుచకుం భస్థాయిగాఁ జేయుచున్
బిసపుష్పప్రియవాసరాగమములన్ బింబోష్ఠి రాచిల్కకున్. ౨౨౭ [ గుక్కి

తే. కనకమణిపఞ్జరంబుల నునిచియునిచి, చక్కెరయునుక్కెరయుసారెగ్రుక్కి
యొఅపుబలుకులుపలుమాఱుగ అపికఅవి, కలికిచిలుకలకొలికిరాచిలుకబెనుచు

---

ఘ్రాణ=మొగసాలయందలి. సారసామోద మేదురవారిన్ = తామరల వాసనవలన నతిశయించిన జలమునందు. పవలింటి = పగటివేళయందలి. బీటెండ = మిక్కుటమయిన యెండ. తలఁకి=భయపడి ॥ ౨౨౦ ॥ విప్రుషములచేన్ = తుంపరలచేత. చొదుకు=తడి. పొదవెట్టు=కలుగఁజేయునట్టి. రజోవికారములు = దుమ్మయొక్క ప్రసరించుటలు ॥ ౨౨౧ ॥ ఉపలేపసంస్కార = అలుకుట వలని. సార = మేలైన. నిరపాయ = చెడని. శోభనంబు = శుభము ॥ ౨౨౨ ॥ చంచుజితకింశుకము = ముక్కుచే గెలువఁబడిన మోదుగ మొగ్గగలది. అంశుకము = కాంతులుగలది. కుసుమాకర= = వసంతఋతువునందలి ॥ ౨౨౩ ॥ అలమి = ఆక్రమించి. దగ = దాహము = దప్పి. తొట్టి=కలి గి ॥ ౨౨౪ ॥ ౨౨౫ ॥ అహములు = దినములు ॥ ౨౨౬ ॥ పసుపార్చున్ = పసుపుపూసి స్నానము

మ. కలహంసోపమయాన చక్రకుచ ప్రేంఖత్ఖంజరీటాక్షి గో
కిలసారస్వరబర్హిబర్హచికుర గీరప్రియాలాప దో
య్యాలిం జాలన్ మరిగెన్ శుకం బది మహీయఃప్రేమ గావించుచున్
బలుఁగుం బొందున నంది పొందినగతిన్ బొత్తొత్తులన్ హత్తుచున్. ౨౨౯

తే. ఆశుకద్విజరాజున కంతఁగొంత, కాలమునఁగంగనొకనాఁడు కలిగె బంధ
మోక్షమాకస్మికంబనిర్ముక్తికలిమి, యాశుకద్విజరాజునకద్భుతంబె. ౨౩౦

సీ. జనియించెనో కొక్కపచ్చని మొల్కయనుబుద్ధి, గ్రుచ్చినపచ్చలకొమరువలన
సమకూరెనో కొక్క దాడిమఫలోద్భవబీజ, మతిపద్మరాగసామగ్రివలన
బొడకట్టునో కొక్క జంబూఫలంబనుమనో, భ్రమమింద్రనీలవిభ్రమమువలన
దోఁతెంచెనో కొక్క మధూకపుష్పములను నాసహుర్మంజిముత్యములవలన

తే. దాదియటుపెట్టి పసుపాడఁ దలఁగి చనుడు
బరణిమూఁకుటనెలకొన్న బన్నసరము
గఱచికొనిపోయెఁ జిల్క ప్రగల్భవిటుఁడు
బాలికామానసము గొను పగిది నపుడు. ౨౩౧

క. బారాదిహమ్ములుండఁగ, హారమునేకొనుచుఁ జనియె నండజము ప్రియం
బారయ ఫలకాముకులగు, వారలు గుణవత్ప్రసక్తి వదలవిడుతురే. ౨౩౨

క. ఆధవళకిరణముఖికి న, సాధుశుకాచరణ మపుడ సహ్యంబయ్యెన్
గోధుక్కృతిసతికి మనో, బాధక మగుకృష్ణధూర్త బాల్యముఁబోలెన్. ౨౩౩

మ. కటిఁ జేలార్ధముచుట్టి చిక్కనదిమే నం జుట్టి పాలిండ్లమీఁ
దటసంధించుచు నార్ద్రదేహలతమాద్యద్వర్షధారావల

---

చేయించును. సెకన్ = తాపముచేత. బిసపుష్పప్రియవాస రాగమములన్ = గ్రీష్మఋతు దినముల రాకలయందు ॥ ౨౨౭॥౨౨౮ ॥ ప్రేంఖత్=ఎగురుచున్న. ఖంజరీటాక్షి=కాటుక పిట్టకన్నులవంటి కన్నులుగలది. చికుర=ముంగురులుగలది. మహీయః=అధికమయిన. పొత్తొత్తులన్=పొత్తిగుడ్డలచే ఒత్తుటలచేత ॥ ౨౨౯ ॥ శుకద్విజరాజునకున్ = చిలుకపక్షి శ్రేష్ఠమునకు. శుకుఁడనెడి బ్రాహ్మణ శ్రేష్ఠునకు ॥ ౨౩౦ ॥ కొమరు = మనోజ్ఞత. పొడకట్టెన్=కనఁబడెను. ఇంద్రశిలల=నీలమణుల యొక్క. తోఁతెంచెను=తోఁచెను. హుర్మంజి=ఒకానొక దేశము. తలఁగి=తొలఁగి. మూఁకుటన్ = మూఁతయందు. బన్నసరము=రత్నములహారము. ప్రగల్భ=నేర్పరియైన ॥ ౨౩౧ ॥ బారాది=అనేకములైన ॥ ౨౩౨ ॥ అసాధు = చెడ్డ. ఆచరణము=పని. గోధుక్కృతిసతికిన్ = గోపికాస్త్రీకి ॥ ౨౩౩ ॥ కటిన్=నడుమునందు. చేలార్ధము=సగముకోక. ఆర్ద్రదేహలత = తడిసిన తీఁగవంటిదేహము. మాద్యద్వర్షధారా వలత్తటిదాకారమున్ = దట్టమయిన వానచినుకులచేత చుట్టఁబడిన

త్తటిదాకారముఁ జూపఁ ద్రోసికొనుచుఁ ధమ్మిల్లబంధంబు ముం
గిటికిన్ సుస్తని వచ్చె గోస్తనహరత్కీరగ్రహవ్యగ్రయై. ౨౩౪

తే. వర్షధారావశేషాన్వవాయయుక్తి, వాయునశమునఁ దెరలుమువ్వన్నెవిల్లు
వేడ్క వెన్నాడుశశిఁబోలె వెలఁదిచాప,లమునసరమూహరించుశుకముదవులు ౨౩౫

మ. గుహమాతృస్ఫటికాక్షసూత్రమునిలేక్షుచ్ఛేదగుచ్ఛచ్ఛటా [చు.
స్పృహఁ గైకొన్న శుకంబొ యేమఱుతఱిన్ జీరఁ డుపూవాఁగితో
బహిరుడ్డీనత నొడ్డినిల్చి రతిరాట్పట్టాశ్వమో నాఁగ న
మ్మహిళావిభ్రమకీర మొప్పె ముఖసీమాగామిముక్తాళియై. ౨౩౬

వ. ఈచందంబునఁ గందర్పస్యందనంబు వినిందితుండన మందమందప్రచారం
బును, మలిమ్లుచుండనదుర్గమప్రవేశనిపుణంబు నవివేకియనశిథిలీకృతస్వపక్షం
బును, దనుజగృహీతజనకజయన రామానుసరణసముచితంబును నై యు
న్నత్తఃపోలికం జంచుచుంబితలలంతికావ్యాజంబున లాలగ్రక్కుచుఁ బుష్ప
వద్బింబంబువిధంబున శరీరప్రభాదంభంబున నంభోధరంబులచేతఁ గప్పం
బడుచు యోగిబాగున విచ్ఛిన్నచరణశృంఖలాచ్ఛలనంబున పాశచ్ఛేదంబు
సేయుచుఁ బరవధూపయోధరంబుపగిదిఁబట్టరాక నీతివిదుహృదయంబుగతి

---

మెఱపుయొక్క ఆకారమును. ధమ్మిల్లబంధంబు = కొప్పుముడి. ముంగిటికిన్=ఇంటిమొగసాలకు. గోస్తన...వ్యగ్ర-గోస్తన=రత్నములహారమును. హరత్ = ఎత్తుకొనిపోవుచున్న. కీర=చిలుకను. గ్రహ=పట్టుటయందు. వ్యగ్ర=త్వరగలది ॥ ౨౩౪ ॥ అవశేష=మిగిలిన. అన్వయయుక్తిన్=సమూహముయొక్క కూడికచేత. తెరలు=బయలువెడలు. మువ్వన్నెవిల్లు=ఇంద్రధనుస్సును. వెన్నాడు =వెంబడించు. తవులుచున్=వెంబడించుచు ॥ ౨౩౫ ॥ గుహమాతృ=పార్వతియొక్క. సితేక్షుచ్ఛేద గుచ్ఛచ్ఛటాస్పృహన్ = తెల్లచెఱకుతునుకలగుదెలయొక్క సమూహమునందలి యపేక్షచేత. బహిరుడ్డీనతన్=బయట ఎగురునట్టి స్వభావముతో. ఒడ్డి=అడ్డగించి. రతిరాట్పట్టాశ్వము = మన్మథుని పట్టపుగుఱ్ఱము. అమ్మహిళావిభ్రమకీరము = ఆ యాఁడువారివినోదపుఁజిలుక. ముఖసీమాగామిముక్తాళి = ముక్కునందు తగులుకొన్న ముత్యాలసరముగలది ॥ ౨౩౬ ॥ కందర్పస్యందనంబు=చిలుక. వినిందితుండు=మిక్కిలి నిందింపఁబడినవాఁడు. మలిమ్లుచుండు=దొంగ. దుర్గమ = పోనువల్లపడనితావును. శిథిలీకృత = సడలింపఁబడిన. స్వపక్షంబు=తన ఱెక్కలుగలది; తనవారు గలది. రామానుసరణ=స్త్రీయొక్క అనుసరించుటకు; శ్రీరాముని ననుసరించుటకు. లలంతికా = హారము. లాల=చొంగ. పుష్పవద్బింబంబు = సూర్యచంద్రుల మండలము. బాగునన్ = విధమున. విచ్ఛిన్నచరణశృంఖలాచ్ఛలనంబునన్=తెగినకాలి గొలుసుల కారణముచేత. కట్టివేసిన కాలిగొలుసులు వీడిపోయినందున. పాశచ్ఛేదంబు = త్రాటిని త్రెంచుట; ఆశలను త్రెంచుట. పయోధరము= స్తనము. దూరదర్శనయోగ్యంబు = దూరమునందుండి చూచుటకుఁ దగినది; దీర్ఘాలోచనచేయు

దూరదర్శనయోగ్యంబై కరువలి మురువునం బొడమి యడంగుచుఁ బర
బ్రహ్మంబుచాడ్పున నగోచరంబయ్యును దదీయమాయావిలసితంబునునై
సకలంబునునిజప్రతిభాసంబున యాథార్థ్యభూమిక నభినయించుచు శశాంక
శిలాసౌధవిటంకంబులనునుకువగొన్నతతి శరన్నీరదవశంవదం బగుశునాసీర
శిలాశకలంబన మెలఁగుచు నంతరిక్షమహాప్లక్షంబునకు నక్షామ చంచుపుట
ప్రవాళఖండప్రభాహిండనంబునందొరలి సఫలవిటపలక్ష్మి నావహించుచుఁ
బ్రమాదవిగళితం బగునగవిరోధికొలువుపీవన యచ్చరల పచ్చలకడియంబు
వడువున నిరాలంబనస్థలంబునం బలుమఱు చక్రచంక్రమణచమత్కారంబు
సూపుచు సమీపారామశ్యామలపలాశపటలగర్భంబునందుముకుందవిగ్రహం
బునందుభక్తిసమగ్రుండగుపురుషశ్రేష్ఠుండునుంబోలె నేర్పరుపరాకి డిందు
చు నందంద జాతిపుల్కుఁగులు మనుజగంధధురంధరం బగుటకుజగడంబుదిగి
చినం గినిసి విస్ఫురత తనూరుహ దంతుర కపోలాంతరంబును, విఘూర్ణన
విస్తృతవీక్షణంబునై క్షణంబు మణివలయవలయితం బగురతియునతిముంజేతి
రీతిం జెలువడరు మెడ నిగిడించి మగుడంబడి కాకుప్రకారవికారస్వరంబుగ
వానినిరాకరించుచుంబఱచునప్పుఱచుఁజిలుకఁ గరఁగినయదిపోలె నయ్యన్న
వెన్నాడం బెన్నాటకంబై బోటికత్తియ లుత్తుంగకుచోత్సంగసంగతకురంగ
లాఞ్ఛనకళావలోకనంబున మునిమునినగవులు నెఱయ గోరువంక గానవచ్చెం
గాని కీరంబుదూరంబయ్యెఁగదేయని గర్భోక్తివైదర్భింగూడి యాడుచుం

టకుఁదగినది. కరువలిమురువునన్=గాలిరీతిని. పొడమి=పుట్టి. చాడ్పునన్=విధమున. అగోచరము=
కానరానిది; ఇంద్రియములకు విషయముకానిది. మాయ=మోసము; ప్రకృతి. ప్రతిభాసము=నీడ;
తోఁపిక. భూమిక=వేషము. విటంకంబులన్=మంజూరునందలి గూండ్లయందు. ఉనుకువ=ఉనికి.
శరన్నీరద వశంవదంబు=శరత్కాలమేఘమునందణఁగినది. శునాసీర శిలాశకలంబు = ఇంద్రనీలమణి
ఖండము. ప్లక్షంబునకున్=జువ్విపండునకు. అక్షామ-చంచుపుటప్రవాళఖండ ప్రభాహిండనంబునన్
=తెల్లబొటులేని ముక్కుపుటము అనెడి పగడపుపలుకు కాంతియొక్క వ్యాపనముతోడ. దొరలిన
= కలసిన. ఫలవిటపలక్ష్మిన్ = పండ్లతోడి కొమ్మకలిమిని. విగళితంబు=జాఱినది. నగవిరోధి=ఇం
ద్రుని. పీవన-పిసనకట్టులుగల. వడువునన్ = విధమున. నిరాలంబన=నిలువ నాధారములేని. చంక్ర
మణ = దాఁటునట్టి. శ్యామల పలాశపటల గర్భంబునందున్ = నలుపుతేఱుచున్న పచ్చని
యాకుల జొంపముయొక్క లోపలిభాగమునందు. డిందుచున్=అణఁగుచు. అందంద = మఱి
మఱి. విస్ఫురతనూరుహ దంతురకపోలాంతరంబు = ప్రసరించు స్వభావముగల (నిక్కుచున్న)
మేనివెండ్రుకలచేత మిట్టపల్లములగునట్టిచెక్కిటిప్రదేశములుగలది. విఘూర్ణన=తిరుగుడుపడుచున్న.
చెలువడరు=అందగించు. పఱచు=పలువ=చెడ్డ. అన్న=స్త్రీ. వెన్నాడన్=వెంబడింపఁగా. పెన్నా

బాడుచు పంజరంబునుజిలుకచాలు తెరయనుచేర్చికచేసి యెలయింప నలయిం
చుచు నడిఱెక్క గ్రిక్కిఱించుచు నొక్కయెడంగాలుఁవొడిచి ముక్కున న
క్కంఠహారతరళంబునొక్కుచుఁ జిక్కంజిక్క నిక్కడనిక్కడ నక్కయక్క
యని చేటికానికరంబు పొలసిన ఫులుఁ గెఱింగి మెఱుంగుమెఱసి తొలం
గిన తెఱంగున డాయవచ్చినట్టుల పూయుంబగుమాయ లేటిపాటఁ బోవంబోవ
దూరంబగుచునుండు నెండమావులపూక్షి దివియ నచ్చట నటించి మువ్వ
లోనిరాయిసోయగంబున నొక్కింతవడి పట్టువడుట పచరించి ప్రచురరయం
బున ఖచరపురప్రాసాదంబులు మోవం బూఁపున నెగసితిరిగి పెఱతెరువునం
బఱతెంచి పాండురంగాయతనంబు మధ్యరంగంబుచొచ్చి యచ్చట నిచ్చం
దనయిచ్చనుండు దండియంబుపై వ్రాల నిచ్చట. ౨౩౭

సీ. మదఘూర్ణదురుసంకుమదమలీమసకుచద్విపమహోద్ధతిఁగొనుఁదీఁగనులియ
ఘనసారపుండ్రకగ్లౌబింబనికటఘ ర్మహిమప్రాప్తి మోముదామరచలింప
నాసికానూత్నగంధఫలియూఁపుఁదావి, నధరదంతపదము త్తాళివిరియఁ
గింకిణీక్వణనశంకితగర్జితస్రస్తకాంచిచంచలగతి యంచ జడియ

తే. బంధనిర్ముక్తశుకసక్తభావయగుచు, నలపరాశరసుతుచంద మధిగమించు
మించుననబోడిచందంబు మేలుకనిన, వాడుతలపోయుఁగలలోనివార్తయయ్యె

తే. కక్కసపువంకగోరులఁద్రొక్కిత్రొక్కి, కఱకుముక్కుననందంద గఱచికఱచి
పూసయొకటియుబోఁగునఁబొందనీక, చెరిపెముత్యాలపేసువిచ్చిపుఁబులుఁగు

క. బహువిధరచనోజ్జ్వల మగు, మహిళామణి మణిసరంబు మఱుఁబన్నియు న
య్యహిశయను సదనశరధికి, నహీనరత్నాకరత్వ మనుసంధించెన్. ౨౪౦

క. శుకమున కొదవె నయత్న, ప్రకటితమణిరంగవల్లి పరికల్పనకో
రకితసుకృతానుకృతి దా,నికి మెచ్చెన్ బౌండరీక నిలయుం డాత్మన్. ౨౪౧

---

టకంబు=పెద్దయాట. ఉత్సంగ=మీఁదిభాగమునందు. గోరువంక=ఒకపక్షి ; నఖక్షతము. గర్భోక్తివైదర్భిన్=అర్థాంతరము తోఁచునట్టిమాటలరీతిని. ఎలయింపన్=దగ్గఱకు రప్పింప. తరళంబు = నాయకమణి. పులుఁగు=జాడ. పాటిన్=విధమున. తివియన్=తీయ. మువ్వ=పెద్దగజ్జె. సోయగంబునన్=విధమున. పచరించి=నటించి. ప్రచుర=అధికమయిన. మోవన్=తాఁకునట్లు. పూఁపునన్=పూనికతో. ఆయతన=దేవళము ‖ ౨౩౭ ‖ ఘూర్ణత్=తిరుగుడు పడుచున్న. మలీమస = మాసిన. నులియన్=చలింపఁగా. పుండ్రక=బొట్టుచేత-గ్లౌబింబ=చంద్ర బింబముయొక్క. గంధఫలి = సంపెఁగ. దంతపద=పలునొక్కు. స్రస్త=జాఱిన. జడియన్=చెదరఁగా. శుకసక్త = చిలుకయందంటిన. అధిగమించు = పొందు ‖ ౨౩౮ ‖ కక్కసపు = కఱకైన. విచ్చికపు=దుష్టమైన ‖ ౨౩౯ ‖

క. గిరికానుషక్తబుద్ధి ను, పరిచరునింబోలు నొక్క పన్నగ మొకనా
డురవడి నెచ్చటనుండియొ, మురమర్దనుదివ్యభవనమున కేతెంచెన్. ౨౮౨

వ. ఆసమయంబున. ౨౮౩

క. యమదండచండ మగు భుజ, గమునకు వెఱచఱచి యాఖు కన్యక కమలా
రమణాంఘ్రిఁ జేరె గురుశ్రీ, తమతికి నాముక్తమాల్య దకు నెన యగుచున్.

క. హరిపదపీఠస్థితిగల, సరియను చిట్టెలుక దాఁగె సంవర్తహతిన్
దెరలి మృకండూద్భవుఁ డా, తురతం దజ్జఠరపేటిఁ దూఱినభాతిన్. ౨౮౫

ఆ. వీడిపడినగాజు వెదకంగ వెదకంగఁ, బద్మరాగ మొదవు పగిది నహికి
దొరకె నెలుకదూఱి తొలఁగినతఱి రమా, కమన చరణకైతకప్రసవము.

చ. చరణసరోరుహప్రసవ శైవలినీనివసద్బిసాంకురా
హరణమనీషఁ జేరిన బిసాశన శాబము నాఁగఁ బొల్చు సా
గరశయపూజనాచరణ కైతకకోరకమున్ భజించె మ
త్కరవరకంకణంబు మిహికాఘృణి రాహువు గప్పనొప్పనన్. ౨౮౭

తే. మధురమదిరారసామోదమైత్రినలరు,పొలతినెమ్మోమువలపానుభోగిఁబోలె
హరిపదాబ్జమధూళిమ యంబుఁ గ్రోలె, జాతిగేదంగితావి భుజంగభర్త.

క. అలరు నల రుచిరమత్కుం,డలముపయిన్ నిలిపె సవ్య నఖరపదముపై
నలరు నిజకంటకక్షత, విలసనమును విటునిమేన వేశ్యయుఁబోలెన్. ౨౮౯

సీ. సరసిజాకల్యాణ సమయార్హ జతులక్ష్మిఁ, గలిగించుఁ బదనఖాగ్రమునఁ దవిలి
తళుకొత్తుమిన్నేటి తెలినీటి తెమలున, ముదురుచెందొవచాలు మొలవఁ బెట్టు
సీమంతసీమాంతసిందూరరుచిఁ జేయుఁ, మ్రొక్కి లేవని చతుశ్శ్రుతిసతులకుఁ
బీఠరూపంబునఁ బెట్టిన శేషుని, ఫణరత్నఘృణులకుఁ బ్రాఁకు వెట్టు

---

శరధికిన్=సముద్రమునకు ॥ ౨౮౦ ॥ కోరకిత=మొలకలెత్తిన ॥ ౨౮౧ ॥ గిరికానుషక్త=చిట్టెలుకయందాసక్తనుయిన; గిరికాదేవియందాసక్తమైన ॥ ౨౮౨ ॥ ౨౮౩ ॥ చండము=భయంకరము. ఆఖుకన్యక=ఎలుకపిల్ల ॥ ౨౮౪ ॥ సరియన్=సందునందు. సంవర్తహతిన్=ప్రళయకాలపు దెబ్బచేత ॥ ౨౮౫ ॥ రమాకమన=విష్ణుదేవునియొక్క. కైతకప్రసవము=గేదంగిపువ్వు ॥ ౨౮౬ ॥ బిసాశనశాబము=హంసపిల్ల. కోరకమున్=మొగ్గను. మిహికాఘృణిన్=మంచు వెలుఁగును=చంద్రుని ॥ ౨౮౭ ॥ మదిర=మద్యము. మధూళి=మధువు=తేనె. భుజంగభర్త=పాములరాజు ; విటశ్రేష్ఠుఁడు॥ ౨౮౮ ॥ రుచిర=ప్రకాశించునట్టి ॥ ౨౮౯ ॥ జతులక్ష్మిన్=లత్తుక కలిమిని. తెమలునన్=చలనమునందు. చెందొవ=ఎఱ్ఱగలువ. సీమంతసీమాంత=పాపటకొనయందలి. ప్రాఁకు=(తీఁగలకుఁ బెట్టునట్టి) యల్లుడుకఱ్ఱ. పారణ=ఒకప్రొద్దున్న దినమునకుమఱునాటిభోజనము_ఇక్కడ భోజనమనియర్థము.

తే. కైటభాంతకపూజనా కైతకప్ర, సవనవామోదపారణా సౌఖ్యముదిత
భుజగరాజస్ఫటాభోగ భూరిమణిస, మాజరాజత్ప్రభాపుంజ మంజిమములు.

క. వ్యాపించు తిమిరహరమై, దీపించు నిజోత్తమాంగ దివ్యమణిరుచిన్
దీపావళి హరి కిచ్చుచు, నాపుణ్యఫలానుభవము నయ్యహి గనియెన్.

క. ఆతటి నొకకందువ న, వ్వాతాశనశయను కేళి వనవసుమతినుం
డేతెంచెన్ సరఘాసం, ఘాతము తమపెరకుఁ గడువి ఘాతంబగుటన్. ౨౫౨

క. కాయద్యుతి జిడ్డుకొనఁగ, నాయీఁగలమొత్తమాశ్రితాఖిలదిశమై
యాయెడఁ దైలతటాక,న్యాయంబొనరించె జలధ రాధ్వంబునకున్. ౨౫౩

శా. ఆ మందోద్భవబీజషండరుచి సయ్యాటించుచున్ మక్షికా
స్తోమం బాతతపక్షగుచ్ఛమగుచున్ దోతేరఁగా శ్మశ్రులం
బై మిన్నొప్పు తదంగసంగతివధు వ్యామోహముం జేయు దో
డ్త్రో మర్త్యాలికిఁ దద్విహారకలిత ద్రుస్కంధవీరుచ్ఛిఖల్. ౨౫౪

క. ఆమధుమక్షిక లటఁ జని, దామోదరమందిరాగ్ర తలగతనిర్మా
ల్యామోదామేదురమధు, ప్రేమాకులబుద్ధిమైఁ జరింపఁగ నంతన్. ౨౫౫

క. అందు నొకసరఘ గ్రోలె ము,కుందపదాఘ్ర్యాంబు బిందు గుంభితసుమనో
మందమకరందశీకర, ముం దీర్థస్వార్థముల్ సమున్నతి వెలయన్. ౨౫౬

క. కలిగె మధుమక్షికమునకుఁ, దలఁపనితలఁ పస్మదాది ధార్యము గంగా
జలవలమానము యదుకుల, తిలకాంఘ్రిసరోజదివ్య తీర్థముఁ గ్రోలన్. ౨౫౭

ఆ. దానసంభవించెఁ దేనియయీఁగకు, సోమపానరతుల సుకృతఫలము
భాగ్యమొదవె నేని ప్రాపించుతనుఁ దాన,పుణ్యలక్ష్మి సన్నిధియఁబోలెఁ బురుషు

---

స్ఫటా=పడగయొక్క. ఆభోగ=విశాలప్రదేశమునందలి. రాజత్ = ప్రకాశించుచున్న. మంజిమములు=మనోజ్ఞతలు ॥ ౨౫౦ ॥ ఉత్తమాంగ=తలయందలి. రుచిన్=ప్రకాశముచేత. దీపావళిన్ = దీపముల వరుసను ॥ ౨౫౧ ॥ కందువన్=సమయమునందు. వాతాశనశయను=శేషశాయియొక్క. సరఘాసంఘాతము=తేనెటీఁగలగుంపు. పెరకన్=తేనెతెట్టెకు ॥ ౨౫౨ ॥ జిడ్డుకొను=మెఱుఁగుదేఱు. ఆశ్రితాఖిలదిశము=ఆశ్రయింపఁబడిన యెల్లదిశలుగలది. జలధరాధ్వము=ఆకాశము ॥ ౨౫౩ ॥ ఆమందోద్భవబీజషండ రుచిన్ = ఆముదాలరాశి విధమును. సయ్యాటించు=పరిహసించు. తోతేరఁగాన్=తోఁచఁగా. శ్మశ్రులము=గడ్డమీసములుగలది. ద్రుస్కంధ వీరుచ్ఛిఖలు = చెట్లమొదళ్లయందలి చిగురుఁగొమ్మలకొనలు ॥ ౨౫౪ ॥ ౨౫౫ ॥ సరఘు=తేనెటీఁగ. గుంభిత=కూర్పఁబడిన ॥ ౨౫౬ ॥ ధార్యము=ధరింపఁదగినది. వలమానము = కదలుచున్నది. క్రోలన్=త్రాగను ॥ ౨౫౭ ॥ ౨౫౮ ॥ జాతిస్మరత్వ సంపదకల్మిన్=పూర్వజన్మజ్ఞానము కలిమికలుగుటచేత. అపాంఘుల=అం…

సీ. జనియించె నేసాధ్వి జాతిస్మరత్వసం పదకల్మి నిజకులాభరణమగుచు
వర్తించె నేపతివ్రత తాటిమీఁదటి, తపమైనతెనువునఁ దాల్మిమిగిలి
నెలకొల్పె నేయపాంసుల మానసమునందుఁ, బరమవైష్ణవధర్మపాటవంబు
మెప్పించె నేసతి యప్పౌండరీకితీర్థవిభు నిష్టాన్నవిశ్రాణనమున
నా సుశీలకు నక్కాక హంస చిత్ర, శుక భుజంగమ సరఘులు సురథ సులభ
సుముఖసువ్రతసుకృతినామములువరుసఁ, దాల్చి జనియించె శక్తిముక్తాఫలు [లై]
ఉ. కేసరిశాబశోభిగృహ కర్తయు భానుమదంశవిస్ఫుర
ద్వాసరలక్ష్మివైభవము వారిధిలగ్నసమగ్రవేల యు
ల్లాసముదాల్చి యొప్పె మహిళాతిలకంబు పతివ్రతాదవి
న్యాసముచేతఁ జేకుఱిన నందను లేవురు నందమందఁగన్. ౨౭౦
క. గోమునఁ బెరుగుచు ముఖ్యా, ద్యై మెలఁగుచు గర్భవైష్ణవాగ్రేసరులౌ
నాముద్దుకొమరులం గని, కామిని దీపించెఁ దోడఁగాచినభాతిన్. ౨౭౧
క. భూలేఖకులుల కేమే, కాలంబున నెట్టియెట్టికర్మములైనం
బోలుం దత్తత్కృత్యము, లోలిం బిత్రకృతములయి గుణోన్నతిఁ బెనుపన్.
శా. శాణోత్తేజితరత్నలక్ష్మిఁగురుశిక్షావత్కిశోరాకృతిన్
రేణుక్షాళనశారిమూర్తి కలభశ్రీదోహదోద్యన్నవ
క్షోణీజప్రభముక్తకంచుకఫణిస్ఫూర్తిన్ సుధీబాంధవ
శ్రేణిప్రీణనకారణోజ్జ్వలకళోత్సేకాఢ్యులై రేవురున్. ౨౭౩
చ. ఒకఁడు నిరూఢకృష్ణరుచి యొక్కఁడు నిర్మలమానసప్రియుం
డొకఁడు ప్రయత్నయోగ్యఫలుఁ డొక్కఁ డనాదృతబంధకంచుకుం
డొకఁడు రసానుకూలమతి యుక్తుఁడునై విలసిల్లి రంత ప్ర
త్యకులఁ బెట్టెనెట్టివారలకుఁ దప్పునె తొల్లిటిజన్మవాసనల్. ౨౭౪

టాలుకానిది—పతివ్రత. విశ్రాణనమునన్=ఈవిచేత ॥ ౨౬౯ ॥ కేసరిశాబశోభి = సింహపుపిల్లవలె (స్వచ్ఛముగా) ప్రకాశించునట్టి. భానుమదంశు విస్ఫురద్వాసరలక్ష్మి = సూర్యప్రకాశముచేత వెలుఁగునట్టిపగటి సంపద. లగ్న=అంటిన. విన్యాసము=ఉంచుట. చేకుఱిన=కలిగిన ॥౨౭౦॥౨౭౧॥ భూలేఖకులులకున్=బ్రాహ్మణ కులముగలవారికి ॥ ౨౭౨ ॥ శాణోత్తేజిత = సానయందు మెఱుఁగియ్యఁబడిన. ముక్తకంచుక = కుబుసమువిడిచిన. ప్రీణన = తృప్తినొందించుటకు. ఉత్సేకాఢ్యులు = అతిశయముగలవారు ॥ ౨౭౩ ॥ కృష్ణరుచి=నల్లనికాంతిగలవాఁడు ; కృష్ణునిబోలినవాఁడు. నిర్మల మానసప్రియుండు = నిర్మలమయిన మానససరస్సునందుఁ బ్రియము గలవాఁడు ; నిర్మలమయిన మనసుగలవారికిఁ బ్రియుఁడు. ప్రయత్నయోగ్యఫలుఁడు = ప్రయత్నమునకుఁ దగిన

ఉ. లౌకికవైదికాచరణలాలసులై హరిభక్తినుత్తమ
    శ్లోకులు వీరనందగిరిసూనృతలక్ష్మికిఁ బట్టుగొమ్మలై
    యేకడ సర్వభూతదయయే తమసొమ్ముగ దీనమానస
    వ్యాకులతాపనోదనధనాఢ్యులనన్ విలసిల్లి రేవురున్. ౨౬౫

క. అత్తొలుగోల మలపలసర, మెత్తినక్రియఁ బొలుపొంగు నెస వికసితమా
    నెత్తమ్మికొలనిచెలువునఁ, దత్తత్సౌభాగ్యములను దాత్తంబయ్యెన్. ౨౬౬

తే. అఖిలకల్యాణగుణశీల యాసుశీల, పెట్టెఁ జేమీఁదుగా నెల్ల చుట్టములకు
    భర్తతోఁగూడ ముత్తాటి పండుదినియె, నెత్తె మున్మనుమగుజ్జుల నెందతేని.

ఉ. ఆ నలినాయతాక్షి ప్రసవాపగమంబునఁ బండఁబాఱుచున్
    బ్రాణవిభూషలాలనము ప్రాఁకుడుఁగొయ్యఁగ నిల్చి మన్మసం
    తానమెునప్పుప్రోది జరదైన్యము నాఁగ నతీతవర్షను
    ద్ధ్యానతరౌషధిప్రవహదంబుసమీపనిరూఢిఁ బోలదే. ౨౬౮

క. సకలాగమజ్ఞ యగువి, ప్రకులాంగన యొక్క నాఁడు పలుకు నిజకుమా
    రకులఁగని మును మదాలస, శుకతుల్యులఁగూర్మియాత్మజులఁబల్కుక్రియన్.

మ. అనుభూతాఖిలభోగఁ బోషితసమస్తార్యం గృతానేకకాం
    చనముఖ్యోచితదాన దృష్టిగత యుష్మత్తమజీవత్పతిన్
    జనతామాన్య నశీతివృద్ధ నను నీ సంసారదుర్వారబం
    ధనిర్బంధమునందుఁ బాపుటకు యత్నం బింకఁ జేయందగున్. ౨౭౦

క. సభవజ్జనకంబుగఁ జని, ప్రభవజ్జగదండషండ పరిపూర్ణతనున్
    శుభదాయిఁ బౌండరీక, ప్రభు నారాధించి కాంతుఁ బరమపదంబున్. ౨౭౧

---

పండుగలవాఁడు ; ప్రయత్నమునకుఁదగిన ప్రయోజనము గలవాఁడు. అనాదృతబంధకంచుకుఁడు= ఆదరింపఁబడని కట్టయినకుబుసము గలవాఁడు. ఆదరింపఁబడని సంసారబంధమనెడి కవచముగల వాఁడు. రసానుకూల=రసమునకు అనుకూలమయిన ; భూమిక (లోకమునకు) అనుకూలమయిన ॥ ౨౬౪ ॥ పట్టుగొమ్మలు = ఆధారములు. ఆపనోదన = తొలఁగించుటయనెడి ॥ ౨౬౫ ॥ అత్తొలు గోలము=ఆబ్రాహ్మణవంశము. ఎసన్ =అతిశయముతో. చెలువునన్ =అందముతో. ఉదాత్తము = హెచ్చినది ॥ ౨౬౬ ॥ మున్మమ్మగుజ్జులన్ =మనుమలకు కొడుకులైన బిడ్డలను. ముత్తాటిపండు దిని రొన్ = ముత్తైదువ తనమువలని ఫలమును అనుభవించెను. ఎందతేనిన్ =ఎందతినో=అనేకులను ॥ ౨౬౭ ॥ ప్రసవాపగమంబునన్ =కానుపుల యుడిగిపోవుటచేత ; పూవులు ఊడిపోవుటచేత. ప్రోది =రక్షణము. ఆఁగన్ =త్రోసివేయఁగా ॥ ౨౬౮ ॥ ౨౬౯ ॥ అనుభూత=అనుభవింపఁబడిన. ముఖ్య =మొదలగు. దృష్టిగతన్ =చూపును బొందినదానిని. అశీతివృద్ధన్ =ఎనుబదియేండ్లు ముసలిదానిని ॥

క. ఒకబుద్ధివినుం డొండా, డక సకలాగమమతంబు దక్కఁ దెలిసి మీ
కకుటిలమతి నెఱిఁగింతు జ, నకసనకశుకాదులెఱిఁగి న తెరువుఁ దెలియన్.

సీ. అమితభోగాయతనము దేహమనుసర్ప, ముగ్రకృత్యము లేల యుడిగియుండు
ధాతుమయంబుగా త్రనుసుధాత్రీధరం,బది యేల రాగంబు నవలఁ ద్రోయు
నిచితనానాగుణ ప్రచురమీతనువను, ఫలమేల చిరుఁగక పదిలమొందు
నూర్మిపరంపరా యుతమగు మనువార్ధి,యెడ జీవనభ్రాంతి యేలయుడుగు

ఆ. నార్జవంబుచాల దతికఠినాశయ, మెపుడు మైలవిడువ దెండుఁ జీవుకుఁ
బటికిడొక్క దీనిఁ బాటింప రెప్పాట, లక్ష్యయేనియునుము ముక్షుజనులు.

ఉ. మాయయు జీవుఁడుం బెరసి మైత్రియొకానొకఁ డాచరించుచుం
బాయక యాఁడుఁబాటుమగ పాటువడన్ వివిధత్వమొంది ప
ల్చాయలఁ బాంచభౌతికపుఁ బైరుదయించి తలిర్ప ప్రమోదుగా
మేయు జరామయవ్యసన మృత్యునియుక్త కడంగరీయముల్. ౨౭౪

శా. అంతర్వాణికుశేశయద్యుమణిఁ బద్మాక్షున్ మదిన్ నిల్పి దు
ర్దాంతానంతభవాంధకూపతరణ ప్రౌఢిన్ దృఢస్థేమఁ బా
టింతు ర్పెద్దలు తద్ద నమ్మి నుయిదాఁ టేవానికిన్ జింత యా
కంతైనం గడమేనియుం గడమగా దాయంచు నూహించుచున్. ౨౭౫

క. తలముచ్చుట్టులు దిరిగిన, తలపోయఁగ నోరిలోని దయకడియన్న
ట్లిల నేతెఱఁగులఁ దిరిగినఁ, గలుగదు గతి విష్ణుసేవ గావింపకయున్. ౨౭౬

మ. పురుషశ్రేష్ఠులు గొంద ఱాత్మచరితంబుల్ జ్ఞానవైరాగ్యభా
స్వరముల్గా విహరించుచుం గుసకృపా సంపన్నులై సాధనాం
తర మంత్రాంతర దేవతాంతరములం దర్కించి క్షీరోదక
స్ఫురణం బొప్ప ముకుందలీనతనులై పొంద రజస్రముల్. ౨౭౭

---

౨౭౦ ॥ సభవజ్జనకంబుగన్ = మీతండ్రితోఁగూడ. ప్రభవత్=పుట్టుచున్న ॥ ౨౭౧ ॥ ౨౭౨ ఆయతనము=ఇల్లు. రాగంబున్=అనురాగమును ; ఎఱుపువన్నెను. నిచిత=వ్యాపింపఁజేయఁబడిన. చిరుఁగక=చినుఁగక. ఊర్మి=తమకము ; అల. జీవనభ్రాంతి=బ్రదుకునందలి భ్రమ; నీటివలని తిరుగుడు. ఆశయము = చోటు ॥ ౨౭౩ ॥ బెరసి=చేరి. కడంగరీయములు=తాలుగడ్డిమేయునట్టి యెద్దులు ॥ ౨౭౪ ॥ అంతర్వాణికుశేశయద్యుమణిన్=విద్వాంసులనెడి తామరలకుసూర్యుని. స్థేమన్=బలమును. కడమ=తక్కువ ॥ ౨౭౫ ॥ ముచ్చుట్టులు=మూడుచుట్లు ॥ ౨౭౬ ॥ భాస్వరములు = వెలుఁగునవి. తర్కించి=విచారించి. లీన=ఐక్యమైన ॥ ౨౭౭ ॥ కసటు=మురికి. త్రిభువనంబు =

సీ. విషయాంకురముగిల్లి వేయనివారికి, నినుపకచ్చడమున కెంతదవ్వు
తెగఁగొని కసటుగడుగనివారికిని త్రిషవణంబునకు నెన్నిచాళ్లపట్టు
చింతలన్నియు మ్రోడు సేయనివారికి, బోడయాదలలకు నేడకేడ
యేనుతత్త్వంబులు నెఱుఁగనివారికి, నెఱుకకు నేయూరి కేదితెరువు

ఆ. తమమొగంబుఁ జూడు తముఁజూడుమేనుంగు, మీఁదనున్నవాని మేరమీరి
సున్నమడుగఁజూచుచున్నారు హరిభక్తి, గమ్యధామకాంక్షఁ గర్మపరులు.

సీ. పరదారపరధనాహరణవైముఖ్యంబు, వశవర్తిగాఁ జేయు వారుదక్కఁ
బరగుణపరమాణుపర్వతకరణంబు, వ్రతముగాఁ బాటించు వారుదక్కఁ
బరుఁడైనఁ గోడు కైనమరియాదచెడనమ, త్వమునఁ దనియునప్పు వారుదక్కఁ
బరమసంపదలనాపద్వేళ సత్యంబు, వదలక భాషించువారుదక్క

తే. దూరమగుకోర్కిఁ గోరని వారుదక్కఁ, గ్రూరకర్మంబులుడివోవువారుదక్కఁ
బూరుషార్థపరతఁ గ్రాలువారుదక్కఁ, దక్కువారెల్లభవవహ్నిదక్కువారు.

క. పలువేల్పులబడిననడవక, యిలువేలుపుగా భజింపుఁడీ మీరలు వి
ట్ఠలు శిక్యగదధిరసగం, ధిలకేళుం బౌండరీకతీర్థాధీశున్. ౨౮౦

ఉ. మస్తకిరీటహాటకస మంచితకుంభయుతంబు పీవరో
రస్తటిరత్నదీప్తిరుచిరంబు రమాసమసాలభంజికా
శస్తము నైన శార్ఙ్గితను సౌధము నెక్కి సుఖించు బుద్ధికిన్
నిస్తులభక్తి గౌరవము నిచ్చెనయై చననిచ్చు మీఁదికిన్. ౨౮౧

క. మీరును గృహస్థధర్మము, మేరకుఁ దలమీఱి చనక మిత్రామాత్యో
దారహితదారదారక, వారకములతోడఁ దీర్ఘవాసపరులరై. ౨౮౨

క. కోమలతులసీపల్లవ, దామాంచితవత్సలక్ష్మధామముఁ బయోద
శ్యామముఁ బదద్వయనతసు, త్రామున్ మనపౌండరీకధామముఁ గొలువుఁడీ!

క. అనుచుండ నర్కనిభమగు, ననిమిషయానంబు దెచ్చి హరిపార్శ్వచరుల్
గొనిచనిరి సభర్తృకముగ, ఘనశీల సుశీల విష్ణుగాథాలోలన్. ౨౮౪

త్రికాలస్నానము. బోడయాదల = బోడితల. తెరువు=మార్గము. గమ్య=పొందఁదగిన ॥ ౨౭౮ ॥ ఉడివోవు=ఉడుగు. క్రాలు=ప్రకాశించు ॥ ౨౭౯ ॥ బడిన్=మార్గమున. శిక్యగ=ఉట్టినిబొందిన. గంధిల=వాసనకొట్టుచున్న ॥ ౨౮౦ ॥ మస్త=తల. పీవర=బలిసిన. ఉరస్తట=ఱొమ్ము ప్రదేశము నందలి. శస్తము=శ్లాఘ్యము ॥ ౨౮౧ ॥ మేరకున్=మర్యాదకు. తలమీఱి=అతిక్రమించి. ఉదార=తిన్నఁదనముగల. దారకవారకములతోన్=పిల్లకాయల సమూహములతో ॥ ౨౮౨ ॥ వత్సలక్ష్మ=

తే. ఆవు నవనీసుపుండు వాయసము నంచ, రాజకీరంబు పాము సరఘయు నిట్లు
ముక్తికేగినకథవినుభక్తతతికిఁ, బర్వతాగ్రశిలాబ్జసంభవముభవము. ౨౮౫

వ. అని వెండియు నిందుధరుండు శతానందనందనుతో నిట్లనియె. ౨౮౬

సీ. నీలమో కాలాభ్ర జాలమో బాలశై, వాలమో యాసిద్ధవపునికాంతి
కెంపులో పవడంపు గుంపులో యీరెండ, సొంపులో యామేటి జోగిజడలు
హారమో హారినీహారమో భూరిక, ర్పూరమో యాయాది పురుషునగవు
మెఱుపులో వజ్రంపుటొఱపులో శశిరేఖ తఱపులోయావటూత్తమునికోఱ

తే. లనఁగ శార్ఙ్గికి నాదిక్కునందునిలిచి, ప్రేతభూతనిశాచర పీడ లడఁచి
క్షేత్రరక్షణదక్షుఁడై క్షేత్రపాలుఁ, డుండువిభునాజ్ఞతలమోచియోమునీంద్ర

క. శిక్యావచూడు నాజ్ఞా, వైక్యార్థముసేయు భోగి వలయు ప్రభావా
ధిక్యంబుమీఱి యెరిఁగి, శక్యమె తత్క్షేత్రమునఁబ్రచారమొనర్పన్. ౨౮౮

చ. చెడుగుల విష్ణుభక్తి నిరసించుదురాత్ముల మోక్షలక్ష్మి చే
పడుటకుఁగానిహీనులఁ బ్రభావతిరస్కృతలోకపాలుఁ డా
బుడిబుడితాల్పుఁ డందు నొకపూఁటయు నుండఁగనీక త్రోచి పో
నడుచుఁ గలంచుదెందముల నారటపెట్టు మహోగ్రమూర్తియై. ౨౮౯

ఉ. పువ్వును బూఁత పుట్టమును భూషయు దివ్యములై చెలంగ లే
జవ్వను లర్థిఁగొల్వ నొకచక్కనిఖేచరుఁ డొక్కనాఁడు ము
న్నవ్వనమాలిహాటకమయావసథోపరివీథిఁ ద్రిమ్మరన్
గ్రొవ్వెసఁగ న్విమానరుచి కోకనదప్రియరోచి యెచ్చఁగన్. ౨౯౦

ఉ. ఏధితయౌవనోత్థమతి నెద్దియు మీఁదెఱుఁగంగలేక వి
ద్యాధరుఁ డాతఁ డాత్మరుచి నాకసమున్ గనకప్రసూనరా

---

శ్రీవత్సమనెడి చిహ్నమునకు ॥ ౨౮౩ ॥ అనిమిషయానము=విమానము. సభర్తృకముగన్ = పెనిమిటితోఁ గూడుకొనునట్టుగా. విష్ణుగాథాలోలన్=విష్ణునికథలయందాసక్తురాలైనదానిని ॥ ౨౮౪॥ ౨౮౫ ॥ ౨౮౬ ॥ బాలశైవాలము=లేఁతపాఁచి. ఈరెండ=కొంచెపు ఎండ. జోగి = యోగి. హారము=ముత్యాలసరము. హారి=మనోజ్ఞమైన. వజ్రంపుటొఱపులో = రవలవెలుఁగులో. తఱపులో = ముదురుఁదనములో. మోచి=వహించి ॥ ౨౮౭ ॥ శిక్యావచూడు=చిక్కము సిగయందుఁగలవాని యొక్క. ప్రచారము=సంచారము ॥ ౨౮౮ ॥ బుడిబుడితాల్పుఁడు=బాలచంద్రునిధరించినవాఁడు— క్షేత్రపాలుఁడు ॥ ౨౮౯ ॥ ఖేచరుఁడు=విద్యాధరుఁడు. వనమాలీ = విష్ణుదేవునియొక్క. అవసథోపరివీథిన్ = ఆలయమునిూఁది మార్గమున. ఎసఁగన్=అతిశయింపఁగా. కోకనదప్రియరోచి=వెన్నెలవెలుఁగువంటి వెలుఁగు ॥ ౨౯౦ ॥ ఏధిత=పెరిగిన. యౌవనోత్థమతిన్ = ప్రాయమువలనఁ బుట్టిన

జీకరణాభిరామముగఁ జేయుచుఁ ద్రిపుర క్షేత్రపాలుఁ డు
త్కటక్రోధరసోగ్రమూర్తియయి కోయనియార్చె నభంబుఁ జూచుచున్. ౨౯౧

సీ. కనువిచ్చిచూచుట గాక దిగ్గున లేచె, నమితసమాధిస్థిరమునికుము
గ్రుడ్డులఁబొదువుమక్కువలు దక్కుట గాక, పొదలాడెఁ జెట్లపైఁ బులుఁగుమూఁక
పులుమేయుతమకంబు దొలఁగుట గాక వి, హ్వాలబుద్ధియై దాఁటె హరిణకులము
ప్రజ గేలఁ గర్ణరంధ్రములు మూయుట గాక, పవిశంకనరనతిప్రవణమయ్యెఁ

తే. బద్మనాభగృహోపరిభాగసంచ, రిష్ణుఖేచరదర్శనోద్రిక్తహృదయ
కాలభైరవభైరవోద్వేలకంఠ, కుహరనిష్ఠ్యూతరోషనిర్ఘోషవిహృతి.

ఉ. మానని కోప మిట్లు మది మల్లడిగొల్పఁగ మింటికిన్ మహా
శ్యేనముపోలె బిట్టెగసి యెక్కుడు నుక్కున నుగ్రవిగ్రహుం
డై నెఱితగ్గ నగ్గగనయాయివిమానముఁ ద్రొక్కి భగ్నముం
గానొనరించుచుం ద్రిదశ గాయకనాయకుఁ డుర్విఁ గూలుడున్. ౨౯౩

ఉ. కోలుమసంగి మ్రోఁగి బలు గోఱలు దీటుచు గ్రుడ్లుద్రిప్పుచున్
క్ష్వేళలొనర్చుచున్ మొగము జేవురుముద్దవిధంబునన్ మహా
భీలముగాఁగ వ్యాళవిభుఁ బెన్బులుఁగీడ్చినమాడ్కి నీడ్చె న
బ్బాలిశుఁ గాలభైరవుఁడు పైకుబుసం బొక పోరువెత్తఁగన్. ౨౯౪

క. ఈవడువునఁ బులిదొడికిన, యావుపసిగ నుసుఱువోవ కాసన్నుండౌ
నావిద్యాధరు భైరవ, దేవావృతుఁ గాంచి వాసుదేవుఁడు పలుకున్. ౨౯౫

శా. నాగాకల్ప! యహో పురే! నిలు విమానభ్రష్టుఁడై నేలపై
నీగంధర్వుఁడు కూలి దర్పముడిపో యెన్ జంపఁగాఁగాదు గా
ఢాగస్కర్ముఁడేనియున్ జడుపువాఁడై యుండ నర్థిన్ మహా
భాగుల్ చంపమి నీ వెఱుంగుదువు కోపం బాఁపు మీపట్టునన్. ౨౯౬

---

బుద్ధితో. ఉత్కటక్రోధరసోగ్రమూర్తి=మిక్కుటమయిన కోపరసముచేత భయంకరమైన రూపము గలవాఁడు ॥ ౨౯౧ ॥ పొదలాడెన్ వర్ధిల్లెను-అతిశయించెను. పులు=గడ్డి. పవిశంకన్=పిడుగు అను భయముచేత. ప్రవణము = ఆసక్తము. ఉద్రిక్త=రేఁగిన. భైరవ=భయంకరమైన. ఉద్వేల = అతిశయించిన. నిష్ఠ్యూత=వెడలింపఁబడిన. నిర్ఘోష=ధ్వనియొక్క ॥ ౨౯౨ ॥ పల్లడిగొల్పఁగన్=కలఁతనొందింపఁగా. బిట్టు=శీఘ్రముగా. ఉక్కునన్=బలముతో. ఉగ్రవిగ్రహుఁడు=భయంకరమయిన యాకృతిగలవాఁడు. నెఱి=అందము ॥ ౨౯౩ ॥ కోలుమసంగి=మిక్కిలి విజృంభించి. క్ష్వేళలు = సింహనాదములు. జేవురు=ఎఱుపుయొక్క. మహాభీల=అతిభయంకరము. అబ్బాలిశున్ = ఆమూర్ఖుని. పోరువ=పోర ॥ ౨౯౪ ॥ తొడికిన=పట్టిన. ఆవుపసిగన్=గోవుకాఁగా. ॥ ౨౯౫ ॥ నాగా

క. అని శ్రీపతి యానతియి, చ్చిన మందల విడిచె నతని సిద్ధవిభుఁడు వాఁ
డును గులగులలై లావగ, లిన మై విదలించుకొనుచు లేచెఁ గిదుకుచున్.

ఉ. లేచి యతండు గాంచెఁ గద లీమ్ప్రదులోరయయుగున్ హసన్ముఖున్
మేచకమేఘమూర్తి దిన మిత్రసమాసమరత్నభూషితున్
లోచనధిక్కృతాంబుజదళున్ శతకోటిసుధాకరాగ్నిరు
గ్వీచిపరంపరోపమన వీనతనుప్రభు యాదవప్రభున్. ౨౯౮

వ. ఇట్లు సచ్చిదానందకందం బగునచ్చిందంబుదాల్పు ననల్పాద్భుతరస నిర్మ
గ్నుండై కనుంగొనుచు నవతీర్ణగర్వవిద్యాధరుండై యవ్విద్యాధరుం డిట్లని
వితర్కించు. ౨౯౯

శా. ఈపుంగ్రామణి యెవ్వఁడొక్కొ హరి యిట్లొప్పొందె సందేహమే
లా పద్మాక్షుఁడె యంచు లోఁదెలిసి యోలక్ష్మీశ! యేఁ దున్నివా
సోపర్యభ్రిచరద్విమానగుఁడనై యుండుండి యిష్టాక్క యు
త్తోక్కపోదగుఁడు గూల్పఁ గ్రొవ్వఱిగి కన్ గొంటిన్ సురేశున్ నినున్.

క. నిర్మదులకుఁదోఁచినక్రియ, దుర్మదులకుఁ దోఁప వీవె దుట ననుచు మనో
మ్మర్మరవాపిఁ బడి మనుజ,ధర్మభటుఁడు తత్పదద్వితయకృతమతియై. ౩౦౧

స్రగ్ధర. పాపోహం పాపకోప ప్రిణమతిరహం బాలిశోహం సుధీదు
ష్ప్రాపోహం దుష్టకష్ట ప్రకృతిరహ మహం పామరాత్మాస్మి నానా
రూపద్రోహాపచారా ర్పదనిహితధియం క్రోధినం మా మవ త్వ
చ్ఛ్రీపాదాసక్తియుక్తం శివకర!యనుచున్ జిష్ణుఁ గృష్ణున్ నుతించెన్. ౩౦౨

వ. అని మఱియును. 303

చ. యదుకులనాథ! యిప్పు డితఁ డాగ్రహవృత్తి నొనర్చు నిగ్రహం
బిదియు ననుగ్రహంబయగు నింద్రియరాజికి బంటు సేయు శ్రీ

---

కల్ప=పాములుపొమ్ములుగాఁగలభైరవుఁడా. పురే=బళీ. ఉడివోయెన్=ఉడిగిపోయెను. గాఢాగః
కర్మతుఁడు=ఎచ్చైచ్చన తప్పుపనిచేసినవాఁడు ॥౨౯౬॥ మందల=మనుదల—జీవముతో. లావు=బలము.
అగలినన్=పెల్లగిలఁగా_నశింపఁగా. కిదుకుచున్=బాధచేమూలుఁగుచు ॥ ౨౯౭ ॥ మేచకమేఘ=
నీలమేఘమువంటి ॥ ౨౯౮ ॥ కందము=దుంప. చిందంబు దాల్పు = శంఖమును ధరించినవాఁడు _
కృష్ణుఁడు. నిర్మగ్నుఁడు=మునిఁగినవాఁడు. అవతీర్ణ=దిగిన_పోయిన ॥ ౨౯౯ ॥ పుంగ్రామణి=పురుష
శ్రేష్ఠుఁడు. అభ్రిచరత్ _ ఆకాశమునందుఁ దిరుగుచున్న ॥ 300 ॥ మర్మరవాపిన్=మమ్మబావి
యందు ॥ ౩౦౧ ॥ సుధీదుష్ప్రాపః=విద్వాంసులకుఁ బొందరానివాఁడను. పామరాత్మాస్మి=మూఢ
మనసు గలవాఁడనైతిని. మామవ=నన్ను రక్షింపుము ॥ ౩౦౨ ॥ 303 ॥ అడుగుమానిసి=పాదసే

మదమున నెంచి నీయడుగు మానిసిగా ననుఁ జేసెఁ గాన సం
పదగలగర్వి నిర్మముని మాడ్కి నినుంగని కొల్వఁ జాలునే. ౩౦౪

క. మూఢుఁడ ననుఁ బ్రోవు మహ ద్రీక్షకు నీకజొరక నామతి వెలయుత దయా
గాఢత్వాజ్ఞవిమానా, రూఢుఁడనై జగములం దిరుగువాఁడ హరీ! ౩౦౫

చ. సురసదనంబునందయిన క్షోణితలంబునయందునైన భీ
కరనిరయంబునందయినఁ గర్మవశంబుననుండు నా మదిం
బొరయును గాతఁ గాతరస ముద్ధరణోచితకార్యధుర్య త్వ
చ్చరణసరోరుహద్వితయ సంతతసంస్మరణానుషంగముల్. ౩౦౬

క. అనివలగొని యాయదునం, దను నిరుపమదివ్యరూప దర్శనమున లోఁ
దనియుచుఁ జొక్కుచు మ్రొక్కుచుఁ, జని యెన్విద్యాధరుండుశతధృతితనయా!

క. మధుమథను నాజ్ఞ నేవం, విధమహిమఁ దలిర్చు క్షేత్ర విభుభైరవదే
వు ధరాధోభువనస్వ, ర్గధామనుతుఁ గాంచి విదపఁ గనఁదగుఁ గృష్ణా.

శా. సాహిత్యాపరకాళిదాస హరిపూజాగౌరవవ్యాస గం
గాహల్లోహలవాగ్విలాస రిపువర్గత్రాసకృత్ప్రాస కాం
తాహర్షావహదృగ్విలాస శ్రుతిపద్యాయోజితాభ్యాస హే
మాహార్యోపమధైర్యధుర్యపదవి న్యాసా విధేయారసా! ౩౦౯

క. షడ్దర్శనపారగ కవి, రాద్ధాంతానుగ్రహాభిరమ్య సుధాంధ
ద్విడ్దంతిసింహ మహిత, త్విడ్దశశతకిరణ హృదయధృతహరిచరణా! ౩౧౦

మాలిని. వినయనయసముద్రా విశ్రుతోల్లాసముద్రా
జననుతగుణజాలా శత్రురాణ్మీనజాలా
ధనదనదసమానా ధన్యధీభాసమానా
ఘనపురినరాగా కావ్యదత్తానురాగా! ౩౧౧

గద్యము. ఇది శ్రీమత్పరమపదనాథ నిరవధికకృపాపరిపాకపరిచిత సరసకవితా
సనాథ రామకృష్ణకవినాథప్రణీతంబైన పాండురంగమాహాత్మ్యం బను
పరమభాగవత చరిత్రంబునందుఁ జతుర్థాశ్వాసము.

---

వకుఁడు. నిర్మమునిమాడ్కిన్=మమతలేనివాని విధమున ॥ ౩౦౪ ॥ మహద్రీక్షకున్=పెద్దల యవమానమునకు॥ ౩౦౫॥ కాతర=భయపడినవారియొక్క. అనుషంగములు=కూడినవి॥ ౩౦౬॥ ౩౦౭ ॥ ౩౦౮॥ హల్లోహల=ప్రవాహమువంటి॥ ౩౦౯॥ మహితత్విడ్దశశతకిరణ=అధిక తేజస్సుచేతసూర్యుఁడా ॥ ౩౧౦ ॥

శ్రీకృష్ణాయనమః.

# పాండురంగమాహాత్మ్యము.

## పంచమాశ్వాసము.

క. శ్రీషణ్ముఖజననీ మహి, భామా నిభ నిజవధూ శు భప్రదలీలా
భూషిత కల్యాణోజ్జ్వల, వేషా రామానుజేంద్ర వేదాద్రీశా! ౧

వ. ఆకర్ణింపుము. ౨

క. అని యీక్రియ నానతియి, చ్చినహెచ్చిన సంతసంబు చిత్తముతోడం
బెనఁగొన ననిమిషముని యి, ట్లను నజ్జగదేకనిధికిఁ బ్రాంజలియగుచున్. ౩

తే. క్షేత్రమాహాత్మ్యమును మహాక్షేత్రపాల, దివ్యచరితంబునందుండు దేవదేవు
గుణకలాపంబుఁబుండరీకునిమహిమయు, వింటిభవబంధములవీడుకొంటిదేవ!

తే. ఎన్నిద్వారంబులయ్యాయియెడవసించు, ద్వారదేవతలెందఱాస్థలమునందుఁ
బ్రబలుక్షేత్రాదిపుణ్యవైభవముపేర, నొండుగలదేనియానతియిండుమఱియు

క. అని నారదుండు ప్రార్థిం, చినఁ బద్మదళాయతాక్షుఁ జిత్తాంభోజం
బున నిల్పి యతనిఁ బలుకున్, మనసిజమర్దనుఁడు మధుర మధురారభటిన్.

క. సుఖమాలికాతరంగిణి, సఖియై భీమరథిఁ గూడి చను నెచ్చట స
త్సుఖకర మచ్చోటు చతు, ర్ముఖముఖనత మాదితీర్థ మనునై వెలయున్. ౭

క. పూర్వద్వారంబగునది, దర్వీకరసార్వభౌమ తల్పునగరికిన్
సర్వసుపర్వార్చితపద, గీర్వనిత వసించు నచటఁ గృష్ణునియాజ్ఞన్. ౮

క. శ్రీమహితము సిద్ధేశ్వర, నామాంక మపంకజలస నాథము లక్ష్మీ
కాముకనిహితము ఖచరా, లీమాన్యము నై నకంభు లింగముతోడన్. ౯

లఘుటీక:—కల్యాణోజ్జ్వల=చొక్కపు బంగారుచే వెలుఁగునట్టి ॥ ౧॥౨॥౩॥౪ ॥ ఒండు = ఇతరము ॥ ౫ ॥ అతనిన్=అతనితో. మధురమధుర = మిక్కిలిమధురమైన ॥ ౬ ॥ ౭ ॥ దర్వీకర సార్వభౌమతల్పు=విష్ణునియొక్క. గీర్వనిత=సరస్వతి ॥ ౮ ॥ సనాథము = కూడుకొన్నది. లక్ష్మీకాముకనిహితము=విష్ణునిచేత ఉంచఁబడినది. ఖచరాలీ=దేవతాసమూహముచేత ॥ ౯ ॥ అగమ్య=

క. తగుదక్షిణంపువాకిలి, నగధరునగరునకు భీమ నందనపొందుం
దగిలినయదియచ్చోటన, యగమ్యపుష్పావతీమహానది యనఘా ! ౧౦

క. దానస్నానాదిహృతా, జ్ఞానానలదాహమైన సంగమతీర్థం
బానెలవున విఖ్యాతం, బైనది సుర లుండుదురు శిలాకృతి నందుర్. ౧౧

వ. అది భవదీయాశ్రమంబగుట నీ వెఱుంగుదు వదియునుంగాక. ౧౨

చ. కలఁ డొకబోయ ిన్నికట కాననభూమి నతండు విల్లున
మ్ములు ధరియించి కల్మషస మూహము లెత్తినమేనుబోలెఁ బే
రలుకవహించెనేని హృద యంబుగలంగు ధరాధరస్థలీ
నిలయవసత్కిరీంద్రులకు నిక్కము తక్కుమృగంబు లోర్చునే. ౧౩

చ. అడవికి వేఁటమై నరిగి యాతఁ డొకానొకనా డొకింతయున్
మెడమలఁగింపలేక తన మేపొడ లొండును రెండు నేకమై
పొడమఁగ బీదకన్నువడి బూడిదపండునుబోలె బూఁదుపా
రెడు నొక దుప్పికిం గవియఁ బ్రేలి భయజ్వరతప్తచిత్తమై. ౧౪

తే. ఆచమూరువుయూథంబుఁద్రోచిపఱచె, వింటనమ్మేర్చిబోయవెన్వెంటఁదఱుమ
లోలజిహ్వాకరాళవి శాలముఖత, నోలి భీతేందుమృగశాబ మోయనంగ.

ఉ. ఆరురు వీగతిం బఱచి యగ్రమహిం బడి లేచి వెండియున్
భూరిరయంబునం జని వపుర్వ్యథ సంగమతీర్థతీరవి
స్ఫారలతానికుంజములు బల్విడి దూఱునెడం గిరాతుఁడున్
క్రూరశిలీముఖంబు దొడిగుండియగాఁడఁగ నేసె నేసినన్. ౧౬

సీ. ఆశరముఖనిభం బాశరమటుదాఁకఁ, బవనాభిహతిఁ దూలు బంధుజీవ
కుంజంబు పువ్వులఁ గూలించువిధమున, నవనవక్షతజ బిందువులు దొరఁగఁ
జేయుచు వివృతాస్య సీమఁ బ్రాణానిల, ప్రస్థానపటహోగ్ర రవమనంగ
నార్తనాదముగ్రమ్మ నది యేటితెలినీటి, తెమలునునుఱికి దేదీప్యమాన

---

పొందశక్యముకానిది ॥ ౧౦॥౧౧॥౧౨ ॥ నికట=సమీపమునందలి. పేరలుక=అధికకోపము ॥ ౧౩ ॥ మలఁగింపన్=త్రిప్ప. బీదకన్ను=భయదృష్టి. బూఁదుపారెడు = బూఁజుపట్టినట్టు కానవచ్చెడు. భయజ్వర=భయమువలని తాపముచేత ॥ ౧౪ ॥ చమూరువు=దుప్పి. తోlచి=మీాఱి. ఏర్చి=కూర్చి. లోల=చలించెడి. కరాళ=భయంకరమైన. శాబము=పిల్ల ॥ ౧౫ ॥ రురువు=దుప్పి. అగ్ర=ఎదుట. వపుర్వ్యథన్=దేహబాధచేత. విస్ఫార=మిక్కిలిగొప్పవైన. తొడి=తొడిగి ॥ ౧౬ ॥ ఆశరముఖని భంబు=అగ్నిముఖమునుబోలినది. కుంజము=చెట్టు. కూలించు=రాల్చు. నవనవక్షతజ=క్రొత్తక్రొత్త నెత్తురులయొక్క. వివృత=తెఱవఁబడిన. ప్రస్థానపటహ=ప్రయాణకాలమునందలి తప్పెటయొక్క.

తే. హాటకవిమానమెక్కి విద్యాధరేంద్రుఁ, డగుచు లావణ్యపుష్పాస్త్రుఁ డగుచుఁ
జస్ద్రి, సాన్ద్రితనుకాన్తి యగుచు నతీన్ద్రమహిమ, గగనమునకేగె దొలుమేను కా

శా. చిత్తం బద్భుతమంద నమ్మృగవధాజీవుండు లోలోనఁ ద [నేఁబడదు
ద్వృత్తంబుల్ బలుమాఱు మెచ్చి నిజదుర్వృత్తిన్ విసర్జించుచున్
దత్తీర్థాంబువు నాడి క్రోలి విగతాతంకాత్ముఁడై శుద్ధి ద
ళ్కొత్తన్ ముక్తశరీరుఁడై కనియె దివ్యుల్ మెచ్చ నుచ్చస్థితిన్. ౧౮

క. కావునఁ దత్తీర్థంబున, నేవలనఁ బరాసు లగు విహీనమతులకున్
గైవల్యసిద్ధి యగు నన, నీవలె నతిశుద్ధమతుల నేటికి నెన్నన్. ౧౯

సీ. సంధ్యలు మూఁట నిచ్చ నివాళు లిచ్చుచు, బిరుదాంకమాలికల్ పేరుకొనుచు
లోఁచూపు దివుట నాలోకించి చొక్కుచుఁ, బులకాశ్రుగాద్గద్యములఁ బొరయుచు
శ్రుతులెట్టులట్ల సంస్తుతు లాచరించుచు, వీనులఁ దత్కథా వితతి వినుచుఁ
గరతాళగతులఁ జొక్కాటముగా నాడుచు, నావేళ మూర్ఛలనలఁతఁ గనుచు

తే. విష్ణుసేవింతు రచట నవ్విబుధవల్ల, భాజనంబులు తత్కృపాభాజనంబు
లమ్మహాక్రీడనస్థలి నాచరించె, లంఘనాక్రీడనము దొల్లి లచ్చిమగఁడు. ౨౦

మ. విను మున్ శౌరికి నోడి సంగమమరుద్విద్వేషి యెచ్చోటికో
చని నెండిం జనుదెంచి యచ్చట శిలాసంఛన్న దేహంబుతో
డ నిలాగర్భమునందు దాఁగఁ గని గాఢక్రోధుఁడై దేవకీ
తనయుం డాశిలఁ గ్రొచ్చి వైచి మెదిపెన్ దద్దైత్యుఁ జూర్ణంబుగన్. ౨౧

క. ఉవ్విలుతుతండ్రి యచ్చట, మువ్వంకమురువున మురళి మ్రోయించె మనం
బువ్విళులూరఁగ శ్రుతులకు, నవ్విధము తదీయపదయుగాంకము దెలుపన్.

క. మహి నేవంవిధచిత్రా, వహ మగు నద్దక్షిణంపు వాకిట మహిమల్
బహుముఖముల వినుతింపఁగ, నహిపతియు నజాలఁ డనిన నన్యులవశమే ?

---

తెమలునన్ = చలనమునందు-ప్రవాహమునందు. అతీంద్రమహిమన్ = ఇంద్రుని మహిమనుమీఱిన మహిమతో ॥ ౧౭ ॥ మృగవధాజీవుండు = బోయవాఁడు. వృత్తంబున్ = వృత్తిని. ఆడి = స్నానము చేసి. గతాతంకాత్ముండు = పోయిన భయముతోడి మనసుగలవాఁడు. కనియెన్ = పొందెను. ఉచ్చ = ఉన్నతమైన ॥ ౧౮॥౧౯ ॥ నిచ్చ = ఎల్లప్పుడు. నివాళులు = ఆరతులు. తివుటన్ = పూనికతో. గాద్గద్యము = గద్గదభావము = గొంతునుండి మాటవెడలని. పొరయు = పొందు. చొక్కాటము = స్వచ్ఛము ॥ ౨౦ ॥ మరుద్విద్వేషి = దేవశత్రువు = రాక్షసుఁడు. గ్రొచ్చి = తొలిచి = పగులఁగొట్టి. మెదిపెన్ = నలఁపెను ॥ ౨౧ ॥ ఉవ్విళులూరఁగన్ = తమకపడఁగా ॥ ౨౨ ॥ చిత్రావహము = వింతనుబుట్టించునది ॥

సీ. తనకటాక్షములు సంతానచింతారత్న, నిర్మాణ పరమాణు నికరమనఁగఁ
దనవిలాసంబు మద్వైరిశంబర నిషూ, దనపాలితపురఃప తాకయనఁగఁ
దనమనస్సరసి సంతతచిదానందవై, భవమరాళము కున్కి పట్టనఁగఁ
దనప్రసాదంబు భక్తవరేణ్యదుర్గతి, త్రాశనోచితచంద్ర గోళి యనఁగ
తే. వెలయు నేదేవి యాదేవి విద్రుమద్రు, కద్రునిర్నిద్రతనుకాంతి భద్రపరమ
మాయభువనేశ్వరి వసింప మధువిరోధి, ధామమునఁగల్గు పశ్చిమద్వారమమరు.
ఉ. పోర్మహిషున్ నిజాంఘ్రిగల బొట్టనవ్రేల్తుదమట్టిపట్టి మున్
పేర్మిఁ దదంగమున్ మెదిపి పెట్టిన నెత్తురుబొట్టుఁబోలె జ్యో
తిర్మయవీక్షణాంబలిక దేహమునంగల దుర్గ స్వర్గదన్
వార్మణధారి నుత్తరపు వాకిట నిల్పినవాఁడు కాపుగన్. ౨౪
క. తరణియు భైమియును బర, స్పర మచ్చటఁగూడి నిగుడఁ బావన మగుత
త్సరిదంబువునం దాడిన, నరునకు నవ్వారి చరణ నఖమున వెడలున్. ౨౫
క. ఎవ్వఁడు వ్యాధిగ్రస్తుం, డెవ్వఁడు భయవిహ్వలాత్ముఁ డెవ్వం డధముం
డవ్వాఁ డచ్చటి దుర్గం, బువ్వులఁ బూజించి యిష్ట భోగములందున్. ౨౬
వ. ఇన్నాలుగునంతర్ద్వారంబు లింక బహిర్ద్వారంబులప్రకారం బాకర్ణింపుమని గోకర్ణకుణ్డలుండాకర్ణనవశంవదాశయుం డగు కుశేశయాసనసూతికిట్లనియె.
సీ. కలికురక్కసుని నొక్కరుని జిక్కఁ ద్రొక్కి, భద్రకాళిక యొందుఁ బ్రస్ఫురించు
నిందుండు విఘమున నెందు నే వసియింతు, నలికేకకోటీశ్వరాహ్వయమునఁ
బ్రవహించు నెందు నభ్రంకషోర్మ్మిలఁ బుణ్య, జలయను జలధియోషామతల్లి
నతజగత్త్రితయ శ్రీనారాయణీదేవి, వర్తించు నెందేని వార్తకెక్కి
తే. యట్టి యట్టాలతోరణ హట్టకుట్టి, మస్ఫురద్గోపురైడూక మణిమయోరు
హర్మ్యరమ్యంబు కరవీర మనుపురంబు, పశ్చిమ ద్వారమగుజగత్పతినగరికి.

---

౨౩ ॥ సంతాన=కల్పవృక్షము. శంబరనిషూదన=మన్మథునిచేత. పురఃపతాక = ఎదుటిటెక్కెము. గోళి=గోళము=బింబము. విద్రుమద్రుకద్రునిర్నిద్ర = పగడపుఁజెట్టుయొక్క గోరోజనపుఁజాయచేత పోలని ॥ ౨౪ ॥ పట్టి=త్రొక్కి. అలికదేశమునన్=నొసటియందు. వార్మణధారి= కవచసమూహములను ధరించినవాఁడు_విష్ణుఁడు ॥ ౨౫ ॥ నిగుడన్=ప్రవహింపఁగా. సరిదంబువునందున్=ఏటినీటియందు ॥ ౨౬ ॥ ౨౭ ॥ ఆకర్ణనవశంవదాశయుండు=వినుటయం దాసక్తమయిన మనసుగలవాఁడు. కుశేశయాసన సూతికిన్=బ్రహ్మకొడుకునకు ॥ ౨౮ ॥ కలికు=కలినుఁడైన. అలి=కొలఁత. అభ్రంకషోర్మ్మిలన్=ఆకాశము నొరయుచున్న యలలచేత. జలధియోష=నది. అట్టాల=బురుజు. హట్ట = అంగడివీధి. కుట్టిమ=తాలికట్టడపునేల. ఏడూక = లోపలయెముకలు పేర్చి మెత్తినగోడ ॥ ౨౯ ॥

తే. క్షోణిఁ గృష్ణానదీతీర శూర్పలాఖ్య, తీర్థరాజాధివాసనై తీర్థచరణ
ధామమణిసౌధదక్షిణ ద్వారమేను,జాగరూకతఁ బాలింతు యోగివర్య! ౩౦

శా. గర్వోద్రిక్తతరంగసంఘముల వీఁకన్ బుష్కరిణ్యాపగా
వార్వేణుల్ దనయుత్తరంపు దెసఁ బర్వంగా గదాపాణినై
సర్వాలంకృతశాలినై వెలయుఁ గం సధ్వంసనాగారరా
ట్పూర్వద్వారమునం ద్రివిక్రముఁడునై పొంగన్ బయోదచ్ఛవిన్. ౩౧

క. కరనఖరదళితరక్షః, పరివృఢవక్షోరణాంబు పరిచితదీప్తా
త్యురుకేసరదోహదుఁ డగు, నరకేసరి యుత్తరంబు న గవనిఁగాచున్. ౩౨

క. లోనాలుగు వెలినాలుగు, నైన మహాద్వారభూము లపవర్గశ్రీ
నీనఁగ నీనగరాడ్వర, శ్రీనగరగణితవిభూతిఁ జెందు మునీంద్రా! ౩౩

వ. అని మఱియు నక్కుఱియ వేల్పు ననల్పగుణప్రకటనపరుండై హరుండిట్లనియె.

❀ ధర్మరాజు తమ్ములతోఁగూడ పాండురంగక్షేత్రమునకుఁ బోయినకథ ❀

చ. అభిముఖతత్త్వశాలి సుకృతాఢ్యుఁడు నా చతురాస్యమానస
ప్రభవుఁడు శిష్యసంఘముల పారము గొల్వఁగఁ దొల్లి యొక్క నా
డిభపురనాథుఁ గౌరవకులేశ్వరు ధర్మజుఁ గానఁబోవ భూ
విభుఁ డతఁ డాతనిం దెలిచె వేయివిధంబుల సాధుపూజలన్. ౩౪

క. అహితాహితకారణవి, గ్రహులును సదను గ్రహప్రగల్భులు నగు నా
గహనగృహవాసచర్యా, మహితతపోధనులసంగమముపొగడొందెన్. ౩౫

ఉ. తమ్ములుఁ దాను నప్పుడు పృథాప్రథమాత్మజుఁ డంతరంగముం
గ్రమ్మిన శోకవహ్నిహతిఁ గందుచుఁ గేలు మొగిడ్చి బ్రహ్మచి
త్తమ్మునఁ గల్గు సంయమివతంసముఁ బల్కు ఖరాంశుతాపత
ప్తమ్మగు తేనియం జినుకు తమ్ములఁబోల సబాష్పనేత్రముల్. ౩౬

క. ఏ భీరువనై వేఁడెద, నోభద్రప్రద! ప్రసాద మొసఁగుము నాకున్
మీభావంబునఁ బోఁడమని, దీభువనత్రయమునందు నింతయుఁ గలదే. ౩౭

---

తీర్థచరణ=విష్ణుదేవునియొక్క ॥ ౩౦ ॥ వీఁకన్=నిక్కుచేత. వార్వేణులు=నీటిపాయలు. పర్వఁగాన్=పాఱఁగా. అగారరాట్-దొడ్డనగరియొక్క. పయోదచ్ఛవిన్=మబ్బుచాయతో ॥ ౩౧ ॥ రక్షఃపరివృఢ = హిరణ్యకశిపుని. దోహదుఁడు = ఎరువువేయువాఁడు ॥ ౩౨ ॥ అపవర్గశ్రీన్= మోక్షసంపదను ॥ ౩౩ ॥ ౩౪ ॥ తెలిచెన్ = సంతోషపెట్టెను ॥ ౩౫ ॥ ౩౬ ॥ చినుకు = కార్చు

శా. చింతాకంతయు వెన్కడియ్యక కురుక్షేత్రంబునం బాపసం
క్రాంతస్వాంతుఁడనై సుహృత్సుతపితృభ్రాత్రాదులం జంపి య
త్యంతద్రోహ మొనర్చియుం దిరిగెదన్ బ్రాణంబుతో మత్సముం
డంతర్వాణివతంస! యెవ్వఁడు గలం? డాహా! వితర్కింపఁగన్. ౩౯

క. వంగడపు వెదురుఁ గోపపు, టింగలమున నేర్చి కనిన యీనిరి నిండా
సంగతిఁ బొగచూరెనుద, ద్భంగురమౌక్తికము దీనఁ బసిమియుఁ గలదే. ౪౦

మ. అసిధారావధితాత్మబంధుభుజమధ్యస్వైరనిర్యద్వసన్
మసనైపుట్టిన యమ్మహాదురితమున్ మన్నెట్టియున్ వాజిమే
ధసమిద్ధానలభూతిచే నుసిమియున్ దప్పింపలేనైతి నీ
కసటెప్పాటఁ దొలంగు నెట్టులగుదున్ గల్యాణకల్యాత్ముఁడన్. ౪౧

క. కర్మము కర్మాంతరహృ, త్కర్మత మగుదానిఁబూనఁ గానము నిరయాం
తర్మజ్జనాభిముఖు నీ, దుర్మదుఁ బడనీక నిలుపు ద్రుహిణప్రభవా! ౪౨

క. మావంటివారలకుఁ బా, పావిలదృక్కులకు ధర్మ మారయని యస
ద్భావులకు భవాదృశు లగు, శ్రీవైష్ణవవరులె దిక్కు చిత్పూర్ణమతీ! ౪౩

సీ. అని యుధిష్ఠిరుఁడు పల్కిన సనందనుఁ డాత్మ, నలరి యిట్లనునమ్మహాత్ముతోడ
నీపాల శాంబరీగోపాలుఁడు గలాఁడు, పరమవైష్ణవధర్మపరత మెలఁగు
నీమోముగనుఁగొన్న నిఖిలాఘములుఁ బోవు, సెకదాఁకియడఁగు తూలికలలీల
హరిభక్తియనుగంగ కడ్డమే కలుషపు, టినుకచేఁ గట్టిన యసదుఁగట్ట
తే. దురితరాశిమునింగి శ్రీవరునిభటుఁడు, తోయపద్మదళచ్ఛాయఁ బూయఁబడఁడు
రేయుఁబగలు వృథాచింత సేయనీవు, ప్రాకృతుండవె భూలోకపాలవినుత! ౪౪

ఉ. కర్తవుగావు హర్తవును గా వభిరక్షివిగావు నీవు స
త్కీర్తిధురీణ! యింతకును గృష్ణుఁడె మూలముగాన పుణ్యవి

---

నట్టి ॥ ౩౭ ॥ ౩౮ ॥ సంక్రాంత=పొందిన. అంతర్వాణివతంస = పండితశ్రేష్ఠుఁడా ॥ ౩౯ ॥ వంగడము = వంశము. ఇంగలము = అగ్ని. ఏర్చి= కాల్చి ॥ ౪౦ ॥ వధిత = చంపఁబడిన. స్వైర నిర్యద్వసన్=యథేచ్ఛముగా కాఱుచున్న ద్రవరూపమైన క్రొవ్వుచేత. మసనై=ముటికిరియై. ఉసిమియున్=తోమియు. కసటు=పాపము. కల్య=సంపాదింపఁబడిన ॥ ౪౧ ॥ నిరయాంతర్మజ్జనాభిముఖున్=నరకములోపలమునుఁగుటకు అభిముఖుని. ద్రుహిణప్రభవా=బ్రహ్మకొడుకా ॥ ౪౨ ॥ ఆవిల =కలఁగిన. చిత్పూర్ణమతీ = జ్ఞానముచేతనిండుకొన్న బుద్ధిగలవాఁడా ॥ ౪౩ ॥ కలాఁడు = కలఁడు, తూలికలలీలన్ = దూదిరేకులవిధమున. అసదు = అల్పమైన. తోయపద్మదళచ్ఛాయన్ =

స్ఫూర్తియుఁ బాపవైకృతముఁ బూరుషుఁ బొందునె యస్వతంత్రతన్
వర్తిలుచున్కిఁ బ్రేరణకు వచ్చునె పాకగుణాగుణావలుల్. ౪౫

క. పరులకతంబుననేనియు, హరి నొకపరి దలఁప భద్రమగు ఖలులకుఁ ద
న్నిరతస్మరణాచరణ, స్ఫురణాఢ్యులు నిత్యపదవిఁ బొందుట యరుదే. ౪౬

తే. ధారుణీవల్లభులకంటెఁ దక్కుచోట, నశ్వమేధంబునిష్ఫలం బగువిధమున
నర్థవంతంబుగాదుసత్యాకళత్రు, సేవకిలఁబూనిసేయు ప్రాచితముశతము. ౪౭

క. భ్రాతృవధపితృవధాదుల, పాతకములు రావు విష్ణు పదభక్తులకున్
ధైతేయసూను లిరువుర, యేతద్వ్యవహారసాక్షు లిభపురనాథా! ౪౮

శా. ఆకంసారిప్రశంస నీమది నుదీర్ణావిష్కృతిం దాల్పఁ బె
ల్లాకంపించి తొలంగుగాక నిను డాయన్ నేర్చునే పాతకా
నీకంబుల్ రవిఁగప్పఁ జీఁకటుల నెందేఁ గంటిమే వింటిమే
క్ష్మాకాంతాధిప! లోకసంగ్రహమనీషం జేసి తీప్రశ్నమున్. ౪౯

క. అటులేనియుఁ జెప్పెద నీ, పొటిపొటి తలపోఁతలెల్లఁ బోవనడువు మా
రటముడుగు నెమ్మనమునొ, క్కటిగా నొనరించి గట్టిగా వినుమధిపా! ౫౦

సీ. తలపించునే దేవు తనువునం దఖిలాండములు పయోనిధిభంగ విలసనముల
నే దేవుమహిమకు నింతయు దంతీంద్ర, పదమగ్నతదితర పదసమాన
మే దేవునిజమాయ నెవ్వాఁడుఁ గడచన, నేరఁడు తనమేని నీడపోలె
నే దేవుఁ డింతకు నింతయై యంతకు, నంతయై గుఱిలేక యతిశయిల్లు

తే. నాజగత్కర్త దుష్టసంహరణబుద్ధి, విట్ఠలుండన ధర నుద్భవించె క్షేత్ర
పాలుఁడునుబుండరీకుండుబలసికొలువ, నుండుతీర్థంబునకునేగుముదయకాంక్ష

క. ఏగి మహానదివారిం, దోఁగి హరిం గొలువు నిఖిల దురితశ్రేణుల్
కాఁగిన యినుమామిష మని, మూఁగికొనినమక్షికాసమూహంబులగున్.

తే. బ్రాహ్మణునిఁ దల్లిఁదండ్రిని భ్రాతదాత, గురుజనంబులఁహింసించిక్రూరుడైన
శీధుపానాభిరతుఁడు దుశ్శీలుఁడైన, పాండురంగాధిపతిఁగాంచి పరమునొందు

---

నీటిలోనితామరపాకురీతిని || ౪౪ || ౪౫ || ౪౬ || ప్రాచితము=ప్రాయశ్చిత్తము || ౪౭ || ౪౮ || ఉదీర్ణావిష్కృతిన్ = మిక్కిలివెల్లడిగా. పెల్లాకంపించి = అత్యంతమువణఁకి || ౪౯ || పొటిపొటితలపోఁతలు = కొంచెపు ఆలోచనలు. పోవనడువుము = పోఁగొట్టుము || ౫౦ || విలసనములన్ =ప్రకాశములచేత. మగ్న= అణఁగిన. కడచనన్ = మీఱను. గుఱి=మేర. ఉదయకాంక్షన్ = గౌరవాభిలాషచేత || ౫౧ || తోఁగి = స్నానముచేసి. ఆమిషము = మాంసము. మూఁగికొనిన=చుట్టుకొన్న ||౫౨|| శీధు = చెఱకుపాలచే వండిన సారాయిని ||౫౩|| తమ్మగమి=తమ్ముల

క. నా వీని ధౌమ్యాదిమహీ, దైవతములుఁదమ్ముగమియుఁ దనుఁగొలువంగ శో
కావహామతి భవదగ్రజు, దీవనగొని చనియె నయ్యధిష్ఠిసుఁ దెలమిన్. ౫౪

ఉ. ఆకుముదాప్తవంశవిభుఁ డంతఁ గనుంగొనియెన్ వసుంధరా
నాకము నాకుపాకశుక నాసశుకాదికసన్మునిస్తుత
శ్లోకము శోకకర్దమవి శోషణకోకహితప్రభాసము
త్సేకముఁ దాపవహ్నిజల శీకర సేకముఁ బౌండరీకమున్. ౫౫

ల. కంబువునరాళచికురంబులుగటీకృతకరాంబురుహయుగ్మమళికాంబకమునగ్న
త్వంబుఁబసిఁరొప్ప వెదురంబెరగునుడ్డపాడలుంబదములంబలుకు చుంబొదలు
మువ్వల్, జంబుఫలజిద్రుచిభరంబుమకరాకృతిగరంబమరుగుణ్డలములుంబరగ
బక్షాచ్, బ్దంబులదలిప్పనిసువుంబతిభజించెద్రిజగంబులకురోహణనగంబగునగ

క. పుష్కరిణిఁదీర్థమాడియు,బుష్కరదళనయనుమూర్తిబూజించియునా [ణ్యున్
విష్కృతశుభోన్నతియునతి,నిష్కల్మషమతియునయ్యెన్నృపతిమునిపతీ ! ౫౬

క. దానంబునఁ బితృగురుసఖి, దానంబునసైనకీడు దలఁగి హరికృపా
దానంబు నందెఁ గురుపతి, దానం బునరుద్భవంబు దానికిఁ గలదే. ౫౭

తే. ఆయతీంద్రుండు బుత్విజుం డయ్యెవేది, యయ్యెశ్రీపౌండరీకమహాస్థలంబు
పాపపశువుల విశసించి భక్తిచరువు,పాండురంగాగ్నిలో వేల్చెపాండవునకు

వ. ఇవ్విధంబున నవ్విధువంశవతంసంబు కంసమర్దనసాక్షాత్కారదర్శనంబునిజ
దురితకర్శనంబు నాపాదించుటఁ గృతార్థుండై పౌండరీకవాస్తవ్యు లగుపుండ
రీకాదివిద్వత్పుండరీకంబుల నొండొండఁ గీర్తించుచుం బ్రవర్తిత కతిపయ
దివసప్రచారుండై యచ్చటనుండి నిజానుజద్విజసనాథంబుగాగజపురంబున
కుం జనుదెంచి సుఖంబుండె నట్లగుటంజేసి. ౬౦

సమూహము॥౫౩॥౫౪॥కుముదాప్త=చంద్రుని. నాకుపాక=వాల్మీకి.శ్లోకము=శ్లాఘ్యము. విశోషణ=
ఎండించునట్టి. కోకహితప్రభా=సూర్యప్రకాశముచేత. సముత్సేకము=హెచ్చినది. సేకము=తడుపు
టగలది ॥ ౫౫ ॥ కంబువు=శంఖము.చికురంబులు = తలవెండ్రుకలు. నగ్నత్వంబు=దిగంబరత్వము.
పసిఁడి=ఆవులమందను. ఁొప్పు=తోలునట్టి. ఉడ్డ=నాలుగు. రుచిభరంబు=ప్రకాశాతిశయము. నిసు
వున్=శిశువును. రోహణనగంబు=రత్న పర్వతము ॥ ౫౬ ॥ పుష్కరదళ = తామర రేకులవంటి.
ఆవిష్కృత=ప్రసిద్ధమయిన ॥ ౫౭ ॥ దానంబునన్=ఈవిచేత. ఉద్భవంబు = జన్మము. దానికిన్=
దానమిచ్చువానికి ॥ ౫౮ ॥ విశసించి=నఱకి. చరువు=హోమమునందు వేల్చుటకైవండినయన్నము॥
౫౯ ॥ వతంసంబు=సిగనుధరించెడి పువ్వుచెండు-శ్రేష్ఠుఁడు, సాక్షాత్కార=ప్రత్యక్షమైన. వాస్త
వ్యులు=వాసముచేయువారు. పుండరీకంబులన్=శ్రేష్ఠులను. ప్రవర్తించి=ఉండి. ప్రచారుండు =

క. అదియె మహాఫలమని తన, హృదయంబునఁ బౌండరీకమెవ్వఁడెఱుఁగఁడా
మెదుక చను నదియు ముక్తి, ప్రదమని పెరతీర్థమునకు బహునిగమనిధీ! ౬౧

క. వాలినదప్పి వియజ్ఝర, కూలంబున నుయ్యి ద్రవ్వ కుమతి గలిగినన్
శ్రీలలనావిభుఁ డుండని, నేలయు క్షేత్రమని యరుగు నీచుఁడు గలుగున్. ౬౨

చ. మసనమునందునైనఁ బర మార్గమునంబడియైన నింటనై
న సకలగర్హితస్థలము నం బ్లవగేహమునందునైన నా
కసమున నీట నేలపయిఁ గంకటిమీఁదనునైన మానవుం
డసువులఁ బాసి నిష్కలుషుఁడై హరి దానగు నమ్మహాస్థలిన్. ౬౩

క. విను పతితుఁడైనఁ గానీ, చని తత్క్షేత్రంబునందుఁ జానోపి పున
ర్జననంబు గనఁడు గావున, జనులకు నాస్థలమునందుఁ జనుఁ దనువూడ్వన్.

ఉ. అద్రిభృదుత్తరాశ శత హస్తమితావని నున్నవాఁడు బో
ధిద్రుమమూర్తియై నృహరి తీర్థనివాసులఁ గాచువాన్కి నో
భద్రవిచార! యాభువన భర్తకు నుత్తరభాగమూఁది య
త్యుద్రసుఖోన్నతిన్ వెలయుఁ గుండలతీర్థము తీర్థరాజమై. ౬౫

క. విందుఁదనతోడుగు మణిమయ, కుండలయుగమచట దాఁచెఁ గొండగొడుగుగా
నుండు నతఁ డనఁగఁ దద్గుణ, కుండలపరిపూర్ణకర్ణ కుహరుఁడ నగుచున్.

సీ. ఆకుండలాఖ్యతీర్థాంబుధారలనాడి, నరకేసరిభజించు నరుఁడు రాజ
సూయఫలంబొందుఁ జూవె యావేలుపు, ఱేలికఁ బుట్టిరా నేనుచేతు
ల వెడల్పు నేలవా లాయంబుగాఁ గస, వూడ్చి యల్కి భజించు చున్నజనుల
చేతఁ బూజలుగొను భూతనాభూతనా, రీహర్త బహుజన శ్రేణులందు

తే. వారు ముక్తులు ధర జీవ వంతులయ్యు, వారిపితరులుత్సు ప్రత్రైవఱలువారు
వారుచరియించుచున్న యుర్వరయ తెల్ల, దీవి వారలపలుకులు దేవకథలు.

తే. అన్యకేసరి భజియింతు రమరకన్య, లెన్నఁ బెక్కండ్రు హారతు లిచ్చియిచ్చి
వారిఁ గోఁర్వక గర్వించు పాపక్షేత్ర, మండలమున సుఖస్థితి నుండ లేరు. ౬౮

---

మెలఁగువాఁడు ॥ ౬౦ ॥ మెదుక = తెలివిమాలినవాఁడు ॥ ౬౧ ॥ వియజ్ఝరకూలంబునన్ = ఆకాశగంగగట్టునందు ॥ ౬౨ ॥ మసనము=శ్మశానము. గర్హిత=నిందింపఁబడిన. ప్లవగేహము=మాలయిల్లు. కంకటి=మంచము. అసువులన్ = ప్రాణములను. నిష్కలుషుఁడు = పాపములేనివాఁడు. ॥ ౬౩ ॥ ౬౪ ॥ అద్రిభృదుత్తరాశన్=విట్ఠలదేవునికి ఉత్తరపు దిక్కునందు. బోధిద్రుమమూర్తి=రావిచెట్టు రూపముగలవాఁడు. ఊఁది=అవలంబించి ॥ ౬౫ ॥ ౬౬ ॥ వేలుపుఱేలిక=దేవతలరాజు. భూతనారీహర్త=పిశాచస్త్రీనిజంపినవాఁడు ॥ ౬౭ ॥ ౬౮ ॥ ప్రోలన్=ఎదుట. నిరయైకసంగతులు = నరక

ఉ. ఆనరసింహుక్రోల మృతులై కులకోటిసమన్వితంబుగా
మానవులూర్ధ్వలోకసుఖ మగ్నతఁ జొక్కుదు రెల్లకాలముఁ
దానికి గర్వ్యమైన యయు తత్ప్రియపుత్త్రుఁడె సాక్షి యచ్చటన్
గాని తెఱంగులన్ మెలఁగు కష్టమతుల్ నిరయైకసంగతుల్. ౧౯

ఉ. పంకజపత్రనేత్రునకుఁ బశ్చిమదిక్కున నుండు నా నమ
త్పంకరుహాసనాద్యమర పాల మహోలము పద్మతీర్థ మో
పంకవిదూర! శేలఁగల పద్మము నచ్చట దాఁచినాఁడు చ
క్రాంకుఁడు ముఁ త్రిదంష్ట్రమను జాశననాశనహేతుకంబుగన్. ౨౦

క. ఆతీర్థతనువునకు ల, క్ష్మీతరుణీవల్లభుండు జీనము వృజినో
పేతుఁడు ననవధిసవనో, ద్భూతఫలం బందు నందు బొందివిడిచినన్. ౨౧

ఉ. పాపదురాపరూప మగు పద్మసమాహ్వయతీర్థవారిలోఁ
రేపురుషుండు గ్రోలు నొకయించుక యున్నఁడునేని వానికిన్
బాపము లభ్రపుష్పములు బంధనముల్ శశశాబశృంగముల్
తాపవికారముల్ మరుజలంబులు పుట్టువు లశ్మతైలముల్. ౨౨

సుశర్మోపాఖ్యానము. పద్మతీర్థ ప్రభావము.

క. ఒకఁడు సుశర్మాఖ్యుఁడుఘాతుకుఁడుగలఁడు కల్లుద్రాగుఁ దునుము ధరామ
ర్త్యకులులనఱదలఁచుంగురు,నకుఁ గనకముదొంగిలుంది నము నజపుత్త్రా!

క. ఆవృషలీపతి యావ, జ్జీవంబుగ నంతనంతఁ జేసిన నానాం
హోవిసరంబులు పటమున,గోవలువడవ్రాసి చిత్రగుప్తుఁడు దాఁచెన్. ౨౪

శా. ఆనీచుం డొకనాడు వాఁడిమిఁ జతుర్వ్యాధాన్వితుండై పెనుం
గానం దెర్వ్వలుగట్టియేగు ప్రజలం గట్టిండియై దోఁచి నీ
రానన్ రోయుచునుండె దప్పిగొని మధ్యాహ్నతపాపాతజ
గ్లానిం దత్సమయార్తకాసరముఁబో లంజాలి నద్దిక్కులన్. ౨౫

---

మును ఒకటిసే పొందువారు ॥ ౧౯ ॥ ౨౦ ॥ వృజినోపేతుఁడును = పాపములతోఁ గూడుకొన్న వాఁడును. అనవధి=మేరలేని. బొంది=దేహము ॥ ౨౧ ॥ దురాప = పొందశక్యముగాని. శాబ=పిల్ల. మరు=నీళ్లులేనిచోటి. అశ్మతైలములు = ఱాతిలోని నూనెలు ॥ ౨౨ ॥ అఱ=ద్రోహము ॥ ౨౩ ॥ వృషలీపతి=శూద్రదానిమగఁడు. నానాంహోవిసరంబులు = అనేకములైన పాపసమూహములు. కోవలు=దొంతులు ॥ ౨౪ ॥ ఆపాతజగ్లానిన్=అంతటను పడుటవలనఁబుట్టినబాధవలని బడలికచేత. కాసరము=ఎనుఁబోతు॥౨౫॥౨౬॥౨౭॥లిఖితతత్కృతాఘలిపి=వ్రాయఁబడినవానిచేత జేయఁబడినపాప

ఆ. అంతఁబద్మతీర్థ మటవాఁడుగనియందు, జెమటవాయ మునిఁగి విమలవారిఁ
గ్రోలి రావిమొదలఁ గూర్చుండి యొకయింత, నిలిచియింటికరిగె వలయురీతి.

క. ఆవిషము మేన నూని త, దావిర్భవదఘచయంబు నసుగఁగరాచేఁ
బోవకనలసంక్రాంతమ, హావిషధర విషముకివిలయముచేయుక్రియన్. ౭౭

ఆ. అంతఁ గొంతకాల మరుగంగ మృత్యువుగోఁ, జరతనున్నయా సుశర్మకడకు
లిఖితతత్కృతాఘ లిపియైన పటముఁ దె, చ్చించి చిత్రగుప్తుఁ డెంచి చూచి

క. దురితశతకోటులం ద, క్షరమొకటియుఁ గానలేక కంపవిస్మృతిభం
గురతాయుతుఁడై జముకడ, కరిగి తగం బలుకు నతఁడు ప్రాంజలియగుచున్.

ఉ. డక్కఁగ వ్రాసితి న్మును పటమ్మునయందు సుశర్మపాపముల్
లెక్కయెఱుంగరాదు లవలేశము దానికి నట్టివ్రాఁతయం
దక్కజ మిప్పు డొక్కటియు నక్షరరూపము లేదు దేవ ! నే
డక్కడితంబు గట్టియిడి నట్టులయున్నది కప్పుదేఱుచున్. ౮౦

ఆ. హతలతాంతమైన యారామమునుబోలె, విగతతారమైన విన్నుఁబోలె
గళితవర్ణమగుటఁ గళితంబు దీనికి, మీరె తెలియవలయుఁ గారణంబు. ౮౧

క. అని పల్కు నమ్మహామతిఁ, గని జముఁ డిట్లనియె నీవు కవిలియ నీవ్రా
సిన లిపి యున్నదొ లేదో, కనుఁగొను మీసారి లెస్స గా గణకవరా ! ౮౨

ఆ. అనుడు నట్లకాక యని చిత్రగుప్తుండు, దండధరునియాజ్ఞ వెండి నేగి
పటముప్రతిపుటంబుఁ బరికించి యందు నీ, క్షించెఁ జక్రపాణి చేతివ్రాఁత.

ఉ. ఈతఁడు పద్మతీర్థమున కేగి యొకానొకనాఁడు తత్పయో
ధౌతనిజాంగుఁడై చనుకతంబున విప్రవధాదిపాతక
వ్రాతముఁ దొంటిపుట్టువులఁ బ్రాప్తములైన యఘంబులున్ మరు
ద్ధూతఘనాఘనావలుల తోసరియై సరిపోయె నన్నియున్. ౮౪

క. అనునర్థంబులుగల లిపి, గని సని జముఁ బల్కు నతఁడు గానఁబడదు నే
మును వ్రాసినయది యన్యము, కనుపట్టెడు నేలిఖితమొ కాని విన్నదగున్.

---

ముల వ్రాలుగలది ॥ ౭౮ ॥ భంగురత=వక్రత ॥ ౭౯ ॥ డక్కఁగన్ = అనుభవమునకు తగునట్లు. అక్కజము=వింత. కడితము = మసిపూసిగట్టనచేసిన చదరపుగోనెపట్టతోఁజేసిన లెక్క పుస్తకము ॥ ౮౦ ॥ హతలతాంతము=కొట్టఁబడిన పువ్వులుగలది. విగతతారము=పోయిన నక్షత్రములుగలది. విన్ను=మిన్ను=ఆకాశము. కళితము=కడితము ॥ ౮౧ ॥ కవిలియ=లెక్కపుస్తకము ॥ ౮౨॥ వెండిన్=మఱియును ॥ ౮౩ ॥ తత్పయోధౌతనిజాంగుఁడు = ఆనీళ్లచేత కడుగఁబడిన తనదేహము గలవాఁడు. మరుద్ధూత ఘనాఘనావలులతోన్ = గాలిచేత చెదరఁగొట్టఁబడిన వానకాలపు మేఘ

ఉ. ఈతఁడు పద్మతీర్థమున కేగి యొకానొకనాఁడు తత్పయో
ధౌతనిజాంగుఁడై చనుకతంబున విప్రవధాదిపాతక
వ్రాతముఁ దొంటిపుట్టువులఁ బ్రాప్తములైన యఘంబులున్ మరు
ద్ధూతఘనాఘనావలులతో సరియై సరిపోయె నన్నియున్. ౮౬

సీ. అని యొప్పు కౌతుకజనకాక్షరశ్రేణి, వీక్షించి వచ్చితి విద్విడింద్ర!
యిదిమీరలెఱిఁగింపుఁ డేనాట సకృదవ, గాహనంబున మహాకలుషరాశి
వలనఁ బూరుషుఁ జేరఁ దలఁగుపుణ్యాప్తుఁదీర్థ, మెన్నఁడు గన విన నీమదుక్త
లిపిపఙ్క్తి నేకవారపయోభిమజ్జన, మాత్రచే నెనఁచిన మహిమగలుగు

తే. దివ్యతీర్థంబువైభవ మవ్యయప్ర, సాదమేదురమానసౌజ్జ్వల్యకల్య
వచనరచనలవివరింప వలయు నప్రపన్నదైత్యలతాదాత్ర భానుపుత్త్ర! ౮౭

వ. అనిన నప్పద్మమిత్రపుత్త్రుండు చిత్రగుప్తున కిట్లనియె. ౮౮

శా. ప్రాశస్త్యంబువహించు దండకమహారణ్యంబు పుణ్యార్థి పం
చాశత్కోటివిశాలభూమి ఖలదుష్ప్రాపప్రభావోదయ
శ్రీశుద్ధుల్ గనుదాని గౌతమి గుణోత్సేకంబుకల్మిన్ హృషీ
కేశావాసము పౌండరీకనిలయం బీరెంటి గెల్చుం దుదిన్. ౮౯

సీ. అర్కుండువెలుఁగుట యనిలుండు వీచుట, యింద్రుండువర్షించుటిల జలముల
మునుఁగకతిరమౌట యునునెసంగునవిష్ణు, నాజ్ఞాప్తిచే నెవ్వఁ డఖిలజగము
బ్రహ్మయైసృజియించుఁబద్మాక్షుఁడై ప్రోచు, మదనారియైతుంచుమత్ప్రభృ
లోకపాలకుల నేలోకేశుకరుణాక, టాక్షంబె యధికృతి యందు నిలుపుఁ[తుల

తే. నావిభుండెందునుండుమ ర్త్యమునఁబుట్టి,భూతకోటిననుగ్రహంబునఁ బెనుపు
నెందుఁగ్రుంకినుశర్మయుఁ జెందెముక్తి, దానికెనవచ్చుతీర్థమీధరణిఁగలదె[చు

వ. అని పద్మతీర్థంబు తీర్థచరణవిహరణ చరితార్థం బగుదానినానాగుణంబులు
నగణితప్రభావంబు లని కొనియాడి. ౯౧

---

పఙ్క్తులతో. సరిపోయెన్=నశించెను ॥ ౮౪ ॥ ౮౫ ॥ ౮౬॥ కౌతుకజనక=వేడుకను పుట్టించునట్టి. సకృదవగాహనంబునన్=ఒకతూరి స్నానముచేత. ఏకవార=ఒకసారి. పయోభిమజ్జన=నీటియందు మునుఁగుట. అవ్యయ=తగ్గని. మేదుర=అతిశయించిన. ఔజ్జ్వల్యకల్య = ప్రకాశత్వముయొక్కచాతుర్యముగల. అప్రపన్న=శరణాగతులుకాని. దైత్యలతాదాత్ర=రాక్షసులనెడి తీఁగలకు కొడవలియైనవాఁడా ॥ ౮౭ ॥ ౮౮ ॥ ఖలదుష్ప్రాప= దుర్జనులకు పొందరాని ॥ ౮౯ ॥ తిరము=స్థిరము. అధికృతి=అధికారము ॥ ౯౦ ॥ తీర్థచరణ=విష్ణునియొక్క ॥ ౯౧ ॥ ౯౨ ॥ పున్నాగ=పురుషశ్రే

క. పెనుగ్రస సుశర్మఁ గనుఁగొని, తనుపునిష్ఠుర్లి యాదరించి దండధరుఁడు చం
ద్రునిలీలఁ జల్లనగుచుం, దనభూషణ వసనమాల్య తర్పితుఁ జేసెన్. ౯౨

క. ఈగతిఁ గృతాంతుకృపగని, సాగి చనియె నతఁడు గగన చరయానమునన్.
నాగనరయక్షసురప్స, న్నాగానీకములు గొలువ నాకంబునకున్. ౯౩

మ. అమరాధీశుఁడు గౌరవంబెసఁగఁ ద న్నర్ధాసనాసీనుఁ జే
య మరుద్భోగములెల్లఁ గాంచి ధరయం దగ్రాన్వయోద్భూతుఁడై
కమలావల్లభుఁ బౌండరీకపతి సాక్షాద్బ్రహ్మముం గొల్చి ని
త్యముఁ దన్మందిరరాడలంకృతియె చేయం జాల నేలెన్ధ్రుతిన్. ౯౪

శా. ఆపంచత్వముగాఁగ నిట్లు హరిగేహక్షోణిసమ్మార్జనం
బాపాదింప ఘటిల్లుపుణ్యమునఁ జంద్రావాసముంజొచ్చి హ
ర్షాపూర్ణస్థితిఁ బెక్కుభోగములఁ బెక్కబ్దావళుల్ గాంచి ధా
త్రీపాలోత్తముఁడై సుకీర్తియన నుర్విం బెంపునం బుట్టుచున్. ౯౫

క. అతఁ డధికభక్తితో నా, యతకీర్తిస్ఫూర్తివర్తియై వెలసి జగ
త్పతి నుచితపూజనంబులఁ, బ్రతిఘస్రము దెలచు భక్తపరతంత్రుండై. ౯౬

ఆ. అతఁడు సన్యసించె నఖిలభోగంబులు, నిండువయసునాఁడ యుండియుండి
నందనందనాంఘ్రి నాళీకసేవోప, యోగరాగభోగ మొకటిదక్క. ౯౭

సీ. నిలువుననొలిపించెవిలువంగడము నెల్ల, శరములయాయంబుఁ బోరయుటుడిపెఁ
దగశబ్దమాత్రపాత్రముచేసెగుణలత, గ్రమ్మఁకునఁ గట్టించె మూలబలముఁ
గంచుకివశముగావించె సేనానాథుఁ, గట్టించె సహచరుఁ గటికియెండఁ
బ్రతిపక్షభావసంగతుఁడనిహితుఁజూచె, వరకేతనముకీర్తి భరముడులిపె

తే. ధర్మనిర్మలబుద్ధి సుశర్మఁ గదిసి, కొలువఁగాలేక చని కోపగించి మదనుఁ
డురకతనవారలతనికి నోడుమనిరె, పతికిఁ గీడౌట బంట్లపాపంబుగాదె. ౯౮

క. ఆరాజర్షి పదంపడి, క్షీరోదన్యాయమున విచిత్రగతిన్ ల
క్ష్మీరమణుఁ గలసి యేకా, కారంబున నలరె ముజ్జగంబులుపొగడన్.

---

ష్ఠులయొక్క ॥ ౯౩ ॥ మరుద్భోగములు=దేవతలయొక్క భోగములు ॥ ౯౪ ॥ ఆపంచత్వముగాఁ గన్=చచ్చునంతవఱకు ॥ ౯౫ ॥ ఘస్రము=దినము. తెలచున్=సేవించును ॥ ౯౬ ॥ అంఘ్రినాళీక=పాదకమలముల ॥ ౯౭ ॥ వంగడము=వంశము. ఆయంబు=వచ్చుబడి; మర్మస్థానము. మూలబలమున్=మూలబలమును. సహచరున్=స్నేహితుని. కీర్తిభరమున్=కీర్తియొక్క అతిశయమును; అడుస్లుయొక్క బరువును ॥ ౯౮ ॥ ౯౯ ॥ అమృతనిధి=సముద్రము ॥ ౧౦౦ ॥ అనుషంగములు==చేరిక.

క. విను మఖిలదురితకులభం, జనమజ్జన మమృతనిధివ శం బగుటకుఁగా
వున సర్వజనోపాస్యం, బనూన మత్తీర్థరాజ మనుపమ మనఘా! ౧౦౦

ఉ. భూరిసుఖానుషంగములు పూరుషుఁ బొందవు సోమపానకై
దారజలోపయోగములు తత్కలనం బసరెక్కు నెత్తికిన్
బేర శిలాకృతుల్ జఠర పేటిక కత్తెవులేల యెందు నె
వ్వారికిఁ బద్మతీర్థపతి వారికిఁ జేరినఁ గల్గు సౌఖ్యముల్. ౧౦౧

చ. కృతమున నేకదంష్ట్రుఁడయి క్రీడయొనర్చుచుఁ ద్రేత దంష్ట్రికా
ద్వితయముచే వెలుంగుచు మ దించి త్రిదంష్ట్రలతోడ ద్వాపరం
బుతఱిఁ జరించు నొక్కదితి పుత్త్రుఁడు వృత్రుఁడు వానిఁబోలఁ డ
ద్భుతజనకప్రతాపమున భూరిబలంబున మాయపెంపునన్. ౧౦౨

క. ఆహరిహయారి పార్ష్ణి, గ్రాహియన హిరణ్యకశిపు గాదిలిసుతుఁడై
బాహాబలశిఖిఁ ద్రిజగ, ద్దాహంబొనరించె నేక దంష్ట్రియుఁ దానున్. ౧౦౩

క. ఆయొంటిపంటివేలుపు, దాయం బొలియించె నృహరి దంభోళికటు
చ్ఛాయలనాయలలూఁపున, ఖాయుధములవఱుఁ జీరువ్యాఘ్రముఁబోలెన్

ఉ. వెండియు రావణాబ్ధిఁ బ్రభవించెఁ ద్రిలోకహలాహలాకృతిన్
మండుచు దంష్ట్రికాయుగము నం బెడఁగై యతికాయనామ వా
తండు ధరించి త్రేతఁ దలఁ దర్వెఁ దదుగ్రనిశాటుఁబట్టి వి
ష్ణుం డని రాముఁడై విలయ సూర్యకరోగ్రశరాగ్రధారలన్. ౧౦౫

ఉ. ఆపితబద్ధవైరమతి నంతటఁ బోవక వాఁడు వెండియున్
ద్వాపరవేళ నిద్దరఁ ద్రి దంష్ట్రుఁడు నా నుదయించి యాది ల
క్ష్మీపతిఁ బౌండరీకవిభుఁ జేరి కనుంగొని పల్కు మిక్కిలిన్
గోపముపర్వఁగన్ గొలిమి గూఁడుల యాడునఁ గన్నులుబ్బఁగన్. ౧౦౬

---

గలవి. కైదార=పరిమళ్ళయందలి. తత్కలనన్=దానిచేరికచేత. జఠరపేటికకున్ = కడుపుపెట్టెకు. అత్తెవులు=ఆతెగులు=అవ్యాధి. వారికిన్=జలమునకు ౧౦౧ ॥ ౧౦౨॥ హరిహయారి=ఇంద్రుని పగవాఁడు_రాక్షసుఁడు. గాదిలి=ప్రియమైన. శిఖిన్=అగ్నిచేత ॥౧౦౩ ॥ వేలుపుదాయన్=రాక్షసుని. పొలియించెన్=చంపెను. వఱుదున్=నక్కను. చీలు=చీల్చు ॥ ౧౦౪ ॥ రావణాబ్ధిన్=రావణుఁడనెడిసముద్రమునందు.త్రిలోకహలాహలాకృతిన్=మూడులోకములకునుహాలాహలవిషము విధమున. బెడఁగై=అందమై.తర్వెన్=నఱకెను.ధారలన్=వాదరలచేత ॥౧౦౫॥ఆపిత=పొందఁబడిన ॥౧౦౬॥

ఉ. ఎక్కడి కేగుదెంచితి వహీనవిహార ! చికిత్స నీకు నే
  జక్క నొనర్చెదన్ బెలుచఁ జంపితి దొంగిలి మున్ మదీయులన్
  రక్కసులన్ నినుం బొదివి ప్రాణముఁ గొందుఁ గడంగి పాదవై
  త్రుక్కఁడియున్నఁ బోవిడువఁ దొల్లిటిత్రుళ్లికిఁ జెల్లదిచ్చటన్. ౧౦౭

మ. అని సింహంబునకల్లు నక్కక్రియ ని ట్లాక్షేపముల్ పల్కి య
  ద్దనుజుం డంతకదండభీషణగదా దండంబునన్ వ్రేయ వం
  చనఁ దూలించెఁ దదుగ్రసాధనముఁ గంసధ్వంసి తద్ఘోరతా
  డనవేగంబున భగ్నమయ్యెఁ గటివేల్లత్తుల్లకాశిక్యమున్. ౧౦౮

శా. అత్తార్క్ష్యధ్వజుఁ డప్పు డాగ్రహసహవ్యగ్రాత్ముఁడై దానవున్
  మొత్తెన్ మెత్తనివీఁక దక్షిణకరాంభోజంబునం దానన
  మ్మత్తుండున్ గడతేఱె నెత్తురులుగ్రమ్మన్ ముక్కునన్ వాతఁ బెన్
  మొత్తంబుల్ గొని ప్రస్తుతించిరమరుల్ మోదించి దామోదరున్. ౧౦౯

క. ఆయెడ మదిక్కుచిక్కం, బోయతివర ! కానవచ్చి యున్నది భగ్నం
  బై యిపుడు మంత్రవర్ణ, శ్రీయుతవక్షస్స్థలునకు జితదనుజునకున్. ౧౧౦

ఉ. ఆకమలేక్షణుండు తన యక్కునఁ దాల్చిన సిద్ధమంత్రకమున్
  నాకెఱిఁగించినాఁడు మును నాయెడఁ గల్గిన కూర్మిపేర్మి నే
  లోకమునందు నెవ్వరికి లోఁబడనేరదు నాకె కాని త
  ద్వ్యాకృతి నావుడుం బలుకుఁ బ్రాంజలియై యతఁ డిందుశేఖరున్. ౧౧౧

చ. పశుపతి ! మమ్ముఁబోలిన ప్రపన్నులపైఁ గృపచాలియున్కి త్వా
  దృశులకు నైజమౌట వసుదేవతనూభవదత్తమంత్రమున్
  విశదముగాఁగ నాకొసఁగవే నిను వేఁడెద దానఁ జేసి దుః
  ఖశరధి ద్రెవ్వ నీదయ నఖండసుఖస్ఫురణంబు నొందెదన్. ౧౧౨

ఉ. నా విని శూలి పల్కు మునినాయక ! యీమను వెందు గోప్యమై
  తా విలసిల్లు దీని దురితప్రవణాత్ములకున్ మురారి సే

---

పెలుచన్=క్రూరముగా. త్రుక్కఁడి=గర్వముడిగి. త్రుళ్లు=గర్వము ॥ ౧౦౭ ॥ ౧౦౮ ॥ అత్తార్క్ష్యధ్వజుఁడు=ఆకృష్ణుఁడు. ఆగ్రహసహవ్యగ్రాత్ముఁడు=కోపముతో వేగిరపడునట్టి మనసుగలవాఁడు. వీఁకన్=పూనికతో. కడతేఱెన్=చచ్చెను. మోదించి = సంతోషించి ॥ ౧౦౯ ॥ భగ్నంబై = భంగము నొందినదై ॥ ౧౧౦ ॥ కూర్మిపేర్మిన్=స్నేహగౌరవముచేత. తద్వ్యాకృతి=దాని విశేషాకారము ॥ ౧౧౧ ॥ పశుపతి=శివుఁడా. ప్రపన్నులపైన్ = శరణాగతులమీఁద. ఉన్కి = ఉండుట. త్వాదృశులకున్ = మీవంటివారికి. శరధి=సముద్రము. త్రెవ్వన్ = తెగఁగా_నశింపఁగా ॥

వావిముఖప్రచారులకు వైష్ణవమార్గముగాని హీనపుం
ద్రోవఁ జరించు సజ్జనవిరోధులకుం దగ దింత దెల్పఁగన్. ౧౧౩

క. నీవు హరిభక్తియుతుఁడవు, గావున నాకెపుడుఁ గూర్తు గావున విజ్ఞా
నావాసపూర్ణబుద్ధివి, గావున వినిపింతు వినుము కలుషవిదూరా! ౧౧౪

శ్లో. స్పర్శాద్యం సత్యనామాద్యం షష్ఠషష్ఠం సదీర్ఘకమ్,
షష్ఠం షష్ఠాదినత్యం తం సమారం తం విదుర్బుధాః. ౧౧౫

క. కృష్ణుఁడు ఋషిగాఁగ మహా, విష్ణుఁడు దేవతగఁ బొల్చి వేమాఱులు త
న్నిష్ణాతబుద్ధిఁ బేర్కొను, వైష్ణవులకు నీ మనువు ధురీ నస్థితి యొసఁగున్.

ఉ. ఎవ్వఁడు పౌండరీకమున కేగి మహానదిఁ దీర్థమాడి తా
నవ్విధు లెల్లఁ దీర్చి కమలాక్షునకున్ బ్రణమిల్లి నూఱుమా
ర్లివ్వరమంత్ర మర్థిఁ బఠియించునతం డఖిలాఘపంకముల్
దవ్వనసం గనంగలఁడు తత్త్వమహత్త్వము సత్వరంబుగన్. ౧౧౬

క. విధివంతంబుగ విధుస, న్నిధి నిచ్చలు నేఁ బఠింతు నిఖిలభవతమో
వధవిధివిధు వగుదీనిన్, విధినందన! తత్ప్రసాద విభవాపేక్షన్. ౧౧౭

వ. సిద్ధేశ్వరాహ్వయంబున సిద్ధలింగంబవై యెందేని నీవుండుదు వా దక్షిణ ద్వారంబు నధిష్ఠించి యీమంత్రంబు ననుష్ఠించు నిష్ఠాగరిష్ఠులకు నిష్టార్థసిద్ధి కరతలస్ఫటికఘుటికయగుట నిగమార్థంబు. తొల్లి తీర్థయాత్రాచరణనిపుణుం డగునీలాంబరుండు నిఖిలతీర్థంబులును దర్శించుచు వచ్చివచ్చి పౌండరీకంబుసొత్తెంచి యుత్తుంగతరంగడోలారూఢకలహంసకుల కలకలారావఘుమఘుమిత బ్రహ్మాండకుహరక్రోడం బగు భీమరథినీరంబునం గృతస్నానుండై యనూనమహిమాభిరామం బగునాక్షేత్రంబునంగల విచిత్రంబులు నేత్రప్రీణనంబుగానాచరించుచు నచ్చోట సాక్షరుం డగుపుణ్డరీకాక్షునీక్షించి వెఱఁగంది తదక్షరలక్షణంబు నెఱుంగనేరక యూరకుండె నుండియునయ్యేకకుండలుండు చలపకారితనంబున నవ్వర్ణంబులు నిర్ణయింపనుద్యుక్తుండై.

౧౧౨ ॥ మనువు=మంత్రము. దురితప్రవణాత్ములకున్ = పాపమునం దాసక్తమయిన మనస్సుగలవారికి. ప్రచారులకున్ = నడవడిగలవారికి ॥ ౧౧౩ ॥ కూర్తు=స్నేహింతువు ॥ ౧౧౪ ॥ ౧౧౫ ॥ పేర్కొను=ఉచ్చరించు ॥ ౧౧౬ ॥ తీర్థమాడి=స్నానముచేసి ॥ ౧౧౬ ॥ విధు = విష్ణునియొక్క. భవతమోవధవిధిన్=జన్మములనెడి చీఁకటిని నాశముచేయుపనియందు. విధువు=చంద్రుఁడు. విధినందన=నారదుఁడా ॥ ౧౧౭ ॥ స్ఫటికఘుటిక = పటికపుపూస. నీలాంబరుండు=బలరాముఁడు. చొత్తెంచి=చొచ్చి. క్రోడంబు-నడిమి భాగముగలది. ప్రీణనంబు=తృప్తి పుట్టించుటను. ఏకకుండ

మ. కరముల్ మీఁదికి సాఁచి యూఁపులు బిగ్గంబట్టి యంతర్రిపూ
త్కారముఁ బోవ నదల్చి యట్టితతిఁ బద్మంబట్లు మోమొప్పఁగాఁ
జరణాంగుష్ఠనఖావలంబనముతోఁ జండాంశుఁ గన్గొంచు భా
స్వరనిష్ఠం దపమాచరించె నొకమాసం బన్నవర్జ్యంబుగన్. ౧౨౦

తే. దానఁ బ్రియమంది దానవధ్వంసియొసఁగెఁ, గూర్మియన్నకుధైర్మైకనిర్మలునకు
నమ్మహామంత్రమాతండు నంతనుండి, యదియజపియింపఁదొణఁగెఁ గాయత్రి వో

క. భూరిగుణరత్నరాశిఁగు, మారుఁగనుంగొనఁగఁదివురు మమకారము లో [ లె
నారసి యొసంగె మున్నా, నీరజనాభుండు రుక్మిణికి నీ మనువున్. ౧౨౨

క. జపియించె నేనుదివసము, లుపవాసపురస్సరముగ నుగ్మలి నిష్ఠా
నిపుణమతిం బతిచే నిటు, లుపదిష్టంబైనమంత్ర ముత్సుకమొదవన్. ౧౨౩

ఉ. విన్ము మదీయనేత్రశిఖి వేగమునన్ జముఁగూడఁ జన్న య
మ్మన్మథుఁ డిందుబింబసుకుమారుఁడు భోజతనూజయందుఁ బు
ట్టె న్మధువైరి దెల్పిన క డిందిజపంబు నెపంబునన్ బున
ర్జన్మముఁ బొందె రాగరస సంపదపెంపు యువద్వయీమతిన్. ౧౨౪

సీ. బలభిదారామసంభవలతాంతశ్రేణిఁ, బన్నుమునాకొక్క చిన్నితేరు
కాళికెంగేలి విల్కలరాజుఁగొనితెచ్చి, నా వెంటఁబడి వాగెనడవఁబనుపు
గగనచరద్రాళి గణవర్తి మకరంబు, బిరుదుటెక్కెముగ వేగిర మొనర్పు
మదనగోపాలుండు మాతండ్రిచే నాకుఁ, జెఱకుచేమలిపించు కెఱకువిల్లు

తే. వనజహితువేఁడి తమ్మితూఁపునకుఁ దెమ్ము, దివ్యములఁగాని సాధింపఁదీరదీశు
నంబ ! నీవంచు రుక్మిణి నట్టునిట్టుఁ, దిరుగు శైశవచాపలార్దితుఁడు మరుఁడు.

చ. పలుచని లేఁత కెంజిగురు బత్త్రళికం బెకలించి తేనియం
గొలిపిన బాసటంబుగల క్రొవ్విరితూపుల నిత్తుచాపుఁ డే

---

లుండు=బలరాముఁడు. చలపకారితనంబునన్ = మచ్చరముకలవానితనమున ॥ ౧౧౯ ॥ చండాం
శున్=సూర్యుని ॥౧౨౦॥౧౨౧॥ తివురు=యత్నించు ॥ ౧౨౨ ॥ ఉగ్మలి=స్త్రీ—రుక్మిణి. ఉత్సుక
ము=ఉత్సాహము ॥ ౧౨౩॥ జముఁగూడఁజన్న=చచ్చిన. ఇందు=చంద్రుని. భోజతనూజ=రుక్మిణి.
౧౨౪॥బలభిత్=ఇంద్రుని.లతాంతశ్రేణిన్=పూలసరముచేత.చిన్ని=మనోజ్ఞమైన.పడివాగెన్=ఎక్కు
టకాయత్తము చేయఁబడినయునికితో. చరత్=తిరుగుచున్న. వర్తి=ఉండెడి. మలిపించు=తరిమెన
పట్టింపుము. తీరదు=సరిపడదు. అర్దితుఁడు=పీడింపఁబడినవాఁడు ॥ ౧౨౫ ॥ బత్త్రళిక=అమ్ములపొది,

గెలుపొనఁగూర్చె నా గెలుపు కృష్ణనిపట్టపుదేవి రుక్మిణీ
లలన జపించు మంత్రము బలంబునసైనదిగా నెఱుంగుమీ. ౧౨౬

క. సరసిజభవభవ! వాయు, స్ఫురితములై త్రిపురదహనములు త్రిజగములన్
బురికొని నీరసయవసాం, కురసఖముగ నేర్చె మున్నకుంఠితశక్తిన్. ౧౨౭

సీ. పెనుఁగంపతోఁ దుగులీచ్చిన మొల్కససియయ్యెఁ, గగనంబుతోరాయు కాననము
కడులావుమానిసి కాళ్లరాచినచీమ, చాలయ్యెఁ బశ్వాది జంతుపఙ్క్తు [లు
బడెగండ్లనొంటిమైఁ బడినవిఘ్నేశవాహములయ్యె హరిదంతహస్తిపతులు
వనపాలురడుసులోఁ జనఁగ్రుక్కుతాళీఫలాకృతులయ్యెఁ గులాచలములు

తే. మృదులగోమయపిండసమ్మిళితకార, వేల్లఫలబీజసమమైరి వీళ్లప్రజలు
కమలసంభవవరదానగర్వితాసు, రవరపట్టణనిర్భరాక్రమణవికృతి. ౧౨౮

క. ఈరీతిఁ గొంతకాలము, క్రూరగతిన్ సోఁకుమూఁక కుడిదలయూళ్లుల్
గారింపఁగ నేనంతట, వారింపఁగఁ గణఁగితిన్ భువనహితబుద్ధిన్. ౧౨౯

చ. అపుడు పినాకమున్ పవిని భాస్త్రములుంగొని యేయఁ బూనితత్
త్రిపురము లొక్కటన్ నిటలదృష్టికి లక్ష్యముచేయుచోట మ
ద్వపురుదితంబులైన శ్రమవారికణంబులు దిగ్గజాళియు
ర్విపయిఁ గడున్ వడిన్ దొఱఁగి వెల్లువచూపి నదీత్వమొందుచున్. ౧౩౦

క. మున్నెను మేన నలఁదిన, ప్రన్ననిభసితంబు నణఁచి శ్రమవారికడున్
జెన్నెసఁగె మంచుమలసం, చున్నాచికొని ప్రవహించు సురనదిపగిదిన్.

క. భీమాహ్వయమునవర్తిలు, నామేనం బుట్టువంది నదియై వెలసెన్
భూమిన్ భైమి యనందగి, భీమరథియనంగ మాఱుపేరెసఁగంగన్. ౧౩౨

శా. ఆభైమీనది విశ్వమున్ నిజకృపీటార్ద్రంబు గావించుచున్
శ్రీభామావిభుక్షేత్రమండలము డా సెన్ డాసినన్ వీచిరే

---

బాసటంబు=సహాయము—వాఁడి. క్రొవ్విరి=క్రొత్తపువ్వు ॥ ౧౨౬ ॥ త్రిపురదహనములు=త్రిపురములనేడియగ్నులు. నీరసయవసాంకుర సఖముగన్ = ఎండినగడ్డి మొలకపోలికగా. ఏర్చెన్ = కాల్చెను ॥ ౧౨౭ ॥ ససి=పైరు. బడెగండ్ల=పెద్దకలుగులయందు. విఘ్నేశవాహనములు = పందికొక్కులు. హరిదంతహస్తిపతులు=దిగ్గజములు. తాళీఫలాకృతులు = తాటిపండ్ల యాకృతిగలవి. పిండ=ముద్దయందు. వీళ్ళ=పట్టణముల ॥ ౧౨౮ ॥ సోఁకుమూఁక కుడిదలయూళులు = రాక్షసుల యునికిపట్టులగు పట్టణములు. కారింపఁగన్=బాధింపఁగా ॥ ౧౨౯ ॥ పవి=వజ్రాయుధమును. వపురుదితంబులు = దేహమునందుఁబుట్టినవి. శ్రమవారికణంబులు=చెమటబొట్లు ॥ ౧౩౦ ॥ ప్రన్నని = ఒప్పిదమయిన. మల=కొండ. సంచున్=విధమును-అందమును ॥ ౧౩౧ ॥ ౧౩౨ ॥ కృపీట=జలము

ఖాభీలం బగు దాని పెంపు గని మున్నందుండు ప్రాణుల్ మహా
క్షోభోద్విగ్నమనస్కులై పెలుచ నాక్రోశించుచున్ బెంపఱన్. ౧౩౩

క. భూరిభయార్దితులై చని, భైరవు మదరాగరుచిక్ర పాపూరితదృ
క్కైరవుఁ బలుకుదు రమృతాహారులు హరిఁ బలుకు క్రియఁ గృతాఞ్జలులగుచున్.

ఉ. మిక్కుటమైన పంకమున మిన్నులగర్భము గాఁగఁ బొంగి నే
డొక్క మహాస్రవంతి యిదె యుత్తరదిక్కున క్షేత్రసీమపై
నిక్కెఁ యాబ్ధిఁ బోలె నిట నిల్వఁగ నోపము నాగహార! మే
మెక్కడికేగువార మిఁక నెద్ది తెఱం గిటమీఁద నావుడున్. ౧౩౫

సీ. కాళరాత్రిస్తనాగ్రకృతావకాశమై, యురము వెల్మిడిపూఁత యొప్పు వెనుప
శిథిలత్వమొందిన చెంగావిజడముడి, చిలుకూడి నెలపువ్వు చెంప నంటఁ
గంకాళమనుబుద్ధిఁ గరమున జందెంపుఁ, జిలువఁ బట్టిన నది జలదరింప
నెచ్చటఁ బ్రభవించె నేతెద్దియని పల్కు, సరభసోక్తుల జగజ్జంతు లలుకఁ

తే. బాణిపుటశీధుపాత్రంబుఁ బాఱవైచి, కుఱువుపై నున్న కిన్నర నుఱుకఁ ద్రోచి
యతిరహఃకేళినుండియు నరుగుదెంచె, భూరిజయగౌరవుఁడు కాలభైరవుండు.

ఆ. అరుగుదెంచి యమ్మహానది నీక్షించి, చేతులెత్తి బెట్టు చిట్టమిడిచి
ఘోరకోపవేగ ధీరోక్తు లులియంగఁ, బలుకు నిట్లు క్షేత్రపాలకుండు ౧౩౭

చ. నిలునిలు తుంగభంగవగు నిన్నుఁ గనుంగొని సాధ్వసాతివి
హ్వలమతులైరి క్షేత్రతల వాసులు దానికిఁ గోపగించె నిన్
వలమురితాల్పుఁ డింక నిట వచ్చుట మానుము మచ్చెకంటి! నా
నిలిచి నుతించు నన్నది వినిశ్చితకార్యగతిన్ జగత్పతిన్. ౧౩౮

---

చేత. వీచిరేఖా=అలలవరుసచేత. ఆభీలంబు=భయంకరము. పెంపు=అభివృద్ధిని. మహాక్షోభోద్విగ్నమనస్కులు=మిక్కుటమయిన కలఁతచేత వెఱపునొందిన మనస్సుగలవారు. పెలుచన్ = గట్టిగా. ఆక్రోశించుచున్=మొఱపెట్టుకొనుచు. పెంపఱన్=హీనతనొందఁగా ॥౧౩౩॥ దృక్కైరవున్=చూపు కలువలుగలవానిని. అమృతాహారులు=దేవతలు ॥ ౧౩౪ ॥ స్రవంతి=ఏఱు. నిక్కెన్ = వ్యాపించెను. నాగహార=సర్పహారములు గలవాఁడా ॥ ౧౩౫ ॥ వెల్మిడి=విబూది. చిలుకు=ముడి. నెలపువ్వు=పువ్వైన చంద్రుఁడు. కంకాళము=కప్పెర. చిలువ=పాము. సరభసోక్తులన్ = త్వరతోడి మాటలచేత. కుఱువు=తొడ. రహఃకేళి=ఏకాంత క్రీడయందు ॥ ౧౩౬ ॥ బెట్టు = గట్టిగా. చిట్టమిడిచి=చిటిక వేసి. ఉలియంగన్ = ధ్వనింపఁగా ॥ ౧౩౭ ॥ తుంగభంగవు=ఉన్నతములైన యలలుగల దానవు. సాధ్వసాతివిహ్వలమతులు=భయముచేత స్వాధీనత తప్పినబుద్ధులు గలవారు. వలమురితాల్పుడు=శంఖమును ధరించినవాఁడు=కృష్ణుఁడు ॥ ౧౩౮ ॥ గ్రాహనిగ్రహమున్=మొసలి

సీ. జగదుద్భవస్థితి క్షయహేతు వెవ్వఁ డా, దేవాదిదేవుండు దిక్కునాకు
గ్రాహనిగ్రహమిాఁగి కరిఁగాచె నెవ్వఁ డా, త్రిభువనాధీశుండు దిక్కునాకుఁ
దుదిపదంబునొసంగి ధ్రువుఁగాచె నెవ్వఁడా, దృఢదయామయమూర్తి దిక్కు
ద్రౌపదిబన్నంబు దలఁగించెనెవ్వఁ డా, దీనమందారుండు దిక్కు నాకు [నాకు
తే. నెవ్వనిపదాబ్జమున జని యించుజలము, మజ్జనకుఁడైన శివుఁడాత్మ శిఖాళినిలిపె
నమ్మహావిష్ణుఁ డాకృష్ణుఁ డాగుణాబ్ధి, దేవకీనందనుఁడె యొందుదిక్కునాకు.
తే. శరణమవుగమ్ము మద్భయ జ్వరమునుడుపు, భగ్నమతినైతికురుక్కుర భర్తకతన
నింకనెయ్యదిదిక్కు చక్రాబ్జనన్నుఁ, బ్రోవుమనిపల్కఁగృపఁబల్కు దేవుఁడేటి.
ఉ. రమ్ము గరమ్ము ద్రోచి మధు రప్రియభాషిణి నన్నుఁగన్నమీఁ
ద మ్మిటియుక్ భయమ్ము గల దా ? వల దాతురవృత్తి మన్నియో
గమ్మున నీప్రదేశమునఁ గ్రమ్మిన మజ్జన జన్మజాడ్యపా
శమ్ములఁ ద్రెంపు నింపు మని శమ్ము శుభమ్ములు భూతకోటికిన్. ౧౯౧
క. అస్మత్క్షేత్రస్థితి భవ, భస్మాంగజ ! గంగకంటెఁ బావనివగుచున్
భస్మీకరింపు లోకా, పస్మారప్రాయదురిత బాధాశతముః . ౧౯౨
చ. అని వనజాక్షుఁ డీకరణి నానతియిచ్చినఁ దత్కృపారసం
బను పెనువాన నుబ్బినక్రి యన్ రయ మారఁగఁ దత్ప్రదేశమున్
ధనువున నారియై నిగిడె దానిశరంబు గరంబు దాఁకినన్
దునుఁగుఁ జినుంగు ప్రీలుఁ గడుఁ దూలు జగజ్జనజన్మలక్ష్యముల్. ౧౯౩
క. ఎందుఁ బ్రవహించె నస్మ, న్నందన యత్తీర్థవిభువు నరసింహాఖ్యం
జెంది యదునందనాత్మా, నంద మగున్ బద్మగర్భనందన ! వింటే. ౧౯౪
క. అదిమొదలుగను సరస్వతి, తుదగాఁగల తీర్థములకు దొరయై నడుమన్
బొదలు ఋషివృషభసేవిత, పదుఁ డగుహరి మెచ్చుతీర్థ పతి మునిపతీ!
క. సాక్షాత్కరించి పద్మద, ళాక్షుఁడు వేంచేసియునికి న త్తీర్థకులా
ధ్యక్షము మసారతరళా, లక్షితముక్తావళీల లంతిం బోలున్. ౧౯౬

---

వలని నిర్బంధమును. ఈఁగి=తొలఁగించి. పదంబున్=స్థానమును. బన్నంబు=భంగమును ॥ ౧౩౯ ॥ ఉడుపుము = మాన్పుము. కురుక్కురభర్త=కుక్కలరాజు ॥ ౧౯౦ ॥ నిమజ్జన=మ్రొక్కుచున్న జనుల యొక్క ॥ ౧౯౧ ॥ భవభస్మాంగజ = శివుని విబూదిపూఁతతోడి దేహమునందుఁ బుట్టినదానా. అపస్మారప్రాయ = దేహస్మృతిలేమిని బోలిన ॥ ౧౯౨ ॥ నారి=అల్లెత్రాడు. శరంబు=జలము ; బాణము. ప్రీలున్=చీలును ॥ ౧౯౩ ॥ ౧౯౪ ॥ ౧౯౫ ॥ ఉనికిన్=ఉండుటచేత. మసారతరళా లక్షిత=పచ్చలపతకముచే గుఱుతిడఁబడిన. లలంతికన్ = మెడను వ్రేలెడిహారమును॥ ౧౯౬ ॥ అశన్=

క. వెన్నుఁడు ప్రత్యక్షంబై, యున్న యెడకు దక్షిణాశ నొకపులినతలం
బున్నది మిన్నది కడగను,నున్నతిఁగన్నది శుభంబు లొసఁగంబొసఁగన్.
ఆ. ముందు నందగోపు మందయందుఁజరించు, రూపధన్య యొక్క గోపకన్య
విష్ణుభుక్తముక్త కృష్ణుఁ డచ్చటనున్కి,నెఱిఁగి యేగుదెంచె నెలుకమించి.
క. విప్రవధూచితశుచివే, షప్రథితశరీరయయ్యెఁ జక్రస్తని సా
భిప్రాయస్మితవికసిత, దీప్రనిజకపోలయగుచు దేవుని మ్రోలన్. ౧౪౯
సీ. జలధరశ్యామకుం తలకలాపమునకుఁ, బాటింపమియె నవ ప్రసవకలన
దళితనీలోత్పల దళచంచదక్షుల, కామీలనంబె కా లాంజనంబు
కుంభికుంభస్థూల కుచమండలికి జ్ఞాన, ముద్రాకరమె ముత్యములసరంబు
గగనసోదరవల గ్న ప్రదేశమున కో డ్యాణబంధంబె యొ డ్డాణమిడుట
తే. గాఁగఁ దపమాచరించునక్కలువకంటి,యంగలతికనిరాకల్పయయ్యునమరె
శారదారంభవిమలాభ్ర సరణికరణిఁ, బ్రకృతిమధురంబులకు వేషరచనలేల?
శా. లోకేశస్థితలోకవాసకృతి సా లోక్యంబు నర్చింప ల
క్ష్మీనాథాంఘ్రియుగంబుఁ జేరుటమి సా మీప్యంబు సద్భక్తిర
క్షాకారిం దనరూపుగా నిలుపుటన్ సారూప్యమున్ బుద్ధి నా
కౌకశ్శేఖరుఁ గూర్చియున్కి సతి సా యుజ్యంబు నొందుం దుదిన్. ౧౫౦
శా. స్నానానుక్రమవాసితాచల ఝరీ సాంద్రాంబువుల్ ధ్యానసం
ధానాధీనవపుర్విలోకననితాంతప్రీతసారంగసం
తానంబుల్ మృదుపాదపల్లవతలో ద్యత్కాంతిలాక్షారస
శ్రీనద్ధాచలతుంగశృంగములు మిం చెం దత్తపస్సంగముల్. ౧౫౨
ఉ. ఆభగవంతుఁ డంతఁ గరుణార్ద్రమతిన్ సతిమ్రోల నిల్చె న
భ్రాభ మదభ్ర మబ్భ్రమ మనంతము శాంతము కాంతివంత మ క్షు
క్షోభ మలోభ మప్రతిమ శోభనశోభియునైనమేను నా
నాభరణంబులం గుసుమితామరభూజమునోజ రాజిలన్. ౧౫౩

దిక్కునందు. పులినతలము=ఇసుకదిన్నె ప్రదేశము ॥ ౧౪౭ ॥ భుక్తముక్త=అనుభవింపఁబడి విడువఁబడినది ॥ ౧౪౮ ॥ దీప్ర=వెలుఁగునట్టి ॥ ౧౪౯ ॥ కుంతల కలాపమునకున్=కొప్పునకు. ప్రసవకలన=పువ్వులపొందిక. చంచత్=ఒప్పిదమైన. వలగ్న=నడుము. ప్రకృతిమధురంబులకున్=స్వభావముచేత మనోహరములైనవానికి ॥ ౧౫౦ ॥ నాకౌకశ్శేఖరున్=దేవశ్రేష్ఠుని-కృష్ణుని ॥ ౧౫౧ ॥ ఝరీ=సెలయేటియొక్క. సారంగ=తుమ్మెదలయొక్క. నద్ధ=నిక్కిన ॥ ౧౫౨ ॥ అభ్రాభము = మేఘకాంతివంటి కాంతిగలది. అదభ్రము=అల్పముకానిది. అబ్భ్రమము = నీటిసుడిగలది. అక్షో

ఉ. ఆ శరదిందుబింబసదృ శానన సూనశరాసకోటిసం
కాశు రమేశు రాగరస కశ్మలగాత్రయు స్రస్తనేత్రయున్
బేశలబంధకైశికయు భీతిముదశ్రునిపాతముఖ్యచే
ష్టాశబలత్వసక్తతను శంపయునై కనుమ్రంపు డాల్చుచున్. ౧౫౪

తే. పృథులవిజ్ఞానరసపూర్ణ భృగుశుకాది, భావనాదీర్ఘికలయందుఁ బరిణమించు
జలజదళనేత్రుపాదాంబుజములు గేల, భీతమృగపోతలోచన బిగియఁబట్టె.

క. కరకలితనిజపదాబ్జయు, విరళతరత్రపయునైన విధుబింబముఖిన్
వరసంఛాదితఁ జేసెన్, గరుణాగుణహారి శౌరి కన్నుల నగుచున్. ౧౫౬

సీ. తనుఁజూచి శిథిలబంధశిరోజయగుట న,య్యతివకు ముక్తకేశాహ్వయంబు
దయచేసి తత్ప్రార్థితమ్ములైనవరముల, నొసఁగి యప్పసిగాపు టసరబుద్ధి
చిఱుగుబ్బలాని తక్షేత్రరాజమునకు, నీశానుదిక్కున నిరవుపఱిచె
వెన్నుఁడు తనునది ద్రేపల్లెలోరాక,తర్కించు దౌష్ట్యంబుఁ దలఁచి నగుచు

తే. దానికరములచేఁబిడి తంబులైన, పాండురంగేశు శ్రీపాద పల్లవముల
నంగుళీమధ్యతలరేఖ లంటియుండు, గంగ ప్రవహించునిటి శొంకలునుబోలె.

క. ఆముక్తకేశదర్శన, మోమునికుఁ సార్వభౌమ ! యొసఁగు ననేక
శ్రీమూర్తి దానఫలమా, భామిని శ్రీమూర్తి గాఁగఁ బాటింపఁదగున్. ౧౫౮

తే. అనుడు వేలుపుఁదాపసి యాసుశీల,పుత్త్రిలేచందమున మోక్షమునకుఁజనిరి
ప్రయుతనందనుఁ డెవ్వఁడేపగిదినతఁడు,నృహరికృపఁగాంచె నన్నఁబల్కునీలగ [ళుఁడు

క. మునివర! విను మత్యద్భుత,జనకచరిత్రయైన జనని చనినపిదపఁ ద
త్తనయులు మురభిత్పదవ, త్తనయులు గురువాక్యకరణ తత్పరబుద్ధిన్. ౧౬౦

---

భము=కలఁతలేనిది. అప్రతిమశోభనశోభి=ఈడులేని శుభములచేత ప్రకాశించునది. ఓజన్ = విధమున ॥ ౧౫౩ ॥ సూనశరాస = మన్మథునియొక్క. సంకాశున్=పోలినవానిని. కశ్మల = మయిలపడిన. స్రస్త=చలించిన. పేశల=అందమైన. కైశిక=కీలుగంటుగలది. ముదశ్రు=ఆనందబాష్పములయొక్క. నిపాత=పాటు. శబలత్వ=చిత్రవర్ణముతోడ. సక్త=కూడిన. శంప= మెఱపుగలది. మ్రంపు =మాంద్యము ॥ ౧౫౪ ॥ భావనాదీర్ఘికలయందున్=మనస్సులనెడి నడబావులందు. పరిణమించు= సంతోషించు—వికసించు. పోత=పిల్ల ॥ ౧౫౫ ॥ విరళతరత్రప = మిక్కిలి యొడమైన సిగ్గుగలది. హారి=మనోహరుఁడు ॥ ౧౫౬ ॥ పసిగాపుటసరబుద్ధి =ధూర్తురాలైన గొల్లపడుచుయొక్క. గుబ్బలు= స్తనములను. ఇరవుపఱిచెన్=నిలిపెను ॥ ౧౫౭ ॥ ౧౫౮ ॥ వేలుపుఁదాపసి=దేవముని ॥ ౧౫౯ ॥ మురభిత్పదవత్తనయులు=కృష్ణుని పాదములవలన రక్షింపఁబడుచున్న కొడుకులుగలవారు ॥౧౬౦॥

శా. భైమీతీర్థనివాసు రాసకుశలున్ బద్మేక్షణున్ యాదవ
స్వామిన్ సామజవత్సలుం గొలిచి యైశ్వర్యంబునం బొల్చి వా
రామీఁదన్ సకళత్రపుత్త్రముగ దివ్యస్వర్గస్థులై తత్తనూ
గ్రామం బెక్కిరి నావుడున్ మఱియు నా బ్రహ్మర్షి పల్కెన్ శివున్. ౧౬౧

ఉ. హాళి మనంబునం బెరుగ నాలయి బిడ్డయి బంటు పైదయై
మూలధనార్జనంబు నిలు ముంగిలియై గళదఘ్నదర్పతన్
వాలినవారి కెట్టులపవర్గము భర్గ! ముకుందుఁ డిచ్చె నిం
కేల గలాపమేల జడ లేల కమండలువేల దండమున్? ౧౬౨

క. వార లటుగాక కారణ, పూరుషులై యట్టిసతికిఁ బుట్టుటనో తుదిన్
జేరిరి గృహస్థులయ్యును, సారసదళనయనుమేని సాయుజ్యంబున్. ౧౬౩

వ. అనిన నా జగదీశ్వరుండు సురమునీశ్వరునితో వెండియు నిట్లనియె. ౧౬౪

ఉ. హారివిచార! నీవనిన యట్లు పురాకృతపుణ్యసంపదన్
వారల కావహిల్లె ముని వల్లభ దుర్లభమయ్యు నయ్యమ
ర్త్యారివిదారిమేనఁ గలయంగలపూనిక వారయేల? యె
వ్వారు గృహస్థధర్మవశవర్తులు వారలసొమ్ము ముక్తియున్. ౧౬౫

సీ. పరిణతయగు నింతి ప్రతికూలగాదేని, తనయుండు తనయాజ్ఞ దాఁటఁడేని
నిజసహోదరులు వినతులయి మనిరేని, కోడలోరుపుదక్కి గొఱఁగదేని
కూఁతురీలువునందుఁ గొదవచూపదయేని, ఋణమనుపాతకం బెనయదేని
తేజోగరిమ పరాధీనతఁ జెడదేని, నిందాంధకారంబు నెఱయదేని

తే. న్యాయమున మొల్లముల పెల్లుడాయునేని, యతిథిసంతర్పణంబింట నమరునేని
సముచితాచారమును గొనసాగునేని, కలదె? గృహమేధిధర్మంబు కంటె మేలు.

❀ అయుత, నియుతులను మునికుమారుల చరిత్రము. ❀

క. ఏనోహర మొక్కయుపా, ఖ్యానము గల దేతదర్థ మదియును వినినన్
మౌనివర! నీమనంబున, నూనినజడనుడుగు ననుచు నుగ్రుఁడు పలుకున్.

---

రాసకుశలు=రాసక్రీడయందు నేర్పుగలవానిని ॥ ౧౬౧ ॥ హాళి=ఆసక్తి. పైద = పిల్ల. గళదఘ్న దర్పతన్=గొంతానిన గర్వముచేత. వాలిన=అతిశయించిన. కలాసము – కృష్ణాజినము ॥ ౧౬౨ ॥ ౧౬౩ ॥ ౧౬౪ ॥ హారివిచార=మనోజ్ఞమయిన విచారణకలవాఁడా. ఆవహిల్లెన్=కలిగెను. అమర్త్యారివిదారి=కృష్ణునియొక్క ॥ ౧౬౫ ॥ పరిణత=పెండ్లాడినది. వినతులు=అణఁకువగలవారు. ఈలువునందున్=మంచినడవడియందు. మొల్లముల పెల్లు = ధనాధిక్యము— మేరలేనిధనము ॥ ౧౬౬ ॥ ఏనోహరము=పాపములనుహరించునది. జడను=ఆలస్యము-సందేహము. ఉగ్రుఁడు=శివుఁడు॥౧౬౭॥

తే. వింధ్య మమరాద్రిపోటికి వివిధతార
కములు మొలపూసలుగఁ బెరుగ మదిఁ దలఁచె
నెన్నఁ డటమున్న కాశిలో నన్నుఁ గొలిచి
ఘటజ మగుతేజ మింపొందు నుటజమునను. ౧౬౮

వ. అస్తంభతపోధనభావవిజృంభితుం డగునక్కుంభసంభవునకు నజస్రశుశ్రూషావికస్వరహృదయంబగుశిష్యసహస్రంబుగల దండుఁ బ్రయతుం డనుముని తనయు లయుతనియుతు లనువార లప్పారికాంక్షికిం బ్రేమాస్పదులయి యుండి రంత నొక్కకాలంబున నమ్మునిలోకపాకశాసనుండు నిజాంతర్గతంబున నిట్లని వితర్కించు. ౧౬౯

శా. ఈ నా శిష్యులలోన వీరిరువురున్ హృద్యానవద్యోదయ
జ్ఞానానూనవిచారవాగ్విభవతే జఃక్షాంతిశాంతిప్రథా
సానాథ్యంబునఁ గానిపించెదరు మత్సక్తాశయుల్ వీరి స
న్మానింపందగుఁ బాణిపీడనవిధా నశ్రీల వాలాయమున్. ౧౭౦

శా. వాసోనిగ్రహ మెన్న రాఁకలియు నీ ర్వట్టున్ గణింప ర్తలల్
మాసెంగా యన రంగముల్ బడలినం బాటింప రట్లుండనీ
యాసాయంబుగ నానిశాత్యయముగా నామ్నాయముల్ గ్రోల్చుచోఁ
నాసీనప్రచలాయితంబయిన లే దాహా! వితర్కింపఁగన్. ౧౭౧

క. వీరలకుఁ దగిన మగువల, ధారుణిఁ బొరయంగ లేర ధాతృతనయ లు
న్నారఁట సకరగ్రహణలు, గారఁట గొనివత్తు వారిఁ గమలజుచేతన్. ౧౭౨

వ. అని నిశ్చయించి యాసత్యవ్రతుండు సత్యలోకంబున కరిగి. ౧౭౩

---

ఉటజము = పర్ణశాల ॥ ౧౬౮ ॥ అస్తంభ = నివారింపఁగూడని. అజస్ర = ఎడతెగని. వికస్వర=వికసించిన. పారికాంక్షికిన్=మునికి. మునిలోక పాకశాసనుండు=మునులసమూహమునకు శ్రేష్ఠుఁడు. అంతర్గతంబునన్ = మనసునందు. వితర్కించున్=ఆలోచించెను ॥ ౧౬౯ ॥ హృద్య=మనోహరము. అనవద్య=నింద్యముకానిదియునై. క్షాంతి=ఓర్పు. శాంతి=తిన్నఁదనము. ప్రథా = ప్రసిద్ధి. సానాథ్యంబునన్ = కూడికచేత. మత్సక్తాశయులు = నాయందాసక్తమయిన మనస్సుగలవారు. పాణిపీడన విధానశ్రీలన్=పెండ్లిచేయుటవలని సంపదలచేత. వాలాయమున్ = అవశ్యము ॥ ౧౭౦ ॥ వాసోనిగ్రహము=వస్త్రములేమి. నీర్వట్టు=దప్పి. ఆసాయంబుగన్ = తెల్లవాతినదిమొదలు ప్రొద్దుగ్రుంకునంతవఱకును. ఆనిశాత్యయముగాన్ = ప్రొద్దుగ్రుంకినదిమొదలు తెల్లవాఱునంతవఱకును. ఆమ్నాయములు = వేదములు. క్రోల్చుచోన్ = వల్లించునపుడును. ప్రచలాయితంబు = కూరుకుపాటు. ఆహా = ఔరా ॥ ౧౭౧ ॥ సకరగ్రహణలు = పెండ్లియయినవారు ॥

సీ. శశిరేఖఁ గైకొన్న సౌవర్ణగిరిపోలె, మినుకుఁజేడియఁగూడి మెఱయువాని
నసురేజ్యుఁ బాటించుహాటకాద్రియుఁబోలె, నంచచెంగటనుండ నలరువాని
శారదాభ్రములంటు భూరిశైలముఁబోలె, దెలుపుఁగైసేఁతల వెలయువానిఁ
గకుబిభంబులమీఁది కాంచనాగముఁబోలె, వెలితమ్మిగద్దియ వెలయువానిఁ

తే. బొడవులన్నియుఁదనయందపొడమువాని, గడయునడుమును మొదలునేర్పడ
సచ్చిదానన్దకన్దమై హెచ్చువాని, నలువఁ జుళుకితపాథోధి తెలచెనుతుల [నివాని

క. తెలచిన మెలచినకృపకుం, గలఁచిన మదితోడ నతనిఁ గమలజుఁ డగ్ర
స్థలిని నిలిపి పలుకులపస, ధళధళలుముఖప్రఘాణ తలములఁ బొలయన్.

సీ. హుంకారములు లేవె యుపపురందరహాత్రో, త్పాటనంబునకుఁ బాల్పడవుగాక
భ్రూభంగములు లేవె యాభీలవింధ్యగ, ర్వస్తంభనమునకు రావుగాక
చులుకాకృతులు లేవె జలరాశినిశ్శేష, శోషణక్రీడకుఁ జొరవుగాక
జాఠరాగ్నులు లేవె జటిలాపివాతాపి, తనుదాహమున నెదుర్కొనవుగాక

తే. నిష్ఠనీమాడ్కి లోకప్రతిష్ఠగులిచి, దుష్టనిగ్రహశిష్టసంతుష్టిహేతు
రోషభీషణరేఖాని రూఢగాఢ, లీలఁ గ్రీడించుప్రోడలు లేరుగాక. ౧౭౬

తే. భువనసంభవదుపసర్గ నివహశాంతి, త్వన్ముఖంబునఁ జనఁ బెద్దతనముతోడ
నిందుధరుఁడన హరియన నేననంగఁ, బ్రోపుగంటిమి మిత్రావరుణకుమార!

సీ. అనియాదరించి యమ్మునివచ్చుటకుఁ బ్రయో, జనముఁ దద్విశదోక్తిసరణిఁ దెలిసి
యీవర్తియగుటకు నిది యెంత యనిశతా, నందుండు మున్నొక్కనాఁడు నిఖిల
యువతిసృష్టికి నెక్కుడవుగాకయని తన, యాత్మ నిర్మించి గాయత్రియనియు
సావిత్రియనియుఁ బ్రశస్తనామములిడ్డ, కూఁతులనొసఁగ గైకొనియతండు

తే. వారినట దెచ్చి తనకూర్చువారిఁ గూర్చి, యయుతనియుతులకెఱిగింపనందునయు
తుఁ,డొల్లఁడయ్యెనిజోద్యోగ మొల్లకున్న, నియుతునకుఁ బెండ్లిసేసె గన్నియలదోయి

౧౭౨ ॥ ౧౭౩ ॥ సౌవర్ణగిరి = మేరుపర్వతము. మినుకుఁజేడియన్ = సరస్వతిని. అసురేజ్యున్ = శుక్రుని. చెంగటన్ = సమీపమునందు. కైసేఁతలన్ = అలంకారములచేత. కకుబిభంబుల = దిగ్గజముల. వెలి = తెల్లని. గద్దియన్ = సింహాసనమునందు. పొడవులు = రూపములు - ప్రాణులదేహములు. పొడము = పుట్టు. కందము = మూలము. చుళుకితపాథోధి = పుడిసిటఁబట్టిన సముద్రముగలవాఁడు - అగస్త్యుఁడు. తెలచెన్ = సంతోషపెట్టెను ॥ ౧౭౪ ॥ అగ్రస్థలిన్ = ఎదుటిప్రదేశమునందు. ప్రఘాణతలములన్ = తలవాకిటిముందరిగదులందు. పొలయన్ = వర్తింపఁగా ॥ ౧౭౫ ॥ భంగములు = బొమముళ్లు. స్తంభనమునకున్ = నిలుపుటకు. చులుక = పుడిసిటియొక్క. జటి తాపి = ఋషులను తపింపఁజేయువాఁడైన. ప్రోడలు = నేర్పరులు ॥ ౧౭౬ ॥ ఉపసర్గ = ఉత్పాత

క. తనయాజ్ఞగూడ శతధృతి, తనయామణిఁగైకొనని హతనయాశయునిన్
ముసు చట్టు వెడలనడిచెను, ముని కినలి కఠోరవర్ణ ముగఁబలుకొలయన్.

సీ. కుటిలాలకములు చీఁ కటిప్రోగులగునైన,జిచ్చంద్రికాఢ్యముల్ చిత్తగతులు
మధురోష్ఠములు రాగమహితంబులగునైన,భావముల్ వైరాగ్య బంభరములు
కుచకుచంబులు గర్వ భరితంబులగునైన, హతదుర్వికారంబు లాశయంబు
లలవోకనడలు మాంద్యమయంబులగునైన,నంతరఙ్గములు బోధాస్పదములు

తే. పొగరుజూపులు చపలంబు లగునయ్యైన, నిండుమనములు మిక్కిలి నిశ్చలంబు
లవుర! వీరలకి ననొప్పనతివలందు,నిలిపె సమబుద్ధి ప్రియమూనినియతమూని.

క. ఈతఁడిటులుండ ముచుపటి, యాతఁడు హృల్లగ్నగుచుకృతానాదరుఁడై
శీతనగసవిధవసుధకు, నేతెంచి మనోగతమున నిటు లూహించెన్. ౧౭౧

చ. చిలుకలు కిమ్మఁదెమ్మెరలు శీతమయూఖుఁడు తేఁటులాదిగాఁ
గల ననవిల్తుసాధనని కాయము వేలముపట్టు లంగనా
కుల మటుగాన దానివిడఁ గొట్టక తృట్టైకదొట్ట వీతరా
గుల మని విఱ్ఱవీఁగెదరు కొందఱుబోడలు నానగండలై. ౧౭౨

క. జడలఁట చుట్టం గట్టం, గడవసమఁట మేనఁగప్పఁ గాషాయమఁటే
యడవుల నవయు తపస్వికిఁ, గడుసౌఖ్యమె కోరుసతికిఁ గలయికతగునే. ౧౭౩

సీ. ఉర్వీధరము లెక్కి యుఱుకనే కుచకుంభ,యుగ మొల్లఁగాక తానుఱుకుమనిన
వాఁడికైదువులపై వ్రాలనేనిడు చూపు, వాలొల్లఁగాక తా వ్రాలుమనిన
మున్నీటసుడివడి మునుఁగనే నతనాభిఁ, గనవొల్లఁగాక తా మునుఁగుమనిన
బెడఁగారు కాలాహిఁ దొడుకనే నూఁగారు,తొడుపొల్లఁగాక తాఁదొడుకుమనిన

తే. జెప్పిగురుఁడేమి పనిచినఁ జేయలేనె, కావెతనసొమ్ము మామక కాయకర్మ
గతులు మొఱ్ఱోయనంగలింగంబుగట్టు,జంగమననంగనలఁగూర్పఁజనదుగాక

---

ములయొక్క. చనన్=జరగఁగా ॥ ౧౬౭ ॥ ఎంత=ఎంతమాత్రము. కూర్చు=ప్రియమైన ॥ ౧౬౮ ॥ శతధృతి=బ్రహ్మ. హతనయాశయునిన్=కొట్టఁబడిననీతికి ఉనికిపట్టయినవానిని. చట్టున్=శిష్యుని. కనలి=కోపించి. కఠోర=కఠినమయిన ॥ ౧౬౯ ॥ చిచ్చంద్రికాఢ్యములు = జ్ఞానమనెడి వెన్నెలలు గలవి. అలవోక=ఒయ్యారమైన. బోధ=తెలివి. పొగరు=వాఁడియైన ॥ ౧౭౦ ॥ హృల్లగ్న=మనసునందుఁబొందిన. సవిధ=సమీపపు. మనోగతమునన్=మనసునందు ॥ ౧౭౧ ॥ కమ్మనిదెమ్మెరలు =పరిమళముతోడి చల్లగాలి. ననవిల్తు=మన్మథుని. వేలముపట్టులు = శిబిరస్థానములు. తృట్టు=ఆశ. ఎకదొట్టన్=ఎచ్చఁగా. నానగండలు=సిగ్గులేనివారు ॥ ౧౭౨ ॥ కడవసము=తోలు_కృష్ణాజినము. నవయు=కృశించు. కలయిక=చేరిక ॥ ౧౭౩ ॥ బెడఁగారు = అందగించు. తొడుకనే = పట్టనా.

తే. నెయ్యుఁడట్టిపనికి నియతుఁడ తగుఁగాక, గృహితకం బెవేత్త కీడుగలదె
గురుహితంబునూఁది యరిఁబడనేనోప,నను చుఁ బ్రహ్మచర్య మయుతుఁడొంది.

మ. సుముఖాంతశ్శిరణంబు మత్సరము నౌత్సుక్యంబునుం బాసి ధౌ
తమణీదర్పణరీతిఁ జెన్నుగఁ దదంతర్లగ్నమై యాదిత
త్త్వముదీపింపఁ దపంబొనర్చు జటిలవ్యాఘ్రింబనాఘాత్రిపు
ష్పము చందంబగు మేననూననియమభ్రాష్ట్రాగ్నిఁ దగ్గించుచున్. ౧౮౬

క. సర్వాతిరిక్తధృతియగు, నుర్వీసురసార్వభౌము నుగ్రతపమునం
బర్వెభయజ్వరదాహము, ఖర్వోద్ధతి నిఖిలభువనగర్భములందున్. ౧౮౭

క. మినుమినుకుమినుకుమనియెన్, బెనుమినుకులబరణి ధరణి బిట్టూటాడెన్
వననిధులు విరిసెఁ గురిసెన్, గనగనగనమనుచు నిప్పుకిలు గుప్పలుగన్.

ఉ. అత్తఱి నిప్పుద్రొక్కినటు లౌదలఁ దేల్గొనినట్టు లానయు
వ్వొత్తుగఁ ద్రావినట్లు విబుధేశుఁడు మాణవకోగ్రనిష్ఠకున్
జిత్తమునం దపించి యతిశీఘ్రగతిన్ క్షితి కేగుదెంచెఁ ద
ద్వృత్తము మానిపింతునని వృద్ధమహీసురవేషధారియై. ౧౮౯

సీ. జీర్ణకృత్తి వేష్టితశాస్త్రశబళికా, వారపేటిక లొక్క వటువు పూనఁ
గంబళకట్టబ్రుసీ కాషాయకరకంబు, లొక్కఁడంతేవాసి యుద్వహింప
నామ్లికాఫలసార యవసక్తుతండుల, సూపాదులొక్కశిష్యుండు మోవ
సమిదాజ్యపూరకీచకకుచస్రుక్స్రువ,చయ మొక్కఛాత్రుండు సంగ్రహింపఁ

తే. దలుగుదామెనఁబనఁచిన గళముతోడ,జంట వెన్నాడు క్రేపుతోఁ జాలనలసి
నడచు ధేనువునొకచిన్న వడుగురొప్ప,నయతునాశ్రమవాటమయ్యతిథిడాసి.

---

తొడుసు=తగులు ॥ ౧౮౪ ॥ నెయ్యుఁడు=మిత్రుఁడు. గృహిత=గృహస్థత్వము ॥ ౧౮౫ ॥ ఔత్సుక్యము=తమకము. అంతర్లగ్నము=లోపలనాటినది. జటిలవ్యాఘ్రింబున్=బుషిశ్రేష్ఠుని. భ్రాష్ట్రాగ్నిన్=వేఁపుడుమంగలపు నిప్పుచేత ॥ ౧౮౬ ॥ అతిరిక్తము = మీఱినది ॥ ౧౮౭ ॥ పెనుమినుకుల బరణి=సూర్యుఁడు. విరిసెన్=పొంగెను ॥ ౧౮౮ ॥ తేల్గొనినట్టులు=తేలుకుట్టినట్లు. ఉవ్వొత్తుగన్ =మిగులు క్షేమండ_అధికముగా. మాణవక=బ్రహ్మచారియొక్క. వృత్తము=వ్యాపారము ॥ ౧౮౯ ॥ జీర్ణకృత్తివేష్టిత=పాతకృష్ణాజినముచేత చుట్టఁబడిన శబళికా=నానావర్ణమయిన. బ్రుసి = యతులయాసనము. కరకంబు=కమండలువు. అంతేవాసి = శిష్యుఁడు. ఉద్వహింపన్=మోవఁగా. సక్తు=పిండి. కీచకకుచ=వెదురుసోల. స్రుక్స్రువచయము=హోమము వేల్చుకొయ్యగరిటెల సమూహము. ఛాత్రుండు=శిష్యుఁడు. తలుగు=పలుపు. వెన్నాడు=వెంబడించు. క్రేపుతోన్=దూడతో. వడుగు=బ్రహ్మచారి. రొప్పన్=తోలఁగా ॥ ౧౯౦ ॥ గృహమేధిని=ఇల్లాలు. పట్టు=చోటు. జర=

క. శిరసువడంకఁగఁ దెల్లఁగ, నరసిన గృహమేధినియును నడచేఁ దదంగం
బిరవుకొని పట్టుచాలక, జర కొంత వినిర్గమించి చనుదెంచుక్రియన్, ౧౯౧

వ. ఇట్లు కుహనాహితాగ్నియుఁ దైర్థికవేషాభినయనిపుణుండు నగు నాఖండ లుండు తపఃప్రభావతరంగితం బగు తదాశ్రమంబునఁ బటకుటికా మండప మధ్యంబున నధ్యాసించి మాధ్యాహ్నిక క్రియాచరణానంతరంబునం బ్రా ణాగ్నిహోత్రప్రీణనంబు ననుసంధించి యతిస్నిగ్ధవర్ణముగ్ధాకృతియుఁ జతుర పదవిన్యాస ధన్యాసికయునై కవికవితయుంబోలె నున్న హోమధేనువునకుఁ బథశ్రమంబునోసరించుచు నుచితగతి నొక్కించుక తడవు విశ్రమించి సఛా త్రుండై మెత్తమెత్తన చని యొండకండక్రొవ్వుదఱుఁగు నత్తటి సరిత్తీరం బునకు సాయంసంధ్యాసముపాసనార్థంబు నిర్గమింపనుద్యుక్తుండై ముక్తస మాధియగు నయుతునికడకుంజనుటయు నతం డతనికి నాతిథేయంబు ప్రియం బుననాచరించి సుఖాసీనుఁగావించి యాగమనకారణంబడుగుటయుఁ గృత్రి మముని ధాత్రీసురపుత్త్రున కిట్లనియె. ౧౯౨

చ. అమృతభుగాస్పదంబు విశదాప్సరమున్ నవపారిజాతము
ఖ్యమహిజరాజిరాజిత మనంతఫలాయతనంబు నిత్యర
మ్యము నగు నొక్కయాశ్రమము హైమనగోపరిసీమ నుల్లసి
ల్లు మదధివాసమై మదము లోభము క్రోధము మొల్వదచ్చటన్. ౧౯౩

క. శ్రీసఖులు సుగుణరత్నా, వాసులు సమవర్తనప్రవర్తులునయ్యున్
నాసరివారలుగని మనఁ, గా సుఖినై యేనొనర్తుఁ గాఁపురమచటన్. ౧౯౪

తే. అఖిలధర్మంబులందు గార్హస్థ్యమెన్న, నుత్కటంబని తన్నిష్ఠ నోర్పుగలిగి
జగతిఁ దీర్థాచరణబుద్ధి సంచరింతు, ధ్రువతపోగామి యీమేనుధ్రువముగామి

ఉ. కంచి భజించి శేషగిరిఁ గన్గొని యాదిమురంగధామ్ముఁ గీ
ర్తించి ప్రయాగమాధవు నుతించి గయాప్రియు శ్రీగదాధరున్

---

ముసలితనము. వినిర్గమించి=బయలువెడలి ॥ ౧౯౧ ॥ కుహనాహితాగ్ని=కపటగృహస్థుఁడు. తైర్థిక =తీర్థయాత్రచేయువానిదైన. తరంగితము=అతిశయించినది. పటకుటికామండప మధ్యంబునన్ = గుడారపు నడిమిప్రదేశమునందు. అధ్యాసించి=కూర్చుండి. ప్రీణనంబు=తృప్తిని. ధన్యాసిక=ధన్య త్వముగలది. ఓసరించుచున్=తొలఁగించుచు ॥ ౧౯౨ ॥ అమృతభుక్=దేవత. విశదాప్సరము=తేట నీళ్లసరస్సులుగలది; పరిశుద్ధలయిన యప్సరస్త్రీలుగలది. ఆయతనము = ఇల్లు ॥ ౧౯౩ ॥ ౧౯౪ ॥ ఉత్కటము=హెచ్చైనది ॥ ౧౯౫ ॥ ఆదిమున్=మొదటివానిని. కొయ్యవేల్పున్=జగన్నాథుని ॥

గాంచి కరిద్విషన్నగశిఖామణికిన్ బ్రణమిల్లి వార్ధి నే
తెంచిన క్రొయ్యవేల్పుఁగని దిక్కులతీర్థము లెల్ల నాడుచున్. ౧౯౬

ఉత్సాహ. వచ్చివచ్చి కల్పకంబు వంటి యొంటివానిఁ గ
న్నిచ్చవచ్చు గ్రచ్చకాయ లెంచియాడువాని మో
విచ్చునచ్చగంటివాని వింటి వెన్నముచ్చు న
ప్పచ్చవిల్తుఁ గన్నతండ్రిఁ బాండురంగవిట్ఠలున్. ౧౯౭

వ. విని యద్దేవాదిదేవు సేవింపంజనువాఁడనై పైజాడసపరిచ్ఛదంబుగా నేగు దెంచితి నీవెవ్వఁడ వెద్దియభిలషించి భువనభయానకంబగుతపం బాచరించె దు? వాచంయమవంశకంఠీరవంబ! యీ శరీరసాదంబునకునాదికారణం బగు నీహృదయంబని యుచ్చరించుటన నోరుపొక్కుచున్నయది యన్నయట్ల నొడువు మనుడు నవ్వడు విట్లనియె. ౧౯౮

క. ప్రయతుఁడనుమునికుమారుఁడ, నయతుండనువాఁడనియుతునగ్రజుఁడగత
స్మయ! విస్మయావహతపో, నియతి వెలుఁగు కలశజన్ము నికి శిష్యుండన్. ౧౯౯

క. కులశిఖరినిభులు తనకుం, గలశిష్యులలోన నెల్ల గారవ మారం
గలశీసుతుండు కరుణా, కలశీతలదృష్టి బెరయఁగా మముఁ జూచున్. ౨౦౦

ఉ. దాతయు దైవముం గురుఁడుఁ దల్లియుఁ దండ్రియునై యభేద్య వి
ద్యాతిశయంబు రాఁ జొనిపి యమ్మురి మున్నొకనాడు ధాత్రుసం
జాతల సత్సితాస్యజల జాతల జాతలతాంతసాయక
ద్యోతల నొక్కయిద్దఱుత లోదరులన్ మముఁ జూచి యిట్లనున్. ౨౦౧

క. మీకని కొనితెచ్చితి నా, ళీకాసను వేఁడి యిన్నలిననయనల మీ
రోకుఱ్ఱలార! పాణి, స్వీకృతి జ్యేష్ఠానుపూర్విఁ జేకొనుఁ డనుడున్. ౨౦౨

క. అవగుణగణ శేవధు లగు, ధవళాక్షుల కీడు దలఁచి దారాదరణ
వ్యవహృతికిమాఱు మొగమిడి, యవు గాదనికొన్నిమాటలాడితినతనిన్. ౨౦౩

క. ఆడినఁ గూడినకినుకన్, వీడినజడముడియుఁ బొగలు వెడలెడిచూపుల్
పోఁడిమిగొనునిట్టూర్పులు, వాడినడెందమును మేనవడియుఁ జెమటనై. ౨౦౪

---

౧౯౬ ॥ పచ్చవిల్తున్=మన్మథుని ॥ ౧౯౭ ॥ సపరిచ్ఛదంబుగాన్ = పరిజనముతోఁగూడ. సాదంబునకున్=నాశమునకు, వడువు=వడుగు-బ్రహ్మచారి ॥ ౧౯౮ ॥ గతస్మయ=పోయిన గర్వముగలవాఁడా ॥ ౧౯౯ ॥ గారవము=ప్రేమము. బెరయఁగాన్=వ్యాపింపఁగా ॥ ౨౦౦ ॥ ధాతృసంజాతలన్=బ్రహ్మకొమార్తెలను. ద్యోతలన్=తోఁపించువారిని ॥ ౨౦౧ ॥ ౨౦౨ ॥ శేవధులు=నిధులు,

క. శపియింపఁగఁదలఁచియు న, త్తపసియుడిగెఁగ ఆవఁదలఁచితానెయుడుగుపా
ముపగిది శిఖ విడినంతనె, విపులామర విపులకోప విషముం దిరుగన్. ౨౦౫

క. నను వెడల నడిచి నాత, మ్మునికి వివాహంబొనర్చె మునీ కినకవిభా
జనకతనుద్యుతివిభవల, వనరుహభవమానసోద్భవల నా కవలన్. ౨౦౬

క. సలసలమనుకలశజువె, గ్గలపుంగినుకయనునెసటఁగలవడి వడి నా
దలయంటి చూచుకొని యే, నిలువెడలితి నాత్మఁ౦బ యెత్తినభీతిన్. ౨౦౭

తే. విషనిభంబులైన విషయాభిలాషంబు, లెల్లజెల్లఁబెట్టి యేను బ్రహ్మ
చర్యధుర్యవృత్తి సవరించుచున్నాఁడ, నుగ్రతపము మోక్ష మొందుకోర్కి.

క. అనుడు దరహాసరసమునఁ, దనవదనజరద్విధుండు తారుణ్యముగై
కొన మందాందోళనమే,ళనమునశిరమమర మాయలాఁడిట్లనియెన్. ౨౦౯

చ. ప్రయుతుఁడు మత్సఖుం డతని ప్రాభవమున్ భవమున్ సుధీజన
ప్రియజనకంబు లాగుఁగ రిష్టుని జ్యేష్ఠతనూజుఁ డాట మ
న్నయనయుగంబు హార్దసుధ నానె నినుం గనుఁగొన్న సాధుబో
ధయుత! భవద్విరుద్ధచరితంబు శ్రవఃపుటసూచి యయ్యెడున్. ౨౧౦

మ. కులధర్మం బెడలించి శ్రీగురునకున్ గోపంబుపుట్టించి మి
త్రుల సౌభ్రాత్రనివాసదేశముల నీ తోఁబుట్టులం బాసి ని
శ్చలతన్ బ్రేలెద వుట్టిగట్టుకొని దుస్సాధంబుసుమ్మీ స్మర
జ్వలనజ్వాలికి సోఁకనీకి నిలుపన్ జ్ఞానామృతస్యందమున్. ౨౧౧

చ. చలనవిహీనవృత్తి సడి సన్న పరాశరుఁ డాదిగాయైనయ
య్యల యలరాయివంటిహృదయంబులునీరుగఁజేయు బోయ పూ
విలుతున కెంతదొడ్డపని వెన్నెల బిట్టనికాసినంతలో
లలన కరంగిపోంగు పసి బాలుర చిత్తము మెత్తచేయఁగన్. ౨౧౨

---

వ్యవహృతి = వ్యవహారము ॥ ౨౦౩ ॥ చెమరు= చెమట ॥ ౨౦౪ ॥ ౨౦౫ ॥ విభాజనక = కాం తిని పుట్టించుచున్న. కవలన్ = అపడలను. ॥ ౨౦౬ ॥ వెగ్గలపుంగినుక=అధికకోపము. ఎత్తిన= హెచ్చిన ॥ ౨౦౭ ॥ సవరించుచున్నాఁడన్=జరుపుచున్నాను ॥ ౨౦౮ ॥ జరత్=ముదిసిన. మంద =మెల్లని. ఆందోళన=ఊఁగించుటతోడి. మేళనమునన్=కూడికతో. మాయలాఁడు=మాయకాఁడు॥ ౨౦౯ ॥ హార్ద సుధ నానెన్=సంతోషామృతము ననుభవించెను. శ్రవఃపుట = దొప్పలవంటిచెవులకు. సూచి=సూది ॥ ౨౧౦ ॥ ఎడలించి=తొలఁగించి. దుస్సాధంబు=సాధింపరానిది. స్మరజ్వాలనజ్వాలిక =మన్మథాగ్నిజ్వాల. స్యందమున్=ధారను ॥ ౨౧౧ ॥ సడిసన్న=నిందింపరాని ॥ ౨౧౨ ॥ చేలదోఁ

మ. లలితాగారవిహారులై మణిమయాలంకారులై శీలవ
ల్లలనాలాలితులై యమూల్యమృదుచేలద్యోతితాకారులై
కలమాన్నప్రియులై సుగంధధరులై కందర్పునింబోని భూ
తలనాథుల్ జనకాదులొందిరికదా తత్తాదృగానందముల్. ౨౧౩

మ. కలరో వార్తలు విప్పిచెప్పెదుక్రియన్ గాథాపురాణార్థముల్
దెలుపన్ నేర్తురుగాని నేరరుసుమీ తీవ్రవ్రతాచారశ
ష్కులులై యుండెడు ముండధారులు సుముక్తుల్ డాయఁగాఁ జింతకా
యలకజ్జాయముతోయ మింతచదరంబా తత్పరిష్వంగముల్. ౨౧౪

మ. వరసారస్వతపట్టభద్రులు కవుల్ వర్ణించివర్ణించియున్
సరసావంతయుఁ గానలేరు తుద యోషావిభ్రమాంభోధికిన్
విరసాంతఃకిరణుండవై యెటులుగా నిందించెదో యయ్య త
త్సరసాకార ముదారమన్మథకళాసర్వస్వశృంగారమున్. ౨౧౫

సీ. కీలారమునునుండి పాలింటికే తేర, బహుధాన్యములు చేలఁ బండియొరగ
నెడనెడఁ బెండ్లిండ్లు వడుగులు వోడమఁగృ తార్థులై యర్థించు నర్థులలరఁ
బరిచారికాకోటి పనిపాటుపాటింపఁ, జుట్టంపుసందడి నెట్టుకొనఁగ
గ్రామమెంతయునిజ ప్రాభవంబునమన, సత్యనిష్ఠకుఁ దన్ను సాక్షిగోర

తే. నిత్యనైమిత్తికములు నిర్ఛిద్రబుద్ధి, నాచరించుచు హరిభక్తి మాత్మభార్య
భక్తినిడభుక్తిగొనుచున్కి ముక్తిగాని, నిదురవంటిదిజాతివంటిదియుఁ గాదు.

క. అని తను నీక్రియ బోధించిన జరఠతపస్విపలుకుఁ జిత్తాభోగం
బునఁ బెనఁగనీక ప్రయుతుని, తనయుఁడు తనయుండుబిగివదలకిట్లని యెన్. ౨౧౭

ఉ. పుక్కిటి యోవరిం జదువుపుత్తడి హత్తిన పెద్దనైన మీ
రొక్కొకవేళ పాటవము నొందమిఁ జెందినఁ జక్కఁబెట్టువా

---

తీత=వస్త్రములచేత ప్రకాశింపఁజేయఁబడిన. కలమాన్న=వరియన్నమునందు. తత్తాదృక్ = దానికి దగిన ॥ ౨౧౩ ॥ శష్కులులు=చక్కిలములు – కృశించినవారు. ముండధారులు = ఏకదండిసన్యాసులు. తోయము=విధము. పరిష్వంగములు = ఆలింగనములు ॥ ౨౧౪ ॥ సారస్వతపట్టభద్రులు = విద్యలందురాజులు. ఉదార=గొప్పవాఁడైన. కళా=విద్య ॥ ౨౧౫ ॥ కీలారము=మంద. అర్థులు=యాచకులు. అలరన్=సంతోషింపఁగా. ప్రాభవంబునన్=ప్రభుత్వముచేత. నిర్ఛిద్ర=పరాకులేని ॥ ౨౧౬ ॥ జరఠతపస్వి=ముసలిముని. చిత్తాభోగంబునన్=మనోవృత్తియందు ॥ ౨౧౭ ॥ ఓవరి=ఉప్పరిగ. చదువుపుత్తడి=సరస్వతి. (పుత్తడి=కీలుబొమ్మ) బెడఁకి=తప్పి ॥ ౨౧౮ ॥ బహిష్కారము =

రక్కట యొక్కటక్ బెడఁకి యాడినఁ గీడన నెవ్వఁడోప్పఁ బే
రుక్కన నేఱునిక్కిచన నొక్కఁడు వంకలునొక్క శక్తుఁడే? ౨౧౮

క. నిష్కారణముగఁ దన్ను బ, హిష్కారమునొందఁజేయు నిల్వాలవైరిక్
శుష్కీభూతకరణహృ, త్పుష్కరుఁ డితఁడనఁగనన్ను దూఱందగునే. ౨౧౯

క. మమకారదూరునకు మిత్రములు గళత్రములు నన్నదమ్ములు ననుబం
ధముల పరిష్వంగము ధర్మమె మైకొనమఁఱుఁగునగము మైలయునగమే.

తే. గాఢవిజ్ఞానమయమనో గూఢమైన, నిర్మమునిధైర్య మతనుండునేరఁడుగొన
దానధారాకరాళకాం తారదంతి,కుంభముక్తాహరణమొనఁ గూడునెట్లు?

క. అకుటిలగుణవాసనతో, న కలిగి మనువంపులేఁగొ నయ్యఁబోలిన శ్రీ
శుకు నెన్నరేమి సారె జనకు నెంతురు పరముఖోప నతవిజ్ఞానుక్. ౨౨౨

చ. మునిజనభాగధేయ మగు మోక్షముపక్షము లేకపల్కి నీ
వనఘవిచార! సారె గొని యాడెదు బూడిదబొట్టువోని యీ
చెనఁటిగృహస్థధర్మ మది చిమ్మెట సింగమె గాజు రత్నమే
కనకశలాటుకాధమము కల్పఫలంబె? చలంబులేటికిక్. ౨౨౩

ఉ. సంపదచేతఁగాని కొనసాగవు సువ్వె గృహస్థధర్మముల్
సంపద పూర్వజన్మవిక సత్సుకృతంబునఁగాని చేరదా
సంపదచేరియుక్ స్మరవ శంవదుఁజేయు మహాత్ము నేనియుక్
జంపకు నన్నుఁ గన్నుసిమి చంపుడు ముంపుడుబోధగాథలక్. ౨౨౪

శా. కందర్పాస్త్రములంచు సంచితతటి త్కాండంబులంచుక్ సుధా
మందస్యందములంచు కాంచనలతా మత్తల్లులంచుక్ సుధీ
బృందంబుల్ ధ్వనినిందలం దెగడు నీ బింబోష్ఠులందెల్ల నా
నందాభాసమె కాక భాసితచిదా నందంబు పొందునే? ౨౨౫

చ. కురులసిరుల్ మెఱుంగుఁజను గుబ్బలనిబ్బరముల్ మొగంబువి
స్ఫురణము లింద్రనీలమణి భూధరశృంగకురంగలాంఛనా

---

వెలి. హృత్పుష్కరుఁడు=మనఃకమలముగలవాఁడు ॥ ౨౧౯ ॥ పరిష్వంగము=చేరిక. మైకొనక = ఒప్పుకొన ॥ ౨౨౦ ॥ నిర్మముని=మమకారము లేనివానియొక్క. కరాళ=భయంకరమైన ॥౨౨౧॥ ఉపనత=పొందఁబడిన ॥ ౨౨౨ ॥ భాగధేయము= భాగ్యము. చెనఁటి = వ్యర్థమయిన ॥ ౨౨౩ ॥ ఉసిమి = పులిమి—కప్పి. ముంపుడు = ముంచునట్టి ॥ ౨౨౪ ॥ తటిత్కాండంబులు = మెఱుపుల సమూహములు. స్యందములు = ధారలు.మత్తల్లులు = శ్రేష్ఠములు, తెగడు = నిందించు ॥

దరవశదృష్టిఁజూచెదవు తాపసవంశవతంస! తజ్జరా
భరమున వచ్చుతెల్పుఁబడు పాటు వళీవలనంబు నుండఁగన్. ౨౨౬
క. కుల మొల్ల గోత్ర మొల్లక, గలకంఠుల నొల్ల నొల్లఁ గలుములు బాధా
నలహుతదుర్భవబాధా, నలమతినై కందు నొకథ నముచేననుచున్. ౨౨౭
క. ఒకటికిఁ బదియుఁ బదింటికి, నొకనూఱును గాఁగఁ దనదు యుక్తులకుఁ జలిం
పక నొడువు వడువు దృఢని,ష్టకునలరియుఁ బలుకుఁ గపట సంయమికినుకన్.
సీ. పందకుఁ బోటు లో భగ్రస్తునకు నీఁగి, బోయకుఁగరుణ నపుంసకునకు
నంగనాసుఖము నె ఱింగించు తెఱఁగయ్యె, నాబుద్ధి నీయందునాటకునికి
నెటులైనఁగమ్మ నీ విది వోలునిదివోల, దని దెల్పఁ దెలియునే యసదుఁబోడువ
నిమ్నాభిముఖమైన నీటి నెవ్వాఁడోపు, ద్రిప్పియొప్పగుచోటఁ దిరుగఁజేయ
తే. నలమిగుడిఁ మింగువానికిఁదలుపులప్పు,డములుగాకుండునేయగ స్త్యమునిపనుపు
మీఱియూరకిగుర్పునమిన్నుముట్టు, నింత మేటికి నామాట యెంత పాటి.
ఉ. వ్యాసుతాదులం దలఁచి వానికి మంగలకత్తి మ్రింగె దా
సాసలనట్టుచాఁచె దదె యందనిపంటికి బొందితోన కై
లాసము జేరఁజూచెదు చ లం బది యేమిఫలంబటంచు నా
భూసురుఁ డీసు వెంచి ముని పుత్త్రికుఁ బాసి తొలంగి వెండియున్. ౨౩౦
తే. కామధేనుముఖంబునఁ గార్యసిద్ధిఁ,బడయనూహించిమాయలువన్నిచని యె
వినుమునిశ్రేష్ఠతపముగావించువారిఁ,గనినఁదలయేర్చుఁగా దెయాఖణ్డలునకు
సీ. ఉద్యదుత్థానస ముద్యోగమాత్రావ, శిష్టచేతస్సార దష్టదర్భ
క్షతికృదుగ్రధ్వాంక్ష తతినివారణవిధా, త్వరమాణవాలాగ్ర దంశవిహిత
నాదృతాధశ్శయ నారంభవిస్రంభ, గళకంబళాభోగఁ గాతరాక్షి
నేకపార్శ్వస్థతి స్వీకారనిర్భగ్న, చరమోరుకరశల్య సాంద్రబాష్ప
తే. దుగ్ధసేవాసమయబోధ ముగ్ధవత్స, పీడితాపీనపర్యంత పృథులదామ
వేష్టితగ్రీవ నటచూచె విప్రుఁ డొక్క, యర్జుననిజోటజప్రఘాణాంతరమున.

---

౨౨౫ ॥ నిబ్బరములు=బిగువులు. వళీవలనంబు = కడుపుమీఁదిముడుతలచుట్టుకోలు ॥ ౨౨౬ ॥ ౨౨౭ ॥ ౨౨౮ ॥ పంద = పిఱికి. పోటు = యుద్ధము. ఈఁగి = దానము. అసదుఁబోడువ = అల్పదుష్టుఁడు. నిమ్నాభిముఖము = పల్లమునకుఁదిరిగినది. పనుపు=ఆజ్ఞ. ఇగుర్పునన్=చిగిరించుట యందు—మొలకెత్తినప్పుడే ॥ ౨౨౯ ॥ ౨౩౦ ॥ తలయేర్చున్=తలనొచ్చును ॥ ౨౩౧ ॥ ఉత్థాన=లేచుటకు, దష్ట=కఱచిన, క్షతికృత్=గాయముచేయుచున్న. ధ్వాంక్ష=కాకులయొక్క. విధా =

క. చూచి యిది యల్ల మున్నటి, వాచంయము వేల్మిగిడ్డి వడువాఁ దెడు నీ
నైచికికి నెట్లొకో యీ, నీచత వాటిల్లె నిన్న నేటనె యనుచున్. ౨౩౩

చ. మఱిఁ గృపగ్రమ్మ బాడబకు మారశిరోమణి యుద్ధరించె భూ
పతితఁ దపస్వి రోహిణి న పాయపరంపరఁ బాచి సాఁకి యూ
ర్జితబలఁ జేయఁగాఁ దలఁచి శిష్టహితత్ గలికాలజాతదు
స్థతఁబడు ధర్మదేవత శ తచ్ఛదలోచనుఁ డెత్తుకై వడిన్. ౨౩౪

క. పడఁబడఁ బాఱుచు గడగడ, వడఁకుచు మొదవింతనిలిచె వనజాక్షుఁడు మున్
వెడలింపఁగ జలనిధి వెలు, వడి యించుక దెలియు పుడమిపడఁతియుఁ బోలెన్.

చ. పదములకొంకువోఁ బసికి ప్రక్కల స్రుక్కెడలించి దంశవం
శదమనవృత్తి నింపొసఁగి సాస్న నఖంబుల దువ్వి నెత్తురుల్
చిదికెడుగండ్ల భూరజము చిల్కు ముఖస్థ తృణంబు ద్రోచి య
మ్మొదవు మృదుక్రియన్ నడపి ముంగిటఁ బందిటిరాటఁ గట్టుచున్. ౨౩౬

క. చేతోజహాయచ్ఛాయా, పాతాసహమైన మంచి పచ్చికయు విని
ర్ధౌతకలధౌతదండవి, భాతులితజలంబులం ద పసి ప్రియమెసఁగన్. ౨౩౭

సీ. పడఁబడ నెత్తఁ బా ల్పడియున్కి నాసనా, భ్యాసనైపుణశక్తి పట్టువదలె
నులపాంకురము లేర్చి యులుపవట్టెడుపూన్కిఁ గుశపల్లవాహృతి కుంటువడియె
సడలంగ మెడరజ్జు గడువడి నిడుతమి, నక్షసూత్రవృత్తి యవలఁ జనియెఁ [త్ర
బొలయూడ్చితినుటకుఁ బొలయుపుల్గులఁ బోవ, నదలించుహుంకృతిఁ బెదరె మంత

తే. మాసలన్నియు మొదలంటఁ గోసియున్న, గోఁచికట్టునకటువంటి గోడవగడవ
రాక మెడఁ జుట్టుకొనియె నూరక యకార్య, కరణశీలురకెప్పాటఁ గలదె సుఖము.

చ. విబుధతపోధనేంద్ర ! విను వేయువిధంబుల నాతఁ డేద నే
చి బలవిభేదినైచికి వి శృంఖలమై ఖలమైత్రిఁ బోలె వే

---

పనియందు. దంశపిహిత=అడవియీఁగలచేత కప్పఁబడినది. విస్రంభ=మైత్రిగల. గళకంబళ=గంగ డోలుయొక్క. కాతర=వెఱచిన. చరమోరు=వెనుకటి తొడయొక్క. అర్జునిన్=ఆవును ॥ ౨౩౨ ॥ వేల్మిగిడ్డి=హోమధేనువు. వడువు=విధము. నైచికికిన్=ఆవునకు ॥ ౨౩౩ ॥ రోహిణిన్ = ఆవును. దుస్థతన్ = పేదఱికమునందు—హీనదశయందు. శతచ్ఛదలోచనుఁడు=విష్ణుఁడు ॥ ౨౩౪ ॥ మొదవు =ఆవు ॥ ౨౩౫ ॥ కొంకు=దడ. స్రుక్కు = ముడుఁత. సాస్న=గంగడోలు. గండ్లన్ = గాయములందు. చిల్కు=చల్లి. రాటన్=కంబమునందు ॥ ౨౩౬ ॥ ౨౩౭ ॥ ఉలపాంకురములు = గడ్డిమొలకలు. ఉలుప=కానుక. కుంటుపడియెన్=నిలిచిపోయెను. పొల=మాంసము. పొలయు=చుట్టుకొను. గోఁచికట్టునకున్=బ్రహ్మచారికి. గోడవ=దుఃఖము ॥ ౨౩౮ ॥ ఏదన్=పోషింపఁగా. ఏచి=బలిసి.

గ బలవిహీనతార్తి యుడు గంగడుఁ గ్రొవ్వున నివ్వటిల్లి పె
ద బలిసి బందికాఁడగువి ధంబునఁ ద్రిమ్మరు నమ్మహాటవిన్. ౨౩౯

ఉ. గుండువలెన్ బలియ మగు గోడియతోడఁ జరింప నారఁగాఁ
బండినబల్సువంటి పసి భాసిలుమై సరిచూడ్కికెంతయున్
బండువొనర్ప నల్పగతి పాలజనింప సమాంసమీనకున్
వెండియు నిల్చెఁ జూలు దధి పీదిమణీఘృణిచొచ్చుచాడ్పునన్. ౨౪౦

ఆ. వత్సయుతయు గర్భవతియునై మాహేయి, పతివ్రతంబునణఁపవార్చియుండెఁ
గంజగర్భతర్ణకయుజగద్గర్భయు, నైనయనుఁ జెఱుపు టావుఁబోలె. ౨౪౧

క. లోచనవికృతి ముకురమున, గోచరమగుపగిదిఁ గపటగోచరితము దన్
మోచిన వాచంయమసుతుఁ, డే చిననెవ్వగలబోగిలియిట్లూహించెన్. ౨౪౨

సీ. వత్సనాభీగంధ వహమయ్యె నీ యావు, పైగాలి నీవార పాకములకుఁ
గఠినకుద్దాలవ క్త్రిములయ్యెనీ జన్నె, మునుడెక్క లక్కందమూలములకుఁ
జటులదవానల చ్ఛటయయ్యె నీ గిడ్డి, కటుజిహ్వ బర్హిర్ని కాయములకు
నారణోచ్చారణోద్ధతులయ్యె నీ తొఱ్ఱు, కంఠహుంకృతు లేణ గర్భిణులకు

తే. నాకు మొగమోడియాఁగాద నపతిపస్వ, లేలయీమైలపూయకిదూలదీని
వత్సయుతముగనీవనీ వాటమునకు, లాడిగావింతు నంతఁ దొలంగుదూఱు.

ఉ. దండమె దీనివాలధిను ధానిభవాఁశికరకంజె దీనియా
కుండపొదుంగు దీనిముకుఁ గ్రోళులు భూమిపెలాంతరంబుతే
గండపటంబె దీనిమెడ కంబళమంచుఁ ద్యజించె నోసి య
క్కొండొకబ్రహ్మచారి మది గూకులువత్తులునై యసద్గతిన్. ౨౪౪

తే. క్రేపువాపోవఁబట్టిలంకియకుఁదార్చి, తోలవియఁగొట్టిమెడనొక్కతుండుగట్టి
గిడ్డివెడలించెఁదలత్రాడు కేలఁదొట్టి, మారివెడలించువడువున మాణవకుఁడు.

---

విశృంఖలమై=అడ్డములేనిదయి ॥ ౨౩౯ ॥ సమాంసమీనకున్ = ఏఁటేఁటనీనెడి యావునకు ॥ ౨౪౦ ॥ మాహేయి=ఆవు. వార్చి=ప్రతీక్షించి. తర్ణకి=లేఁతదూడగలది ॥ ౨౪౧ ॥ ముకురమునన్= అద్దమునందు. నెవ్వగలన్=అధికవిచారములచేత॥౨౪౨॥ వత్సనాభి=వసనాభియనెడువిషము. నీవార పాకములకున్=నివ్వరిపంటలకు. జన్నె=ఆవు. డెక్కలు=గిట్టలు. గిడ్డి=ఆవు. బర్హిస్సు = దర్భ. ఆరణ=గర్భస్రావము గలిగించెడి వేదమంత్రములయొక్క. తొఱ్ఱు=ఆవు. దూల=తీఁట. లాడి=బలి॥ ౨౪౩ ॥ వాలధి=తోఁక. గండపటంజె = తెరచీరయా. కొండొక=చిన్న. కూకులువత్తులునై = మిక్కిలి కలవరము నొంది ॥౨౪౪ ॥ క్రేపు=దూడ. వాపోవన్=అఱవఁగా. లంకియ=పెన. తారిచి

క. ఆధేనువు తత్కృతబహు, బాధల సక్రోధయగుచుఁ బరతత్త్వసము
ద్బోధకబోధకలితుఁడగు,వాధూలమునీంద్రు డుండు వనమునఁబడియెన్.

క. పులియున్న పొదరు మొసలికి, నెలవగుబలుమడువు ద్రాఁచు నిల్చినవల్మీక
బిలమన నమ్మునివన మెవ్వలనంజొరఁజనదువాసవప్రభృతులకున్. ౨౪౮

శా. ఆమాయాగవి మట్టె నట్టడవిలో నత్యుద్ధతిన్ రేసి మ
ధ్యేమార్గంబున నభ్రగర్భితసురాద్రింబోలి వల్మీకరే
ఖామగ్నాకృతినున్న యున్నతతపః కౌశల్యశల్యున్ గత
వ్యామోహున్ జిరజీవి దేవతులితున్ వాధూలవాచంయమున్. ౨౪౯

ఉ. మట్టిన బిట్టు మిట్టిపడి మౌని సముత్థితుఁడయ్యె మేనిపై
పెట్టినపుట్ట నెట్టవిసి బీఁటలువాఱ శ్రవశ్శకుంతముల్
చట్టుపలెత్తి ముందఱికి సాఁగఁదలంప జటాచ్ఛటాచ్ఛవిన్
ద్రుట్టెలుగట్టి నిద్రిలు మరుద్భుగధీశకులంబు మేల్కొనన్. ౨౫౦

మ. కసవుందీవలు దావపావకశిఖా ఘుంబుల్ ప్రకాశింప వె
క్కసమై తోఁచిన కొండచందమున దీర్ఘశ్మశ్రుచంచచ్ఛటా
విసరక్రోధరసోగ్రమూర్తి యగుచున్ వృద్ధవ్రతిశ్రేష్ఠుఁ డా
త్మసమీపస్థితు హస్తముక్తిసురభిన్ దద్వర్ణి వీక్షించుచున్. ౨౫౧

ఉ. ఓరి దురాత్మ! యోరివిన యోజ్ఝిత! యోరి మదాంధ! యెందు నే
వారికిఁ జేరరాదు మను వారికి నావన మీవు చొచ్చి జం
భారికృతోపఘాతగత హార్యముగాని మదీయఘోరదు
ర్వారసమాధిగౌరవము వమ్ముగఁ జేసితి వాసురక్రియన్. ౨౫౨

తే. వృద్ధుఁ బ్రణిధాననిర్మగ్ను బుద్ధిబలవి, హీను నన్నిట్లుచేసితి గాన నీవు
నిట్టిప్రాయంబు నీరూపు నీవిధంబు,నదటునుడిపోయి భేకంబ వగుమనవుడు.

---

=కూర్చి. తొట్టి=పట్టి. మాణవకుఁడు=బ్రహ్మచారి ॥ ౨౪౬ ॥ ౨౪౭ ॥ పొదరు=పొద. వల్మీకబిలము=పుట్టకలుగు ॥ ౨౪౮ ॥ గవి=ఆవు. మట్టెన్=త్రొక్కెను. రేసి=విజృంభించి ॥ ౨౪౯ ॥ మిట్టిపడి=ఎగిరిపడి. నెట్టు=కప్పు. అవిసి=పగిలి. బీఁటలువాఱన్=బద్దలుకాఁగా. శ్రవశ్శకుంతములు = చెవియందలి పక్షులు. చట్టుపలు=రెక్కలు. ద్రుట్టెలుగట్టి=గుమిగూడి. మరుద్భుక్=పాములయొక్క॥ ౨౫౦ ॥ తద్వర్ణిన్=ఆబ్రహ్మచారిని ॥ ౨౫౧॥ హార్యము=హరింపఁదగినది. వమ్ముగన్=వ్యర్థముగా॥ ౨౫౨ ॥ ప్రణిధాననిర్మగ్నున్=ధ్యానయోగమునందు మునిఁగినవానిని ॥ ౨౫౩ ॥ ఈరు=మీరు

శా. ఆపృథ్వీసురసూతి తత్పదసరోజాసక్తుఁడై యిట్లనున్
గోపాటోపమడంపుఁడీ రలిగినన్ గొండల్ వడున్ వారిధుల్
రూపేర్పున్ ధర వ్రయ్యు మిన్నొరగు మద్రూపంబు నా నెంత ని
ష్ఠాపద్మాసన! లెస్సగాఁ దెలిసి నన్ శాపాగ్నిచేఁ గ్రాఁపవే. ౨౫౩

క. తెలుఁగని లయశిఖవని నిను, నెఱుఁగుదు వాధూలమునికులేశ! నిజముగా
నెఱిఁగియెఱిఁగి తనయూఁదల, కొఱవిం గొని గోఁకదివురు కుమతియుఁగలఁడే?

ఉ. ఉద్ధతిదక్కి యొక్కయెడ నూరకయుండఁగనీని కంధరా
బద్ధమహాహి నీకపిలఁ బాపఁదలంచితి నొండు లేదు దీ
నోద్ధరణాతిసాంద్రకరుణోదధివీచిసమృద్ధియైన నీ
బుద్ధికిఁ జేర్పఁగాఁదగునె? భూరిదవానలకీలఖేలమున్. ౨౫౫

వ. అనిమునితనయుండు ధేన్వాగమనాదితదుచ్చాటనాంతంబుగాఁగల తన వృత్తాంతంబు విన్నవించుటయు నూహించి యత్తెఱంగు చిత్తంబున యథార్థంబుగాఁ గనుంగొని. ౨౫౬

మ. భ్రుకుటీభీషణఫాలభాగుఁడు తను ప్రోద్భూతఘర్మాంబుబిం
దుకుఁడున్ బ్రస్ఫుటదోష్ఠపల్లవుఁడు చే తోభీతికృల్లోలతా
రకఘూర్ణన్నయనుండుగాక శమ సారస్మేరుఁ డయ్యెం దప
స్వికులగ్రామణి చిచ్చు చంద్రుపొడవై చెన్నొందుచందంబునన్. ౨౫౭

క. సప్రణయుఁ డగుచు మునిలో, కప్రవరుం డాదరించెఁ గనికరమున న
వ్విప్రకుమారుఁ దృణాంచల, విప్రుషములుగావె యవని విబుధాగ్రహముల్.

ఉ. ఆవసుధామరప్రభవు నమ్ముని యిట్లను వత్స! విన్ము నా
భావపథంబునన్ నినున పాపునిఁగాఁ గనుఁగొంటి నాగ్రహ
వ్యావృతచిత్తవృత్తి నిటు లాడితి మీఁదరయంగలేక నా
యీవచనంబు దప్ప దనయం బెద మూర్ఖత నన్ను మోచుటన్. ౨౫౯

---

౨౫౩ ॥ లయశిఖి=ప్రళయాగ్ని. తివురు=యత్నించు ॥ ౨౫౪ ॥ కంధరాబద్ధమహాహిన్=మెడను గట్టఁబడిన పెద్దపామును ॥ ౨౫౫ ॥ ౨౫౬ ॥ ప్రస్ఫుటత్=చలించుచున్న. లోలతారక=చలించుచున్న కనుగ్రుడ్లతో. ఘూర్ణన్నయనుండు = తిరుగుడుపడుచున్న కన్నులుకలవాఁడు. స్మేరుఁడు= చిరునవ్వుగలవాఁడు. పొడవు=ఆకృతి ॥ ౨౫౭ ॥ సప్రణయుఁడు = ప్రీతితోఁ గూడుకొన్నవాఁడు. విప్రుషములు=తుంపురులు. అవనివిబుధ = బ్రాహ్మణులయొక్క ॥౨౫౮॥ వ్యావృత = మిక్కిలి యావరింపఁబడిన. మోచుటన్ = పొందుటచేత ॥ ౨౫౯ ॥ పొగులకుము = తపింపకుము ॥౨౬౦॥

చ. వగవకుమన్న దైవగతి వచ్చినకీడు దలంచి నెమ్మదిన్
బొగులకుమన్న కర్మముల పోకకు భోగమె హేతువన్న వి
శ్వగురు గిరీంద్రవత్సలు దివానిశమున్ దలపోయుమన్న మే
లగు హరిభక్తియుక్తులకు నాపదరాదుగదన్న యెన్నఁడున్. ౨౮౧

సీ. జలధరం బనన్నెద్ది పొలపంబుపుట్టించు, నిల్లాలిమెఱుఁగుల మెల్లములకు
మున్నీరనఁగనెద్ది మొలచుటకావాల, మాణిపూసలుఁబోని యాత్మజులకు
నీడమ్రాఁకననెద్ది నిలువనీదై తోఁచు,నాకటనుండు ద్విజావళులకుఁ
దాఁపననెద్దియా ధారఁజూదివిబ్రాఁకు, పితృవర్యులకుఁ గుంటి పిచ్చుకలకు
తే. నట్టిగృహమేధిధర్మంబు నందు నీవు, గుత్ససేయుట నీరీతి గొడవ యొదవె
నొప్పుగతి నొప్పఁగనఁగల్గ దుర్గతులకుఁ,గసరిపై వచ్చు తాళ్లపై గాలియైన.

క. ఏనింతవాఁడనేనయి, పూనుదునేఁట యెద్దిగాక పోయెదునని సుం
తైన ఫల మందఁ దీరదు,మానవులకె కాదువినుమ మర్త్యులకైనన్. ౨౮౨

సీ. మునులనుష్టుభమునఁదనుఁగొల్వఁదగువానిఁ, బ్రహ్లాదుఁబ్రోవఁబొల్పడినవాని
ద్వాత్రింశదురుభుజాస్తంభాఢ్యుఁడగువాని,నశ్వత్థమూర్తియై యలరువాని
చక్రంబుచేక్షేత్ర జనముఁబ్రోచెడువాని, వివిధాయుధంబుల వెలయువాని
నలఘుదివ్యాకల్ప ములఁజూడఁగలవాని, భీమరథ్యాపగా సీమవాని
ఆ. వివిధకథలవాని వివిధరూపంబుల, వాని నిలిచికొలుచు వాని వాని
శ్రీనృసింహదేవు సేవింపు భేకంబ, వై తదంఘ్రిమూల మధివసించి. ౨౮౩

తే. దర్దురాంగనయందు సంతానసిద్ధి, నీకు నగుఁ గొంతకాలంబు నిర్గమింప
దాన నీదుపితౄణంబుతలఁగి శాప! మోక్షసంప్రాప్తియునుగల్గు నాక్షణంబ

వ. అని యివ్విధంబున వాధూలుండు శాపావధినొడివి యవ్వటువు నాశ్వా
సించి విశ్వాద్భుతజనకంబుగ నంబురుహప్రియమండలంబుభేదించికొనుచుం
జని యపవర్గసామ్రాజ్యసింహాసనాసీనుండయ్యె నిచ్చట వియచ్చరధేనువు
నేలినవానిపని సఫలంబుచేసి ఫలోదయంబు నలంకరించె. ప్రయుతసుతుం
డును విఫలప్రయత్నుండై యయత్నసంప్రాప్తం బగునిజవ్యసనంబున నసు

పొలపంబు = వ్యాపనము. మెల్లములకున్ = ధనములకు. ఆవాలము = పాదు. ఆణిపూసలు = ముత్యాలు. ద్విజావళులకున్=పక్షిసమూహములకు; బాలిష్ఠాణపస్త్కులకు. తాఁప= మెట్టు. కుత్స= నింద—గోఁత. ॥ ౨౮౧ ॥ సుంత = కొంచెము ॥ ౨౮౨ ॥ ౨౮౩ ॥ దర్దురాంగన = ఆఁడు కప్ప. నిర్గమింపన్=కడవఁగా. పితౄణంబు=పితృఋణము ॥ ౨౮౪ ॥ అంబురుహప్రియమండలంబున్=సూర్యమండలమును. అపవర్గ=మోక్షమనెడి. వియచ్చరధేనువు = దేవతలయావు. అసు

రుసురయ్యును సాయంసమయకుముదంబుచందంబునం గొంతకొంత త
చ్ఛాంతివచనంబుల నడదేఱినవాఁడై జగత్త్రితయపవిత్రీకరణం బగు
పాండురంగక్షేత్రంబునకుం జని. ౨౬౫

క. భీమరథి దొట్టి తీర్థ, స్తోమంబుల నెల్లఁ దనువుఁ దోఁగించి ముని
గ్రామణి కుహనాభీరశి, ఖామణి మణిసౌధరాజ గర్భాగతుఁడై. ౨౬౬

సీ. సురతరుప్రసవరింఛోళిచూళివినీల, జలదంబులోని క్రొం దళుకు లెసఁగ
మొగము వెన్నెలయేటి మొగరేటిమగమీల, గతిపక్ష్మలాక్షియుగ్మకము మెఱవ
గఱియనెమ్మేనుచీఁకటిగ్రమ్మఁకుఁ బ్రాఁకుబంగరుతీఁగక్రియఁ దూలఁ గద్రుశాటి
యుడుపథంబునఁ జాఱు నురురత్నతతిభాతి, మెడహారముల పెనపు డమిఁ దాఁక

తే. నచ్చరలువీవనలువీవ నంగరాగ, వాసనలుభూషణార్చుల సేసలెసఁగఁ
బిఱ్ఱెఁది దెసనున్నరమఁ దనొరగిధవళ, చలదళచ్ఛాయనుండు విట్ఠలునుతించు

ఉ. ఫాలము మక్కవంకనెల పై వెలుఁగొందెడు లోహితాంగునిం
బోలఁగఁ గంబుగర్భమునఁ బొల్పగు నీలములీలఁ గంధరా
కాళిమ యుల్లసిల్ల విధు ఖండము కెంజడకెంపుఁదమ్మిలో
బాలమరాళమట్లలర భాసిలు శూలిలలాటపట్టికన్. ౨౬౭

మ. నలి నాస న్నలినాసనాననపురా ణస్థానముల్ డాయ ని
మ్ముల బల్పాయలబోరుతల్పు లధరంబుల్ గెంపువాచూరులున్
గల విద్వద్వదనాంతరాళ నవరంగక్షోణి శాణించు ను
జ్జ్వలవజ్రవ్రజశంఖసంఘనిభభా షాయోష జిహ్వాస్థలిన్. ౨౬౮

సీ. లలితకుంతలశైవలము ముఖైందవబింబ, మధరాధరప్రవాళాంకురంబు
చపలస్వభావలోచనమహామీనంబు, కమనీయకంధరాకంబుకంబు
గర్వితస్తనకనత్పార్వతాభోగంబు, విశదత్రివళిభంగవిలసనంబు
మధ్యవృంతావర్త మహితంబు కటితటీ, ద్వీపంబు పృథులోరు దివిజకరటి

---

రుసురు=బడలినవాఁడు. కుముదంబు=తెల్లగలువ ॥౨౬౫॥ తొట్టి=మొదలుకొని.తోఁగించి=ముంచి॥ ౨౬౬ ॥ ప్రసవసరింఛోళి=పువ్వులసమూహము — పువ్వులచెండు. మొగరేటి = ముఖరయనునది యందలి. కఱియ=నల్లన. కద్రుశాటి=పసుపువన్నెవస్త్రము. పీతాంబరము. ఉడుపథము=ఆకాశము. అర్చుల=వెలుఁగుల. చలదలచ్ఛాయన్ = రావిమ్రానినీడయందు ॥ ౨౬౭ ॥ నెలపైన్=చంద్రునిమీఁద. లోహితాంగునిన్=అంగారకుని. కంధరాకాళిమ = మెడనలుపు ॥ ౨౬౮ ॥ నలిన్=తగునట్లు. ఆసన్=ఆశతో. నవరంగక్షోణిన్=క్రొత్తఆటచవికెయందు, భాషాయోష=సరస్వతి. ౨౬౯ ॥ ఐంధవబింబము=చంద్రబింబము. మధ్యవృంత=బొడ్డునెడి. ఆవర్త=సుడిచేత. పృథుకంబు=

తే. కరముపదకూర్మపృథుకంబు గ్రమ్మనఖర, మణికిలాపంబునగుచునేమగువరూపు
భూరిసౌభాగ్యసంపదఁ బోల్చుఁదంఘ్రి, నాసుధాంభోధిపుత్త్రి బాహాంతరమున

మ. సితకీరస్ఫటికాక్షమాలికలు గం జేదోయిసంధించి భా
రతివామాంకతలంబునన్ సతతమున్ రంజిల్లఁ గల్లోలసం
గతహంసోత్తమఫేనపఙ్క్తి యగు గం గావాహినిం దాల్చు దై
వతశైలంబనఁ దేజరిల్లు నల వి శ్వస్రష్ట నాభిం దగన్. ౨౨౧

తే. రత్నసందర్భగర్భ యీ రత్నగర్భ, చరణపీఠంబుగానున్న సకలభువనఁ గడి
మయునినినుఁగంటిదేవ! నాభయములుడిగె, ననితపస్విప్రీతిఁ గంసాభియాతిఁ బొ

క. అటఁ జని వటు వుత్తరది, క్తటమునఁ గనుఁగొని యొఁదరళ తరతరముమూర్తిన్
బటునఖరశైత్యమున నా, రటముడిపి సురారినేలు రసికు నృసింహున్.

క. శాశ్వతకరుణాంబుధి న, వ్విశ్వవిభుం గనుటఁగోలె విప్రుని మది మా
నీశ్వరశాపవికార మ, నీశ్వరదుశ్చేష్టితాభి నయమొనరింపన్. ౨౨౪

శా. నీరప్రాంగణకర్కటీబిలములన్ నిద్రింప మృత్స్నామయా
హారంబున్ గబళింపఁ బెల్లుఱవ నిట్టట్టుం బ్లుతంబుల్ గొనన్
దూరాయాస్య దహీంద్రభీతిహతి గొం దుల్ దూఱఁగోరున్ మదిన్
సారాపేతమనోబలం బగు భవి ష్యద్భేక ముత్సేకమై ౨౨౫

క. ఈవడువున శాపవ్యస, నావేశము గదిరియును మహాధైర్యముతో
నావిప్రుఁడు సుప్రతిభా, దేవేజ్యుఁడు ప్రస్తుతించు దితిసుతశత్రున్. ౨౨౬

ఉ. ఆసభ నుక్కుఁగంబమున నాక్రియ నుద్భవమంది యాసురా
గ్రేసరహృద్విదారణము కించిదుదంచితహాసకృత్యమున్
గా సమకట్టియుం బెనుపఁ గాఁ గతమేమి పునర్భవస్పృహన్
నీ సట లెవ్వరేఁ దెలియ నేర్తురె? మర్త్యమృగాధినాయకా! ౨౨౭

ఉ. మిమ్మటమైన వాఁడిపవి మిత్రములై వెలుఁగొందు నీనఖా
గ్రమ్ములకున్ మృదుప్రకృతి గల్గుట క్రొత్త రమాకుచాద్రిపా

---

ప్లు ॥ ౨౨౦ ॥ విశ్వస్రష్ట=బ్రహ్మ ॥ ౨౨౧ ॥ ౨౨౨ ॥ నఖరశైత్యమునన్=గోటిచల్లఁదనముచేత. ఆరటము=సంకటము. సురారిన్=ప్రహ్లాదుని ॥ ౨౨౩ ॥ కోలెన్=మొదలుకొని ॥ ౨౨౪ ॥ ప్రాంగణ=ముందరిచోటునందలి. మృత్స్నామయ=మట్టివికారమయిన. కబళింపన్=మ్రింగను. ప్లుతంబులు=దాఁటులు. ఆయాస్యత్=వచ్చుచున్న. సారాపేత=సారములేని ॥ ౨౨౫ ॥ సుప్రతిభాదేవేజ్యుఁడు=మంచిబుద్ధిచేతబృహస్పతియైనవాడు ॥ ౨౨౬ ॥ హృద్విదారణము=గుండెలుపగల్చుట. పునర్భవస్పృహన్=సంసారాసక్తిచేత; గోళ్ళయందలియాసక్తిచేత. సట=మోసము; జూలు ॥ ౨౨౭ ॥

ర్శ్వమ్ములయందు నందఁగల సారగతుల్ నఖరాభిపాతిసా
ధ్యమ్ములుగామి గావలయు నట్లగుటల్ దితిపుత్త్రశాత్రవా! ౨౭౮

ఉ. కోపవికారమంచు నొక కొందఱు గొందఱు భక్తలోకర
క్షాపరతంత్రతాజనిత సాంద్రకృపాగుణ మంచుఁ గొందఱు
ద్దీపితవీరసింధువిహృతిస్ఫుటఖేటవికార మంచు నీ
చూపులరక్తిమం బొగడు చుండ్రు నుతియింపుదు రీశ్వరేశ్వరా! ౨౭౯

చ. హరికిరిదంష్ట్రనాటువడి యైందవరేఖ దలిర్ప పూర్వభూ
ధరశిఖరం బనంగ నుతి దాల్చు కుచంబునఁ బోల్చు భూసతిన్
బరిహసనం బొనర్చు రమ భావము సిగ్గున క్రుంగఁజేయవే
నరమృగరాజ! నీ నఖము నాటినఁ బోల్చు నురోజకుంభముల్. ౨౮౦

సీ. పరిపూర్ణచంద్రబింబమునందుచక్కిలోఁ, గొనసాగువిద్రుమాంకురమనంగ
కన్నెగేదఁగిఱేకు కత్తులబోనులోఁ, జిక్కినయౌర్వాగ్ని శిఖయనంగ
వెండికంబములతో వియ్యంపుఁబొత్తెత్తు, యమునాతరంగసంఘములనంగఁ
బ్రాలేయగిరివెన్కభారంబువహియించు,పవనపారణకులప్రభువనంగ [గేల
తే. మొగమునకుబిగిగావించుమిగులుఁగన్ను,దంష్ట్రికాంతరజిహ్వయుఁదఱచుఁ
వెలుగులుఁబిఱుందవాలమ్ముగలుగునిన్ను,గొలుతుదితిపుత్త్రచేతఃకుకూలదహన

తే. అనిన్నృహర్యక్షవర్యునర్యమసహస్ర,దివ్యతేజఃప్రవాహుఁగీర్తించియతఁడు
తత్పదద్వంద్వమునకు వందనముసల్పి,తపసెటిట్టునఁబ్లవమయ్యెఁదత్క్షణంబ.

క. ఆశమము నావివేకం, బాశుద్ధియు నాతపంబు లాబహునిగమ
ప్రాశస్త్యము నటులయ్యెము, నీశునకును దైవఘటన లిట్టివి దలఁపన్.

ఆ. అస్మదాదిమాన సాహాలవలయప్ర, కాశభక్తియుక్తికల్పలతకు
మూల మనఁగనొప్పు నాలోకవిభునంఘ్రి,మూలమాశ్రయించి జాలిమాలి.

ఉ. ముత్తియము ల్ప్రవాళదళముల్ గన నాకృతిఁగూడనట్లుగా
గ్రొత్తగు నౌర! వీని యపురూపపు రూపిది యంచు విస్మయో

---

మిష్టటము=మిక్కుటము. పవి=వజ్రాయుధము ॥ ౨౭౮ ॥ ఉద్దీ...వికారము-ఉద్దీపిత=మిక్కిలి వెలుఁగుచున్న. వీరసింధు=వీరరససముద్రమునందలి. విహృతి=విహారముచేత. ఖేట=డాలువాఱి యొక్క. వికారము=మాఱురూపము ॥ ౨౭౯ ॥ కిరి=పంది ॥ ౨౮౦ ॥ చక్కి=స్థానము. కన్నె=లేఁత. ఔర్వాగ్ని=బడబాగ్ని. ప్రాలేయగిరి=మంచుకొండ. పవనపారణకులప్రభువు=శేషుఁడు. కుకూలదహన=కమ్మనిప్పయినవాఁడా ॥ ౨౮౧ ॥ అర్యమ=సూర్యులయొక్క. ప్లవము=కప్ప ॥౨౮౨॥ ౨౮౩ ॥ అంఘ్రిమూలము=అడుగుమొదలు. జాలి=దుఃఖము ॥ ౨౮౪ ॥ అపురూపపు=అపూర్వమ

దాత్తమనస్కులై సకల తైర్థికులుఁ గొనియాడ భేకలో
కోత్తమ మెప్పుఁ జిత్రవపు రుజ్జ్వలమై జలజాసనోద్భవా! ౨౮౫

సీ. కమలాప్తుఁ డుదయింపకయమున్న బుటుకున,మునుఁగు సంగమతీర్థమునకునేగి
వినుసైకతనిషణ్ణ మునివేదనినదంబు, తగుచోటనుండి లేఁ బగటిదాఁక
మధ్యాహ్నవేళసం ప్రాశించు బలిపీఠ, గతపులాకంబులు మితముగాఁగ
సందెప్రొద్దుననుండి సవరేయిగడసన, సమ్ముఖమ్మునఁ గొల్చి సంవసించు

తే. శ్రీనృసింహుండు పెనుఁబాప సెజ్జమేను, చేర్చఁ దద్దివ్యచరణరాజీనమూల
భూబిలంబున నధ్యాత్మ పూర్ణబుద్ధి, జాగరముసేయు శాలూర చక్రవర్తి.

ఆ. రత్నరంగవల్లి రచనకుఁ దనమేను, పువ్వుగు త్రికరణి పొలుపునిలుప
నంబుచరము ప్రాతరారంభవేళల, నృహరియగ్రవీధి నిలుచు ననఘ! ౨౮౭

క. హరిదాస మనుచుఁ దను నె, ల్లరు పేరిడి పిలువఁగలిగి ప్లవపతి గడపెన్
జిరకాలము పూర్వజనన, చరితజ్ఞంబగుచు మోక్ష సౌఖ్యాపేక్షన్. ౨౮౮

ఆ. ఇటులు కొన్నియేండ్లు లేగంగ నొకనాడు, పౌండరీకనాథు పర్వమునకుఁ
గన్యకుబ్జవిభుని కన్యాశిరోమణి, ప్రాణసఖులు గొల్వ నరుగుదెంచె. ౨౮౯

తే. ఆత్మవాహనములనుండి యవతరించి, నారసింహాఖ్యతీర్థంబు నకుఁగుఱఁగట
భైమిచెంగటవిడిసిరిపద్మముఖులు,విరహిహృద్ధాములగుమారుశరములనఁగ.

ఆ. మార్గఖేదశిథిల మతులంగనలుచొచ్చి, భీమరథిఁగలంచు కేమిఁ క్రొత్త
వారిగోరువెచ్చ వక్షోజములకాంతి, లవముజ్జగములఁ దవిలికలఁప. ౨౯౧

సీ. గంధవాహమునక గారంబులివియంచు, వీజనంబులఁ జూచి వెగటుగదరి
మరుబాణములసహోదరవర్గమిదియంచు,నలరు మొగ్గలఁ జూచి యలఁతనొంది
కమలారినామంబు గైకొన్నవివియంచుఁ, బుల్లదీఁగలఁ జూచి పుల్లసిల్లి [దిరి
శుకయుగంబులుదాముశొకచాయవివియంచు,నవశుకంబులఁ జూచి నవముగ

---

యిన. తైర్థికులు=తీర్థయాత్రచేయువారు. చిత్రవపురుజ్జ్వలము=నానావర్ణమైన దేహముచేత వెలుఁగునది ॥ ౨౮౫ ॥ నిషణ్ణ=కూర్చుండిన. లేఁబగలు=సూర్యోదయము మొదలు పదిగడియలప్రొద్దగువఱకునైనకాలము. సంప్రాశించున్=తినును. పులాకంబులు=మెతుకులు. సవరేయి = సగమురాత్రి. సంవసించున్=ఉండును. పెనుఁబాపసెజ్జన్=శేషశయ్యయందు. అధ్యాత్మ=తత్త్వజ్ఞానముతోడి. శాలూరచక్రవర్తి=కప్పలరాజు ॥౨౮౬॥ రంగవల్లి=ముగ్గు అంబుచరము=కప్ప. ప్రాతరారంభ=తెల్లవాఱి ॥ ౨౮౭ ॥ చరితజ్ఞము=చరిత్రము నెఱిఁగినది ॥ ౨౮౮ ॥ ఏగంగన్=కడపఁగా ॥౨౮౯॥ అవతరించి=దిగి. కుఱఁగటన్=దగ్గఱ. చెంగటన్=దగ్గఱ. విడిసిరి=నివసించిరి. విరహిహృద్ధాములు=విరహముగలవారిమనసుననాటినవి ॥ ౨౯౦ ॥ ఖేద=శ్రమచే. లవము=లేశము ॥ ౨౯౧ ॥ అగా

తే. కన్యకుబ్జేశకన్యపైఁ గలుగు చెలువు, భావములఁ బెంపుసొంపులు మోవఁ జేయ(లు.
బలిమి నిజధైర్యములు చిక్కఁబట్టియున్న, మునులొనప్పుడ రొకరీతి ముఖ్యవిధు

తే. వనజనాభుని యభిషేకమునకె గాని, కనకగర్భాదులకుఁ బాఁదుకొనఁగ రాని
తీర్థకుండాంబునికరంబు తెలవపిండు, గబ్బిచనుజక్కవలచేతఁ గప్పఁబడియె.

తే. జాలునలఁపుల తేనియ గారయిచ్చి, గాడ్పు సంధించునయ కాని యూప్ప వెఱచు
నెందునయ్యాఁకవిరితోఁటనిందుముఖుల, నగవు నునుమంచు సానవోలెనయము

ఆ. అవసరంబుగాచి యల్లంత దవ్వుల, నుండి సురలు మునులు దండములిడ[దలఁగ.
కొప్పుముక్కునాఁదు నూఁపుగల వేల్పుఁ, గొమ్మలంటి చాట బొమ్మవోలె.

మత్తకోకిల. జాలిదక్కి మతాంతరాళవిశాలవేదులయందుఁ గో
నాలగొందిఁ దపంబుసల్పు జనంబు తాల్ములు దూలుఁ ద
ద్బాలికాకుల నిస్తులస్తనపాళికా మృగనాభి వా
తూలికాహతి పక్వశాల్మలి తూలికాశకలాకృతిన్. ౯౯౬

శా. డోలారోహణసాహసోద్యమముఁ జాటుప్రౌఢిసన్మోక్తి వి
ద్యాలాలిత్యముఁ బుష్పసాయకసప ర్యాచర్యయున్ మున్నుగా
హాలాపానవిహారము న్నడపి పద్యత్ప్రీతిపద్మేక్షణల్
పోలుంబోలము లెంత యెన్నక మహాబోధిద్రుమచ్ఛాయలన్. ౯౯౭

ఆ. జవ్వనంబుమదము సౌందర్యమదమును, ఘనమనంబు మనసుఁ బెనుఁగుదుల్లఁ
బొదల నంత శీధుమదముఁ దోడ్తోఁ బ్రోది, యగుచుఁ బిగిడె నమ్మృగాక్షులందు

సీ. దామోదరుఁడు యశోదాస్తన్యమానెడు, ననిమొక్కవిరిగుత్తి నలిభ్రమింప
బ్రొద్దులుపొచ్చెఁగ ద్రూఁదేవి కిపుడని, ప్రియమందు వేణుగర్భిణి గుఱించి

---

రంబులు=ఇండ్లు. వీజనంబులన్=విసనకఱ్ఱలను. ఫుల్లదీఁగలన్=సోఁపలతలను. ఫుల్లసిల్లి=వెలవెలఁబోయి. నవశుకంబులన్=లేఁతమాచిపత్రులను. నవము=మృదుత్వము. చెలువు=అందము ॥ ౯౯౧ ॥ పాఁదుకొనన్=స్థిరముగానిలువ. తెలవపిండు=స్త్రీలగుంపు. గబ్బి=గంభీరమయిన ॥ ౯౯౩ ॥ నయ=మనోజ్ఞము. ఆఁకవిరితోఁటన్=కట్టుకావలిగలపూఁదోఁటయందు. సాన=నూఁగు॥ ౯౯౪ ॥ ౯౯౫॥ జాలి=శంక. వేదులయందున్=అరుఁగులయందు. కోనాలగొందిన్=మిక్కిలియిఱుకైనచీఁకటిమూలయందు. తాల్ములు=ధైర్యములు. తూలున్=చలించును. నిస్తుల=ఈడులేని. వాతూలికాహతిన్=గాలిసోఁకుడుచేతి. శాల్మలితూలిక=బూరుగదూది ॥ ౯౯౬ ॥ చాటు=స్తోత్రరూపమయిన. సన్మోక్తి=ప్రియవచనము. లాలిత్యము=తిన్నఁదనము. సపర్యాచర్య=పూజచేయుట. హాలా=మద్యము. పోలుంబోలములు=యుక్తాయుక్తతలు. బోధిద్రుమ=రావిమ్రానియొక్క ॥ ౯౯౭ ॥ జవ్వనంబు=యౌవనము. ప్రోది=పోషణము-వృద్ధి ॥ ౯౯౮ ॥ అలి=తుమ్మెద. పావని=భీముని. ఫణికేతు=దుర్యోధ

పావనిగదనొచ్చె ఫణికేతుతొడలని, యడలునేనుఁగుచేత నరఁటులొదుఁగ
బడబాగ్నిజడధివె ల్వడియెడునని చూపుఁ, గానఁబూచినకింశు కముచెలులకు
తే. శేషవృతమేరుశిఖరమ నిషఁబొగడు,నంచ కౌఁగిటనున్న హేమాంబుజంబు
పూర్వమగువిన్కి మదివెడపాడము దేర,మధు మదక్షీబయగు నొక్క విధుని భాస్య
సీ. సుభయొల్కు నెఱివేణిసోమార్ధమునుబోలి, చెమరించెదుర్గ లేఁజెమరునొసలు
కుక్కురభర్తద్వ్య గ్గోళంబుశీధుసం, సేవనంబునుబోలె జేవురించె
విష్ణున్యాసక్తు వీక్షించుటనుబోలె, ముక్తకేశికి బొమ ముడిజనించె
ద్వరితనిశ్శ్వాసవే దనవోల్తెఁగంపించె, విజయుని వదనార విందదళము
తే. పరమపావనమైన త త్పౌండరీక, పుణ్యతీర్థావకాశమ పూర్వసిద్ధిఁ
బెనఁచున్నపకి న్యకాసఖి జనులవివిధ,విలసనంబులజనియించు నలుకనసఘ !
క. పొడగనిరి పడఁతు లయ్యెడఁ,బొడలపొడలమొడలి తపసి పుట్టువుఁ గప్పన్
జడభరతనిభము నరహరి, యడుగుఁబుడమిసరియవెడలి యటచనుదేరన్.
చ. కినకముపేరిరోహణన గంబొ సుధాంబునిధానగర్భమో
యనిమిషకార్ముకం బుదయ మయ్యెడునొప్ప గునొక్కొ దీనిపు
ట్టినకడయంచు విస్మయము డింపక చంపకపుష్పనాసికల్
చొనిపిరి వాలుఁజూపువల చుట్టును దర్దురపట్టభద్రునిన్. ౩౦౨
తే. కందుకముగాదు కేళిశు కంబుగాదు, పల్కువీణియగాదు దర్పణముగాదు
వర్షపిశునంబుఁ బట్టఁ బల్వురుసఁ జనిరి,చంచలాక్షులు చపలప్ర చారలెందు.
తే. యువజనంబులఁదనయుఱఁ దవులుపఱచు, కీలుగలిగిన యొకనీల నీలవేణి
తురుముపిరిదండయురివారిచరముఁజిక్కు, వఱపనేరక మదిఁజిక్కువడియెఁదాన
తే. చొచ్చిచనబట్టుటకునొక్క మచ్చెకంటి,మ్రోఁబఱచినబేలదర్దురము దాఁటె
దొంటిపుట్టునఁదనయుంటుసంటు వారి,మీఁది మమకారనది ద్రెవ్వ నీఁదుకరణి.
క. ఆవర్షాభూవిభునకు, హావళి దఱచయ్యె బిసరు హాక్షులచేతన్
రావణునకు వైకుంఠపు, రావాసస్త్రీలచేతి యలజడి వోలెన్. ౩౦౬

---

నని. అడలున్=దుఃఖించును. జడధి=సముద్రమునుండి. కానన్=అడవియందు. వృత=ఆవరింపఁబడిన. క్షీబ=మదించినది ॥ ౨౯౯ ॥ చెమరించు=చెమటపట్టు. కుక్కురభర్త=కుక్కలరాజు=భైరవుఁడు. జేవురించెన్ = ఎఱ్ఱవాఱెను ॥ ౩౦౦ ॥ సరియన్=సందును ॥ ౩౦౧ ॥ రోహణనగంబో=రత్నపర్వతమో. అంబునిధాన=సముద్రముయొక్క. అనిమిషకార్ముకంబు=ఇంద్రధనుస్సు. దర్దురపట్టభద్రునిన్=కప్పలరాజును ॥ ౩౦౨ ॥ వర్షపిశునంబున్=కప్పను ॥ ౩౦౩ ॥ కీలు=నేర్పు. తురుము=కొప్పు ॥ ౩౦౪ ॥ బేల=మూఢము. దర్దురము=కప్ప ॥ ౩౦౫ ॥ వర్షాభూ=కప్ప. హావళి=ఉపద్ర

ఆ. పూర్వజన్మకుంభ భూశిష్యముఖ్యుండు, భేకరూపకూప బింబితుండు
ప్రయుతసుతుఁడు దవులుపడఁడయ్యె భూపాల, తనయసఖులచేత ధాతృతనయ!

క. నరనాథపుత్త్రి యత్తఱి, నురుకుచకచజఘనభార యుతయయ్యు మదిన్
ధరియించెఁ గార్యభరమున్, గిరిగహనద్వీపసహిత క్షితిధృతిఁ బోలెన్. ౩౦౮

ఉ. పన్నిదమొడ్డి యేనిడుఁడు పట్టెదఁ జూడుఁడు దీని నంచు నా
కన్నియ చిన్నినవ్వొలయఁ గాఁ జెలకత్తియలం దనూద్యమ
చ్ఛన్నమనస్కలం దెగడి చంచలకాంచికలాపవాగురీ
సన్నహనంబునన్ సలిల జంతులలామముఁ బట్టె నుబ్బుచున్. ౩౦౯

తే. సర్వతీర్థప్రదేశప్రశస్తమతికిఁ, గాంచిఁ దవులుట దనకర్హ మంచునొక్కొ
తవులువడియుండె వరుణదంతావళంబు, పడఁతి యురిఁ జేసె మెడచుట్టు పసిఁడిరశన

సీ. పులుఁగునాడించుచో ప్పన మించునాడించు, మించున సకిననాడించినట్టు
లారామచిత్రశాలూరంబు మదహాస, కౌముదిపరిషిక్త గండఫలక
యగుచు నించుకనడి యాడించికప్పకు, వెఱచిన యొకవృద్ధ విప్రుమీఁద
వైచి తచ్ఛాపంబు వలన సఖీజనం, బును దాను దద్భేకమునకు భార్య

ఆ. యయ్యె నిట్లు తనకు ననురూపతనురూప, శీలములఁ దలిర్చు నాలిపిండు
గలుగుటయు ననయయుతుఁ డలఘుసంసారాబ్ధి, నీఁదుతొంటి యీఁత యినుమడింప

తే. అధిపతనయకు మును బహిఃప్రాణములగు, చామలెవ్వారు వారెల్ల సతికి దాయ
లైరి మండూకసార్వభౌమార్ధతనువు, లైన దినముల సాపత్న్య మెంత కీడు

ఉ. నున్నని మోము మీసముల నూఁగును జెన్నటిగాక మున్న యా
సన్నముగా గృహస్థులకు నగ్రణివై మనుమంచు మున్న వే

---

వము. అలజడి=శ్రమము ॥ ౩౦౬ ॥ కుంభభూ=అగస్త్యుని. తవులుపడఁడు=చిక్కఁడు. తవులుపడఁడయ్యెను=చిక్కకపోయెను ॥ ౩౦౭ ॥ కచ=తలవెండ్రుకలయు. జఘన=పిడికట్టుయొక్కయు. ధృతిన్=ధరించుటను ॥ ౩౦౮ ॥ పన్నిదము = పందెము. తనూద్యమచ్ఛన్నమనస్కలన్=కొంచెపుఁబ్రయత్నముచేత కప్పఁబడిన మనసుగలవారిని=విశేషప్రయత్నము లేనివారిని. తెగడి=నిందించి. వాగురీ=ఉరి. సన్నహనంబునన్=ఆయిత్తపాటుచేత. ఉబ్బుచున్=సంతోషించుచు ॥ ౩౦౯ ॥ కాంచిన్ = మొలనూలునందు; కంచియందు. తగులుట=చిక్కుకొనుట; ఆసక్తుఁడగుట. వరుణదంతావళంబు=కప్ప. రశన=మొలనూలు ॥ ౩౧౦ ॥ మించు=మెఱపు; విధము. సకిన=బొమ్మ. కౌముది=వెన్నెలచేత. పరిషిక్త=అంతటను తడిసిన. ఇంచుకవడి=కొంచెము సేపు. ఆలిపిండు=పెండ్లాలసమూహము ॥ ౩౧౧॥ చామలు=స్త్రీలు. దాయలు=పగవారు. అర్ధతనువులు=అర్ధదేహములు_భార్యలు. సాపత్న్యము=సవతితనము ॥ ౩౧౨॥ వేగన్నులవేల్పు=ఇంద్రుఁడు. పాదనతిన్=కాళ్లకుమ్రొక్కుట

గన్నులవేల్పు దేల్పు నది గాదని వాదముసేయు ధైర్యసం
పన్నుఁడు దేర్పఁగాఁ దొణఁగె పాదనతిం గుపితప్రియాతతిన్. ౩౧౩

తే. విషమశరుఁ డేయుదూపుల వేట్లనెన్ను, వాఁడువాధూలమునిశాపవర్ణతతుల
రాతికోడుకై నయిల్వలారాతిచట్టు, మనసుగరఁగించిమమతలఁ బెనఁగెఁగాన.

తే. స్వాతిమేఘంబుచినుకులువనధిశుక్తి, వితతిముయ్యాడునైమౌక్తికతవహించు
కరణినయుతునిప్రేమతత్కాంతలందు, నిలిచెఁబర్యాయపాత్రతానియమసరణి

క. మునిపతికి రాజసుతకునుఁ, దనయుఁడు జన్మించె నంతఁ దచ్ఛాపపుటి
ర్లను విరిసె జ్ఞానచంద్రుఁడు, గనుపట్టెన్ విష్ణుపదముగానఁగ వచ్చెన్. ౩౧౬

వ. సలపితుండగుట మందపాలసమశీలుం డగుప్రయుతనందనుచరిత్రం బద్భుత
రసైకపాత్రంబయ్యె నిట్లు. ౩౧౭

క. గృహమేధిధర్మవర్మా, సహమతి యగుకుమతి యయుతుచందమున నుదు
స్సహదుఃఖగ్రాహానన, గుహఁబడుననివింటిమును ముకుందునిచేతన్. ౩౧౮

ఆ. విష్ణుభక్తులై వివేకులై తృష్ణావి, దూరులై స్వకుక్షి పూరణంబు
సమయసంభృతార్థసంతృప్తిగాఁగోరి, నడచువారు భవముఁ గడచువారు.

సీ. అని పార్వతీనాథుఁ డమరసంయమిఁజూచి, పరమభాగవతప్రపత్తిగలుగు
నీవిట్లుప్రార్థింప నిఖిలోన్నతములగు, దైవతక్షేత్రతీర్థములమేళ
నం బెఱింగించితి నానాకథానిధానంబగుదానినెన్నఁడును దీని
వైష్ణవధర్మప్రవర్తనంబెడలిన, యసదులకెఱుకసేయకుము నీవు [దురాప

తే. గుప్తముగఁజేయుమనుడుభర్గునకుమ్రొక్కి, ముని మునిధ్యేయ! నీకతంబున
రూపత్క్షేత్రరాజస్వరూపమెఱుఁగఁ, గంటిగరిగంటిగానిసౌఖ్యములుగంటి.

చ. భయము నదల్చి దుఃఖములఁ బాచి సుఖంబులఁ బ్రోదిచేసి త
ద్దయుఁ దిలకించి నీయడుగుఁ దమ్ముల నిమ్ములఁ గొల్చి నిత్యసం
శ్రయ మొనరించు నాకిఁక నసాధ్యము లే దిది యట్ల యౌను ని
ర్భయ భవసాగరోత్తరణ నావికు లాదిమ వైష్ణవాశ్రితుల్. ౩౨౧

క. అని పౌనఃపున్యంబుగ, వనజాసనసూతి మ్రొక్కి వలగొని హరు వీ
డ్కొని పౌండరీకమునకున్, జని భైమిం దీర్థమాడి చక్రి భజించెన్. ౩౨౨

---

చే॥ ౩౧౩ ॥ రాతికోడుకు = చలింపనివాఁడు. చట్టు = శిష్యుడు ॥ ౩౧౪ ॥ ౩౧౫ ॥ ఇర్లు=చీఁకటి. విష్ణుపదము=ఆకాశము; విష్ణుదేవునిపాదము ॥౩౧౬॥ సలపితుఁడు=మాటతోఁగూడినవాడు ౩౧౭ ॥ వర్మ=కవచము. అసహమతి=సహింపనిబుద్ధిగలవాఁడు ॥౩౧౮॥ భవము=జన్మము॥౩౧౯॥ ప్రపత్తి=భక్తిపూర్వకశరణాగతి. ఎడలిన=చెడిన. అసదులకున్=అల్పులకు. దురాప=పొందరాని. గరిగంటిగాని=తెలుఁగని ॥ ౩౨౦ ॥ ప్రోదిచేసి=పోషించి. తిలకించి=చూచి ॥౩౨౧॥ పౌనఃపున్యం

క. భజియించి తత్ప్రసాద, వ్యజనానిలశమితతాపుఁడై యిప్పుడు న
బ్జజసూతి దక్షిణద్వా, రజగతి నున్నాఁడు సుస్థిరప్రమదమునన్. ౩౨౩

క. అని కథకుఁడు శౌనకముఖ, మునులకు హరిదివ్యచరిత ములు దురితతమో
దినకరకిరణాయితములు, వినిపించెఁ గళావతీశ వేదాద్రీశా!. ౩౨౪

శా. దిగ్దంతావళికర్ణచాలనసముద్వేల్లన్మరుత్పల్లవ
స్రగ్దీప్తిప్రకటప్రతాపశిఖిసంఛన్నాఖిలాశాంత స
మ్యగ్దానాధరితామరద్రుమ రమా ప్రాణేశభక్తిప్రియా
ప్రాగ్ధక్కేసరిపీఠికాధిపసభా పద్మాకరాహస్కరా ! ౩౨౫

క. విద్వత్కుముదనిశాకర, విద్వేషివరూథనాథ వేశంత మదాం
ధద్విరద కీర్తిసంవృత, సద్వీప దిలీపభూప సదృశాటోపా! ౩౨౬

మాలిని. సరసగుణరతీశా షట్సహస్రాన్వయేశా
నిరవధికగుణాబ్ధీ నిత్యసత్యోపలబ్ధీ
హరిహయసమభోగా యాచమానానురాగా
కరగతనిగమాళీ కావ్యకృత్పద్మహేళీ ! ౩౨౭

గద్యము. ఇది శ్రీమత్పరమపదనాథనిరవధికకృపాపరిపాక పరిచిత సరస కవితా
సనాథ రామకృష్ణకవినాథప్రణీతంబయిన పాండురంగమాహాత్మ్యం బను
పరమభాగవతచరిత్రంబునందు సర్వంబును బంచమాశ్వాసము.

శ్రీమత్పాండురంగ విట్ఠలస్వామినేనమః.



బుగన్ = మాటిమాటికి. వనజాసనసూతి = నారదుడు. వలగొని = ప్రదక్షిణముచేసి ॥ ౩౨౨ ॥ వ్యజన = విసనకఱ్ఱవలని. శమిత = అణఁపఁబడిన. జగతిన్ = భూమియందు ॥ ౩౨౩ ॥ కిరణాయితములు = కిరణములయినవి ॥౩౨౪॥ దిగ్దంతావళి = దిగ్గజములయొక్క. చాలన = చలింపఁజేయుటచేత. సముద్వేల్లత్ = మిక్కిలివీచుచున్న. మరుత్పల్లవ = గాలిచిగుళ్లయొక్క. స్రక్ = సరముయొక్క. ప్రకట = ప్రసిద్ధపఱిచెడి. ప్రతాపశిఖి = ప్రతాపాగ్నిచేత. సంఛన్న = లెస్సగాఁగప్పఁబడిన. అఖిలాశాంత = ఎల్లదిక్కుల కొనలుగలవాఁడా. సమ్యక్ = లెస్సయయిన. దాన = ఈవిచేత. అధరిత = క్రిందుపరపఁబడిన. అమరద్రుమ = దేవవృక్షముగలవాఁడా. కేసరిపీఠికాధిప = సింహాసనాధిపతులయొక్క. పద్మాకర = తామరకొలఁకులకు. అహస్కరా = సూర్యుఁడా ॥ ౩౨౫ ॥ విద్వేషి = శత్రువులయొక్క. వరూథనాథ = సేనానాయకుల నెడి. వేశంత = నీటిపడియలకు. మదాంధ = మదముచేతకన్నుగానని. ద్విరద = ఏనుఁగైనవాఁడా. ॥ ౩౨౬ ॥ షట్సహస్రాన్వయేశా = ఆఱు వేలకులమునకుప్రభుఁడా. నిరవధికగుణాబ్ధీ = మేరలేనిమంచిగుణములకుసముద్రుఁడా. నిత్యసత్యోపలబ్ధీ = శాశ్వతమునునిజమునైన బుద్ధికౌశల్యముగలవాఁడా. కరగతనిగమాళీ = హస్తగతమైన వేదపఙ్క్తులుగలవాఁడా. కావ్యకృత్పద్మహేళీ = కవీశ్వరులనెడి తామరలకు సూర్యుఁడా ॥ ౩౨౭ ॥